# శ్రీ లలితా సహస్ర నామవివరణము

## (SCIENTIFIC AND SPIRITUAL SPLENDOUR OF SRI LALITHA SAHASRAM)

(తృతీయ భాగము)




వివరణ కర్త

**డా॥ జి. ఎల్. ఎన్. శాస్త్రి,** M.Sc., M.Phil., Ph.D.

రీడర్ & భౌతిక శాస్త్ర విభాగాధ్యక్షులు

టి. జె. పి. యస్. కళాశాల, గుంటూరు.






జగద్గురు పీఠము - గుంటూరు శాఖ

(The World Teacher Trust - Guntur Branch)

GUNTUR - 522 002.

Phone : 233995

# శ్రీ లలితా సహస్ర నామ వివరణము

## (తృతీయ భాగము)

ప్రథమ ముద్రణ : జనవరి 1998

ద్వితీయ ముద్రణ : జనవరి 2002



ప్రతులకు

1. **ది వరల్డ్ టీచర్ ట్రస్ట్**
   **H/o. డా.జి.ఎల్.ఎన్.శాస్త్రి**
   5-10-4, 2/9, బ్రాడీపేట
   గుంటూరు - 522 002
   ఫోన్ నెం. (0863) 233995

2. **ది వరల్డ్ టీచర్ ట్రస్ట్**
   45-40-36/1, అక్కయ్య పాలెం
   విశాఖపట్టణము - 530 016
   ఫోన్ నెం (0891) 565291

| వెల : | సాధారణ ప్రతి | రూ.**80-00** |
|---|---|---|
| | గ్రంథాలయ ప్రతి | రూ.**100-00** |

ముఖచిత్రం : లాం వర్ధన్ రావు, విద్యాఆర్ట్స్, నగరంపాలెం, గుంటూరు.

ముద్రణ : **విజయసాయి ఆఫ్‌సెట్ ప్రాసెస్ అండ్ ప్రింటింగ్,**
**గుంటూరు -2, ఫోన్ : 242345**

# విషయసూచిక

| విషయము | | పుటసంఖ్య |
|---|---|---|

## ముందుమాట

నాకై నేను మున్ముందుగా చెప్పే ఈ నాలుగు మాటలూ విని, అటు పైన - అమ్మమాటలు చదువుకోండి. అలా చెయ్యటం సమంజసం కూడా ! ఎందుకంటే - నన్ను ముందు పెట్టుకొని నా ద్వారా అమ్మ పలికే మాటలేగా ఇకముందు పుస్తకంలో రాబోయే మాటలన్నీ ! నన్ను ఎలా పలికిస్తోందో ఈ ముందు మాటలో తెలియ చేసి, అటుపైన ఏం పలికించిందో వివరణలో వ్రాస్తాను.

మా గురుదేవులు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యులవారు 13.10.77 నుండి 15.11.78 వరకు విశాఖపట్నం న్యూకోలనీలో వారి వసతి గృహ ప్రాంగణములో దాదాపు 52 వారాల 52 రోజులు ఈ లలితా సహస్ర నామాలపై ధారావాహికంగా చక్కని వివరణాత్మక ప్రసంగాలు చేశారు. నాలాటి కొందరు ఆ ప్రసంగ విషయాలను చక్కగా వింటూ, అవసరమైన చోట వ్రాసుకుంటూ ఆనందించారు. అలా విన్న విషయాలను, వ్రాసుకొన్న విషయాలను బాగా బుద్ధితో మథనం చేసి - కొంత స్వానుభవ జ్ఞానాన్ని, శాస్త్రజ్ఞానాన్ని, జ్ఞాన వృద్ధుల బోధనామృతాన్ని కలిపి రంగరించటం జరిగింది. ఈ జ్ఞానామృత మథన సమారాధన 1981వ సంవత్సరం నుండి 1996వ సంవత్సరం దాకా, అంటే - 15 సంవత్సరాలు జరిగింది. ఇదే విషయం ప్రథమ భాగంలో వ్రాస్తే చాలా మంది అది చదివి - 'అంత అతిశయోక్తి పనికి రాదు' - అని అనుకున్నారేమో తెలియదు. కాని, అది యదార్థం. అయితే, ప్రథమ భాగం చదివిన వారిలో కొందరు - 'నిజమే ! 15 సంవత్సరాలు మథనం జరిగిందన్న దానికి సరిపోయే విధంగానే వివరణ ఉంది' అని ప్రశంసించారు. అంతేకాదు - 'ద్వితీయ భాగం ఎప్పుడు వస్తుందా ?' - అని ఎదురు చూసారు. అదృష్టవశాత్తు ప్రథమ భాగం 1997 జూన్ నెలాఖరున గుంటూరు విశ్వ మందిరంలో శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ గారి చేత ఆవిష్కరింపబడిన నాలుగు నెలలకే, అంటే - అక్టోబరు 19న గుంటూరులో జరిగిన గురుపూజా మహోత్సవములలో ద్వితీయ భాగం కూడా వారి చేతనే ఆవిష్కరింపబడింది. ఇంతవరకు ఈ రెండు భాగాలలో వచ్చిన వివరణను పండితులు, పామరులు, స్త్రీలు, వృద్ధులు, విద్యార్థులు, అధ్యాపకులు, సాధకులు, బోధకులు, ఉద్యోగస్థులు, వ్యాపారస్థులు - ఇలా ఎన్నో రంగాలలో ఎన్నో

దృక్పథాలతో ఉండేవారు అందరూ చదివారు. అందరూ చాలా బాగుందని ప్రశంసలతో ప్రోత్సహించారు. ఈ ప్రోత్సాహంతోనే తృతీయభాగం కూడా వెంటనే వెలుగులోకి వచ్చింది. ఈశ్వర నామ సంవత్సరారంభంలో ప్రారంభించబడిన - ఈ జగదీశ్వరీ వృత్తాంతం - ఈశ్వర నామ సంవత్సరాంతం లోగా పూర్తి అవాలనే సంకల్పంతోనే ఈ వివరణా యజ్ఞాన్ని విరామం లేకుండా కొనసాగించడం జరుగుతోంది.

**చతుర్భాగ సమన్విత -**

శ్రీ లలితా సహస్ర నామస్తోత్రంలో చెప్పినట్లు అమ్మవారు 'చతుర్బాహుసమన్విత' అయితే - ఈ నామవివరణ 'చతుర్భాగ సమన్విత' గా రూపుదిద్దుకోవాలని సంకల్పం జరిగింది. దానికి అనుగుణంగానే ఇప్పటికి మొదటి రెండు భాగాలు వెలువడి ప్రస్తుతం ఈ మూడో భాగం వెలువడబోతోంది. ఈ నాలుగు భాగాల వెనుక నాలుగు స్థితులలోని వాక్కుల సమన్వయం కూడా ఉంది.

భౌతికమైన రూపురేఖా విలాస బల సంకలిత సామర్థ్యాలతో జగన్మాతగా, సింహాసనేశ్వరిగా, అటు బాహ్యరంగ విశ్వ సామ్రాజ్ఞిగా, ఇటు అంతరంగ జ్ఞాన సామ్రాజ్య వైభవ ప్రదాయినిగా, సాధక భక్తజన శుద్ధిని బట్టి సర్వ శుభాలను చేకూర్చగల సర్వమంగళగా - అమ్మవారు ప్రథమ భాగంలో దర్శన మిస్తుంది. ఇది 'వైఖరీ' వాక్సమన్వితమైన భాగం.

సద్గతులను ప్రసాదించే జగజ్జననిగా, 'మహా' లక్షణ సమన్వితురాలిగా, పంచకృత్యపరాయణగా, పురుషార్థప్రదగా, వర్ణాశ్రమవిధాయినిగా, గాయత్రీమాతగా, విశ్వవ్యాపినిగా, భక్త జనులకు కీర్తి ప్రతిష్ఠలను చేకూర్చే యశస్వినిగా - అమ్మవారు ద్వితీయ భాగంలో దర్శన మిస్తుంది. ఇది 'మధ్యమా' వాక్సమన్వితమైన భాగం.

పవిత్ర నామ పారాయణ ప్రతిఫలసిద్ధిని చేకూర్చే చక్ర స్థిత రాకిణ్యంబాది సప్తశక్తి మాతృకలుగా, ప్రజ్ఞానఘనరూపిణిగా, సర్వవేదాంత సంవేద్యగా, సత్యానంద స్వరూపిణిగా, శివజ్ఞానప్రదాయినిగా, సచ్చిదానంద రూపిణిగా, మృత్యుదారుకుఠారికగా - అమ్మవారు ఈ తృతీయభాగంలో దర్శన మిస్తుంది. ఇది 'పశ్యంతీ' వాక్సమన్వితమైన భాగం.

మహేశ్వరిగా మన ముందు నిలిచి, శివశక్త్యైక్యరూపిణిగా మనలను తనలో ఐక్యం చేసుకునే సహస్రనామ బిరుదాంకితురాలైన లలనామతల్లిగా సాక్షాత్కరిస్తూ, శ్రీ లలితా మాతృమూర్తిగా మన హృదయ గుహల్లో స్థిరంగా నిలిచిపోయే అమ్మవారుగా ముందు రాబోయే చతుర్థ భాగంలో దర్శనమిస్తుంది. ఇది 'పరా' వాక్సమన్వితమైన భాగం.

## ప్రస్తుత తృతీయ భాగంలోని కొన్ని విశిష్ట విషయాలు :

ఈ భాగంలో సాంకేతిక విషయాలు చాలా ఉన్నాయి. ప్రప్రథమంలోనే - షట్చక్రాలకు సంబంధించిన దేవతలు - వారి పరివార దేవతలు - వారి ఆయుధాలు, నివేదన ద్రవ్యాలు; మాస క్రమ పిండోత్పత్తి విశేషాలు; యోగ విషయాలు; 'సుప్రతిష్ఠా' నామంలోని శ్వేత సరస్వతీ, నీల సరస్వతీ విశేషాలు; ఛందో విషయాలు; భావా భావ విశేషాలు; గాయత్రీ, సావిత్రీ, సరస్వతీ, గణాంబా, గుహాంబా నామాలలోని నిగూఢార్థాలు; 'నామపారాయణ ప్రీతా' నామంలోని విశేషార్థం, మృత్యువుపై ఉండే సాధారణ అభిప్రాయాల విశ్లేషణ - మొదలైనవన్నీ హేతుబద్ధంగా, సోదాహరణంగా, అవసరమైన చోట చిత్రపటాలతో ఎన్నో విలువైన విషయాలు ఈ భాగంలో వివరించబడినాయి. ఈ నామ వివరణ గ్రంథాల్లో - అమ్మవారి విశేషణాలతో పాటు మన విధ్యుక్త ధర్మం గుఱించి గూడా జోడించి చెప్పడం జరిగింది.

## వ్యక్తిగతమైన అనుభూతి :

ఈ భాగంలోని వివరణలోగూడా పూర్వభాగ నామాల వివరణలలోలాగానే తెల్లవారు ఝామున అకస్మాత్తుగా మెలకువ వచ్చి అప్పటికప్పుడు స్ఫురించి వ్రాసినవి గూడా ఉన్నాయి. అమ్మవారే నన్ను మేలు కొలిపి వాటి వివరణలను వ్రాయించినట్లుగా అనుభూతి చెందాను. అటువంటి వాటిలో - మృగాక్షీ (561), మోహినీ (562), సుప్రతిష్ఠా (660), సాగరమేఖలా (694), మృత్యుదారు కుఠారికా (749) - మొదలైనవి కొన్ని నామాలు.

## ముఖ్య గమనిక :

ప్రథమ భాగంలోని 234 పేజీలో నాల్గవలైనులో తెలిపిన అష్టమావరణ త్రికోణానికి

సంబంధించిన అతి రహస్య శక్తులు 1) కామేశ్వరి 2) వజ్రేశ్వరి 3) భగమాలినీగా సవరించుకొని చదువుకోండి. అలాగే ప్రథమభాగం 222 పేజీలో, 19వలైనులో విశుద్ధి చక్రాధిష్ఠానదేవత ''డాకిణీశక్తి'' గా సవరించుకుని చదువుకోండి.

## వివరణకర్తగా నా సలహా :

ఈ తృతీయభాగం చదువుకునే ముందు ప్రథమ భాగంలోని పీఠిక, వివరణ అనుబంధం, ద్వితీయ భాగంలోని వివరణ, అనుబంధం కూడా చదవండి. ఈ తృతీయ భాగంలోని కొన్ని నామాల వివరణకు – అవి చదివితేనే చక్కని సమన్వయం కుదిరి విషయం బాగా అర్థమౌతుంది. ఈ లలితా సహస్రనామంలోని నామాలు అమ్మవారి బొమ్మలు ఉన్న వెయ్యి తపాలా స్టాంపుల పెద్ద కాగితం లాంటిది కాదు. అలా ఉంటే – ఏ స్టాంపుకు ఆ స్టాంపుకు విడి విడిగా ఒకే విలువ, ఒకే అర్థం, ఒకే రకమైన వినియోగం ఉంటాయి. కాని, స్తోత్రంలోని నామాలు – శ్రీ లలితా అమ్మవారి యొక్క పెద్ద చిత్రం గీయబడిన కాగితం యొక్క వెయ్యి ముక్కలు లాంటివి. ఈ ముక్కలన్నిటికీ వేర్వేరు అర్థాలు, వినియోగాలు ఉన్నా – ఒక దానితో ఒకదానికి సంబంధం ఉంటుంది. సమన్వయం ఉంటుంది. వాటి మధ్య అలాంటి సంబంధాన్ని, సమన్వయాన్ని ఊహిస్తేనే – ఆ పెద్ద కాగితంపై గల అసలైన ఒకే ఒక బొమ్మ అయిన అమ్మవారు అవగాహన అయి దర్శన మిస్తుంది. కాబట్టి, ఈ వివరణకు సంబంధించిన నామాలుగాని, భాగాలు కాని వేరు వేరు అనుకోకండి. ఒకే విద్యుత్తు ప్రవహించే బల్బు, రేడియో, ఫ్యాను, టి.వి. లాంటి వనుకోండి. అప్పుడు నామాల్లో, అంతర్లీనంగా, అంతస్సూత్రంగా వర్తించే జగన్నాటక సూత్రధారిణి అయిన అమ్మవారు అర్థమవుతుంది.

నేను చెప్పిన ఈ సూచనను, సలహాను పాటించి అమ్మవారి స్తోత్ర ప్రాశస్త్యాన్ని, అమ్మవారి వైభవాన్ని అర్థం చేసుకుని ఆనందిస్తారని ఆశిస్తాను.

గుంటూరు
ఇట్లు

4.1.98
-జి.ఎల్.ఎన్. శాస్త్రి

# కృతజ్ఞతలు

జగజ్జననిని తెలుసుకోమని జన్మనిచ్చిన జననీజనకులకు, ఆ జగజ్జననిని కలుసుకోమని ఆమె వేషవిలాస వివరాలను ఇచ్చిన గురుదేవులు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారికి, కలుసుకున్నప్పటి అనుభూతి వివరాలను అందరికీ వివరించమని ప్రోత్సహించి, ఆశీర్వదించిన శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ గారికి, తదితర పెద్దలకు సభక్తి ప్రణామములు.

ప్రథమ, ద్వితీయ భాగాలు చదివి ఉత్తరాల ద్వారా, వారి ఆనందాన్ని తెలియపరుస్తూ, ప్రచురణ పూర్వ మూల్యాల ద్వారా ప్రోత్సహిస్తూ - 'తృతీయ భాగం కోసం ఎదురుచూస్తూ ఉంటాం, త్వరగా ప్రచురించండి' - అని అభినందించిన - యోగసాధక పాఠకులందరికీ కృతజ్ఞతా పూర్వక ధన్యవాదాలు.

ప్రథమ, ద్వితీయ భాగాలకు జరిగినట్లే - ఈ తృతీయ భాగానికి గూడా 'శ్రీ కొండా శివరామకృష్ణమూర్తిగారు ఇచ్చిన విరాళంతోనే టైటిల్ పేజీ ముద్రణ జరిగింది. 'జి.ఎల్.ఎన్. శాస్త్రి వ్రాయబోయే శ్రీలలితా సహస్ర నామ వివరణ గ్రంథ ప్రచురణకు యథాశక్తి సహకరించమని స్వప్నంలో గురుదేవులు కృష్ణమాచార్యులవారిచే ప్రేరేపించబడినానని, రిటైర్ అయిన తరువాత తనకు వచ్చిన పి.ఎఫ్ మరియు గ్రాట్యుటీ సొమ్ములో కొంతభాగాన్ని అందుకోసమే కేటాయించాననీ, - శ్రీ శివరామకృష్ణమూర్తి గారు చెప్పారు. పచ్చతోరణాల స్వగృహంలో వారి సంతాన వివాహాది శుభకార్యాలు త్వరలో జరిగేలా అమ్మవారు, మాష్టారు అను గ్రహించాలని మనఃస్ఫూర్తిగా ఆశిస్తూ - వారికి కృతజ్ఞతా పూర్వక ధన్యవాదాలు తెల్పుకుంటున్నాను.

మా జగద్గురు పీఠం గుంటూరు శాఖవారు నిర్వహించే అన్ని ప్రధాన కార్యక్రమాలకు తమ విశాల గృహ ప్రాంగణాన్ని సానుకూల పరుస్తూ - శ్రీ లలితా దేవీ పూజలలో అత్యంత శ్రద్ధాభక్తులతో పాల్గొంటూ, పూజా మహోత్సవ నిర్వహణ నుండి - ఈ పుస్తక ముద్రణా యజ్ఞం దాకా కూడా అత్యంత ఆదరభావంతో సహకరిస్తూ, ప్రోత్సహిస్తూ, ఆదుకుంటున్న 'శ్రీదేశిరాజు పార్థసారధి - శ్రీలక్ష్మి' దంపతికి, - వారి

కుటుంబ బంధు మిత్ర సభ్యులకు, 'శ్రీ కె. వెంకుబాబు – లక్ష్మీకాంతం' – దంపతికి, శ్రీ లలితా పూజా కార్యక్రమాల్లో పాల్గొనే ఇతర సోదర సోదరీమణులకు, బెల్లంపల్లి వాస్తవ్యులు శ్రీ ఎన్. శ్యామసుందర్, వారి జ్యేష్ఠ కుమారుడు సుభాష్ చంద్రకు, చిన ఓగిరాల వాస్తవ్యురాలు శ్రీమతి ఓగిరాల దుర్గామహాలక్ష్మికి, రాజమండ్రి వాస్తవ్యులు శ్రీ గ్రంథి కోదండ రామారావు గారికి, నకిరేకల్ వాస్తవ్యులు చిరంజీవి ఎమ్. ఆంజనేయులుకు, గుంటూరు వాస్తవ్యులైన – డాక్టర్ పి. నాగమణికి, చిరంజీవి ఎమ్.వి. రమణకు, శ్రీనోరి ఆంజనేయశాస్త్రి గారికి, ప్రచురణ పూర్వ మూల్యాలను స్వీకరించి, అందచేసిన హైదరాబాదు వాస్తవ్యులైన శ్రీ పి.వి. రమణయ్య గారికి, శ్రీ పి. మురళీకృష్ణకు, రాజమండ్రి వాస్తవ్యులు చిరంజీవి జె. రఘునాథశాయికి, ఖరగ్ పూర్ వాస్తవ్యులు శ్రీ జి.ఎస్.ఎన్ మూర్తిగారికి, ఆర్ష విజ్ఞాన గ్రంథాల ప్రచురణకు నెలకొల్పిన గుంటూరులోని భారతీ ధార్మిక విజ్ఞాన పరిషత్ వారికి, గుంటూరు లోని శ్రీ విశ్వ కుటుంబ సభ్యులైన 'శ్రీ ఆకుల కోటేశ్వరరావు – కామేశ్వరి' దంపతికి – కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములు తెల్పుకుంటున్నాను.

ఈ లలితా సహస్ర నామ వివరణ గ్రంథ ప్రచురణా యజ్ఞంలో నాతో పాటు అహర్నిశలూ అత్యంత ఉత్సాహంతో పాల్గొంటూ, నాకు చేదోడు వాదోడుగా సహకరిస్తున్న చిరంజీవి సూరపరాజు హనుమాన్ ప్రసాద్‌కు, నేను వ్రాసే నామ వివరణకు అత్యంత సుందరమైన అక్షరాలలో శుద్ధప్రతిని ఎప్పటికప్పుడు తయారు చేస్తూ, ప్రూఫులు దిద్దుతూ సహధర్మచారిణి అన్న పదాన్ని సార్థకం చేస్తున్న నా శ్రీమతి చి.ల.సౌ. విష్ణుప్రియ (మీనాక్షి)కు నా ఆశీఃపూర్వకాభినందనలు.

ఈ తృతీయ ముద్రణను తన స్వంత పనిలా బాధ్యత పడి పుస్తకాన్ని D.T.P. Off-Setలో అతిసుందరంగా ముద్రించి సకాలంలో ఇచ్చిన ఓంకార్ గ్రాఫిక్స్ అధినేత చిరంజీవి కె. రాముకు, అనవద్యాంగి అయిన అమ్మవారిని అత్యంత సుందరంగా చిత్రించిన చిరంజీవి ఎల్. వర్ధన రావుకు ఆశీః పూర్వకాభినందనలు.

ఈ పుస్తక రచనకు ముందు చూచిన గ్రంథాలు

1) శ్రీ లలితా రహస్యనామ గూడార్థ దీపిక.

(గ్రంథకర్త - శ్రీ రాచకొండ వెంకట కోటేశ్వరరావు (ప్రకాశకులు - శ్రీరాచకొండ దుర్గాప్రసాద్, 4/13 బ్రాడీపేట - గుంటూరు) (అనుబంధములోని విషయాలన్నీ దాదాపు వీరి గ్రంథం నుండే స్వీకరించబడినాయి)

2) శ్రీ లలితా సహస్ర నామావళి (ప్రకాశకులు - 'స్వధర్మస్వారాజ్య సంఘం, బ్రాడ్వే, మద్రాసు)

ఆయా పుస్తకాల గ్రంథకర్తలకు, ప్రకాశకులకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు).

ఈ విధంగా ఈ గ్రంథ ప్రచురణా యజ్ఞానికి ప్రత్యక్షంగాను, పరోక్షంగాను సహకరించిన వారందరికీ కృతజ్ఞతా పూర్వక శుభాభివందనాలు. వీరందరూ అమ్మవారి అరుణారుణ చరణ కమల వికాస ప్రకాశంలో శుద్ధాంత రంగులై, పవిత్ర జీవన మాధుర్యాన్ని ఆస్వాదిస్తూ,బాధ్యతలనుసక్రమంగా, సకాలంలో నిర్వర్తిస్తూ, ఆయురారోగ్యైశ్వర్యాలను, అనంతమైన ఆనందాన్ని అనుభవించాలని హృదయపూర్వకంగా శ్రీ లలితా మాతృమూర్తిని ప్రార్థిస్తున్నాను.

గుంటూరు

4.1.98

ఇట్లు

జి.ఎల్.ఎన్. శాస్త్రి



శ్రీ లలితా దేవి

## చిద్రూప చింతన

తే.గీ. 'క' నులకింపగు రూపమ్ము కలిగి యుండి (మహాలావణ్యశేవధిః)
'ఏ' మి వంకలు లేనట్టి లేమ ఆమె (అనవద్యాంగీ)
'ఈ' వి చింతామణీ సౌధ గృహిణియైన (చింతామణి గృహాంతస్థా)
'ల' క్షణాహ్లాద వర్తనలబ్ధి యున్న (సాధ్వీ)
'హ్రీం' అనంగను గళమెత్తు హృదయశక్తి (హ్రీంకారీ)
'హ' రిణ నయనమ్ములను గల్గు తరుణి ఆమె (మృగాక్షీ)
'స' కల శక్తుల మూలమౌశక్తి ఆమె (సర్వశక్తిమయీ)
'క' డిమితోటల వసియించు కన్నతల్లి (కదంబవనవాసినీ)
'హ' రివిధీంద్రుల అర్చనలందు తల్లి (హరి బ్రహ్మేంద్ర సేవితా)
'ల' యకరియు కూడ అయినట్టి లలన ఆమె (లయకరీ)
'హ్రీం' అనంగ వాగింధన మ్మిచ్చుశక్తి (హ్రీంకారీ)
'స' చ్చిదానందరూపిణి స్వప్రకాశ (సచ్చిదానంద రూపిణీ, స్వప్రకాశా)
'క' ళలు మాలగా నున్నట్టి కల్పవల్లి (కళామాలా)
'ల' లిత లలితార్థ భావ సంకలితమూర్తి (లలితాంబికా)
'హ్రీం' అనంగను గళశక్తినిచ్చు తల్లి (హ్రీంకారీ)
'శ్రీం' అనంగను సిరులిచ్చు శ్రీల తల్లి (శ్రీమాతా)

శా. 'ఓం' కారేశ్వర శంకర ప్రణవ నాదోద్యానసంశోభితా!
'ఐం' కారేశ్వర – దివ్యమూర్తి! స్ఫుటవాగర్థాను సంస్థాపితా!
'హ్రీం' కారేశ్వరి! 'వాగ్విలాసగళమున్' హృద్యాతి హృద్యమ్ముగా
'శ్రీం' కారేశ్వరి! నాకు నిమ్ము కృపతో చిద్రూపచింతామణీ!

జి.ఎల్.ఎన్. శాస్త్రి

# అంకితము



గురుదేవులు

## శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్య

పాదార విందములకు

అంజలిఘటిస్తూ

- జి. ఎల్. ఎన్. శాస్త్రి

# అంకితము

సీ. శ్రీ విద్యబోధించు చిచ్ఛక్తి భక్తుండు
సూర్యస్తుతిని జెప్పు ఆర్యమూర్తి
శివసూక్తముల జెప్పు శివభక్త చిత్తుండు
శ్రీ గణేశుని గొల్చు యోగమూర్తి
విష్ణు సాహస్రక వివరణాత్మక కర్త
కృష్ణచరిత, క్రీస్తు గేయు - కర్త
భాగవత జ్యోతిషాగమ సూక్త గీ
తా బాలశిక్ష - సూత్రాల కర్త

గీ. పూర్వ పశ్చిమ సంస్కృతీ పుష్పములకు
యోగ సంస్కార పరిమళ భోగమిచ్చి
అన్వయించిన ఎక్కిరాలాన్వయులగు
కృష్ణమాచార్య గురువు కంకితము నిత్తు

భక్తినిండిన యెదతోడ ప్రణతిజేసి
పరవశించిన మదితోడ ప్రణుతి జేసి
దివ్యలలితాంబికా నామ దీప్తి కిరణ
భాష్యమైన తృతీయ విభాగ సుమము.

జి. ఎల్. ఎన్. శాస్త్రి

శ్రీ గణేశాయ నమః

శ్రీమత్త్రిపుర సుందర్యై నమః

## 475. విశుద్ధి చక్రనిలయా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించునపుడు 'విశుద్ధి చక్ర నిలయాయైనమః' అని చెప్పాలి.

విశుద్ధి చక్ర = విశుద్ధి చక్రము నందు, నిలయా = వసించునది.

ఈ నామం నుండి అంతర్మాతృకా వర్ణ న్యాస క్రమముగా సప్త చక్రాల యందు ఉండే - డాకినీ, రాకినీ, లాకినీ, కాకినీ, సాకినీ, హాకినీ, యాకినీ అధిష్ఠాన దేవతలు, వారి ఆయుధాలు, పరివార దేవతలు, నివేదన ద్రవ్యాల గురించిన విశేషాలు, పిండోత్పత్తిలో క్రమబద్ధంగా కలిగే మార్పులు, ఇంకా మరి కొన్ని విశేషాలు వివరింపబడతాయి.

శరీర నిర్మాణ శాస్త్రం (Structural Anatomy) కాకుండా, శరీరంలోని వివిధ అవయవాలు చేయవలసిన పనులను నిర్వర్తింప చెయ్యడానికి వెనుక ఉండి పని చేసే సూక్ష్మశక్తి వ్యూహానికి సంబంధించిన శాస్త్రం(Functional Anatomy) తాలూకు విశేషాలు కూడా ఇక్కడ నుండి చెప్పబడతాయి. ఆధునిక వైద్య శాస్త్రం ఎక్కువగా శరీరంలోని స్థూల అవయవాల నిర్మాణము, అమరికను గూర్చి చెబుతుంది కాని, వీటిని నడిపించే సూక్ష్మ శక్తి వ్యూహాన్ని గురించి చెప్పదు.

షట్చక్రాల గురించి కొన్ని వివరాలు ప్రథమ భాగంలోని అనుబంధంలో తెలుపబడ్డాయి. ఆ వివరాలన్నీ ఇక్కడ గుర్తు చేసుకోవాలి. పృథివీ తత్త్వానికి చెందిన మూలాధారంతో కాకుండా, ఆకాశతత్త్వానికి చెందిన విశుద్ధి చక్రంతో ప్రారంభింపబడి ప్రస్తుతం వివరణ చెప్పబడుతుంది. ముందు విషయం ఏదైనా వివరింపబడాలంటే కావలసింది వాక్కు కాబట్టి - ఆ వాక్కుకు సంబంధించిన విశుద్ధి చక్రంతోనే ప్రారంభింప బడుతుంది. 'విశుద్ధి చక్రంతోనే ఎందుకు ప్రారంభించాలి' ? అని ఎవరైనా ప్రశ్నిస్తే 'ఆ ప్రశ్న', అందుకు ప్రతిగా చెప్పే 'సమాధానం' - ఈ రెండూ విశుద్ధి చక్రం అనేది లేక పోతేరావు. అందుకని ముందు ఆ విశుద్ధ చక్రంతోనే వివరణ ప్రారంభించడం. అదీ కాక - ఈ విశుద్ధి చక్రం ఆకాశతత్త్వానికి సంబంధించినది. ఇది పంచ భూతాల్లో సూక్ష్మాతి

సూక్ష్మమైంది. దీనిలోంచే మిగిలిన నాలుగు భూతాలు వచ్చేది. అందుకనే ఈ విశుద్ధితో వివరణ ప్రారంభింపబడింది.

విశుద్ధి చక్రం కంఠానికి కొంచెం క్రిందుగా ఉంటుంది. ఈ విశుద్ధి చక్రానికి సంబంధించిన పద్మం శ్వేతవర్ణంలో ఉంటుంది. పదహారు దళాలు కలిగి ఉంటుంది. సంస్కృత భాషకు సంబంధించిన యాభై అక్షరాల్లో మొదట ఉండే పదహారు అచ్చు అక్షరాల మూలబీజాలు – ఈ పదహారు దళాలలో వరుస క్రమంలో ఉంటాయి. ఈ 'విశుద్ధి' - 'వాక్కు' కు సంబంధించిన చక్రం. ఇంతకు పూర్వం 'వజ్రేశ్వరీ' నామం చెప్పబడింది. ఆ వజ్రేశ్వరి వాక్కుకు సంబంధించిన దేవత ! (వజ్రం అంటే వాక్కే! దీని మంత్ర వ్యూహ యంత్రం గూడా ఆ వజ్రేశ్వరీ నామ వివరణలో చెప్పబడింది.)

ముందు మనలో 'శుద్ధి' ఉంటే – దేనిలో అయినా 'సిద్ధి' చేకూరుతుంది. 'శుద్ధి' అంటే కేవలం దేహపరంగానే కాదు. శరీరంతోచేసే పనుల్లోను, వాక్కుతో చెప్పే విషయాల్లోను, మనస్సులోని భావాలలోను గూడా శుద్ధి (అంటే – త్రికరణ శుద్ధి) ఉండాలి. ఈ శుద్ధి కలిగిన 'హనుమ'కు – 'విశుద్ధి చక్రానికి' – సంబంధించినదే రామాయణంలోని సుందరకాండ (నేను వ్రాసిన 'సుందరకాండ' చదివితే ఈ సమన్వయం తెలుస్తుంది.)

'విశుద్ధి చక్రమునందు వసించునది' అని ఈ నామానికి అర్థం.

## 476. ఆరక్తవర్ణా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ఆరక్తావర్ణాయైనమః' అని చెప్పాలి. 499వ నామం మళ్ళీ 'రక్తావర్ణా' అని వస్తుంది. అందుకని ఈ నామం పునరుక్తి కాకుండా ఉండేందుకు ప్రస్తుత నామాన్ని 'ఆరక్తవర్ణా' అని చెప్పుకోవాలి.

ఆరక్తవర్ణా = రక్తవర్ణములో నుండునది.

విశుద్ధి చక్రం దగ్గర ఉండే అమ్మవారి అంశదేవత (డాకినీదేవత) ఎఱ్ఱని దేహచ్ఛాయ కలిగి ఉంటుంది. వాక్కు వ్యక్తమవబోయే ముందు గొంతులో స్వరపేటికల

(Vocal Cords) గుండా వచ్చేనాదం ఘర్షణకు గురిఔతుంది. ఈ ఘర్షణనే మంత్రశాస్త్రంలో 'రేఫం' (Trill) అంటారు. ఘర్షణ వల్ల అగ్ని పుడుతుంది. కాబట్టి, ఈ రేఫాన్ని అగ్ని బీజమన్నారు. అగ్ని ఎఱుపురంగుకు సంబంధించినదిగా సమన్వయిస్తారు కాబట్టి, ఈ విశుద్ధి వద్ద ఉండే అధిష్ఠాన దేవత అయిన 'ఢాకినీ శక్తి' ఎఱ్ఱగా ఉంటుంది అని చెప్పడం జరిగింది.

రక్త వర్ణంలో ఉంటుందని చెప్పబడినా, ఈ చక్రాధిష్ఠాన దేవత నూటికి నూఱుపాళ్ళు రక్తవర్ణం కాదు. శ్వేత + రక్తవర్ణాల సమ్మిశ్ర వర్ణం. అంటే – 'పాటల వర్ణం' గా ఉంటుందని చెప్పుకోవాలి. ఇలా చెప్పడానికి కూడా కారణం ఉంది. మాతృగర్భంలో పడ్డ జీవి యొక్క పిండం ప్రాథమిక దశలో 'శుక్ల + రక్త' సమ్మేళనమైన బిందు రూపంలో ఉంటుంది. ఒక్క వారం రోజులు ఇలాగే ఉంటుంది. పదిహేను రోజులైన తరువాత, ఈ బిందురూపంలో ఉన్న పిండం – బుడగ రూపాన్ని పొందుతుంది. నెలాఖరుకు గట్టి పడుతుంది. నెలన్నరకు పిండంలాగా తయారవుతుంది.

శుక్లరక్త సమ్మేళనంతో ఆవిర్భవించిన పిండం యొక్క స్థితితో సమన్వయింప బడిన 'ఢాకినీ శక్తి' గూడా ఈ పాటల వర్ణంలోనే ఉంటుందని చెప్పటం సమంజసమే గదా !

'రక్తవర్ణములో నుండునది' అని ఈ నామానికి అర్థం.

## 477. త్రిలోచనా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'త్రిలోచనాయైనమః' అని చెప్పాలి.

ఇంతకు పూర్వం 453వ నామం అయిన 'త్రినయనా' అనే నామం గూడా అమ్మవారి కళ్ళకు సంబంధించినదే ! (ఈ నామం ద్వితీయ భాగంలో వివరింపబడింది.)

'నయన' మనే పదం 'నయ్' అనే ధాతువు నుండి వచ్చింది. 'నయ్' అంటే 'నడిపించు' (To guide, to lead, to manage) అని అర్థం. ఈ అర్థాన్ని బట్టి 'నయనం' అంటే నడిపించేది, ముందుకు జాగ్రత్తగా తీసుకువెళ్ళేది, నడిపించుటకు ఉపకరించేది – అనే అర్థాలు వస్తాయి.

'లోచన' మనే పదం 'లోచ్' అనే ధాతువు నుండి వచ్చింది. 'లోచ్' అంటే - దర్శించు, ఆలోచించు, పరిశీలించు, అవగాహన చేసుకొను (To see, to view, to perceive, to observe) అనే అర్థాలు ఉన్నాయి. ఈ అర్థాలను బట్టి 'లోచనం' అంటే - ఆలోచించుటకు, లోతుగా పరిశీలించుటకు, దర్శించుటకు ('చూచుట' కన్న 'దర్శించుట' అనే పదంలో ఎక్కువవైశిష్ట్యం ఉన్నది) ఉపకరించునది అనే అర్థాలు వస్తాయి.

అమ్మవారికి ఉన్న ఈ మూడు కళ్ళు - నయనాలే కాకుండా అవి - 'మూడూ లోచనాలు కూడా' అని పై అర్థాల తారతమ్యాన్ని బట్టి అర్థం చేసుకోవాలి. లోచనాల కున్న ఈ అర్థంలోనే - 1) ఏ విషయాన్నైనా లోతుగా పరిశీలించగలది, 2) త్రికాలాలలోకి వెళ్ళగలిగేది, 3) ఒక విషయం తాలూకు పూర్తి అవగాహన అంటే - వాటి భూత వర్తమాన భవిష్యత్కాల స్థితులను గూడా దర్శించి చెప్పగలది' అనే భావాలు వస్తాయి.

అమ్మవారి వామ, దక్షిణ, ఫాలనేత్రాలు మూడూ వరుసగా - సోమ, సూర్య, అగ్ని సంబంధమైనవి. వరుసగా ఇవే - రాత్రి, పగలు, సంధ్యాకాలాలను గూడా సూచిస్తాయి. ఇవే - ఋగ్వేద, యజుర్వేద, సామవేదాలను కూడా సూచిస్తాయి.

1) మూడు లోచనములు కలది.

2) సోమ, సూర్య, అగ్నులను, ఋగ్యజాస్సామ వేదములను, దివారాత్ర సంధ్యాకాలములను, భూత భవిష్యద్వర్తమాన కాలములను సూచించు కన్నులు కలది - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 478. 'ఖట్వాంగాది ప్రహరణా'

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ఖట్వాంగాది ప్రహరణాయై నమః' అని చెప్పాలి.

ఖట్వాంగ = ఖట్వాంగము, ఆది = మొదలైన, ప్రహరణ = ఆయుధములు ధరించునది.

'ఖట్', 'వషట్', 'వౌషట్' - మొదలైన వన్నీ ఒకే జాతి పదాలు. 'వస్'

ధాతువునుండి 'వసతి' మాట వస్తే, ఆ 'వసతి' విరూపణ చెంది కొంచెం ఛాందసంగా 'వషత్' అయి ఉంటుంది. 'వషట్'కు సంబంధించినదే 'వౌషట్'. సంధ్యావందనాది విధానాల్లో 'నేత్రత్రయాయ వౌషట్' అని వస్తుంది. 'చ' కార గుళ్ళు అని, 'వషట్కారాలు' అని కొందరిళ్ళలో పెద్దవాళ్ళు వాడుతూ ఉంటారు. ఈ రెంటికీ 'చివాట్లు' 'చఱుపులు'! 'తిట్లు' అని గూడా వ్యంగ్యార్థాలు ఉన్నాయి. అయితే, ఈ అర్థాలు నిఘంటువుల్లో ఉండవు. 'చ' కార గుడి అంటే 'చి', 'చివాట్లు'లో – 'చి' మొదటి అక్షరం కాబట్టి ఇది చివాట్లకు సంకేతం. (అలాగే, నేత్రత్రయాయ వౌషట్' అంటున్నపుడు కుడి చేతిని తలచుట్టూ త్రిప్పి ఎడమ అర చేతిని చఱుస్తారు అందువల్ల ఇది చఱుపులకు సంకేతంగా పెద్దవాళ్ల వాడతారు 'ప్రహరణాలు' అనే పదాన్ని గూడా 'దెబ్బలకు' సంకేతంగా వాడతారు).

అయితే వషట్కారం, 'వషట్' అనేవి దేవతలకు ఏదైనా సమర్పించేటప్పుడు చెప్పే ఒక మాటగాగూడా ఉపయోగిస్తారు. ఈ పదాలకు 'వస్' అనే ధాతువు మూలంగాబట్టి 'ఉండుటకు వీలైనది' అనే అర్థంలో – 'ఖట్వము' అనే పదం – 'పర్యంకము' లేదా 'మంచము' అనే అర్థంలో వాడబడుతోంది. నిఘంటువులో ఈ అర్థమే ఉంటుంది. అయితే, శ్రీ విద్యలో 'ఖట్వాంగము' అనేది ఒక ఆయుధంగా చెబుతారు. గదలాగా పట్టుకోడానికి వీలుగా ఉండే ఒక దండం ఉండి, చివర 'కపాలాన్ని' బోలి ఉండే ఒక ఆయుధాన్ని 'ఖట్వాంగము' అంటారు.

ఖట్వాంగాదులలో ఖట్వాంగముతో పాటు ఉండే మిగిలిన ఆయుధాలు – ఖడ్గము, త్రిశూలము, చర్మము. విశుద్ధి చక్రానికి సంబంధించిన శక్తి దేవత తన నాలుగు చేతుల్లో ఈనాల్గింటిని ధరిస్తుంది.

ఖట్వాంగానికి చివర 'కపాలం' లాగా ఉండేది ఉంటే – మిగిలిన మూడు ఆయుధాలకు – కపాలంలో ఉండే నేత్ర, శ్రోత్ర, నాసికాదులతో సమన్వయం ఉంటుంది.

ఖట్వాంగాదులకు వేరే అక్షర సంకేతాలున్నాయి. హల్లులను ఈ క్రింద తెలిపిన విధంగా ఐదు వర్గాలుగా వ్రాస్తే –

| క | ఖ | గ | ఘ | ఙ |
|---|---|---|---|---|
| చ | ఛ | జ | ఝ | ఞ |
| ట | ఠ | డ | ఢ | ణ |
| త | థ | ద | ధ | న |
| ప | ఫ | బ | భ | మ |

అప్పుడు -

'ఖ, ఛ, ఠ, థ, ఫ' – 'ఖ' తో ప్రారంభమయే ఈ వర్గాక్షరాలను 'ఖట్వాంగాదులు' అంటారు. అలాగే 'ఘ, ఝ, ఢ, ధ, భ' – 'ఘ' తో ప్రారంభమయే ఈ వర్గాక్షరాలను 'పరిఘాంతములు' అంటారు. వీటికి పరిశుద్ధమైన వర్ణక్రమం ఉంటుంది. వీటిని ఉచ్చరిస్తుంటే విశుద్ధి చక్రం శుద్ధి చెందుతుంది.

'ఖట్వాంగాది' ఆయుధములు ధరించునది – అని ఈ నామానికి అర్థం.

## 479. వదనైక సమన్వితా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వదనైక సమన్వితాయై నమః' అని చెప్పాలి.

వదన + ఏక = వదనైక = ఒకే ముఖమును (నోరు) సమన్వితా = కూడి ఉన్నది.

గర్భస్థ పిండం ఆహారాన్ని స్వీకరించడానికి ఒక రంధ్రాన్ని కలిగి ఉంటుంది. దీని ద్వారానే పిండం – తల్లి నుండి ఆహారాన్ని గ్రహిస్తుంది. పిండానికి ఉండే మొట్టమొదటిదైన ఈ రంధ్రం – తర్వాత దానికి ముఖంగా (నోరుగా) మారుతుంది. దీన్నే ముఖ్య ప్రాణం (Buckle Cavity) అని అంటారు. (మధ్వులలో కొందరు ఈ 'ముఖ్య ప్రాణ' పదాన్ని పేరుగా కూడా పెట్టుకుంటారు) 'విశుద్ధి' అంటే నోటి నుండి వెలువడే వాక్కుకు సంబంధించినది కాబట్టి, ఇక్కడ నుండి పలికే దానికి నోరు కాక ఇంకేముంటుంది ?

'కేవలము ఒకే ఒక నోటితో సమన్వయింపబడిన రూపము గలది' అని ఈ నామానికి అర్థము.

## 480. పాయసాన్న ప్రియా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పాయసాన్న ప్రియాయైనమః' అని చెప్పాలి.

పాయసాన్న = పాయసాన్నము నందు, ప్రియా = ప్రీతి కలది.

విశుద్ధి చక్రాధిష్ఠాన దేవతకు 'పాయసాన్నం' ప్రీతిగా ఉంటుంది. గర్భస్థ జీవి పిండరూపంలో ఉన్నపుడు గూడా పాయసాన్నం మీద ప్రీతిగా ఉంటుందిట! ఎందుకంటే – ఆ జీవి తన పూర్వ జన్మలో అన్న ప్రాశన జరిగినపుడు మొట్ట మొదటగా పాయసాన్నాన్నే రుచిచూశాడు కాబట్టి! (జీవి మొట్టమొదటగా పాయసాన్నంతో ఆహారాన్ని స్వీకరించడం ప్రారంభించాలనే సూచన గూడా ఈ నామంలో ఉంది)

'పాయసాన్నము నందు ప్రీతి గలది' అని ఈ నామానికి అర్థం.

## 481. త్వక్ స్థా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'త్వక్స్థాయైనమః' అని చెప్పాలి.

త్వక్ = చర్మమును, స్థా = ఆశ్రయించి యుండునది.

భౌతిక శరీరం – చర్మము, రక్తము, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జా, శుక్రము – అనే ఏడు ధాతువులతో రూపొందింపబడి ఉంటుంది. ఈ సప్త ధాతువులలో ఒక్కొక్కటి ఒక్కొక్క చక్రం యొక్క నియంత్రణలో ఉంటాయి. విశుద్ధి చక్రాధిష్ఠాన దేవత చర్మాన్ని ఆశ్రయించి ఉంటుంది. 'త్వక్' అంటే చర్మం కాబట్టి – 'త్వక్స్థా' అంటే 'చర్మమును అధివసించి ఉండునది' అని అర్థం. ('త్వక్' అనే సంస్కృత పదం నుండే 'తొక్క' (పెచ్చు) అనే తెలుగు పదం వచ్చింది. చర్మ వ్యాధులు ఉన్నవారు ఈ నామాన్ని 'త్వక్స్థాయై నమః' అని సంపుటి చేసి నలభై రోజులు జపించి చివర రోజున అమ్మవారిని పూజించి పాయసం నివేదన చేస్తే – ఆ చర్మవ్యాధులు తొందరగా నివారణమౌతాయి. 'చర్మధాతువును ఆశ్రయించి ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 482. పశులోక భయంకరీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పశులోక భయంకర్యైనమః' అని చెప్పాలి.

పశులోక = పశుప్రవృత్తికి, భయంకరీ = భయము గొలువునది లేదా భయమును కలుగచేయునది.

'పశులోక భయంకరీ' అనగానే – 'పశువులన్నింటినీ భయపెట్టేది' అని అర్థం చెప్పుకోడానికి ప్రయత్నిస్తాము. కాని 'పశు' పదం 'లోక' పదం ఇవి వేరే విషయాలను సూచిస్తాయి. 'పశు' పదం పశుప్రవృత్తిని సూచిస్తుంది. అలాగే 'లోకం' అంటే 'తాను విహరిస్తున్న 'కక్ష్య' (Plane of Existence). అంతే కాని, తాను భౌతికంగా ఉన్న ప్రపంచం కాదు. మనం భౌతికంగా ఉండే భూగోళాన్ని ఆంగ్లంలో Globe of existence అనీ – ఆలోచించే కక్ష్యను Plane of existence అనీ అంటారు. ప్రస్తుత నామంలో 'పశులోక' అంటే 'పశు ప్రవృత్తి కక్ష్యలో ఉండేవారు' అని అర్థం చెప్పుకోవాలి.

మనిషిలో నాభికి దిగువ లోకాన్ని 'పాతాళలోకం' అనీ, నాభికి కంఠానికి మధ్యలోకాన్ని 'మర్త్యలోకం' అనీ – కంఠానికి పైన ఉన్న లోకాన్ని 'దేవలోకం' అనీ అంటారు. మనలోని పశుప్రవృత్తి లక్షణాలను సూచించే మహిషాసుర, నరకాసుర, భండాసురాదులుండే పాతాళలోకమే పశులోకం. వీరికి భయమును కలిగించునది అమ్మవారు.

తనను గురించి తనకి తెలియకపోవడం, తెలుసుకోడానికి ప్రయత్నమే లేకపోవడం – ఇవి పశులక్షణాన్ని సూచిస్తాయి. ఈ పశు లక్షణానికి విరుగుడు అమ్మవారే! అని ఈ నామం సూచిస్తుంది.

'పశుప్రవృత్తికి భయమును కలుగ చేయునది' అని ఈ నామానికి అర్థం.

## 483. అమృతాది మహాశక్తి సంవృతా

పదకొండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అమృతాది మహాశక్తి సంవృతాయై నమః' అని చెప్పాలి.

అమృతాది = అమృతా మొదలైన, మహాశక్తి = మహాశక్తుల చేత, సంవృతా = పరివేష్టింపబడి యుండునది.

ఈ విశుద్ధి చక్రాధిష్ఠాన దేవత పదహారు మంది మహాశక్తుల చేత పరివేష్టింపబడి ఉంటుంది. ఈ పదహారు మంది – అక్షరాలలోని పదహారు అచ్చులచే సూచింపబడతారు. మృతములైన లోకాలు వీటి యందు మాయమౌతాయి. ఈ శక్తుల పేర్ల మొదటి అక్షరాలు అచ్చుల క్రమంలోనే ఉంటాయి. ఈ పేర్లు అనుబంధంలో తెలుపబడ్డాయి. 'అమృతా మొదలైన మహాశక్తుల చేత పరివేష్టింపబడి యుండునది' – అని ఈ నామానికి అర్థం.

## 484. డాకినీశ్వరీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'డాకినీశ్వర్యై నమః' అని చెప్పాలి.

డాకినీశ్వరీ = 'డాకినీ' అని పేరుగల విశుద్ధి చక్రాధిష్ఠాన దేవత.

విశుద్ధి చక్రాధిష్ఠాన శక్తి దేవత పేరు. 'డాకినీ' ఈ చక్రాధిష్ఠాన దేవతకు సంబంధించిన బీజ, కీలక, న్యాస మంత్రాలన్నీ 'డ' కారంతో సంబంధం కలిగినవిగా ఉంటాయని ఈ 'డాకినీ' నామంలోని మొదటి అక్షరం సూచిస్తుంది. 476వ నామం అయిన అరక్తవర్ణా' నామం నుండి ఈ ప్రస్తుత నామం వరకు విశుద్ధి చక్రాధిష్ఠాన దేవత అయిన 'డాకినీశ్వరి' యొక్క దేహచ్ఛాయ, కన్నుల సంఖ్య మొదలైన లక్షణాలన్నీ చెప్పబడ్డాయి. ఈ లక్షణాలన్నీ ఈ క్రింద తెలిపిన డాకినీ దేవతా ధ్యాన శ్లోకంతో గుర్తు పెట్టుకోవచ్చును.

శ్లో. గ్రీవాకూపే, విశుద్ధౌ, నృపదళకమలే, శ్వేతరక్తాం, త్రినేత్రాం
హస్తైః– ఖట్వాంగ, ఖడ్గౌ, త్రిశిఖమపి, మహాచర్మ సంధారయంతీమ్
వక్త్రేణైకేనయుక్తాం, పశుజనభయదాం, పాయసాన్నైక సక్తాం
త్వక్స్థా వందేఽమృతాద్యైః పరివృతవపుషాం, డాకినీం, వీరవంద్యామ్

'డాకినీ' అని పేరుగల విశుద్ధి చక్రాధిష్ఠాన దేవత' అని ఈ నామానికి అర్థం.

## 485. అనాహతాబ్జనిలయా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అనాహతాబ్జనిలయాయై నమః' అని చెప్పాలి.

అనాహతాబ్జ = అనాహత చక్రమునందు, నిలయా = వసించునది.

అనాహత పద్మం హృదయ ప్రాంతంలో ఉంటుంది. వేరే ఒకరు కొడితే గాని ధ్వని, లేదా - శబ్దం పుట్టదు. కాని, అలా కొట్టబడకుండానే శబ్దం పుట్టే చోటు హృదయంలో ఉంటుంది. అందువల్లనే ఈ చక్రానికి, లేదా - పద్మానికి 'అనాహతము' (Un beaten) అనే పేరు వచ్చింది.

ఈ అనాహత పద్మం పన్నెండు దళాలు కలిగి ఉంటుంది. అక్షరాల్లోని హల్లులలో 'క' నుండి 'ఠ' కారం దాకా వుండే పన్నెండు హల్లులకు సంబంధించిన బీజాలు ఈ అనాహత పద్మంలో ఉంటాయి. ఇవి వరుసగా పన్నెండు దళాలలోను వరుస క్రమంలో ఉంటాయి. ఈ అనాహతం వాయుతత్త్వాన్ని నియంత్రణ చేస్తుంది. ఈ చక్రానికి సంబంధించిన కొన్ని వివరాలు ప్రథమ భాగంలోని అనుబంధంలో వివరింపబడ్డాయి. ముందురాబోయే నామాల్లో మరికొన్ని విశేషాలు చెప్పబడతాయి.

'అనాహత పద్మము నందు వసించునది' - అని ఈ నామానికి అర్థం.

## 486. శ్యామాభా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శ్యామాభాయై నమః' అని చెప్పాలి.

శ్యామాభా = శ్యామల వర్ణములో వెలుగొందునది.

అనాహత పద్మ అధిష్ఠాన దేవత యొక్క దేహచ్ఛాయ 'శ్యామలవర్ణం', అంటే - నలుపు రంగులో ఉంటుంది. (రాత్రిపూట ఉండే ఆకాశం రంగును శ్యామల వర్ణం అనవచ్చును)

బయట ఉండే చోటులో జీవి ఉంటే – జీవి యొక్క హృదయంలో మచ్చుకి అన్నట్లు మళ్లీ చోటు ఉంటుంది. హృదయంలో ఉండే ఈ చోటు అందరికి కనబడదు కాబట్టి దీన్ని 'మాటు' అని చెప్పుకోవచ్చును. హృదయంలో ఉండే ఈ చోటును 'దహరాకాశం' అంటారు.

'నలుపు రంగులో వెలుగొందునది' – అని ఈ నామానికి అర్థం.

## 487. వదనద్వయా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వదనద్వయాయై నమః' అని చెప్పాలి.

వదన = ముఖములు; ద్వయా = రెండు కలది.

అనాహత చక్ర అధిష్ఠాన దేవతకు రెండు వదనాలుంటాయి.

'ప్రాణము' అంటే బయట నుండి లోపలకు స్వీకరించే శక్తి, 'అపానము' అంటే లోపల నుండి బయటకు వికర్షించే శక్తి. శరీరంలోని అన్ని చోట్లనుండి చెడ్డ రక్తం సిరల ద్వారా హృదయానికి కొని రాబడుతుంది. హృదయం నుండి మంచి రక్తం ధమనుల ద్వారా మిగిలిన శరీర భాగాలకు సరఫరా చేయబడుతుంది. ఈ రెండు ప్రక్రియలను ఈ రెండు వదనాలు సూచిస్తాయని సమన్వయపరచుకోవచ్చును.

గర్భంలోని పిండానికి మొదటి నెలలో తల్లినుండి ఆహార స్వీకరణకై ఒక రంధ్రం ఏర్పడుతుంది. ఈ రంధ్రాన్నే ఒక వదనంగా కలిగిన విశుద్ధి చక్ర అధిష్ఠాన దేవతగా 480వ నామంలో 'వదనైక సమన్వితా' అని చెప్పబడింది. ప్రస్తుత నామంలో – పిండం యొక్క రెండవ మాసకాలంలో గాలి పీల్చడానికి మరో రంధ్రం ఏర్పడుతుంది. వీటినే రెండు వదనాలుగా (నోరులాంటి రంధ్రాలుగా) సమన్వయ పరచుకోవాలి. పిండం పూర్తిగా మానవాకృతి పొందిన తరువాత ఇదే – ముక్కుగా రూపొందుతుంది. హృదయ స్పందనతో శ్వాసకోశానికి సంకోచ వ్యాకోచాలు కలిగి ముక్కు ద్వారా ఉచ్ఛ్వాస నిశ్వాసలు జరుగుతాయి. 'హృదయానికి సంబంధించిన ఈ అనాహత చక్రం వాయుతత్వాన్ని నియంత్రణ చేస్తుంది' అనే విషయం కూడా ఇక్కడ గుర్తుంచుకోవాలి.

'రెండు వదనములు కలది' అని ఈ నామానికి అర్థం.

## 488. దంష్ట్రోజ్జ్వలా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'దంష్ట్రోజ్జ్వలాయై నమః' అని చెప్పాలి.

దంష్ట్రా = కోరలచేత, ఉజ్జ్వలా = మిక్కుటముగా ప్రకాశించునది.

అనాహత చక్రాధిష్ఠాన దేవత – నల్లని దేహచ్ఛాయతో, రెండు వదనాలతో వుండి – ఆ రెండు ముఖాలలోను వరాహానికి ఉండే తెల్లని కోరలు ఉంటాయి. నల్లని శరీర నేపథ్యంలో తెల్లగా ప్రకాశిస్తూ ఉండే కోరలతో ఈ దేవత చూడటానికి చాలా భయంకరంగా ఉంటుంది. కోరలు నోరు లోపల నుండి బయటకు పొడుచుకు వస్తాయి. వెలుగును ప్రసారం చేస్తున్నట్లుంటాయి. క్రిందటి నామంలో ప్రాణశక్తికి సంబంధించిన శ్వాస ప్రసారాన్ని గూర్చి, ఈ నామంలో వెలుగు ప్రసారాన్ని గూర్చి చెప్పబడిందని గ్రహించాలి. ఈ రెండు రకాల ప్రసారాల మీద ప్రాణాయామ ప్రక్రియ ఆధారపడి ఉంటుందని గూడా గ్రహించాలి. కాబట్టి, వీటికి కావలసిన ఏర్పాటు ముందుగా జరుగుతుందని సూచన.

'కోరలతో ప్రకాశించునది' అని ఈ నామానికి అర్థం.

## 489. అక్షమాలాదిధరా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అక్షమాలాదిధరాయై నమః' అని చెప్పాలి.

అక్షమాలా = రుద్రాక్షమాల (లేదా, అకారాదిక్షకారాంత వర్ణమాల) ఆది = మొదలైన వాటిని, ధరా = ధరించి యుండునది. ఈ చక్రాధిష్ఠాన దేవత అక్షమాల ధరించి ఉంటుంది. అక్షమాల అంటే రుద్రాక్షమాల అని అర్థం చెప్పుకోవచ్చును. లేదా 'అ' కారాది 'క్ష' కారాన్ని మేరువుగా సమన్వయ పరచుకోవాలి.

ఈ దేవత అక్షమాలతో పాటు శూలము, కపాలము, డమరుకములను నాలుగు చేతులలో ధరించి ఉంటుంది.

అనాహత చక్రంలో – అక్షరాలు ఏవేవి 'ఎలా పలకాలో అలా ఉచ్ఛరించే లేదా వ్యక్తపరిచే వాడు' (Typist) ఉంటే – విశుద్ధిలో ఉచ్ఛరించడానికి అవసరమయే పరికరం (Type Writer) ఏర్పాటు (Arrangement) వుంటుందనే విధంగా ఈ రెండు చక్రాల లక్షణాలను అర్థం చేసుకోవాలి.

'అక్షమాల మొదలగు వాటిని ధరించి యుండునది' అని ఈ నామానికి అర్థం.

## 490. రుధిర సంస్థితా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రుధిర సంస్థితాయై నమః' అని చెప్పాలి.

రుధిర = రక్తధాతువును, సంస్థితా = ఆశ్రయించి ఉండునది.

అనాహతం హృదయానికి సంబంధించినది. హృదయం రక్త ప్రసరణకు ఏర్పాటైన ప్రధాన యంత్రం. అందుకని ఈ చక్రానికి సంబంధించిన దేవత 'రక్తాన్ని' ఆశ్రయించి ఉంటుంది.

రక్త దోషాలు, రక్త ప్రసరణ దోషాలు ఉన్నవారు ఈ నామానికి 'రుధిర సంస్థితాయై నమః' అని సంపుటి చేసి జపిస్తే ఆ దోషాలు నివారించబడతాయి.

'రక్త ధాతువును ఆశ్రయించి ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 491. కాళరాత్ర్యాది శక్త్యౌఘవృతా

పది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కాళరాత్ర్యాదిశక్త్యౌఘవృతాయై నమః' అని చెప్పాలి.

కాళరాత్రి = కాళరాత్రి, ఆది = మొదలైన పేర్లు గల, శక్తి = శక్తి దేవతల, ఔఘ = వర్గముతో, వృతా = పరివేష్టింపబడి యుండునది.

అనాహత పద్మానికి పన్నెండు దళాలుంటాయి. ఈ పన్నెండు దళాలలోను వరుసగా 'క' కారం నుండి 'ఠ' కారందాకా ఉండే పన్నెండు అక్షరాలతో ప్రారంభమయే

పేర్లు గలిగిన పన్నెండు శక్తి దేవతలు ఉంటారు. పద్మం మధ్యలో ఉండే కర్ణిక వద్ద అధిష్ఠాన దేవత ఉంటుంది. (ఈ కాళరాత్ర్యాది దేవతల పేర్లు అనుబంధంలో ఇవ్వబడ్డాయి).

'కాళరాత్రి' మొదలైన పన్నెండు మంది శక్తి దేవతలచే పరివేష్టింపబడి యుండునది' - అని ఈ నామానికి అర్థం.

## 492. స్నిగ్ధౌదన ప్రియా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'స్నిగ్ధౌదనప్రియాయై నమః' అని చెప్పాలి.

స్నిగ్ధ = (చమురుతో) తడిసిన, ఓదన = అన్నము నందు, ప్రియా = ప్రీతిగలది.

'స్నిగ్ధము' అంటే తడిసిన అని అర్థం. అయితే తడవడం అంటే నీటితో కాదు. 'స్నిగ్ధ' పదంలో జిడ్డుకు సంబంధించిన 'చమురు', 'నునుపు' లక్షణాలు తెలిపే అర్థాలు గూడా వుంటాయి. చమురుతో తడిసిన అన్నానికే ఈ లక్షణం ఉంటుంది. అయితే, ఈ చమురు అంటే - ఏ నూనె పడితే - ఆ నూనె కాక - 'నెయ్యి' అనే అర్థాన్ని గ్రహిస్తే - ఈ చక్రాధిష్ఠాన దేవతకు నెయ్యి కలిపిన అన్నం ఇష్టమని ఈ నామం సూచిస్తుంది.

గుండె పెద్దది (Heart enlargement) గా వుండడం వల్ల వచ్చే రుగ్మతలు నివారణ అవాలంటే ఈ చమురు, కొవ్వు (అంటే నెయ్యి, నూనె, వెన్న మొదలైనవి) స్వీకరించడం బాగా తగ్గించాలి. లేకపోతే, గుండె - వాటి వల్ల మరింత పెరిగే అవకాశం కలుగుతుంది.

'నేతితో తడిసిన అన్నము నందు ప్రీతి కలది' అని ఈ నామానికి అర్థం.

## 493. మహావీరేంద్రవరదా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహావీరేంద్ర వరదాయై నమః' అని చెప్పాలి.

మహా = గొప్ప, వీరేంద్ర = వీరులైన వారికి, వర = శ్రేష్ఠమైన వాటిని, దా = ఇచ్చునది. మహావీరేంద్రులంటే - త్రిమూర్తులు, ఇంద్రుడు - అని ఒక అర్థం చెబుతారు. వీరి ద్వారా

నిర్వహింపబడవలసిన కృత్యాలకు కావలసినవన్నీ అమ్మవారు సమకూరుస్తుంది - అని ఒక అర్థం.

యోగసాధకులను 'వీరులు' అనీ, - ఈ సాధన ఆపకుండా కొనసాగించే వారిని 'మహావీరులనీ' అనాలి. ఈ మహావీరుల్లో చివరి దాకా నిలబడి లక్ష్యాన్ని సాధించిన వారిని 'మహా వీరేంద్రు' లనాలి. ఇటువంటి మహావీరేంద్రులకు కావలసినవన్నీ - అమ్మవారు వాళ్ళేమీ కోరకుండానే సమకూరుస్తుంది.

అమ్మవారిని ఉపాసించే వారిని 'మహావీరు' లనే పదంతో సంకేతించడం కూడా వుంది. సౌందర్యలహరిలో 'స్ఫురద్గండా భోగ .... 'మహా వీరోమారః' ప్రమథపతయే - సజ్జితవతే'' - అన్న 59వ శ్లోకంలో ఆదిశంకరులు శాక్తేయుడైన మన్మథుణ్ణి ఉద్దేశించి అంటారు. మన్మథుడు పిల్లవాడైనా అమ్మవారిని ఉపాసించి శివుడంతటి వాణ్ణి, ముల్లోకాలను గూడా జయిస్తాడు. దీనికి కారణం అమ్మవారి ఉపాసనే అంటారు ఆది శంకరులు. 'ధనుఃపౌష్పం' .. అన్న శ్లోకంలో.

'సింహరాశి' సూచించే 'హృదయమే' - ధైర్యానికి, సాహసానికి, ఉత్పత్తి స్థానం. ఈ హృదయానికి సంబంధించినదే అనాహత చక్రం. అందువల్ల ఈ చక్రాధిష్ఠాన దేవతా రూపంలో ఉన్న అమ్మవారిని ఉపాసిస్తే ధైర్యసాహసాలు వస్తాయి. ఎప్పుడూ ధైర్యమనేది - మనకు బయటి వారి వల్ల కంటే, మనలో నుండి రావడమే మంచిది. దేనికైనా ముందు 'గుండె ధైర్యం' కావాలంటారు అందుకే !

తన్ను తాను ధరించగలగడం (స్వధా), తనకు ధైర్యం తానే అవడం, ముఖంలో వర్చస్సు - ఈ మూడు లక్షణాలు ఈ 'స్వధా' కు సంబంధించిన పితృదేవతల దయవల్ల కలుగుతాయి. 'స్నిగ్ధ', అంటే - చమురు సంబంధమైన నువ్వులు, నెయ్యి, పుష్కలంగా సమర్పించాలి అంటారు మన పెద్దవాళ్ళు. (ఈ దేవత స్నిగ్ధౌదన ప్రియాకదా!)

'శ్రేష్ఠులైన ఉపాసకులకు అవసరమైన వన్నీ సమకూర్చునది' - అని ఈ నామానికి అర్థం.

## 494. రాకిణ్యంబాస్వరూపిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రాకిణ్యంబాస్వరూపిణ్యై నమః' అని చెప్పాలి.

రాకిణీ + అంబా + స్వరూపిణీ = రాకిణీ దేవతా స్వరూపముగా నుండునది.

అనాహత చక్రాధిష్ఠాన దేవత పేరు 'రాకిణీ' ఈ చక్రాధిష్ఠాన దేవత కు సంబంధించిన బీజ, కీలక, న్యాస మంత్రాలన్నీ 'ర' కార సంబంధంగా ఉంటాయని 'రాకినీ' నామంలోని మొదట అక్షరం 'రా' సూచిస్తుంది. 'అనాహతాబ్జనిలయా' అనే నామం దగ్గర నుండి ఈ నామందాకా చెప్పబడిన వివరాలన్నీ ఈ 'రాకిణీ దేవత' కు సంబంధించినవే. ఈ లక్షణాలన్నీ రాకిణీ దేవత ధ్యానానికి సంబంధించిన శ్లోకంతో గుర్తుపెట్టుకోవచ్చును.

శ్లో. హృత్పద్మే, భానుపత్రే, ద్వివదనలసితాం, దంష్ట్రిణీం, శ్యామవర్ణాం
చక్రం, శూలం,కపాలం, డమరుమపి – భుజైర్ధారయంతీం త్రినేత్రాం
రక్తస్థాం కాళరాత్రి ప్రభృతి పరివృతాం, స్నిగ్ధ భక్తైక సక్తాం
శ్రీమద్వీరేంద్ర వంద్యా మభిమత ఫలదాం, రాకినీం, భావయామః

(ఈ శ్లోకంలోని చివరి పాదంలో 'శ్రీమద్వీరేంద్ర' అనే పదం 'శ్రీ విద్యోపాసనలో వీరులైనవారు' అని సూచిస్తుంది. ఈ సూచన గత నామంలోని 'మహా వీర' పదానికి 'శ్రీ విద్యోపాసకులు' అనే అర్థం చెప్పుకోడంలో తప్పులేదని కూడా నిర్ధారిస్తుంది)

'రాకిణీ దేవతా స్వరూపిణి' – అని ఈ నామానికి అర్థం.

## 495. మణిపూరాబ్జనిలయా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మణిపూరాబ్జనిలయాయై నమః' అని చెప్పాలి.

మణిపూరాబ్జ = మణిపూర చక్రమునందు, నిలయా = వసించునది.

నాభి స్థానం వద్ద మణిపూర చక్రం ఉంటుంది. ఈ చక్రానికి సంబంధించిన కొన్ని వివరాలు ప్రథమ భాగంలోని అనుబంధంలో తెలుపబడ్డాయి. ముందు రాబోయే

నామాల్లో మరికొన్ని విశేషాలు తెలుపబడతాయి. ఈ మణిపూర పద్మానికి పది దళాలుంటాయి. ఈ పది దళాలలోను సంస్కృత భాషలోని 'డ' నుండి 'ఫ' వరకు ఉండే పది అక్షరాలకు సంబంధించిన బీజాలు వరుస క్రమంలో ఉంటాయి.

(గర్భస్థమైన జీవి పిండానికి మూడవ మాసంలో కాళ్ళు చేతులు ఏర్పడడానికి సంబంధించిన మార్పులు వస్తాయి)

'మణిపూర పద్మము నందువసించునది' అని ఈ నామానికి అర్థం.

## 496. వదనత్రయ సంయుతా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వదనత్రయ సంయుతాయైనమః' అని చెప్పాలి.

వదనత్రయా = మూడు ముఖములతో, సంయుత = కూడి యున్నది.

గర్భస్థ పిండానికి మూడవ మాసంలో నోరు ముక్కుతో పాటు కళ్లకు ఏర్పాటు కూడా జరుగుతుంది. అందువలన ఈ మూడూ వదనములుగా ఈ నామంలో సమన్వయింప బడ్డాయి. ఇక్కడ త్రిగుణాలు బాగా పనిచేస్తాయి. ఈ చక్రం వద్ద ఆవేశకావేశాలు గూడా ఎక్కువగా పనిచేస్తాయి.

'మూడు ముఖములతో కూడి యుండునది' అని ఈ నామానికి అర్థం.

## 497. వజ్రాదికాయుధోపేతా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వజ్రాదికాయుధోపేతాయై నమః' అని చెప్పాలి.

వజ్ర = వజ్రము, ఆదిక = మొదలైన, ఆయుధోపేత = ఆయుధములు ధరించినది.

ఈ మణి పూరాబ్జాధిష్ఠాన దేవత నాలుగు చేతులు కలిగి, నాలుగు చేతుల్లోను వజ్రం, శక్తి, దండము, అభయ ముద్రలను ధరించి ఉంటుంది. వ్యత్యాసాలు వైరుధ్యాలు ఇక్కడ బాగా పనిచేస్తాయి. ఆజ్ఞా చక్రం వద్ద ఇవి సమన్వయింపబడతాయి.

'వజ్రం మొదలైన ఆయుధములను ధరించి ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 498. డామర్యాదిభిరావృతా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'డామర్యాదిభిరావృతాయైనమః' అని చెప్పాలి.

డామరి = డామరము, ఆదిభి = మొదలైన శక్తి దేవతలచే ఆవృత = పరివేష్టింపబడి యుండునది.

శ్రావ్యధ్వని (Musical Sound), పిండిమర ధ్వని, డమరుక ధ్వని, శ్రుతికి - స్పందించే లక్షణాలు – ఈ మూడవ మాసం లోనే బాగా ఉంటాయి.

మణిపూర పద్మానికి పది దళాలుంటాయి. ఈ పది దళాలలోను పది మంది శక్తి దేవతలుంటారు. వీరి పేర్లు అనుబంధంలో ఇవ్వబడినాయి. ఈ పదిమంది పేర్ల మొదటి అక్షరాలు 'డ' నుండి 'ఫ' వరకు ఉండే పది అక్షరాల వరుస క్రమంలో ఉంటాయి. పద్మం యొక్క కర్ణిక వద్ద మణిపూర చక్రాధిష్ఠాన దేవత 'లాకినీశక్తి' ఉంటుంది.

## 499. రక్తవర్ణా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రక్తవర్ణాయైనమః' అని చెప్పాలి.

రక్త = నెత్తురు, వర్ణా = రంగులో ఉండునది.

ఇంతకు పూర్వం విశుద్ధి చక్రాధిష్ఠాన దేవతరంగు కూడా 'ఆ రక్తవర్ణా' అనే నామంతో చెప్పబడింది. అయితే ఆ దేవత నూటికి నూరు పాళ్ళు ఎఱ్ఱని ఎఱుపురంగులో ఉండదు. ఆ దేవత వర్ణం పాటల వర్ణం. అంటే – 'తెలుపు + ఎఱుపు' కలిసిన రంగులో ( దీన్నే సంస్కృతంలో సిందూర లేదా పాటల వర్ణం అంటారు) ఉంటుంది. కాని, ఈ మణిపూర చక్రాధిష్ఠాన దేవత ఎఱ్ఱని ఎఱుపురంగు (కండ తెగితే వచ్చే రక్తం రంగు)లో ఉంటుంది.

'ఎఱ్ఱని రక్త వర్ణంలో ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 500. మాంసనిష్ఠా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మాంసనిష్ఠాయైనమః' అని చెప్పాలి.

మాంస = మాంసధాతువును, నిష్ఠా = ఆశ్రయించి ఉండునది.

ఈ మణిపూర చక్రాధిష్ఠాన దేవత సప్త ధాతువులలోని మాంసాన్ని ఆశ్రయించి ఉంటుంది. జీవి శరీరానికి ఎముకలు ఆకారాన్ని మాత్రమే రూపొందిస్తాయి. ఆ ఆకారం యొక్క పూర్తి రూపం ద్యోతకమవాలంటే, ఆ ఎముకలు – మాంసం, కండరాలతో – కలసి ఉండాలి.

ఆర్.సి.సి. గృహానికి ఇనుప తీగలు, కడ్డీలు ఎలాంటివో – శరీరానికి ఎముకలు అలాంటివి. ఆర్.సి.సి. గృహానికి సిమెంటు, సున్నం, ఇటుకలు ఎలాంటివో శరీరానికి మాంసం కండరాలు అలాంటివి. ఈ మాంసం, కండరాల వల్లే శరీరానికి పుష్టి చేకూరుతుంది. ఎండి పోయినట్లు, ఎముకలు కనబడేలా వుండేవారు ఈ నామాన్ని 'మాంసనిష్ఠాయై నమః' అని సంపుటి చేసి 40 రోజులు జపించి, చివరి రోజున అమ్మవారికి పూజ చేసి 'గుడాన్నం' అంటే చక్రపొంగలి లాంటిది నైవేద్యం పెడితే – వారికి త్వరలోనే శరీరపుష్టి చేకూరుతుంది. ముఖ్యంగా ఎన్నో రోజులు జ్వరం వలన లంఘణాలు చేసి శుష్కించిన వారు, పథ్యం తీసుకున్న తరువాత అమ్మవారికి పూజ చేసి, ఈ గుడాన్నాన్ని నైవేద్యం పెడితే త్వరలోనే మళ్లీ వళ్లు చేస్తారు. శరీరంలో ఎక్కువ మాంస పుష్టి, ఆవేశాన్ని గూడా రేకెత్తిస్తుంది. జంతు మాంసం తింటే అది అరిగే వరకు ఈ ఆవేశకావేశ లక్షణం ఉంటుంది.

'మాంస ధాతువును ఆశ్రయించి ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 501. గుడాన్నప్రీతమానసా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'గుడాన్న ప్రీత మానసాయైనమః' అని చెప్పాలి.

గుడాన్న = చక్రపొంగలి వంటి ఆహారము నందు, ప్రీత = ప్రీతికలిగిన, మానసా = మనస్సు గలది. (చెఱకు గడ నుండి తీసిన రసం ఈ అమ్మవారికి ఇష్టం)

మణిపూరాబ్జ అధిష్ఠాన దేవత అయిన రాకిణీ శక్తికి 'గుడాన్నం' అంటే ప్రీతిగా ఉంటుందిట. ఇంతకు ముందు నామంలో చెప్పినట్లు శరీర పుష్టిని కోరేవారు ఈ దేవతను ఆరాధించి గుడాన్నం నైవేద్యం పెట్టిన తరువాత తాము భోజనం చేస్తే - త్వరలోనే వారికి శరీర పుష్టి చేకూరుతుంది. చెఱకు సంబంధమైన వాటిని తీసుకోడం నియంత్రణ చేస్తే ఆవేశాలు (Emotions) నియంత్రించబడతాయి. కాలేయం(Liver) ప్లీహము (Spleen) బాగుపడతాయి. చెఱకు సరుకుల వాడకం అధికమైతే కాలేయం, ప్లీహం ఎక్కువ రసాన్ని ఉత్పత్తి చేసి - నరద్వేషాన్ని(Misanthropy), నిరాశను, నిస్పృహను(Hope disturbance) కలుగచేస్తాయి.

మూడవ మాసంలో పిండ రూపంలో ఉన్న జీవుడు గుడాన్నాన్ని అభిలషిస్తాడని సూచన ఈ నామంలో ఉంది. దీనికి అనుగుణంగా మూడవ మాసం గర్భిణీ స్త్రీ గుడాన్నాన్ని పథ్యంగా స్వీకరిస్తే మంచిది. (అన్న ప్రాశన తరువాత శిశువుకు ముందు పాయసాన్ని, తరువాత నెయ్యి అన్నాన్ని, తరువాత, గుడాన్నాన్ని తినిపించడం ప్రారంభించాలి అనే సూచన గూడా ఈ నామంలో ఉంది.)

'గుడాన్నము నందు ప్రీతి కలది' అని ఈ నామానికి అర్థం.

## 502. సమస్త భక్త సుఖదా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సమస్త భక్త సుఖదాయైనమః' అని చెప్పాలి.

సమస్త = అందరు, భక్త = భక్తులకు, సుఖ = సుఖములను, దా = ఇచ్చునది. (భక్తి మార్గములో సమస్త సుఖములను ఇచ్చునది)

పైన చెప్పినవిధంగానే నైవేద్యం పెడుతూ ఈ మణిపూర చక్రాధిష్ఠానదేవతను ఉపాసించే వారికి అవసరమైన అన్ని సుఖసంతోషాలు కలిగేట్లు అమ్మవారు ప్రసాదిస్తుంది.

'భక్తుల' పదానికి ముందున్న 'సమస్త' పదం – 'అన్ని రకాల భక్తులకు' – అని కూడా సూచిస్తుంది. ఆర్తులు, జిజ్ఞాసువులు, అర్థార్థులు, జ్ఞానులు – అని భక్తులు నాలుగు రకాలని భగవద్గీతలో చెప్పబడింది. తనను ఆరాధించే వీరందరికీ కూడా అమ్మవారు వారికావలసినవి ప్రసాదిస్తుంది. ఈ భక్తుల మనస్సుకు సుఖానికి మధ్య తేడా ఉండదు.

'అన్ని రకముల భక్తులకు అవసరమైన సుఖసంతోషాలను ప్రసాదించునది' అని ఈ నామానికి అర్థం.

## 503. లాకిన్యంబా స్వరూపిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'లాకిన్యంబా స్వరూపిణ్యై నమః' అని చెప్పాలి.

లాకినీ + అంబా + స్వరూపిణీ = లాకినీ దేవతా స్వరూపముగా నున్నది.

మణిపూర చక్రానికి అధిష్ఠాన దేవత పేరు 'లాకినీ' ఈ చక్రాధిష్ఠాన దేవతకు సంబంధించిన బీజ, కీలక, న్యాస, మంత్రాలన్నీ 'ల' కార సంబంధంగా ఉంటాయని 'లాకినీ' నామంలోని మొదటి అక్షరం 'లా' సూచిస్తుంది. మణి పూరాబ్జనిలయా' అనే నామం నుండి ఈ నామం దాకా ఈ లాకినీ దేవతకు సంబంధించిన వివరాలే చెప్పబడ్డాయి. ఈ వివరాలన్నీ ఈ లాకినీ దేవత ధ్యానానికి సంబంధించిన ఈక్రింది శ్లోకంతో గుర్తుపెట్టుకోవచ్చు.

శ్లో. దిక్పత్రే, నాభిపద్మే, త్రివదన విలసద్దంష్ట్రిణీం, రక్తవర్ణాం,
శక్తిం దంభోళి దండావ భయమపి భుజైర్ధారయంతీం మహోగ్రాం
డామర్యాద్యైః పరీతాం పశుజన భయదాం మాంసధాత్వేక నిష్ఠాం
గౌడాన్న సక్త చిత్తాం సకల సుఖకరీం లాకినీం భావయామః

'లాకినీ దేవతా స్వరూపముగా నున్నది' – అని ఈ నామానికి అర్థం.

## 504. స్వాధిష్ఠానాంబుజగతా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'స్వాధిష్ఠానాంబు జగతాయైనమః' అని చెప్పాలి.

స్వాధిష్ఠానాంబుజ = స్వాధిష్ఠాన పద్మమును, గతా = పొందినది.

స్వాధిష్ఠాన చక్రం గురించిన కొన్ని వివరాలు ప్రథమ భాగం అనుబంధంలో ఇవ్వబడినాయి. ముందు నామాల్లో ఈ చక్రం గురించి మరికొన్ని వివరాలు చెప్పబడతాయి. ఈ స్వాధిష్ఠాన పద్మం ఆరుదళాలు కలిగి ఉంటుంది. ఈ ఆరుదళాలలోను బ, భ , మ, య, ర, ల అనే ఆరు అక్షరాలకు సంబంధించిన బీజాలు వరుస క్రమంలో ఉంటాయి.

గర్భస్థ పిండానికి నాల్గవ మాసంలో ఉదరం, నడుము భాగాలేర్పడతాయి. ప్లీహము (Spleen) పూర్తిగా ఈ చక్ర నియంత్రణలో ఉంటుంది.

'స్వాధిష్ఠాన పద్మము నందు వసించునది' అని ఈ నామానికి అర్థం.

## 505. చతుర్వక్త్ర మనోహరా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'చతుర్వక్త్ర మనోహరాయై నమః' అని చెప్పాలి.

చతుర్ = నాలుగు, వక్త్ర = ముఖములతో, మనోహరా = అందముగా ఉండునది.

స్వాధిష్ఠాన చక్రాధిష్ఠాన దేవతకు నాలుగు ముఖాలుంటాయి. అంటే – ఒకే తలకు నాలుగు ముఖాలని కాదు. నాలుగు తలలుండి, నాలుగు ముఖాలుంటాయి. పైగా 'మనోహరా' అనే పదం ఈ నామంలో ఉంది కాబట్టి, ఈ దేవత చాలా అందంగా ఉంటుందనే కాకుండా, ఈ దేవతా ధ్యాన, సాన్నిధ్యాలలో 'ఏది కనిపిస్తే అది ఉంటుంది గాని ఇక మనస్సు ఉండదు' అని చెప్పుకోవాలి.

గర్భస్థ పిండానికి నాల్గవ మాసంలో ఇంతకు పూర్వం ఏర్పడిన నోరు, ముక్కు,

కళ్ళుతో పాటు చెవులకు సంబంధించిన ఏర్పాటు కూడా జరుగు తుంది. ఈ నాలుగింటి వల్లనే ఈ దేవత నాలుగు వదనములు కలిగినట్లుగా సమన్వయింపబడింది.

మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర చక్రాలతో కూడిన 'కులకుండాన్ని' - 'అధోత్రికం' (Lower Triad) లేదా 'అధో త్రిభుజము' (Lower triangle) అంటారు. త్రిగుణాలకు సంబంధించిన మూడు విధములైన ఆవేశాలు, మరియు కోరికల అంకురములు ఈ నాలుగూ ఇక్కడ ప్రస్ఫుటంగా ఉంటాయి.

'నాలుగు వదనములతో అందముగా నుండునది' అని ఈ నామానికి అర్థం.

## 506. శూలాద్యాయుధసంపన్నా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శూలాద్యాయుధ సంపన్నాయై నమః' అని చెప్పాలి.

శూల = శూలము, ఆది = మొదలైన, ఆయుధ = ఆయుధములను, సంపన్నా = కూడి యున్నది.

స్వాధిష్ఠాన చక్రాధి దేవత నాలుగు చేతుల్లోను శూలము, పాశము, కపాలము, అభయ ముద్రలను ధరించి ఉంటుంది.

ఈ నాలుగవ నెలలోనే పిండ రూపంలో ఉన్న జీవునికి పదునైన అంచులు(Sharp edges), కోణాలు (Angularities) మొదలైన వాటి గురించి అవగాహనకు ఏరాట్లు జరుగుతాయి. (శూలాయుధమనే మాట దీన్ని సూచిస్తుంధి)

'శూలము మొదలైన ఆయుధములు ధరించి యుండునది' అని ఈ నామానికి అర్థం.

## 507. పీతవర్ణా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పీతవర్ణాయైనమః' అని చెప్పాలి.

పీత = పసుపు పచ్చని, వర్ణ = రంగులో ఉండునది.

('స్వాధిష్ఠాన చక్ర అధిష్ఠాన దేవత) పసుపు పచ్చని రంగులో ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 508. అతిగర్వితా

ఐదు అక్షరాల నామం- ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అతి గర్వితాయై నమః' అని చెప్పాలి.

అతి = మిక్కిలి, గర్వితా = గర్వముతో ఉండునది.

నాలుగు చేతులతో మనోహరముగా వుండే ఈ స్వాధిష్ఠానదేవత అతి శయించిన తన తనూ విలాసం చేత అతి శయించిన గర్వాన్ని కూడా కలిగి ఉంటుంది.

ఈ స్వాధిష్ఠాన చక్రంలో ఏదైనా తేడా వస్తే మనిషికి గర్వం, దర్పం, స్వాతిశయము మొదలైనవి కలుగుతాయి.

'మిక్కిలి గర్వంతో నుండునది' అని ఈ నామానికి అర్థం.

## 509. మేదోనిష్ఠా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మేదోనిష్ఠాయై నమః' అని చెప్పాలి.

మేద = మేదస్సును, నిష్ఠా = ఆశ్రయించి యుండునది.

'మేదస్సు' అంటే ధారణశక్తికి, బుద్ధికి సంబంధించిన 'మేధ' కాదు. మేదస్సు మెదడుకు (Brain) సంబంధించిన ధాతువు. మెదడుకు సంబంధించిన రుగ్మతలు ఈ ధాతువులోని తేడాల వల్ల వస్తాయి.

'మేదస్సు ధాతువును ఆశ్రయించి యుండునది' అని ఈ నామానికి అర్థం.

## 510. మధుప్రీతా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మధుప్రీతాయైనమః' అని చెప్పాలి.

మధు = తేనెయందు, ప్రీతా = ప్రీతికలది.

మధువు – అంటే 'తేనె', 'మద్యము' – అనే రెండు అర్థాలు ఉన్నాయి. ఎవరి సంస్కారాన్ని బట్టివారు ఆయా అర్థాలను తీసుకోవచ్చును. వామాచారులైతే 'మద్యము' అనే అర్థాన్ని తీసుకోడంలోనే ఉత్సాహపడి – ఆ మద్యాన్ని అమ్మవారికి నైవేద్యం పెట్టి, ఆ మద్యాన్నే స్వీకరిస్తారు. సమయాచారులు తేనెను నైవేద్యం పెట్టి తేనెను స్వీకరిస్తారు. అంతేకాదు, మధురంగా ఉండే ఇతర పదార్థాలను గూడా తేనెతో పాటు ఉపయోగిస్తారు.

సూర్యుడు కిరణాల ద్వారా ప్రసరింపచేసే సూర్యరశ్మిలో అన్ని రకాల ద్రవ్యాలుసూక్ష్మ రూపంలో ఉంటాయి. భూమి వీటిని గ్రహించి వాటికి సంబంధించిన విత్తనాల్లోకి, ఖనిజాల్లోకి బదిలీ చేస్తుంది. ఛాందోగ్యోపనిషత్తులో సూర్య బింబం 'దేవమధువని' చెప్పబడుతుంది. ఒక్క మధు విషయమే కాదు. 'సర్వ పదార్థాలు సూక్ష్మరూపంలో సూర్యరశ్మిలో ఉండి తీరాలి. ఆ రశ్మిలో లేకపోతే సూర్య కుటుంబం లోని గ్రహాల మీద ఆయా పదార్థాలు ఉద్భవించవు' – అనేది ఒక శాస్త్రీయ దృక్పథం. (సౌర వర్ణపటం(Solar Spectrum) ఈ విషయాన్ని సూచిస్తుంది.)

'మధువు నందు ప్రీతి కలిగినది' అని ఈ నామానికి అర్థం.

## 511. బంధిన్యాదిసమన్వితా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'బంధిన్యాది సమన్వితాయై నమః' అని చెప్పాలి.

బంధినీ = బంధినీ, ఆది = మొదలైన పరివార దేవతలచే, సమన్వితా = పరివేష్టింపబడి ఉండునది.

స్వాధిష్ఠాన పద్మానికి ఆరు దళాలు ఉంటాయి. ఈ ఆరు దళాలలోను వరుసగా

ఆరుగురు పరివార దేవతలు ఉంటారు. వీరి పేర్లు వరుసగా బ, భ, మ, య, ర, ల అక్షరాలతో ప్రారంభించేవిగా ఉంటాయి. ఈ పేర్లు - 1. బందినీ 2. భద్రకాళీ 3. మహామాయా 4. యశస్వినీ 5. రమా 6. లంబోష్ఠీ. ఈ ఆరుగురూ చుట్టూ ఉండే ఆరు దళాల్లో ఉంటే - పద్మం మధ్యలోనే కర్ణిక వద్ద స్వాధిష్ఠాన చక్రాధిష్ఠాన దేవత ఉంటుంది.

గర్భస్థ పిండం నాల్గవ మాసంలో ఉన్నప్పుడే జీవికి కలిగే 'పోటీ తత్వలక్షణం' (Spirit of Competition) తనను తాను పరిమితులతో బంధించు కోవడం (Limitation Attitude) మొదలైన వాటికి సంబంధించిన బీజాలేర్పడతాయి. (నామంలోని 'బందినీ' పదం ఈ లక్షణాన్ని సూచిస్తుంది.)

'బందినీ మొదలైన పరివార దేవతలచే పరివేష్టింపబడి ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 512. దధ్యన్నాసక్తహృదయా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'దధ్యన్నాసక్త హృదయాయై నమః' అని చెప్పాలి.

దధి = పెరుగు, అన్న = అన్నమునందు, ఆసక్త హృదయా = ప్రీతి కలిగినది.

ఈ చక్రాధిష్ఠాన దేవతకు పెరుగు అన్నం అంటే చాలా ఇష్టంగా ఉంటుందిట. ఇంతకు ముందు నామంలో చెప్పిన లక్షణాలలో ఉండే తేడాలను సర్దుబాటుకు ఈ దేవతను పూజ చేసి 'పెరుగు అన్నం' నైవేద్యం పెట్టాలి.

అన్న ప్రాశన జరిగిన శిశువుకు గూడా పాయసాన్నం, నెయ్యి అన్నం, బెల్లం అన్నం అయిన తరువాత పెరుగు అన్నం ప్రారంభించమని సూచన ఈ నామంలో ఉంది.

'పెరుగు అన్నం ఇష్టపడునది' అని ఈ నామానికి అర్థం.

## 513. కాకినీ రూపధారిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కాకినీరూపధారిణ్యై నమః' అని చెప్పాలి.

కాకినీ = కాకినీ పేరుగల దేవతగా, రూపధారిణీ = రూపమును ధరించి ఉండునది.

స్వాధిష్ఠాన చక్రాధిష్ఠాన శక్తి దేవత పేరు 'కాకినీ'. ఈ చక్రాధిష్ఠాన దేవతకు సంబంధించిన బీజ, కీలక, న్యాస మంత్రాలన్నీ 'క' కార సంబంధంగా ఉంటాయని 'కాకినీ' నామంలోని మొదటి అక్షరం 'కా' సూచిస్తుంది.

ఇంతవరకు చెప్పిన విశేషణాలు, వివరాలు, లక్షణాలు అన్నీ ఉండే స్వాధిష్ఠానాధిష్ఠాన దేవత పేరు 'కాకినీ'. ఈ దేవతకు చెప్పిన లక్షణాలు, వివరాలు అన్నీ స్వాధిష్ఠాన దేవతా ధ్యానానికి చెప్పిన ఈక్రింది శ్లోకంతో గుర్తుపెట్టుకోవచ్చును.

''స్వాధిష్ఠానాఖ్యపద్మే రసదళసహితే, వేదవక్త్రాం త్రినేత్రాం
హస్తాభ్యాం ధారయంతీం - త్రిశిఖగుణకపాలా భయాన్యాత్తగర్వాం,
మేదోధాతు ప్రవిష్టా, మళిమదముదితాం, బందినీ ముఖ్య యుక్తాం,
పీతాం, దధ్యోదనేష్టా, మభిమత ఫలదాం, కాకినీం, భావయామః''

## 514. మూలాధారాంబుజారూఢా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మూలాధారంబుజారూఢాయై నమః' అని చెప్పాలి.

మూలాధార + అంబుజా = మూలాధారాంబుజా = మూలాధార పద్మము నందు, ఆరూఢా = అధివసించునది.

మనలోని మొత్తం భౌతిక శక్తిని అంతనూ నియంత్రణ చేస్తూ ఉండే చక్రాన్ని 'మూలాధారం' అంటారు. ఇది షట్చక్రాల వరుస క్రమంలో మొట్టమొదటిది. ఈ చక్రం తాలూకు కొన్ని వివరాలు ప్రథమ భాగంలోని అనుబంధంలో ఇవ్వబడ్డాయి. ఈ మూలాధార చక్రాన్ని గూడా నాలుగు దళాల పద్మంతో పోలుస్తారు. ఈ నాలుగు దళాల పద్మం యొక్క మధ్య కర్ణిక అమ్మవారి యొక్క నివాస స్థానం. ఈ మూలాధారానికి సంబంధించిన మరికొన్ని వివరాలు ఇకముందు వచ్చే నామాలలో చెప్పబడతాయి.

'మూలాధార పద్మము నందు అధివసించునది' అని ఈ నామానికి అర్థం.

## 515. పంచ వక్త్రా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పంచవక్త్రాయై నమః' అని చెప్పాలి.

పంచ = ఐదు, వక్త్రా = ముఖములు కలది.

మూలాధార చక్రాధిష్ఠాన దేవతకు ఐదు ముఖాలుంటాయి. పంచ భూతాలను, పంచేంద్రియాలను అనుసంధానం చేసే తన్మాత్రలైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు ఐదూ ఈ మూలాధారం వద్ద పనిచేస్తాయి.

ఐదవ మాసంలో ఏర్పడే స్పర్శ జ్ఞానానికి సంబంధించిన చర్మంతో గర్భస్థ పిండానికి పంచజ్ఞానేంద్రియ పరిపూర్ణత చేకూరుతుంది.

'ఐదు ముఖములతో నుండునది' అని ఈ నామానికి అర్థం.

## 516. అస్థి సంస్థితా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అస్థి సంస్థితాయై నమః' అని చెప్పాలి.

అస్థి = ఎముకలయందు, సం = సమ్యక్ = చక్కగా, స్థిత = ఆశ్రయించి ఉండునది.

మూలాధార చక్రాధిష్ఠాన దేవత అస్థిధాతువును ఆశ్రయించి ఉంటుంది. 'అస్థి' అంటే 'ఎముక'. ఎముకలు ఉన్నపుడే శరీరానికి స్థిరత్వం ఉంటుంది. ఒకRCC స్లాబ్‌లో గాని, స్తంభాలు (Pillars)లో గాని ఇనుప తీగలు, కడ్డీలు ఎలాంటివో శరీరానికి ఎముకలు అలాంటివిగా అర్థం చేసుకోవాలి. వీటి శక్తిని బట్టే మనిషి స్థిరత్వం ఆధారపడి ఉంటుంది.

ఎముకలకు దెబ్బలు తగిలినా, విరూపణ చెందినా, ప్రక్కకు జరిగినా, విరిగినా, లేదా ఎముకల పెరుగుదల సరిగా లేక పోయినా – లేక ఎక్కువ పెరుగుదల వున్నా – ఈ నామాన్ని 'అస్థి సంస్థితాయై నమః' అని సంపుటి చేసి నలభై రోజులు జపించి – చివరి రోజు పూజచేసి – అమ్మవారికి పులగం (పెసరపప్పు + బియ్యం – కలిపి వండిన అన్నం)

నైవేద్యం పెడితే దోషం సత్వరమే నివారణమై చక్కని ఫలితం చేకూరుతుంది.

'ఎముకలను ఆశ్రయించి ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 517. అంకుశాది ప్రహరణా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించే టప్పుడు 'అంకుశాది ప్రహరణాయై నమః' అని చెప్పాలి.

అంకుశ = అంకుశము, ఆది = మొదలైన, ప్రహరణా = ఆయుధములు ధరించినది.

ఈ మూలాధార చక్రాధిష్ఠాన దేవత నాలుగు చేతులలోను అంకుశము, కమలము, పుస్తకము, జ్ఞానముద్రను ధరించి ఉంటుంది.

అంకుశం ఈ 'h' ఆకారంలో ఉంటుంది. జ్యోతిశ్శాస్త్రంలో శనిగ్రహానికి సంబంధించిన సంకేతం లేదా యంత్రం (Glyph) సరిగ్గా ఇదే ఆకారంలో ఉంటుంది. శనిగ్రహం జాతకంలో బలంగా ఉంటే ఆ జాతకునికి చేతులు, కాళ్ళు, వెన్నులకు పొడవైన ఎముకలు ఉండి మనిషి పొడవుగా ఉంటాడు.

'అంకుశం మొదలైన ఆయుధములను ధరించి ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 518. వరదాది నిషేవితా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వరదాదినిషేవితాయైనమః' అని చెప్పాలి.

మూలాధార చక్రాధిష్ఠానదేవత నాలుగు దళాలు గల పద్మంలోని మధ్య కర్ణిక వద్ద ఉంటుంది. ఈ పద్మానికి నాలుగు దళాలలోను వరుసగా 'వ, శ, ష, స' అక్షరాలకు సంబంధించిన 1. వరద, 2. శ్రియ, 3. షండా, 4. సరస్వతి – అనే నాలుగు పరివార దేవతలు ఉండి అమ్మవారిని సేవిస్తూ ఉంటారు.

'వరదా' మొదలైన (నలుగురు పరివార) దేవతలచే 'సేవింపబడునది' అని ఈ నామానికి అర్థం.

## 519. ముద్గౌదనాసక్తచిత్తా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ముద్గౌదనాసక్త చిత్తాయైనమః' అని చెప్పాలి.

ముద్గ = పెసరపప్పుతో చేసిన, ఓదన = అన్నము నందు, ఆసక్త చిత్తా = ఆసక్తి కలిగి యుండునది.

ఈ చక్రాధిష్ఠాన దేవతకు ముద్గౌదనా - అంటే, పులగం ఎక్కువ ఇష్టమట.

(శరీరంలోని భౌతిక శక్తిని నియంత్రణ చేసే శక్తి కేంద్రమే మూలాధారం. భౌతిక బలం యావత్తూ మూలాధారం వద్ద కేంద్రీకృతమై ఉంటుంది. మూలాధార చక్రం వద్ద ఉండే ఈ బలాన్నే పురాణాల్లో - బలిచక్రవర్తితో పోల్చారన్నమాట ! ఈ బలికి సంబంధించిన కథనే సంక్రాంతి ముందు రోజు వచ్చే భోగి రోజున జరుపుకుంటారు. ఆ రోజున కూడా 'పులగం' నైవేద్యం పెట్టి తింటారు)

అన్న ప్రాశన - పాయసాన్నంతో ప్రారంభించి, క్రమక్రమంగా నెయ్యి అన్నం, తియ్యని బెల్లం అన్నం, పెరుగు అన్నం తినిపించి అటుపైన పప్పు అన్నం తినిపించడం ప్రారంభించాలి అనే సూచన గూడా ఈ నామంలో ఉంది.

'పులగము నందు ప్రీతి కలది' అని ఈ నామానికి అర్థం.

## 520. సాకిన్యంబా స్వరూపిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సాకిన్యంబాస్వరూపిణ్యై నమః' అని చెప్పాలి.

సాకిన్యంబా = సాకినీదేవత యొక్క, స్వరూపిణీ = రూపముగా ఉండునది.

మూలాధార చక్రాధిష్ఠాన దేవత అయిన 'సిద్ధవిద్యాదేవి' సాకినీ శక్తి రూపంలో

ఇక్కడ ఉంటుంది. ఈ మూలాధార చక్రాధిష్ఠాన దేవతకు సంబంధించిన బీజ, కీలక న్యాస మంత్రాలన్నీ 'స' కార సంబంధంగా ఉంటాయని 'సాకినీ' నామంలోని మొదటి అక్షరం 'సా' సూచిస్తుంది. 'మూలాధారాంబుజారూఢా' నామం మొదలు ఈ నామం దాకా ఈ దేవత గురించిన వివరాలే చెప్పబడ్డాయి. ఈ వివరాలన్నిటినీ మూలాధార చక్రాధిష్ఠాన దేవత అయిన సాకినీ దేవత యొక్క ధ్యానానికి చెప్పిన ఈక్రింది శ్లోకంతో గుర్తు పెట్టుకోవచ్చు.

శ్లో. 'మూలాధారస్థపద్మే, శ్రుతి దళలసితే, పంచవక్త్రాంత్రినేత్రాం,
ధూమ్రాభా, మస్థి సంస్థాం సృణి మపి కమలం పుస్తకం జ్ఞానముద్రాం
బిభ్రాణాం బాహుదండైస్సులలిత వరదా పూర్వ శక్త్యన్వితాంతాం
ముద్గన్నాసక్త చిత్తాం మధుమదముదితాం సాకినీం భావయామః'

'సాకినీ దేవతా స్వరూపముగా నుండునది' అని ఈ నామానికి అర్థం.

## 521. ఆజ్ఞా చక్రాబ్జనిలయా

ఎనిమది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ఆజ్ఞాచక్రాబ్జ నిలయాయైనమః' అని చెప్పాలి.

ఆజ్ఞా చక్ర = ఆజ్ఞా చక్రము యొక్క

రెండు కనుబొమలకు సరిగ్గా మధ్య ప్రాంతంలో ఈ ఆజ్ఞా చక్రం ఉంటుంది. ఇక్కడే ఇడా, పింగళా, సుషుమ్నా నాడులు కలుస్తాయి. ఈ స్థానాన్ని పురాణాల్లో 'కాశీపట్టణం'తో పోల్చి చెప్తారు. శివుని ఫాలాగ్ని నేత్రస్థానం కూడా ఇదే! వాస్తు పురుషునికి ఇది తూర్పుదిశను సూచిస్తుంది. వివేక సూర్యోదయం జరిగేది ఈ కేంద్రం వద్దనే! కొన్ని ఆధ్యాత్మిక మార్గాల్లోని క్రతువులలో తూర్పు దిశను సూచించే ఈ ఆజ్ఞా చక్రస్థానానికి మిత్రుడు (సూర్యోదయ సూర్యుడు) అధిపతిగా చెబుతారు. తైత్తిరీయోపనిషత్తులోని 'శంనోమిత్రశ్శంవరుణః'... అనే శాంతిపాఠంలో మొట్ట మొదటగా శాంతికై ప్రార్థించేది ఈ మిత్రుణ్ణే! ఈ 'మిత్రుని' ద్వారా అమ్మవారు జ్ఞానాన్ని, వివేకాన్ని, తత్ఫలితంగా శాంతిని కలుగ చేస్తుంది. ఈ ఆజ్ఞాచక్రం గురించి కొన్ని వివరాలు ప్రథమ భాగంలోని

అనుబంధంలో చెప్పబడ్డాయి. ఇంకా మరికొన్ని విశేషాలు ఇకముందు రాబోయే నామాల్లో చెప్పబడతాయి.

'ఆజ్ఞాచక్ర పద్మంలో వసించునది' అని ఈ నామానికి అర్థం.

## 522. శుక్లవర్ణా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శుక్లవర్ణాయైనమః' అని చెప్పాలి.

శుక్ల = తెలుపు, వర్ణ = రంగులో ఉండునది.

ఈ ఆజ్ఞాచక్రాధిష్ఠాన దేవత తెలుపురంగు (Milk White)లో ఉంటుంది. తెలుపురంగులో అన్ని రంగులు కలిసి ఉంటాయి. లేదా, అన్ని రంగులూ కలిస్తే చివరకు తెలుపురంగు వస్తుందని విజ్ఞానశాస్త్రం గూడా చెబుతుంది. అంటే – ఈ ఆజ్ఞాచక్రం వద్ద క్రింది చక్రాలకు సంబంధించిన నియంత్రణ బీజాలు గూడా ఉంటాయి. అంటే, ఈ ఆజ్ఞాచక్రంతో క్రింది చక్రాలకు సంబంధించిన వాటిని కూడా నియంత్రించి పొందవచ్చు. ఇది పూర్తిగా జ్ఞాన సంబంధమైన చక్రం (నేను వ్రాసిన శ్రీమద్రామాయణంలోని యుద్ధకాండకు ఈ ఆజ్ఞాచక్రానికి గల యోగపర సమన్వయాన్ని చదువుకోవచ్చును.) జ్ఞానం స్వచ్ఛమైంది. తెలుపురంగు ఈ స్వచ్ఛతను, అన్ని రంగుల కలయికను కూడా సూచిస్తుంది. ఇది మనస్తత్వానికి సంబంధించిన చక్రం. మనస్సులో ఎంతటి సూక్ష్మమైన విషయమైనా, ఎంతటి అధికమైన విషయమైనా (అణోరణీయాన్ – మహతోమహీయాన్ ... మహానారాయణమ్) ఇమడగలదు. అందుకే ఇది పూర్ణజ్ఞాన సంబంధమైన చక్రం.

త్రికాల జ్ఞానాలు ఈ చక్రాధిష్ఠాన దేవతకు ఉంటాయి.

'తెలుపురంగులో ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 523. షడాననా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'షడాననాయైనమః' అని చెప్పాలి.

షట్ = ఆరు, ఆననా = ముఖములు గలది.

ఈ చక్రాధిష్ఠాన దేవతకు ఆరు ముఖాలుంటాయి. ఆజ్ఞాచక్ర స్థానం ఫాలభాగంలో ఉంటుంది. జ్యోతిశ్శాస్త్ర రీత్యా ఇది - మేషరాశికి, వృషభరాశికి - సంధిస్థానం. మేషరాశిలో అశ్వని 4 పాదాలు, భరణి 4 పాదాలు, కృత్తిక 1 పాదం ఉంటాయి. వృషభరాశిలో కృత్తిక 3 పాదాలు, రోహిణి 4 పాదాలు, మృగశిర 2 పాదాలు ఉంటాయి. దీనిని బట్టి మేష, వృషభ రాశుల సంధి స్థానంలో కృత్తికా నక్షత్రం ఉంటుందనీ తేలికగా గ్రహించవచ్చును. కృత్తికలు ఆరు ఉంటాయి. చీకటి గల రాత్రి పూట ఆకాశం చూస్తే వృషభరాశి ప్రాంతంలో (Near Orion) ఆరు కృత్తికలు కనబడతాయి. ఈ ఆరుకృత్తికల స్తన్యాన్ని కుమారస్వామి తన ఆరు ముఖాలతోను (ఆ క్షీరాన్ని) గ్రోలాడు. అందుకే కుమారస్వామిని కార్తికేయుడంటారు. ఇదంతా యోగ సంబంధమైన సంకేతాలతో కూడుకున్న కథ (ఈ కథ తాలూకు పూర్తి వివరాలు కావాలంటే నేను వ్రాసిన 'అక్షరగణపతి - కుండలినీ పతి' అనే పుస్తకంలో చదవండి)

ఆరు కృత్తికలను, కుమారస్వామి ఆరు ముఖాలను, ఆజ్ఞా చక్రాధిష్ఠాన దేవత అయిన సిద్ధమాతకు ఉండే ఆరు ముఖాలతోను సమన్వయ పరచుకోవాలి. ఈ చక్రాధిష్ఠాన దేవత నామం అయిన 'సిద్ధమాత' లో 'మాతా' అనే పదంపైన చెప్పినట్లుగా స్తన్యాన్నిచ్చే తల్లిని గూడా సూచిస్తుంది.

గర్భస్థ పిండానికి ఈ చక్రసంఖ్య 'ఆరు' సూచించే ఆరవమాసం వచ్చేసరికి పంచేంద్రియాలతో పాటు మనస్సు గూడా ఏర్పడుతుంది. పంచేంద్రియాలతో పాటు మనస్సు గూడా కలసి మొత్తం ఆరు ఆననాలుగా ఈ నామంలో సమన్వయింపబడింది. ఆజ్ఞాచక్రస్థానం 'మనస్తత్వం' కలిగినదని ఇంతకు పూర్వమే చెప్పడం జరిగింది కదా!

'ఆరు ముఖములు కలది' అని ఈ నామానికి అర్థం.

## 524. మజ్జా సంస్థా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మజ్జాసంస్థాయై నమః' అని చెప్పాలి.

మజ్జా = మజ్జాధాతువును, సంస్థా = ఆశ్రయించి యుండునది.

ఎముకలలో ఉండే కొవ్వు పదార్థాన్ని 'మజ్జా' అంటారు. సజీవంగా ఉన్న శరీరం తాలూకు ఎముకల్లోనే ఈ 'మజ్జా' ధాతువు ఉంటుంది. నిర్జీవ మైన ఎముకల్లో ఇది ఉండదు.

'మజ్జాధాతువును ఆశ్రయించి ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 525. హంసవతీ ముఖ్యశక్తి సమన్వితా

పన్నెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'హంసవతీ ముఖ్యశక్తి సమన్వితాయై నమః' అని చెప్పాలి.

హంసవతీ = హంసవతితో పాటు, ముఖ్య శక్తి = ముఖ్యమైన శక్తులతో, సమన్వితా = కూడి యుండునది.

ఆజ్ఞాచక్రాన్ని సూచించే పద్మం రెండు దళాలు కలిగి ఉంటుంది. 'హ', 'క్ష' అనే రెండు అక్షరాల బీజాలు ఈ పద్మం యొక్క రెండు దళాల్లో ఉంటాయి. ఈ రెండు దళాల్లోను 'హ', 'క్ష' అక్షరాలతో ప్రారంభమయే పేర్లు అయిన 'హంసవతీ', 'క్షమావతీ' అనే ముఖ్యమైన ఇద్దరు శక్తి దేవతలుంటారు.

ఈ ఆజ్ఞా చక్రం అతి ముఖ్యమైన చక్రం. ఒక సంస్థలో మేనేజర్ (Manager) మరియు ప్రొప్రైటర్ (Proprietor)గా పనిచేసే వ్యక్తి హోదా లాంటి ఆధిపత్యం ఈ చక్రానికి, చక్రాధిష్ఠాన దేవత అయిన 'సిద్ధమాత'కు ఉంటుంది. ఈ చక్రం తాలూకు పద్మం యొక్క రెండు దళాలయందు ఉచ్ఛ్వాస నిశ్వాసలు రావడానికి సంబంధించిన కారణమైన కేంద్రాలు, నియంత్రణ బీజాలు ఉంటాయి. ఈ రెంటికీ సంబంధించిన దేవతలే 'హంసవతీ', 'క్షమావతీ' దేవతలు. ఈ చక్రం మనస్తత్వానికి సంబంధించినది కాబట్టి మనస్సుకు శ్వాసకు మధ్య వుండే అనుసంధానం కూడా ఈ చక్రం వద్ద ఉంటుంది. పెద్ద ప్రమాదం జరిగినపుడు, 'తెలివికి – శ్వాసకు' మధ్య ఉండే సంధానాన్ని (Link) లేకుండా ఈ చక్రదేవత చేస్తుంది. తెలివి ఉంటే ప్రమాదానికి సంబంధించిన 'షాక్'కు ఒక్కసారి శ్వాస గూడా ఆగిపోవచ్చు. అందుకని ముందుగా తెలివి పని చెయ్యకుండా శ్వాస మాత్రమే

పనిచేసేట్టుగా చేస్తుంది. దీని వల్ల వ్యక్తికి ఎప్పుడు ఎంత పెద్ద ప్రమాదం జరిగినా శ్వాస జరుగుతూనే ఉంటుంది కాని తెలివి మాత్రం తప్పుతుంది. వ్యక్తికి కొంతకాలానికి మళ్ళీ తెలివి వస్తుంది. ప్రాణాధారమైన శ్వాసకు సంబంధించిన శక్తులవటం చేత ఈ శక్తులను నామంలో 'ముఖ్య శక్తు' లన్నారు.

'హంసవతీ, క్షమావతీ ముఖ్య శక్తులతో కూడి ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 526. హరిద్రాన్నైకరసికా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'హరిద్రాన్నైకరసికాయై నమః' అని చెప్పాలి.

హరిద్ర = పచ్చని, అన్న + ఏక = అన్నైక = అన్నమందు మాత్రమే, రసికా = ప్రీతికలది.

ఆజ్ఞా చక్రాధిష్ఠాన దేవతకు హరిద్రాన్నం అంటే ఇష్టమట. హరిద్రాన్నం అంటే పచ్చని రంగులో ఉండే అన్నము.

అన్న ప్రాశన అయిన పిల్లలకు ముందుగా పాలు అన్నంతో ప్రారంభించి, క్రమ క్రమంగా నెయ్యి అన్నం, బెల్లం అన్నం, పెరుగు అన్నం, పప్పు అన్నం తినిపించటం ప్రారంభించి అటుపైన గాని ఈ పులిహోర వంటి పచ్చని అన్నాన్ని తినిపించకూడదని ఈ నామం సూచిస్తుంది. ఈ హరిద్రాన్నం తినే దశకు వచ్చేటప్పటికి పిల్లలకు ఈ అన్నం మీద ఆసక్తి పెరుగుతుంది. అంటే, వారు కూడా మెల్లగా పెద్ద వారి రుచులకు అలవాటు పడుతున్నారన్నమాట. 'అంతకు పూర్వం తిన్న తీపి అన్నాలకంటే ఈ అన్నాన్నే ఎక్కువగా కోరడం జరుగుతుంది. అందుకే – ఈ నామంలో హరిద్రాన్న రసికా' అని చెప్పకుండా 'హరిద్రాన్నైకరసికా' అని చెప్పారు.

'పచ్చని అన్నము నందు మిక్కిలి ప్రీతి కలది' అని ఈ నామానికి అర్థం.

## 527. హాకినీరూపధారిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'హాకినీరూపధారిణ్యై నమః' అని చెప్పాలి.

హాకినీ = హాకినీ అనే పేరు గల శక్తి యొక్క, రూప = రూపమును ధారిణీ = ధరించి ఉండునది.

ఆజ్ఞా చక్రాధిష్ఠానదేవత శక్తి పేరు 'హాకినీ' ఈ చక్రాధిష్ఠాన దేవతకు సంబంధించిన బీజ, కీలక, న్యాస మంత్రాలన్నీ 'హ' కార సంబంధంగా ఉంటాయి అని 'హాకినీ' లోని మొదటి అక్షరం 'హ' సూచిస్తుంది.

'ఆజ్ఞా చక్రాబ్జనిలయా' నుండి ఇంతవరకు చెప్పబడిన ఈ చక్రం తాలూకు వివరాలన్నీ ఈ క్రింది శ్లోకంతో గుర్తు పెట్టుకోవచ్చును.

శ్లో. భ్రూమధ్యే బిందు పద్మే, దళయుగ కలితే, శుక్లవర్ణాం, కరాబ్జైః
విభ్రాణాం జ్ఞానముద్రాం, డమరుకమలా, మక్షమాలాం, కపాలం
షట్చక్రాధారమధ్యాం, త్రినయన లసితాం, హంస వత్యాది యుక్తాం,
హరిద్రాన్నైక సక్తాం, సకల శుభకరీం, హాకినీం భావయామః

'హాకినీ దేవతా రూపమును ధరించి ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 528. సహస్రదళపద్మస్థా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సహస్రదళ పద్మస్థాయైనమః' అని చెప్పాలి.

సహస్రదళ పద్మ = సహస్రార కమలమందు, స్థా = ఉండునది.

శిరస్సుకు పైన మధ్యగా ఈ సహస్రార చక్రం ఉంటుంది. దీనికి వెయ్యి దళాలుంటాయి. దీనికి సంబంధించిన కొన్ని వివరాలు ప్రథమ భాగంలోని అనుబంధంలో చెప్పబడ్డాయి. ఇటుపైన వచ్చే నామాల్లో మరికొన్ని చెప్పబడతాయి. ఈ

సహస్రారచక్రాధిష్ఠాన దేవత నామం 'యశస్వినీ'. ఈ సహస్రార కమలస్థానం పరమ శివ నివాస స్థానం. ఉత్తమోత్తమ యోగ సాధకులకు మాత్రమే దీని దర్శనం జరుగుతుంది. ఒక విధంగా ఈ దర్శనాన్ని 'ఆత్మ సాక్షాత్కారం' గా చెప్పుకోవచ్చును.

గర్భస్థ పిండంలోనికి జీవుడు ప్రవేశించేది ఈ చక్రసంఖ్య సూచించే 7వ మాసంలోనే! అందుకే ఒక్కొక్కప్పుడు తొమ్మిది నెలలు పూర్తిగా నిండకుండానే, ఏడవ నెల నిండినపుడు గూడా ప్రసవించడం జరుగుతుంది. అయితే, పరిపక్వ స్థితికి రాని ఈ శిశువును చాలా జాగ్రత్తగా పెంచాలి. అన్ని అవయవాలు ఉంటాయి కాని - చాలా సుకుమారంగా ఉంటాయి.

**ఎనిమిదవ మాసంలో గాని గర్భస్థుడైన జీవి అవయవాలకు సంపూర్ణత్వం ఏర్పడదు.** తొమ్మిదవ మాసంలో సంపూర్ణంగా తయారైన గర్భస్థ జీవికి 'కూపస్థం'లాగా ఉన్న గర్భకుహరం లోంచి మెల్లగా బయట పడదామనే ఇచ్ఛ కలిగి తదనుగుణమైన ప్రయత్నంలో కదలికలు ప్రారంభమౌతాయి.

'సహస్రారకమలమునందు ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 529. సర్వవర్ణోపశోభితా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వవర్ణోపశోభితాయై నమః' అని చెప్పాలి.

సర్వ = అన్ని, వర్ణా = రంగులు, అక్షరములు, ధ్వనులతో, శోభితా = శోభిల్లునది.

సహస్రార కమలానికి వెయ్యి, లేక - అనంతమైన దళాలుంటాయి. ఈ దళాలయందు విశ్వంలో ఉండే అన్ని రంగులకు, ధ్వనులకు, వాఙ్మయ ప్రపంచంలో ఉండే అన్ని అక్షరములకు సంబంధించిన బీజాలూ ఉంటాయి. ఇంతకు పూర్వం చెప్పిన ఆరు చక్రాధిదేవతా శరీర కాంతులు కూడా ఈ దేవతకు ఉంటాయని వేరే చెప్పాల్సిన పనిలేదు. ఈ నామానికి సంబంధించిన ఈ విషయం సంధ్యావందనంలో - 'సర్వవర్ణే మహాదేవీ, సంధ్యావిద్యే సరస్వతీ' అని చెప్పబడింది.

'అన్ని అక్షరాలు, అన్ని మంత్రాలు, వర్ణపటం (Spectrum) లోని అన్ని రంగులతో శోభిల్లునది' అని ఈ నామానికి అర్థం.

## 530. సర్వాయుధ ధరా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వాయుధధరాయై నమః' అని చెప్పాలి.

సర్వ = అన్ని, ఆయుధ = ఆయుధములను, ధరా = ధరించి యుండునది.

సహస్రార కమలాధిష్ఠాన దేవత అన్ని రకాల ఆయుధాలను ధరించి ఉంటుంది. (ఇంతకు పూర్వం చెప్పిన ఆరు చక్రాధిష్ఠాన దేవతలు ధరించిన ఆయుధాలు కూడా ఈ నామంలోని 'సర్వ' లో ఇమిడే ఉంటాయి.

రుద్రనమకంలో 'సహస్రాణి సహస్రధా బాహువోస్తవహేతయః' అనే మంత్రాన్ని ప్రస్తుతనామంతో సమన్వయించుకుంటే ఈ చక్రాధిష్ఠాత్రి అయిన యశస్వినీ దేవతకు లెక్కలేనన్ని చేతులుంటాయని, ఆ చేతులలో లెక్కలేనన్ని (వివిధ) ఆయుధాలు ధరిస్తుందని చెప్పుకోవాలి.

'అనంతమైన అన్నిరకముల ఆయుధములను ధరించి ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 531. శుక్ల సంస్థితా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శుక్ల సంస్థితాయైనమః' అని చెప్పాలి.

శుక్ల = శుక్ల ధాతువును, సంస్థితా = చక్కగా ఆశ్రయించి ఉండునది.

సహస్రార కమలాధిష్ఠాన దేవత శుక్ల ధాతువును ఆశ్రయించి ఉంటుంది. 'శుక్రం' జీవి యొక్క సారము, సారాంశము. అందుకే – ఇది సప్త ధాతువుల్లో చివరగా చెప్పబడింది. దీన్ని మించిన విలువైన ధాతువు మరొకటి లేదు.

శుక్ర బిందువులోనే రాబోయే జీవి యొక్క సర్వ లక్షణాలు, రూపగుణ విశేషాలు అన్నీ సూక్ష్మంగా ఇమిడి ఉంటాయి. అందుచేతనే 'సర్వవర్ణోపశోభితా' అనే నామం సూచించే లక్షణాలను ఈ 'శుక్ల సంస్థితా' అనే నామం ధ్రువపరుస్తుంది. (శుక్రమన్నపుడు చెప్పే వివరాలు శోణిత పదానికి గూడా వర్తిస్తాయి). తెలుపురంగులోనే అన్ని వర్ణాలు ఇమిడి ఉన్నాయనే విజ్ఞాన శాస్త్ర సత్యం కూడా ఈ నామ విశిష్టతను ధ్రువపరుస్తుంది.

'శుక్ల ధాతువును చక్కగా ఆశ్రయించి ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 532. సర్వతోముఖీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వతోముఖ్యైనమః' అని చెప్పాలి.

సర్వతః = అన్నివైపులా, అంతటా, అనంతమైన, ముఖీ = తన ముఖములతో నిండి ఉన్నది.

పరమాత్మను గాని, పరమేశ్వరుని గాని వర్ణిస్తున్నపుడు తప్పకుండా ఉపయోగించే విశేషణ పదాలు రెండున్నాయి అవి - 'సర్వ', 'సహస్ర'. సహస్ర అనే పేరు తలలకు, కళ్ళకు, పాదాలకు గూడా వర్తిస్తుంది. అందుకే - విష్ణు సహస్ర నామాల్లోను, శివసహస్ర నామాల్లోను, శ్రీ లలితా సహస్ర నామస్తోత్రంలోను ఈ 'సహస్ర శీర్షా' 'సహస్రాక్షీ' 'సహస్రపాత్' నామాలు తప్పకుండా వస్తాయి. 'సహస్ర' పదానికి 'ఎన్నైనా' అనే అర్థాన్ని చెప్పుకోవాలి. ఈ 'సహస్ర' పదానికి సరిపోయే రేఖాగణితాత్మక సంకేతం ఈ క్రింద ఇవ్వబడింది. ఈ సంకేతం గురించి ద్వితీయభాగంలోని 282, 283, 284 నామాల వివరణలో పూర్తిగా ఇవ్వబడింది.



అమ్మవారి ఈ నామాన్ని ధ్యానం చేస్తున్నప్పుడు -

విశ్వంలోని సర్వజీవుల ముఖాలు ఈ అమ్మవారి ముఖాలుగాను, సర్వజీవుల కన్నులు అమ్మవారి కన్నులుగాను, సర్వజీవుల పాదాలు అమ్మవారి పాదాలు గాను దర్శించి

సమన్వయం చేసుకోవాలి. అంటే, సర్వజీవులతో విస్తరించి ఉన్న ఈ విశ్వం అమ్మవారి స్వరూపంగా సమన్వయించుకోవాలన్న మాట!

గర్భస్థ జీవుని పరంగా – 7వ మాసంలో జీవుడు పిండంలోకి ప్రవేశిస్తాడని 'సహస్రదళ పద్మస్థా' నామంలో చెప్పడం జరిగింది.

('నివసించడానికి అవసరమయే ఏర్పాట్లన్నీ పూర్తయిన తరువాతనే గృహస్థు తను కట్టుకున్న గృహంలోకి గృహప్రవేశం చేస్తాడు' – అని చెప్పుకునేవిధంగా – ఈ స్థితిలోని గర్భస్థ పిండంలోనికి జీవుడు ప్రవేశిస్తాడని అర్థం చేసుకోవాలి.)

సర్వతోముఖమైన జ్ఞాన సముపార్జనకు అవసరమైన బీజాలన్నీ జీవికి ఈ స్థితిలో ఉన్నపుడు ఏర్పాటవుతాయి. ఇటువంటి అవకాశం మరి ఏ ఇతర జీవికి ఉండదు.

'సర్వతోముఖమైన ఏర్పాట్లతో నుండునది'

'అనేక ముఖములు కలది' అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 533. సర్వౌదన ప్రీత చిత్తా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వౌదన ప్రీత చిత్తాయైనమః' అని చెప్పాలి.

సర్వ = అన్ని విధములైన, ఓదన = ఆహారములను, ప్రీతచిత్తా = ఇష్టపడునది.

సహస్రారకమలాధిష్ఠాన దేవత అయిన 'యశస్విని'కి అన్నిరకాల ఆహారాలు ఇష్టమే! అన్నిటినీ మహాప్రీతి కరంగా స్వీకరిస్తుంది. ఇది స్వచ్ఛమైన రుచికి సంబంధించిన స్థితి (State of pure Taste). జీవుని భౌతికాభివృద్ధికి తోడ్పడేది ఆహారం కాబట్టి – 'అన్నం బ్రహ్మేతి వ్యజానాత్' అని తైతిరీయంలో అన్నాన్ని పరబ్రహ్మ స్వరూపంగా భావించమని చెప్పబడింది. అంతేకాదు, 'అన్నం ననింద్యాత్' 'అన్నాన్ని నిందించవద్దు' అని, 'అన్నం న పరిచక్షీత' – అన్నాన్ని పారేయవద్దు, దొంగిలించవద్దు, అని, 'అన్నం బహుకుర్వీత' – అన్నాన్ని సమృద్ధిగా పండించు, తయారుచెయ్యి అనీ గూడా చెప్పబడింది.

పరబ్రహ్మ స్వరూపమైన అటువంటి ఆహారం శరీర పోషణకు ఉపకరించేది కాబట్టి, అన్ని రకాల ఆహారాలు గ్రాహ్యములే ! అయితే - ఎన్నో రకాల స్థాయిలలోని వారు, ఎన్నోరకాలైన ఆహారాలను అమ్మవారికి నైవేద్యం భక్తితో పెడతారు. అమ్మవారు వాటి నన్నిటినీ - స్వీకరిస్తుంది. ( భక్త కన్నప్ప పెట్టిన ఎంగిలి మాంసం శివుడు తిన్నాడు కదా! శబరి పెట్టిన ఎంగిలి పళ్ళను శ్రీరాముడు తిన్నాడు కదా!) అలాగే ప్రపంచంలోని అన్ని జాతులవారు, అన్ని మతాల వారు, అన్ని వర్ణాల వారు, అన్ని వర్గాల వారు అమ్మవారి బిడ్డలే కాబట్టి - వారి వారి ఆహారాల్ని అమ్మవారు ప్రియంగానే స్వీకరిస్తుంది. మనకు నచ్చేవి, మనం తినేవి, మనం ఇష్టపడేవి అమ్మ వారికి ఎలా నైవేద్యం పెడతామో అలాగే వివిధ జాతులవారు కూడా వారి వారి పద్ధతులతో ఇష్టపడే ఆహారాన్ని నైవేద్యం పెడతారు అనే సామరస్య భావన రావాలి.

ఇది ఆనందమయ కోశానికి సంబంధించిన స్థితి. 'ఇష్టాయిష్టాలు' - అనే నియమాలకు అతీతంగా ఉండే స్థితి కాబట్టి అమ్మవారు అన్నిటినీ ఇష్టంగానే స్వీకరిస్తుంది.

అన్న ప్రాశన జరిగిన తరువాత పాలు అన్నం, నెయ్యి అన్నం, బెల్లం అన్నం, పెరుగు అన్నం, పప్పన్నం, హరిద్రాన్నం అయిన తరువాత ఇక మనం తినే అన్ని రకాల పదార్థాలు గూడా పెట్టడం ప్రారంభించవచ్చు అనే సూచన ఈ నామంలో ఉంది.

'అన్ని రకముల ఆహారమును ప్రీతితో స్వీకరించునది' అని ఈ నామానికి అర్థం.

## 534. యాకిన్యంబాస్వరూపిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'యాకిన్యంబాస్వరూపిణ్యై నమః' అని చెప్పాలి.

యాకినీ = 'యాకినీ' అను పేరు గల దేవత యొక్క, స్వరూపిణీ = రూపములో ఉండునది.

సహస్రార కమలాధిష్ఠాన దేవత పేరు 'యాకినీ'. ఈ దేవతనుద్దేశించి చేసే బీజ, కీలక, న్యాస మంత్రాదులన్నీ 'య' కార సంబంధంగా ఉంటాయని 'యాకినీ' పేరులోని మొదటి అక్షరం 'యా' సూచిస్తుంది.

'సహస్రదళ పద్మస్థా' అనే నామం దగ్గర నుండి ప్రస్తుత నామం దాకా చెప్పిన వివరాలన్నీ ఈ క్రింద తెలిపిన ఈ దేవతా ధ్యాన శ్లోకంతో గుర్తు పెట్టుకోవచ్చును.

శ్లో. ముండవ్యోమస్థ పద్మే దశశతదళకే కర్ణికా చంద్రసంస్థామ్
రేతో నిష్ఠాం, సమస్తాయుధ కలితకరాం, సర్వతోవక్త్రపద్మాం
ఆది క్షాన్తార్ణశక్తి ప్రకట పరివృతాం సర్వవర్ణాం భవానీం
సర్వాన్నాసక్త చిత్తాం పరశివరసికాం యాకినీం భావయామః.

'యాకినీ దేవతా స్వరూపములో ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 535. స్వాహా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'స్వాహాయైనమః' అని చెప్పాలి.

సు + ఆహా = స్వాహా = చక్కగా ఆహ్వానించుట లేదా స్వాగతము పలుకుట

దేవతలకు సమర్పించే హవిస్సును హోమగుండంలో వేసేటప్పుడు ఏ దేవతను ఉద్దేశించి సమర్పిస్తున్నామో - ఆ దేవత కొఱకు అని చెప్పుచు అటుపైన 'స్వాహా' అని గూడా అనాలి. ఉదా: ఇంద్రునికి సమర్పించేటప్పుడు - 'ఇంద్రాయ స్వాహా' - ఇంద్రాయ్యై దం న మమ' - ఈ సమర్పించు ద్రవ్యము ఇంద్రుని కొఱకు (అందులకు ఇంద్రుని) ఆహ్వానించుచున్నాను. 'ఇది ఇంద్రునికే చెల్లును గాని నాది కాదు. - అని ఈ రెండు వాక్యముల మంత్రమునకు అర్థము. అంటే - 'స్వాహా' అనేది - దేవతాహవిర్దాన వాచకమన్నమాట'.

అగ్ని స్వరూపుడైన ఈశ్వరునికి దోహదపడే పరమేశ్వరీ అంశ రూపమే 'స్వాహా'. 'స్వాహాంతు దక్షిణే పార్శ్వే' - అంటే అగ్నికి ఈమె కుడివైపు ఉండేది. ఈ స్వాహా దేవి పూర్తిగా తేజస్స్వరూపిణి. ఈశ్వర స్వాహాలకు సంబంధించినవాడే 'కుమారస్వామి' (కుమారస్వామి అగ్నిపుత్రుడనే పురాణ కథలోని రహస్యం ఇదే!) ఈ విషయాన్ని -

శ్లో. స్వాహా వహ్న్యాత్మనస్తస్య ప్రోక్తా పశుపతేః ప్రియా
షణ్ముఖో భగవాన్దేవః బుధైః పుత్ర ఉదాహృతః- అన్న శ్లోకంలో లింగపురాణంలో చెప్పబడింది.

ఈ స్వాహాదేవికి మొత్తం పదహారు నామాలున్నాయి. అవి - 1) స్వాహా 2) వహ్నిప్రియా 3) వహ్నిజాయా 4) సంతోషకారిణీ 5) క్రియ 6) శక్తి 7) కాలరాత్రి 8) పరిపాకకరి 9) ధ్రువ 10) గతి 11) దాహిక 12) దహనక్షమ 13) సంసారసార రూప 14) దేవపోషణ కారిణి 15) మోదసంసారతారణి 16) దేవజీవనరూపా.

ఈ పదహారు నామాలతో కూడిన పై శ్లోకంతో స్వాహాదేవిని స్తుతిస్తే వివాహసిద్ధి, సంతాన సిద్ధిలతో పాటు సర్వకామ్య సిద్ధి కూడా చేకూరుతుంది. ఈ స్వాహా - విశుద్ధి చక్రదేవత అయిన వజ్రేశ్వరి యొక్క మంత్ర విశేషం.

మనలో మూడు రకాల అగ్నులుంటాయి. అవి - 1) ఆహవనీయము 2) గార్హపత్యము 3) దక్షిణాగ్ని. వీటినే త్రేతాగ్నులంటారు. బ్రహ్మతేజస్సును పెంపొందింప చేసుకునే స్థితిలోని శుక్రసంబంధమైన తేజస్సును 'ఆహవనీయము' అంటారు. సత్సంతాన ప్రాప్తికై ఉపయోగించే స్థితిలోని శుక్రసంబంధమైన తేజస్సును 'గార్హపత్యము' అంటారు. కేవలము కామ పరితృప్తికి, మోహపరితృప్తికి, ఇంద్రియ భోగలాలసత్వానికి ఉపయోగపడే స్థితిలోని శుక్రతేజస్సును 'దక్షిణాగ్ని' అంటారు. ఈ మూడు స్థితుల్లోని శుక్రాన్ని పురాణ కథల్లో గాని, ఇతిహాస కథల్లో గాని త్రిపథగామియైన గంగానదిగా వరుసగా - 'వియద్గంగా' 'మందాకినీ' 'భోగవతీ' - అనే పేర్లతో సూచిస్తారు. ఈ మూడు పేర్లతో పిలవబడే గంగానది వరుసగా దేవలోకంలోను, మర్త్యలోకంలోను, పాతాళ లోకంలోను ప్రవహిస్తుంది.

మూడు పద్ధతుల ద్వారా అగ్నిని ఉత్పత్తి చెయ్యవచ్చని విజ్ఞాన శాస్త్రం కూడా చెబుతుంది.

1) సూర్యకిరణాలను ఒక కుంభాకార కటకంతో ఒక బిందువు వద్దకు కేంద్రీకరిస్తే ఆ బిందువు వద్ద అగ్నిని పుట్టించవచ్చును. ఈ విధంగా ఉత్పత్తి అయిన అగ్నిని సూర్యాగ్ని (Solar fire) అంటారు.

2) విద్యుత్ ద్వారా అగ్నిని ఉత్పత్తి చేయవచ్చు. ఈ విధంగా ఉత్పత్తి అయే అగ్నిని (Electric fire) 'విద్యుదగ్ని' అంటారు.

3) రాపిడి లేదా ఘర్షణ ద్వారా అగ్నిని పుట్టించవచ్చు. ఈ విధంగా ఉత్పత్తి అయ్యే అగ్నిని 'ఘర్షణాగ్ని' (Frictional fire) అంటారు.

(ఇంకా ఈ అగ్నిని గూర్చి మరి కొన్ని విశేషాలను తెలుసుకోవాలంటే Alice. A. Bailey వ్రాసిన 'Treatise on cosmic fire' అనే దివ్యజ్ఞాన గ్రంథాన్ని చదవండి) అలాగే షట్చక్రవర్తి కలకు, సప్తమహర్షులకు, వారి భార్యలకు, అగ్నికి సంబంధించిన ఎన్నో రహస్య విషయాలను తెలుసుకోవాలంటే 'అగ్నిపురాణం' చదవండి.)

ఏ దేవతకు సమర్పించే హవిస్సునైనా హోమగుండంలో మనకు దర్శనమిచ్చే అగ్ని హోత్రజ్వాలల్లో వేయవలసిందే! ఏ దేవతకు సంబంధించిన హవిస్సును ఆ దేవతకు అగ్ని హోత్రుడే అందచేస్తాడు. అంటే – అగ్ని – ఆధ్యాత్మిక వ్యవహారాలకు సంబంధించిన 'తపాలా బంట్రోతు' (Spiritual Postman) అన్నమాట!

సృష్టిలో ఏమీ లేనట్లుగా కనబడే (Seeming nothingness) ఆకాశం నుండి – అన్నీ ఉన్నట్లుగా కనబడే (Apparent something) భూమి వైపుకు జరుగుతుంది. అంటే అదృశ్యలోకాల నుండి దృశ్యలోకాల వైపుగా జరుగుతుంది. ఈ రెండు లోకాలకు మధ్యలో 'గేటు కాపలాదారు' (gate keeper)గా ఉండే వాడే 'అగ్ని' అని అర్థం చేసుకోవాలి. రెండు లోకాల మధ్య జరిగే 'బట్వాడా' కార్యక్రమాన్ని నిర్వర్తించడానికై అగ్నికి దోహదపడే సహధర్మచారిణి పేరే 'స్వాహా' అని అవగాహన చేసుకోవాలి. ఈ కారణం వల్లనే 'సు' అంటే మంచి లేదా సరియైన 'ఆహా' అంటే దారి లేదా మార్గము అనే అర్థంలో 'స్వాహా' పదం ఏర్పడింది.

ఈ స్వాహాదేవిని – విశుద్ధి చక్రాధిష్ఠాన దేవత అయిన వజ్రేశ్వరి యొక్క మంత్ర విశేషంగాను – ప్రథమమాస గర్భస్థ పిండ విశేషంగాను సమన్వయ పరచుకోవాలి.

## 536. స్వధా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'స్వధాయైనమః' అని చెప్పాలి.

స్వధా = (స్వ + ధా) = శరీర ధారణ ప్రక్రియకు సంబంధించిన స్వాగత వచనము.

**జీవుల సృజనాత్మక శక్తులకు** (creative intelligence) **సంబంధించినవారు దేవతలైతే ఆ జీవుల దేహ ధారణ ప్రక్రియకు దోహదపడు వారిని పితృదేవతలంటారు.** ఈ పితృదేవతలకు విడిచే తర్పణలకు ముందు 'స్వధా' అని చెప్పి తర్పణలు వదలాలి. అంటే – ఇది పితృదేవతా దాన వాచకము.

జీవి శరీర ధారణకు, ఆ శరీరం ఆహారాన్ని స్వీకరించి దేహవృద్ధి జరగడానికి దోహదపడే శక్తులను **(Regenerating powers) పితృదేవతలంటారు.**

అగ్నిమూర్తి అయిన ఈశ్వరునికి దోహదపడే పరమేశ్వరీ అంశరూపమే 'స్వధా'. 'దేవీం వామే స్వధాం తథా'. ఈ స్వధాదేవి అగ్నికి ఎడమవైపున ఉండేది. ఈవిడ కూడా తేజ స్స్వరూపిణియే ! మానవులు అర్పించిన పిండదానాదులు ఈ స్వధా దేవి ద్వారా పితృదేవతలు స్వీకరిస్తారు.

'స్వాహా,' 'స్వధా' దేవతలిద్దరూ వరుసగా అగ్నికి కుడి, ఎడమ పార్శ్వాల్లో ఉంటారని చెప్పబడింది. అంటే ఈ రెండూ సవ్య, అపసవ్య పద్ధతుల్లో ఉంటాయని గూడా గుర్తించాలి. అందుకే – స్వాహాతో దేవతలకు ఏదైనా అర్పిస్తున్నప్పుడు యజ్ఞోపవీతం సవ్యంలోను అంటే – ఎడమ భుజంమీదను, పితృదేవతలకు తిల, పిండదానాలు అర్పిస్తున్నప్పుడు యజ్ఞోపవీతం అపసవ్యంలోను – అంటే కుడి భుజం మీద ఉండాలి.

ఈ స్వధాదేవికి మొత్తం ఏడు నామాలున్నాయి. అవి – 1) పితృ ప్రాణతుల్య 2) ద్విజప్రీతికరా 3) ద్విజజీవనరూపిణి 4) శ్రాద్ధాధిష్ఠాతృదేవి 5) శ్రాద్ధఫలప్రదా 6) బ్రహ్మమానసకన్యా 7) పితృతుష్టిప్రదా

ఈ స్వధాదేవిని – అనాహత చక్రాధిష్ఠాన దేవత అయిన 'వామదేవి' మంత్ర విశేషంగాను, ద్వితీయ మాస గర్భస్థ పిండ విశేషంగాను సమన్వయ పరచుకోవాలి. ఈ నామము పితృదేవతా దాన వాచకము.

## 537. అమతిః

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అమత్యైనమః' అని చెప్పాలి.

అమతిః = మతి, లేదా బుద్ధి వికసించడానికి ముందు ఉన్న స్థితిని సూచించు ప్రజ్ఞాశక్తిని 'అమతి' అంటారు. అంతేగాని 'బుద్ధిలేనిది' అని అర్థం కాదు. అంటే - ఇది శబ్దానికి ముందు ఉండే నిశ్శబ్దం లాంటిది. అనగా, నిశ్శబ్దంలోంచి శబ్దం ఎలా పుడుతుందో 'అమతిః' స్థితిలోంచి 'మతిః' అలాపుడుతుందని అర్థం చేసుకోవాలి. భావానికి ముందు ఉండే స్థితి కాబట్టి దీనిని వాక్కులతో నిర్వచించలేము.

(ఇది బుద్ధి వికసించడానికి ముందు ఉండే స్థితిని సూచించే నామమే కాని బుద్ధిని సూచించే నామము కాదు. పూర్వ నామం 'స్వధా' ను, ప్రస్తుత నామం 'అమతిః' తో కలపడం మూలంగా సవర్ణదీర్ఘ సంధి వలన ''స్వధా + అమతిః = స్వధామతిః'' ఔతుంది. అప్పుడు ఈ సంధి ఫలితంగా వచ్చే ఈ రెండు నామాల కూర్పును చూడంగానే ఈ నామం 'మతిః' అనే నామమేమోననే సందేహం సహజంగానే వస్తుంది కాని - అది సరికాదు. ఎందుకంటే 'మతి'కి లేదా 'బుద్ధి'కి సంబంధించిన 'మేధా' అనే నామం ఈ నామం తర్వాత ఎలాగూ వస్తోంది కదా!)

ఈ నామం మణిపూరక చక్రాధిష్ఠాన దేవత అయిన 'వయోవస్థావివర్జితా' శక్తి దేవత యొక్క మంత్రవిశేషంగాను, తృతీయ మాస గర్భస్థ పిండ విశేషంగాను సమన్వయ పరచుకోవాలి.

ఇది బుద్ధి వికసించడానికి ముందు ఉండే స్థితిని సూచించు నామము.

సృష్టిద్దామనే కోరిక కలగక పూర్వం ఉన్న స్థితిని, అంటే - 'అవ్యక్తా'న్ని లేదా 'మూలప్రకృతి'ని సూచించే నామంగా గూడా దీన్ని అర్థం చేసుకోవచ్చును.

## 538. మేధా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మేధాయై నమః' అని చెప్పాలి.

మేధా = బుద్ధి విశేషము.

మతివల్ల వచ్చిన దాన్ని 'మేధా' అంటారు. లేదా - ధారణ శక్తి గల బుద్ధిని 'మేధా' అంటారు. తానే బ్రహ్మ అన్న విషయం గుర్తుండడాన్ని 'మేధ' అంటారు. (బ్రహ్మే హ

మస్మి స్మృతి రేవ మేధ) అంటే – ఎన్నో రూపాలతోఉంటూ, ఎన్నో నామాలతో పిలవబడుతూ ఎన్నో జన్మలు ఎత్తినా ఇవన్నీ తాత్కాలికమేనని – 'తాను' బ్రహ్మయొక్క శాశ్వతమైన అంశ అని గుర్తుండే బుద్ధి విశేషాన్ని 'మేధ' అంటారు. ఈ నామం ఒక బుద్ధి విశేషాన్ని సూచిస్తుంది.

## 539. శ్రుతిః

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శ్రుత్యైనమః' అని చెప్పాలి.

శ్రుతిః = అంటే చెవులతో, అనగా – చెవులతో సంబంధము కలిగినది.

వినుట ద్వారా తెలియబడు, మరియు తెలుసుకొనవలసిన అత్యంత మహిమ గల, వినియోగము గల విషయ సముదాయాలను 'శ్రుతులు' అంటారు. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము అధర్వణ వేదము – ఈ నాల్గింటిని శ్రుతులంటారు. పూర్వం కాగితాలు, పెన్నులు, ముద్రణలు లేనప్పుడు గురువునోటితో ఉచ్చరించి ఒకసారిచెప్తే – శిష్యుడు జాగ్రత్తగా విని రెండు సార్లు మరల చెప్పే విధంగా మొత్తం నాల్గు వేదాలు నేర్చుకునేవారు. ఎక్కడ అడిగినా చెప్పగలిగే ధారణ వారికుండేది. ఇంత విజ్ఞానం కేవలం వినికిడి వల్ల వచ్చేది అవడం వలన వీటిని 'శ్రుతులు' అన్నారు.

ఋషులకు ప్రకృతిలో దర్శనమైన విజ్ఞాన విశేషాలన్నిటినీ 'శ్రుతు'లనే అంటారు.

'శ్రుతి' అంటే స్థాయి (Pitch) లేదా పౌనఃపున్యము (Frequency) అనే అర్థం గూడా ఉంది. ఇది సంగీతంలో వచ్చే ఒక పారిభాషిక పదం. 'శ్రుతిర్మాతాపితాలయా' అన్నారు. (సంగీతంలో 'శ్రుతి' ని తల్లితోను, 'లయ' ను తండ్రితోను పోల్చి చెప్తారు).

ఏ విషయంలోనైనా ఇంకొకరితో కలవగలగడాన్ని గూడా శ్రుతి(Tune) కుదరడం అంటారు. ఇలా ఇద్దరు లేక అంతకన్నా ఎక్కువమంది మధ్య ఏదైనా ఒక విషయంలో ఏకాభిప్రాయం ఉంటే – వారి మధ్య శ్రుతి కుదిరినట్లు కూడా చెప్పవచ్చు. ఇలా శ్రుతి కలగడానికి వారిని అలా కలపడానికి వారందరిలో ఉండే 'అమ్మవారే' కారణం కాబట్టి అమ్మవారు – 'శ్రుతి'.

తాను ఉచ్చరిస్తూ, అలా తనచే ఉచ్చరింపబడే దాన్ని వింటూ ఉండటం అన్నిటి కన్న ఉత్తమ శ్రుతి అని తెలుసుకోవాలి. (అంటే ఇది - ఉచ్చరించే వాడికి, ఉచ్చరింపబడే దానికి మధ్య శ్రుతికుదరడం అన్నమాట!)

మూలాధార చక్రాధిష్ఠాన దేవత యొక్క మంత్ర విశేషాల్ని, ఆరవ మాస గర్భస్థ పిండము యొక్క స్వభావాన్ని గూడా ఈ నామంతో సమన్వయు పరచుకోవాలి.

## 540. స్మృతిః

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'స్మృత్యైనమః' అని చెప్పాలి.

స్మృతి = మరల మరల గుర్తుకు తెచ్చుకొను లక్షణము. దర్శనం జరిగే - క్రొత్తవిషయాలు - 'శ్రుతులు' (Revelations) అయితే - ఆ శ్రుతులలోని విషయాలే మళ్ళీ మళ్ళీ గుర్తుకు తెచ్చుకుని తదనుగుణంగా వివరింపబడే విషయాలను 'స్మృతులు' (Recollections) అంటారు. వేదాలే శ్రుతులు. మనువు, పరాశరుడు, గౌతముడు, యాజ్ఞవల్క్యుడు మొదలైనవారు ఆ వేదాలను అనుసరించి ఒక్కొక్కరు కొన్ని కొన్ని విషయాలను వివరించి వ్రాశారు. వాటన్నిటినీ 'స్మృతులు' అంటారు. ఇవన్నీ మానవ జాతికి బాగా అర్థమయే రీతిలో ఎంతో ఉపయోగకరంగా ఉంటాయి. పరమ ప్రామాణికమైన వేదాలలోని విషయాలకు వీటిలో తెల్పే విషయాలకు అభేదమే కాబట్టి స్మృతులకు కూడా - శ్రుతులకు ఉన్న ప్రాధాన్యము, గౌరవము ఉన్నది.

(సుదక్షిణాదేవి తన భర్త అయిన దిలీప మహారాజును అడుగుల్లో అడుగు వేసుకుంటూ అనుసరించే విధానాన్ని ఉపమానం చెప్పడానికి 'శ్రుతేరివార్థం స్మృతి రన్వగచ్ఛత్' - 'స్మృతులు శ్రుతులను ఎలా అనుసరిస్తాయో సుదక్షిణ, దిలీపుని అలా అనుసరించింది' అని - తన కావ్యమైన రఘువంశంలో కాళిదాసు అంటాడు.)

(అంటే - స్మృతులు స్వతంత్రమైనవి కావు. శ్రుతులను అనుసరించే ఉంటాయి అని కూడా దీనిని బట్టి గ్రహించాలి.)

'శ్రుతులను ప్రాధాన్యంగా తీసుకునే వారిని – 'శ్రోత్రీయు'లని, 'స్మృతు'లను ప్రాధాన్యంగా తీసుకునే వారిని – 'స్మార్తులు' అనీ అంటారు.

అజ్ఞా చక్రాధిష్ఠాన దేవత అయిన సిద్ధమాత యొక్కమంత్ర విశేషాన్ని ఆరవ మాస గర్భస్థ పిండ స్వభావాన్ని ఈ నామంతో సమన్వయ పరచుకోవచ్చు.

## 541. అనుత్తమా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అనుత్తమాయైనమః' అని చెప్పాలి.

అనుత్తమా = తనను మించి ఉత్తమమైన దేవత లెవరూ లేనిది. అమ్మవారే ఉత్తమోత్తమ దేవత అని 'నత్సమశ్చాభ్యధి కశ్చ దృశ్యత' అని శ్రుతులు, 'నత్వత్య మోహ్యభ్యధికః కుతోన్యః' అని స్మృతులు ఘోషిస్తాయి.

సహస్రార చక్రాధిష్ఠాన అయిన 'యశస్వినీ' దేవతా మంత్ర విశేషాన్ని, ఏడవ మాస గర్భస్థ పిండ స్వభావాన్ని – ఈ నామంతో సమన్వయ పరచుకోవచ్చును.

('వజ్రేశ్వరీ' నామం నుండి ఈ 'అనుత్తమా' నామం వరకు సప్త చక్రసంబంధమైన, గర్భస్థ పిండ సంబంధమైన విషయాలు – వాటి వాటికి సంబంధించిన అధిష్ఠాన, పరివార, దేవతలు, వారి ఆయుధాలు, వర్గాలు, వదనాలు వారికి నైవేద్యంగా పెట్టవలసిన నివేదన ద్రవ్యాలు అన్నీ విపులంగా, స్పష్టంగా విపులీకరింపబడ్డాయి. అంటే, ఇది 'క్షేత్ర' పరమైన జ్ఞానం. క్షేత్రజ్ఞ పరమైన జ్ఞానం ఇంతకు పూర్వం నామాల్లో చెప్పబడింది. ఇక ముందు రాబోయే 'పుణ్యకీర్తిః' నామం నుండి, 'మహాసామ్రాజ్యశాలినీ' నామం దాకా ఉండే నామాలలో 'కాత్యాయనీ విద్య' లేదా,' విమర్శ రూపిణీ విద్య' వివరింపబడుతుంది.

తనను మించిన ఉత్తమ దేవత ఇంకొకరు లేనిది – అని ఈ నామానికి అర్థం.

## 542. పుణ్యకీర్తిః

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పుణ్యకీర్త్యై నమః' అని చెప్పాలి.

పుణ్య = 'మంచి' లేదా, 'పవిత్రమైన', కీర్తిః = యశస్సుకలది.

ఆపదలలో నున్న భక్తులను ఆదుకోడంలోనూ, తనను స్తోత్రనామ పారాయణాదులచే ఆరాధించేవారికి భక్తిని, ముక్తిని, జ్ఞానాన్ని కలుగ చేయడంలోను, అందరి కన్నా ఎక్కువ ఖ్యాతి గడించిన ముఖ్యాతి ముఖ్యమైనది. అందుకని ఈ జగజ్జనని 'పుణ్యకీర్తిః' అనే బిరుదు నామాన్ని పొందింది.

1) మంచి యశస్సు కలది.

2) భక్తుల పుణ్యకార్యాలకు ప్రతిఫలాలను ఇవ్వడంలో ఖ్యాతి వహించినది.

3) పుణ్య కార్యాల సమష్టి రూపము - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 543. పుణ్యలభ్యా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పుణ్యలభ్యాయైనమః' అని చెప్పాలి.

పుణ్య = పుణ్య నామములచే, లభ్యా = పొందబడునది.

అమ్మవారిని ఆరాధించే అవకాశం, అనుభవం రావడం కూడా అదృష్టమే ! ప్రపంచంలో ఎంతో మంది ఉన్నా, ఆ అందరిలో ఎంతమంది జగజ్జననిని ఆరాధించి తరిస్తున్నారు ? అమ్మవారి ఆరాధన అంటే 'అందరిలోను ఉన్న అమ్మవారిని' అనే అర్థం - అంతే గాని మనం ప్రత్యేకంగా మన కిష్టమైన పేరుతో, ఇష్టమైన రూపంతో ఏర్పాటు చేసుకున్న విగ్రహం కాదు. విశ్వమంతా నిండి ఉన్నది ఆమె అయినపుడు - ఆ తల్లికి మనం గీసింది - ఆకారం; మనం చెక్కింది - విగ్రహం, మనం పిల్చింది - పేరు - అవుతుందనే అవగాహన కలగాలి. ఈ యావత్ప్రపంచానికి ఆధారంగా, ఆశ్రయంగా ఒక జగజ్జనని ఉండి ఉండాలనే భావన, ఆ భావనా గమ్యం పట్ల ఆరాధనా భావం ఉండాలి. గాని - ఆ జగజ్జనని నామ రూపాలు కాదు ముఖ్యం. (అమ్మవారి 'నామరూపవివర్జితా' అన్న 300వ నామానికిదే అర్థం). ఈ విధమైన జగజ్జననీ ఆరాధనా పుణ్యము వలన మాత్రమే అమ్మవారిని, అమ్మవారి అనుగ్రహాన్ని పొందుతాము అని ఈ నామానికి అర్థం.

మన భావాలను బట్టి, భావలక్ష్యాలను, ఉద్దేశ్యాలను (Motives) బట్టి - మనం చేసింది పుణ్యకార్యమా, పాపకార్యమా అనేది నిర్ణయింపబడుతుంది. తన ఉన్నత పదవికి అడ్డు వచ్చే ప్రత్యర్థి నశించడానికి చేసే 'చండీయాగం' కూడా పాప కార్యమే అవుతుంది గాని పుణ్య కార్యం కాదు. అలాగే - పిల్ల వాడు బాగుపడటం కోసం దెబ్బలు కొట్టడం పుణ్యకార్యమే అవుతుంది. గాంగ్రిన్ వల్ల ప్రాణానికి హాని కలిగించే సెప్టిక్ స్థితిలో ఉన్న కాలును శస్త్రవైద్యుడు తీసివేసే పని కూడా పుణ్యకార్యమే అవుతుంది గాని పాపకార్యం కాదు. కాబట్టి 'పుణ్యకార్యం' అంటే 'పూజించే కార్యం' అనీ పాపకార్యం అంటే 'బాధించే కార్యం' అనీ పొరబాటుగా అర్థం చేసుకోకూడదు. ఎందుకు ఆపని చేస్తున్నామో, మన మనస్సులోని ఉద్దేశాన్ని బట్టి మనం చేసిన పని - పుణ్యమా, పాపమా అనేది నిర్ణయింపబడుతుంది. యమధర్మరాజు కూడా ఈ పద్ధతిననుసరించే శిక్షను విధించడంలో నిర్ణయం తీసుకుంటాడని గూడా గ్రహించాలి.

జన్మల తరబడి పైన తెల్పిన విధంగా చేసిన పుణ్య కార్యాల ఫలితంగా పరమేశ్వరీ ఆరాధన చెయ్యాలనిపించడం, తత్ఫలితంగా ఆత్మజ్ఞానాన్ని, బ్రహ్మజ్ఞానాన్ని పొంది మోక్షానికి అర్హుడవడం జరుగుతుంది. ఈ విధంగా లభించేది కాబట్టి అమ్మవారు 'పుణ్యలభ్యా'.

'సదుద్దేశంతో చేసే పవిత్ర సత్కార్యాల వలన పొందబడునది' అను ఈ నామానికి అర్థం.

## 544. పుణ్య శ్రవణ కీర్తనా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పుణ్య శ్రవణ కీర్తనాయైనమః' అని చెప్పాలి.

పుణ్య = పవిత్రమైన వాటి, శ్రవణ = వినుటకును, కీర్తనా = కీర్తించుటకును లక్ష్యమైనది, లేదా - అవకాశమును కలుగ చేయునది.

జీవితములో పుణ్యవంతమైన, పవిత్రమైన వాక్కులను వినుటకు కీర్తనము చేయుటకు అవకాశము అమ్మవారి వలననే కలుగును, లేదా - అట్టి వాటినే వినుచుండెడిది అని అర్థం చెప్పుకోవచ్చును.

అమ్మవారికి, అయ్యవారికి; 'శక్తి, శివులకు - ప్రతీకలైన 'హ' కార 'స' కారాల మధ్య శబ్దం రావాలంటేను - ఏ నామాలు స్మరిస్తేను, ఉచ్చరిస్తేను పుణ్యవంతులౌతారో అటువంటి 'హరి' 'హర' పదాదులను ఉచ్చరించాలంటేను - దేని సహకారంలేకపోతే వీలుకాదో - అటువంటి 'హ్రీం' కార స్వరూపిణి.

1) పుణ్య ప్రదమైన వాక్కులను - వినుటకు, కీర్తనము చేయుటకు అవకాశము కలుగచేయునది.

2) 'హరి' 'హర' పుణ్యపదాదుల ఉచ్చారణ, శ్రవణ, కీర్తనాదులకు దోహదపడు 'హ్రీం' కార స్వరూపిణి - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 545. పులోమజార్చితా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పులోమజార్చితాయైనమః' అని చెప్పాలి.

పులోమజా = పులోముని కూతురైన శచీదేవిచే, అర్చితా = ఆరాధింపబడునది.

పూర్వం నహుషుడు నూరు యజ్ఞాలు చేసి ఇంద్రపదవిని పొందినపుడు పాత ఇంద్రుడు అజ్ఞాతవాసంలో గడపవలసి వచ్చింది. అప్పుడు ఆ పాత ఇంద్రుని భార్య, పులోముని కూతరు అయిన శచీదేవి తమ గురువైన బృహస్పతి సలహా మేరకు అమ్మవారిని ఆరాధించి తన భర్త జాడను తెలుసుకోగలిగి, ఇంద్రుణ్ణి, ఆ ఇంద్రునికి - ఇంద్రపదవిని, స్వర్గాన్ని కూడా పొందగలిగింది. అటువంటి అసాధ్యమైన వాటిని కూడా అమ్మవారు సుసాధ్యం చేస్తుందని ఈ నామం దృఢపరుస్తోంది. భక్తుల యోగ క్షేమాలు తన నెత్తిన వేసుకుంటుంది (యోగ క్షేమం వహామ్యహమ్) అన్నదానికి ఇది ఒక తార్కాణం. పులోముని కూతురైన 'పులోమి'నే శచీదేవి అంటారు.

ఇంద్రుని భార్య చేత అర్చింపబడింది కాబట్టి అమ్మవారు 'ఐం ద్రీం' అయింది. ('ఐంద్రీం' అని ఉచ్చరించునపుడు - 'ఐం' వాగ్భవబీజాన్ని 'ద్రీం' నీలకంఠ బీజాన్ని సూచిస్తాయి).

## 546. బంధమోచనీ

అయిదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'బంధమోచన్యై నమః' అని చెప్పాలి.

బంధ = బంధముల నుండి, మోచనీ = విముక్తిని కలిగించునది.

బంధాలంటే భౌతికమైనవే కానక్కర లేదు. మానసికమైనవి ఆధ్యాత్మికమైనవి, అవిద్యా సంబంధమైనవి ఇలా ఎన్నో రకాల బంధాలున్నాయి.

ఒకరి చేతిలో గాని, కారాగారంలో గాని, విపత్కరస్థితులలో గాని చిక్కుకుని నిర్బంధంలో ఉంటే ఆ బంధాన్ని 'భౌతిక బంధం' అంటారు.

ఆశ, దురాశలు గాని, కామ క్రోధాలు గాని, అభిమాన దురభిమానాలు గాని – ఇలాంటి వేమైనా మనస్సుపై ఒత్తిడికి కారణమైతే ఆ బంధాన్ని – 'మానసిక బంధం' అంటారు.

ఒక గురువు వల్లనో, ఒక ఆధ్యాత్మిక సంస్థవల్లనో, ఒక క్షుద్ర దేవతారాధన వల్లనో, సరిపడని మంత్రం వల్లనో, స్తోత్రం వల్లనో, దురభిప్రాయంతో, దురుద్దేశంతో చేసే క్రతువు వల్లనో మనస్సు చిక్కుకుని చికాకు పెడితే, ఆబంధాన్ని – 'ఆధ్యాత్మిక బంధం' అంటారు.

'అన్ని రకాల బంధనాల నుండి విముక్తి కలుగచేయునది' అని ఈ నామానికి అర్థం.

## 547. బంధురాలకా

అయిదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'బంధురాలకాయై నమః' అని చెప్పాలి.

బంధుర = అందమైన, అలకా= కురులు కలిగినది.

అమ్మవారి తలకట్టు జుట్టు సహజంగానే ముంగురులతో ఉంటుంది. ఆ ముంగురులు రావడం కోసం తాపత్రయ పడి వేరే ప్రయత్నాలు చెయ్యక్కరలేదు. ఈ

విషయాన్ని ఆది శంకరులు సౌందర్యలహరిలో 'అరాళైస్స్వాభావ్యా దళికలభసశ్రీభిరలకైః...'' అనే 45వ శ్లోకంలో చెబుతారు.

ఈ నామాన్ని 'బర్బరాలకా' అని గూడా కొందరు చదువుతారు. (అలల వలె, ఉంగరముల వలె, వంకరగాను, కుఱచగాను ఉండు ముంగురులు కలది అని 'బర్బరాలకా' అన్నప్పుడు అర్థం చెప్పుకోవాలి).

ముంగురులు ముఖంపై అలా ఉండడం ముఖానికి ఒక విధమైన ఆకర్షణను, అందాన్ని చేకూరుస్తాయి. అవి కదులుతున్నపుడు ఒక విధమైన సోయగాన్ని, చైతన్యాన్ని కలుగచేస్తాయి.

'అందమైన చిక్కనైన ముంగురులు కలది' అని ఈ నామానికి అర్థం.

## 548. విమర్శరూపిణీ

అయిదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విమర్శరూపిణ్యైనమః' అని చెప్పాలి.

విమర్శ = వివేచనను, రూపిణీ = రూపముగా గలది.

మేల్కాంచిన జ్ఞాన బిందువును – 'చిత్' బిందువని, జ్ఞాన వికాస వైభవాన్ని సూచించే బిందువును – 'ప్రకాశ' బిందువనీ ఆ వైభవ విశ్లేషణను సూచించే బిందువును – 'విమర్శ' బిందువనీ సమన్వయ పరచుకోవచ్చును. చివరిదైన 'విమర్శ' బిందువుకు సంబంధించిన స్వరూపంగా అమ్మవారు ఈ నామంలో చెప్పబడుతుంది. దృశ్యమాన బ్రహ్మాండ సంబంధమైన, పిండాండ, ఆత్మ సంబంధమైన ఆత్మానాత్మవివేచన, అవస్థాత్రయ వివేచన, పంచకోశ, పంచభూత, సప్తధాతు, షట్చక్రాది విషయ, విజ్ఞానాత్మక, విమర్శ, వివేచన – అంతా అమ్మవారి ఈ 'విమర్శ బిందు' వికసనం వల్ల కలుగుతుంది.

'జ్ఞాన విశ్లేషణకు సంబంధించిన బిందుస్వరూపము' అని ఈ నామానికి అర్థం.

## 549. విద్యా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విద్యాయైనమః' అని చెప్పాలి.

విద్ + యా – విద్యా = జ్ఞాన (రూపిణీ).

తెలియచేసేది, తెలుసుకునేది, తెలియబడేది – ఏ ఒక్కటైతే ఉన్నదో అది 'విద్య'. తెలుసుకోవలసిన దాన్ని 'విద్య' అంటారు. వివేకం కలిగిన మానవునిగా పుట్టినందుకు, పరమాణువు నుండి పరమాత్మవరకు, మనస్సునుండి మహత్తువరకు విస్తరించి ఉండే ఆత్మజ్ఞాన, శాస్త్ర జ్ఞాన సముచ్చయాన్ని 'విద్య' అంటారు.

వేదోపనిషత్తులు, వేదాంగ స్మృత్యాదులన్నిటి సంబంధమైన విద్య అమ్మవారి స్వరూపమే! అని ఈ నామం తెలియచేస్తుంది.

జ్ఞాన, జ్ఞేయ, జ్ఞాతృ స్వరూపిణి అయిన అమ్మవారే 'విద్యా'.

## 550. వియదాది జగత్ప్రసూః

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వియదాది జగత్ప్రసవేనమః' అని చెప్పాలి.

వియత్ + ఆది = వియదాది = ఆకాశము మొదలైన పంచ భూతాత్మకమైన, జగత్ = ప్రపంచమును, ప్రసూ = చక్కగా సృజించునది.

పృథివ్యాపస్తేజో వాయురాకాశాదులన్నీ – తెలుసుకునే వాడికి అంటే – 'నేను' కు – తెలియబడే దానికీ అంటే – ప్రపంచానికి – మధ్య ఉండే పొరలు. తెలుసుకునే వాడికి తెలియబడాల్సింది స్పష్టంగా తెలియబడటం కోసమే మధ్య ఉండే ఈ పంచభూతాలైన పొరలను అమ్మవారు సృజిస్తుంది. ప్రపంచం ఈ పొరల ద్వారానే తెలియబడుతుంది తప్ప ఇంకో మార్గం లేదు. అత్యంత స్థూలమైన పృథివీతత్త్వం నుండి క్రమ క్రమంగా సూక్ష్మతత్త్వాలను అవగాహన పరుస్తూ, చిట్ట చివరకు జగత్తుకు కారణమైన అత్యంత సూక్ష్మతత్త్వాన్ని గూడా తెలుసుకునేట్లుగా అమ్మవారు చేస్తుంది.

ఆకాశాదులు – అనే పంచ భూతాలతో కూడిన జగత్తును సృజించునది – అని ఈ నామానికి అర్థం.

## 551. సర్వవ్యాధి ప్రశమనీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వవ్యాధి ప్రశమన్యైనమః' అని చెప్పాలి.

సర్వ = సకల, వ్యాధి = ఆధి, వ్యాధులకు, ప్రశమనీ = చక్కగా శమింపచేయునది, అనగా – నివారించునది.

వ్యాధులను ఒక రకంగా బాధలనే చెప్పుకోవాలి. బాధలంటే దేహానికి సంబంధించినవి, వాక్కుకు సంబంధించినవి, మనస్సుకు సంబంధించినవి అని మూడు రకాలుగా ఉంటాయి. వీటినే స్థూల, సూక్ష్మ, శరీర బాధలంటారు. సాధారణంగా స్థూల శరీరానికి వచ్చే బాధలను వ్యాధులని, మనసునకు సంబంధించిన వాటిని 'ఆధు'లనీ అంటారు. మానసికమైన రుగ్మతలనే 'భవరోగా'లని గూడా అంటారు. 'కళ్ళు మండుతున్నాయి' అన్నపుడు – నిజంగా కళ్ళుమండుతూ నీళ్ళు వస్తుంటే అది 'రోగము' క్రిందకు వస్తుంది. ఎవర్ని చూసినా 'కళ్ళు మండుతున్నాయి', 'కడుపు మండుతోంది' అంటే – అవి భవరోగాల క్రిందకు వస్తాయి. ఈ రెండు రకాల వ్యాధులను అమ్మవారు శమింప చేయ కలదు.

అయస్కాంతంలో అయస్కాంతత్వంకాని మిగిలిన పదార్థం ఉంటే – అది ఆ అయస్కాంతానికి వ్యాధి కారణం అవుతుంది. అలాగే, ఆరోగ్యానికి సరిపడే పదార్థాలు కాక, పడని పదార్థాలను స్వీకరించడం వలన అవి అనారోగ్యకారణా లౌతాయి. అలాగే ఇంద్రియాలకు మనస్సుకు సంబంధించిన విషయాలలో గూడా పడని వాటిని గ్రహిస్తే మానసికమైన వ్యాధులు వస్తాయి. శుద్ధమైన ఆత్మలక్షణాలకు వ్యతిరేకమైన రాగ, ద్వేష, అసూయ, అనుమానాదుల వలన భవరోగాలువస్తాయి. ఇవన్నీ అజ్ఞానం వలన, అవివేకం వలన తెచ్చుకునే ఆధి వ్యాధులే అవటం వలన అమ్మవారు జ్ఞాన స్వరూపిణి కాబట్టి అజ్ఞానాన్ని అవివేకాన్ని పోగొట్టి, అన్ని రకాల ఆధి వ్యాధులకు ఉపశమనాన్ని కలుగచేసి, శుద్ధాంతరంగునిగా ఎటువంటి భక్తునైనా తీర్చిదిద్దుతుంది.

అన్ని విధములైన ఆది వ్యాధులకు ఉపశమనము కలుగ చేయునది – అని ఈ నామానికి అర్థం.

## 552. సర్వమృత్యునివారిణి

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వమృత్యునివారిణ్యైనమః' అని చెప్పాలి.

సర్వ = సకల, మృత్యు = మృత్యుబాధలను, నివారిణీ = నివారించునది.

'మృత్యువు' అంటే 'మరణము'(Death) అని సూటి అయిన అర్థం. జన్మించిన ప్రతి జీవికి ఆ జన్మలో 'మృత్యువు' ఉంటుంది. (జాతస్యహిధ్రువోమృత్యుః .... గీత) అయితే, ఆ మృత్యువు ఒకే ఒకసారి ఉంటుంది కాని ఎక్కువ సార్లు ఉండదు. కాని, పిరికివాళ్ళు ఎన్నోసార్లు 'మరణిస్తారు'. (Cowards die manytimes but the brave man only once - Julius Ceaser). అయితే, ఈ 'మరణం' నిజమైన అర్థంలో మరణం కాదు. 'మృత్యువు'ను గురించిన భయాన్నే 'మృత్యువుగా ఈ సందర్భంలో చెప్పారు. (Fear of Death is often misunderstood as Death) ప్రపంచంలో చాలా మంది ఈ పిరికి వర్గంలోకే వస్తారు. వీరికి కష్టం వచ్చినపుడలా, బాధవచ్చినపుడల్లా, దుఃఖం వచ్చినపుడల్లా చావరుగాని దాదాపు చచ్చేంత పని జరుగుతుంది. 'రేపు నీళ్ళు రావుట' అనంగానే 'చచ్చాం' ఎలా అని ఒకసారి చస్తారు, కరెంటు ఉండదు అనంగానే మళ్ళీ 'చచ్చాం' ఎలా అని ఇంకోసారి చస్తారు. ఇలా శరీరానికి ఏదీ జరక్కుండానే మానసికంగా ఎన్నోసార్లు వీళ్ళు మరణిస్తారు. ఈ విధమైన పిరికితనానికి సంబంధించిన ఎన్నో విధాలుగా ఉండే మృత్యుభీతిని అమ్మవారు నివారిస్తుంది. 'నిజంగా మృత్యువు వచ్చేది పదార్థమయమైన దేహానికే గాని పరమాత్మ అంశ అయిన ఆత్మకు మృత్యువు ఉండదు కదా!' అనే జ్ఞానోదయం కలుగచేసి ఈ జ్ఞానోదయంతో అనవసరంగా కలిగే మృత్యు భీతిని నివారిస్తుంది అమ్మవారు.

మృత్యువు అనేది ఒకసారే ఉంటుంది. మృత్యుభీతులు చాలా ఉంటాయి. 'సర్వమృత్యునివారిణీ' అన్న ఈ నామంలో 'సర్వ' అనే విశేషణ పదానికి 'అన్నిరకాల' లేదా 'అన్ని విధములైన' అని అర్థం కాబట్టి ఈ 'సర్వ' పదం ఎన్నో రకాలుగా ఉండే

మృత్యు భీతులకు సంబంధించిన విశేషణ పదమే అవుతుంది కాని, ఒకేసారి జరిగే 'మృత్యువు'కు సంబంధించిన విశేషణ పదం కాదు.

మృత్యువులు కూడా సకాలంలో వచ్చేవి, అకాలంలో వచ్చేవి అని రెండు రకాలుంటాయి. కాల ధర్మాన్ని అనుసరించి సహజంగా వార్ధక్యానంతరం వచ్చేవి సకాల మృత్యువులు. ఇవి 'సకాల మృత్యువులే కాకుండా సకారణ మృత్యువులు. సకారణమైనవి ఎందుకంటే – మనము, మన జీవితం ఈ రెండూ మరింత అందంగా ఉండేందుకు దేవుడు – మన 'జీవితం' అనే పుస్తకంలో 'మరణం' అనే అధ్యాయం కూడా పెడతాడు. (God wants to enhance the beatuy of our life, therefore there is death) వార్ధక్యంలో మన శరీరం అందంగా ఉండదు. పంచేంద్రియాలు, మన బుద్ధి, చిత్తాదులు సరిగా పని చెయ్యవు. జీవితంలో ఆనంద స్పర్శ, అనుభూతి తగ్గుతుంది. అందుకని, తిరిగి అందంగా శరీరం తయారవడం కోసం, జీవితంలో ఆనంద స్పర్శ పునః ప్రతిష్ఠ జరగడం కోసం, నవనవోన్మేషమైన కొత్త దేహాన్ని ఏర్పాటు చెయ్యడం కోసం, పాతదేహానికి స్వస్తి చెప్పి మరణాన్ని ఏర్పాటు చేస్తాడు. అవసరనిమిత్తం దేహానికి కలిగే ఈ ఏర్పాటును 'సకాల మృత్యువు' అంటారు. ఇటువంటి మృత్యువు ఆసన్నమైనపుడు కూడా ఏమాత్రం ఆదుర్దా, భీతి లేకుండా దేహాన్ని త్యాగంచెయ్యగలిగే నిస్సంగస్థితిని ఇచ్చి, మృత్యునివారణ చేస్తుంది అమ్మవారు. ఒక్కొక్కపుడు బాహ్యంగా మనకు కారణం తెలియక పోయినా అకాలంగా మృత్యువు సంభవిస్తూ ఉంటుంది. ఇది గూడా సహేతుకమైనది కాకపోతే అకాలమృత్యువు కిందకే వస్తుంది. ఇటువంటి కారణరహిత అకాలమృత్యువులన్నిటిని అమ్మవారు ఆమె భక్తులకు రాకుండా నివారిస్తుంది.

'Loophole of awareness is Death and awareness in the present is life' - అన్నారు జిడ్డు కృష్ణమూర్తిగారు.

**'Forgetfulness is Death'** - అన్నాడు ఇంకో మహానుభావుడు.

సకల మృత్యుభయాలను పోగొట్టునది – అని ఈ నామానికి అర్థం.

## 553. అగ్రగణ్యా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అగ్రగణ్యాయైనమః' అని చెప్పాలి.

అగ్ర = ప్రథమముగా లేదా అందరి కన్నా ముందు ఉన్న స్థితిలో నున్నదానిగా.
గణ్యా = గణింపబడునది లేదా గుర్తింపబడునది.

సర్వసృష్టికి మూలం అమ్మవారు కాబట్టి, అమ్మవారికి ముందు ఎవ్వరూ ఉండటానికి అవకాశం లేదు కాబట్టి – ఈ సృష్టికి ముందు ఉండేది జగజ్జనని అయిన అమ్మవారే ! దేవతలను లెక్కపెట్టేటప్పుడు ప్రప్రథమ స్థానం అమ్మవారిదే ! అందుకని అమ్మవారు 'అగ్రగణ్యా' (అహమస్మి ప్రథమజాఋతాస్య – భృగువల్లి – తైత్తిరీయం)

సుషుమ్నా మార్గం వెంబడి ఉండే షట్చక్రాలకు పైన సహస్రారంలో ఉండే సదాశివునితో కలసి ఉంటుంది కాబట్టి, ఊర్ధ్వంగా ఉండే వెన్నెముక లోని సుషుమ్నా మార్గంలో ఉత్తర దిక్కున లేదా అగ్రమున గల సహస్రారంలోని బిందువునందు ఉండేది కాబట్టి – అమ్మవారు 'అగ్రగణ్యా'.

సూక్ష్మాతి సూక్ష్మలోకాలకు ఇంకా పైన ఉండే కారణ లోకాల నుండి అన్ని రకాలలోకాలను సృష్టిస్తుంది కాబట్టి – అమ్మవారు 'అగ్రగణ్యా'. జీవనానికి నాంది అయిన శ్వాస యొక్క రూపంలో జీవులలో చరిస్తూ ఉంటుంది కాబట్టి 'అగ్రగణ్యా.'

1)) సర్వసృష్టికి మూలమైనది, ప్రప్రథమంగా ఉండేది.

2) దేవతలందరిలో ముందుగా గణింపబడేది.

3) సూక్ష్మాతి సూక్ష్మలోకాలకు పైన ఉండే కారణ లోకవాసిని.

4) జీవనానికి నాంది అయిన శ్వాసరూపవాసిని.

5) చిత్తం పని చెయ్యడం ప్రారంభిస్తే మొట్టమొదటగా వ్యక్తమయే చిద్రూపిణి – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 554. అచింత్యరూపా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అచింత్యరూపాయైనమః' అని చెప్పాలి.

అచింత్య = చింతించుటకు వీలులేని, రూపా = రూపముగలది.

చింతన చేసి చూడగలిగిన, అర్థం చేసుకోగలిగిన రూపం కాదు అమ్మవారిది. చింతన చెయ్యడం ప్రారంభిస్తే చింతించేవాడు, చింతన చెయ్యబడేది రెండూ వేరుగా ఉంటాయి. ఇద్దరూ కలిసి ఉన్న తత్త్వం అమ్మవారిది కాని వేరుగా ఉండే తత్వం గాదు. (ధ్యాన, ధ్యాతృ, ధ్యేయ రూపా) అందుకని అమ్మవారి తత్త్వం, పూర్తిగా అవగాహన కాదు. చింతన చెయ్యడం ప్రారంభిస్తే, నిర్వచించడానికి ప్రయత్నిస్తే దక్కేది కాదు అమ్మవారు (నాయమాత్మాప్రవచనేనలభ్యః) (ఏదైనా ఒక వస్తువును కోరినప్పుడు కూడా ఇంతే... కోరేవాడికి కోరబడేదానికి మధ్యదూరము పెరుగుతుంది.) అందుకే, చింతన ఆగినపుడు అమ్మవారు ఉండటం ప్రారంభమవుతుంది. అంటే - స్వంతం చేసుకుందామనే మనస్తత్వంతో (Possessive instinct) పట్టడానికి ప్రయత్నం చేస్తే దక్కేది కాదు అమ్మవారు.

'చింతన ద్వారా తెలుసుకొనుటకు అలవికానిది' - అని ఈ నామానికి అర్థం.

## 555. కలికల్మషనాశినీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కలికల్మషనాశిన్యైనమః' అని చెప్పాలి.

కలి = కలియుగ సంబంధమైన, కల్మష= మలినములను, నాశినీ = పోగొట్టునది.

ఒకరు కాక ఇద్దరు ఉంటే - ఆ ఇద్దరి మధ్య ఏం తేడా ఉందో తెలుసుకోడానికి ప్రయత్నించడం అన్నది కలియుగ లక్షణం. దాన్నే 'కలికల్మషం' లేదా 'కలియుగమలినం' అంటారు. అమ్మవారు ఇటువంటి కలికల్మషాన్ని నాశం చేస్తుంది. ఈ కల్మషం నివారణ కాకపోతే మదం (పొగరు), ద్వేషం మొదలైనవి మనలో ఉత్పన్నమౌతాయి. (ఉదా: 'గోడమీద నుంచుని ఉన్నపుడు ఎవరైనా పడతావ్ జాగ్రత్త !' అంటే - గోడమీద నుండి పడక పూర్వం - అలా అన్నవారిని - 'శకునిపక్షీ ! అట్టేవాక్కు' అంటాం. ఇది మన 'పొగరు'ను సూచిస్తుంది. తీరా హడావిడిలో గోడమీద నుండి పడితే - 'గుడ్లగూబలా అననే అన్నాడు పడనే పడ్డాను' అంటాం. ఇది మనలో వారిపై 'ద్వేషాన్ని' సూచిస్తుంది.)

'కలి' అంటే 'మాయ' అని అర్థం చెప్పుకుంటే - 'మాయాసంబంధమైన అజ్ఞానాంధకారాన్ని పోగొట్టే జ్ఞాన ప్రకాశిక' - అని అర్థం చెప్పుకోవచ్చును.

'కలియుగ మలినములను పోగొట్టునది'

'మాయను తొలగించు జ్ఞాన స్వరూపిణి' -- అని ఈ నామానికి అర్థాలు.

## 556. కాత్యాయనీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కాత్యాయన్యై నమః' అని చెప్పాలి.

కాత్యాయనీ = కాత్యాయనీ దేవి.

అమ్మవారు 'కతుడ'నే మునిపుంగవుని ఆశ్రమంలో పుట్టి పెరిగిందనే ఒక కథ ఉంది. ఈ కారణం వలన అమ్మవారిని 'కాత్యాయనీ' అన్నారు. భండాసురాది అజ్ఞాన భావాలను సంస్కరించి పరిష్కరించడం కోసం సకల దేవతా సమష్టి రూపంగా చిదగ్ని కుండంలోంచి ఆవిర్భవించిన అమ్మవారిని 'కాత్యాయనీ' అని కూడా అంటారు. అమితమైన తేజస్స్వరూపిణి అయిన అమ్మవారు 'కాత్యాయనీ' అని పిలువబడుతుంది.

1) కతుని ఆశ్రమంలో పుట్టి పెరిగినది.

2) అమితమైన తేజస్స్వరూపిణి

3) సకలదేవతా సమష్టిరూపము - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 557. కాలహంత్రీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కాలహంత్ర్యై నమః' అని చెప్పాలి.

కాల = కాలమును, హంత్రీ = హరించునది.

మనుష్యుల మధ్య జరిగే సంభాషణాదులలో వాగ్దేవిగా ఉండి, సంభాషించే వారికి గుర్తు రాకుండా కాలాన్ని హరించేది కాబట్టి 'కాలహంత్రీ' అని ఒక అర్థం.

'కాలం' అంటే 'మృత్యువు' అని అర్థం చెప్పుకుంటే – మృత్యువును కూడా హరించేది, అంటే – 'మృత్యువుకు మృత్యువు' లాంటిది అని అర్థం. మహా ప్రళయంలో సమస్తమూ కాలవశము అయిపోయినా, అమ్మవారు మాత్రం సాక్షీభూతురాలుగా మిగిలే ఉంటుంది. అంటే, ప్రళయమనే మృత్యువుకు ఎదురు నిలబడి తనపై ఆ మృత్యువు ఆటలు సాగనీయక – ఆ మృత్యువుకు కూడా పైన ఉండేది కాబట్టి – అమ్మవారు 'కాలహంత్రీ'. ఈ భావన ఇంకా బాగా అర్థం కావాలంటే 'స్వప్నాన్ని' ఉదాహరణ గా చెప్పుకోవాలి.

సృష్టికర్త సృష్టి ఎలా చేస్తున్నాడో తెలుసుకునేందుకు ఉదాహరణగా 'స్వప్నం' బాగా ఉపకరిస్తుంది. కలలో పాత్రలు సన్నివేశాలు – అన్నీ కలలు కనే వానితోనే చెయ్యబడతాయి. అలాగే – సృష్టికర్తతోనే సృష్టిలోనివన్నీ తయారవుతాయి. స్వప్నం పూర్తవగానే మెలకువ వస్తుంది. అప్పుడు స్వప్నంలోనివన్నీ కలలు కనే వానిలోకి లీనమై, తానొక్కడు మిగులుతాడు. స్వప్నకాల మంతా కలలు కనే వానిలోకి ఎలా లీనమౌతుందో, అలాగే – సృష్టికాలమంతా సృష్టికర్త్రి అయిన అమ్మవారిలోకి లీనమై తాను మాత్రం మిగిలి ఉంటుంది. ఇలా తనలోకి లీనమైన కాలం కల అమ్మవారిని 'కాలహంత్రీ' అంటారు.

'కాలమును హరించునది' లేదా – కాలమును హననము చేయునది' అని ఈ నామానికి అర్థం.

## 558. కమలాక్షనిషేవితా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కమలాక్షనిషేవితాయై నమః' అని చెప్పాలి.

కమలాక్ష = విష్ణుమూర్తిచే, ని + సేవితా = నిషేవితా = నిశ్శేషంగా సేవింపబడునది.

కమలాక్షుడంటే విష్ణుమూర్తి (కమలాక్షునర్చించు కరములు కరములు – భాగవతం – పోతన) విష్ణుమూర్తి చేత అమ్మవారు అర్చింపబడిందని ఆదిశంకరులు కూడా సౌందర్యలహరిలోని 'శివశ్శక్త్యాయుక్తో.... హరిహరవిరించ్యాదిభిరపి' – అన్న మొదటి శ్లోకంలోనే చెబుతారు. అంతేకాదు – 'హరిస్త్వామారాధ్య – అన్న 5వ శ్లోకంలోని మొదటి పాదంలోనే మొట్టమొదటగా చెబుతారు.

దేవ దానవులు క్షీరసాగరాన్ని మథించి అమృతాన్ని సాధిస్తారు. సాధించారు కాని ఆ అమృతాన్ని పంచుకోటంలో మళ్ళీ ఇద్దరి మధ్య పోట్లాటలు ప్రారంభమవుతాయి. అప్పుడు విష్ణుమూర్తి జగన్మోహినీ అవతారం ఎత్తుతాడు. ఈ జగన్మోహిని సాక్షాత్తు అమ్మవారే! అమ్మవారి అనుగ్రహానికై అమ్మవారి మంత్రాన్ని జపించి జపించి – విష్ణుమూర్తి అయిన 'హరి' – అమ్మవారైన 'హ్రీం' అయిపోయాడు. జపసిద్ధికి ఇలా అవడం పరాకాష్ఠ ఫలం. ('హరి' – 'ఈం' బీజం జపించి, జపించి 'హ్రీం' అయిపోయాడనే నిగూఢార్థం – **'హరిస్త్వామారాధ్య ప్రణతజన సౌభాగ్యజననీం....', అన్న 5వ శ్లోక పాదంలో నిక్షిప్తమై ఉంది.)**

ఈ లలితా సహస్రనామ స్తోత్రంలోనే 'హరి బ్రహ్మేంద్రసేవితా' – 'బ్రహ్మోపేంద్ర మహేంద్రాది దేవసంస్తుత వైభవా' అనే నామాల్లో గూడా 'హరి', 'ఉపేంద్రుడు' అనే పేర్లతో పిలువబడే విష్ణుమూర్తి అమ్మవారిని సేవించాడనీ, స్తుతించాడనీ చెప్పబడింది.

'కమలాక్షులు' అంటే పద్మముల వంటి కన్నులు గలవారు అని అర్థం. అమ్మవారు సర్వారుణ కాబట్టి పద్మముల వంటి కన్నులు కలవారందరూ నయన వికాసం కోసం అమ్మవారిని సేవిస్తారు. కాబట్టి, కమలాక్షులచే సేవింపబడునది – అని ఇంకో అర్థం కూడా చెప్పుకోవచ్చును.

'కమలం' అంటే 'పద్మం' 'అక్షం' అంటే 'ఇరుసు'. లేదా – మధ్యగా ఉండే రేఖ (Axis) వెన్నెముక వెంబడి ఉండే మూలాధారాది షట్పద్మాల నిలువు వరుసలో మధ్యగా 'అక్షం' లాగా ఉండేదే సుషుమ్నా మార్గం. 'షట్కమలాక్షమైన సుషుమ్నా మార్గం ద్వారా నిశ్శేషంగా సేవింపబడేది' – అని ఇంకో అర్థం కూడా చెప్పుకోవచ్చును. కమల = పద్మములనెడి, అక్ష = చిహ్నములచే, అనగా – మూలాధారాది షట్పద్మ సంకేతాలతో, నిషేవితా = నిశ్శేషంగా సేవింపబడునది' అని కూడా అర్థం చెప్పుకోవచ్చును.

కమల = స్థితి ప్రకృతి (లక్ష్మి) యొక్క, అక్ష = లక్ష్మములు అనగా, చిహ్నములైన నామరూపముల ద్వారా, (అనగా జీవుల రూపంలో) నిషేవితా = నిశ్శేషంగా సేవింపబడునది.

1) విష్ణుమూర్తిచే నిశ్శేషంగా సేవింపబడునది.

2) కమల నయనములు కలవారిచే సేవింపబడునది.

3) మూలాధారాది షట్కమలాల ఇరుసు (Axis) ను సూచించే సుషుమ్నా మార్గం ద్వారా ఉపాసింపబడునది.

4) మూలాధారాది షట్పద్మ చిహ్నాలతో ఉపాసింపబడునది.

5) స్థితి ప్రకృతికి చిహ్నాలైన నామరూపాలతో ఉండే జీవుల ద్వారా సేవింపబడునది - అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 559. తాంబూల పూరితముఖీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'తాంబూలముచే, పూరిత = నిండియున్న, ముఖీ = నోరుగలది.

ఈ 'తాంబూల పూరితముఖీ' నామం నుండి 'నిఖిలేశ్వరీ' నామం వరకు - ధ్యానంలో భావన చేసుకునేందుకు అమ్మవారి మరి కొన్ని లక్షణాలను మళ్ళీ చెప్పడం జరుగుతుంది.

(ఈ ప్రస్తుత నామ వివరణ ఇంతకు పూర్వమే 'కర్పూర వీటికా మోదసమాకర్షద్దిగంతరా' అనే 26వ నామంలో చాలా భాగం చెప్పబడింది. కాబట్టి పాఠకులు ఆనామ వివరణ మళ్ళీ ఒకసారి చదవండి)

తాంబూల చర్వణం - కేవలం 'పెదవులు ఎట్టిగా ఉన్నాయి. చూడండి' - అని చెప్పడం కోసం వేసే కృత్రిమ రసాయనపు పూతలు, అంటే - పెదవుల రంగు(Lipstick) లాంటిది కాదు. పెదవుల రంగువల్ల పెదవుల చర్మం దెబ్బ తినే అవకాశం కూడా ఉంది కాని, తాంబూల చర్వణం వలన ఈ క్రింది తెలిపిన ఎన్నో లాభాలున్నాయి.

1) జీర్ణశక్తి పెరుగుతుంది.

2) సున్నం ఘాటుకి సూక్ష్మ జీవులకు కారకమయే మలిన దుర్గంధాలు నశిస్తాయి.

3) చుట్టు ప్రక్కలకు చక్కని పరిమళం వెదజల్లబడి - వ్యక్తులకు, పరిసరాలకు ఆహ్లాదాన్ని చేకూరుస్తుంది.

4) దంతాలకు, చిగుళ్ళకు గట్టిదనాన్ని చేకూరుస్తుంది.

5) అనురాగ సంకేతమైన అరుణారుణ కాంతుల్ని ప్రసారం చేస్తుంది.

6) ఆకర్షణను, అందాన్ని చేకూరుస్తుంది.

'తాంబూలము చేత నిండి పండిన ముఖము (నోరు) కలది - అని ఈ నామానికి అర్థం.

## 560. దాడిమీకుసుమప్రభా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'దాడిమీకుసుమ ప్రభాయైనమః' అని చెప్పాలి.

దాడిమీ = దానిమ్మ, కుసుమ = పువ్వు యొక్క, ప్రభా = చక్కని అరుణ వర్ణ వికాసం కలది.

ప్రకృతిలోని పుష్పాలకు, స్త్రీలకు చక్కని సమన్వయం, సామ్యము ఉంది. సుకుమార సౌమ్య గుణాలకు, పరిమళానికి, సౌందర్యానికి, మాధుర్యానికి, వంశాభివృద్ధికి, ఆరాధనకు, అర్చనకు, అనురాగానికి, వికాసానికి ఇలా ఎన్నో గుణాల్లో పుష్పాలకు స్త్రీలకు సామ్యం ఉంది. అయితే, మళ్ళీ ఒక్కొక్క పుష్పానికి ఒక్కొక్క ప్రత్యేకత ఉంది. దాడిమీ పుష్పం చాలా రమణీయంగా, అరుణారుణ వర్ణంతో శోభాయమానంగా ఉంటుంది. సర్వారుణ అయిన అమ్మవారి తేజః ప్రభ, - నూటికి నూరుపాళ్ళు దానిమ్మ పువ్వు ప్రభ - ఒకే రకంగా ఉంటాయి. ఈ పువ్వు ఇచ్చే పళ్ళునిండుగా, దృఢంగా ఉండి వాటిలోని బీజాలు ( గింజలు) చక్కని ఆరోగ్యాన్ని, పళ్ళ(Teeth) చిగుళ్ళకు గట్టిదనాన్ని, శోభను చేకూరుస్తాయి.

ఇంతకు పూర్వం చెప్పిన 'తాంబూల పూరిత ముఖీ' నామానికి ఈ నామం అనుబంధంగా ఉండి ఈ రెండు నామాలు అమ్మవారి అరుణారుణ ప్రభకు పరి

పూర్ణవికాసాన్ని దోహదపరుస్తాయి.

'దానిమ్మపువ్వు ప్రభతో విరాజిల్లునది' – అని ఈ నామానికి అర్థం.

## 561. మృగాక్షీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మృగాక్ష్యై నమః' అని చెప్పాలి.

మృగ = లేడి, అక్షి = కన్నుల వంటి కన్నులు కలది.

'మృగము' అంటే జంతువు అనే అర్థమే కాకుండా ప్రత్యేకంగా 'లేడి' అనే అర్థం కూడా ఉంది. లేడి కన్నులు చైతన్య వంతంగాను (Everactive, alert, and attentive) విశాలంగాను, అందంగాను, ఆకర్షణీయంగాను, అమాయకంగాను (ముగ్ధత్వం) ఒక విధమైన జాగృతీ లక్షణంతోను ఉంటాయి. ఈ లక్షణాలన్నీ అమ్మవారి కళ్ళకు ఉంటాయి.

'మృగం' అంటే 'వెదకుట' అనే అర్థం కూడా ఉంది. 'అక్షి' అంటే కన్ను కాబట్టి 'మృగాక్షీ' అంటే వెతుకుతూ ఉండే కన్నులు కలది – అని అర్థం. ఈ వెదకటానికి ఎన్నో అర్థాలు చెప్పుకోవచ్చును. 1) ఆపదలో ఉన్న తన బిడ్డలైన జీవులను కాపాడటం కోసం వెదికే కళ్ళు అవచ్చు. 2) తనను పూర్తిగా నమ్మి శరణాగతులై ఆరాధించే భక్తుల్ని వెదికే కళ్ళు.కావచ్చు. 3) శిష్టులైనవారిని ఇబ్బంది పెట్టే దుష్టులను వెదికే కళ్ళు కావచ్చు. 4) యావత్ సృష్టిలోను సూక్ష్మాతి సూక్ష్మంగా అంతర్లీనంగా ఉండే సర్వాంతర్యామి అయిన ఈశ్వరుణ్ణి వెదికే కళ్ళుకావచ్చు.

జ్యోతిశ్శాస్త్రంలో మకరరాశికి 'మృగం' సంకేతం. మృగంతో సూచింపబడే మకరరాశిని అక్షులుగా అంటే 'కన్నులు' గా గలది అని – 'మృగాక్షీ' సమాసానికి అర్థం చెప్పుకోవచ్చు. మకరరాశి కన్నులను సూచించాలంటే ఆ రాశి ద్వితీయభావం అవాలి, అంటే – ధనుస్సు లగ్నం అవాలి. కుండలినీ యోగానికి ప్రారంభ చక్రమైన మూలాధారానికి సంబంధించిన 'మూలా' నక్షత్రంతోనే ధనూరాశి ప్రారంభమవుతుంది. ఈ రాశిని లగ్నముగా కలిగినది అమ్మవారు. ఈ ధనూరాశి శుభాన్ని, పూర్వ పుణ్యాన్ని, ఉపదేశాన్ని,

మోక్షాన్ని, దూర ప్రయాణాన్ని, జన్మ కారక జనక లక్షణాన్ని గూడా సూచిస్తుంది. ఈ లక్షణాలన్నీ అమ్మవారికున్నాయి.

'మృగ' పదం 'మార్గా'న్ని కూడా సూచిస్తుంది. (కృతి – 'కీర్తన' అయినట్లు, స్మృతి – 'స్మార్త' అయినట్లు అన్నమాట!) మృగాక్షీ అంటే 'మార్గాన్ని సూచించే కన్నులు కలది' అని అర్థం వస్తుంది కాబట్టి – జీవితంలో ఆచరించవలసిన పద్ధతులను, మార్గాలను, ధ్యేయాలను, (ధ్యేయానికి ఎక్కు పెట్టబడిన బాణంతో ధనూరాశి సూచింపబడుతుందని కూడా ఇక్కడ గుర్తు తెచ్చుకోవాలి) సూచించే కన్నులు కలది అమ్మవారు. అంటే అమ్మవారు అందరికీ మార్గనిర్దేశకురాలన్నమాట!

1) ఆడలేడి కన్నులకు ఉండే లక్షణాలుకల కళ్ళు గలది.

2) శిష్టులను రక్షించడానికి, దుష్టులను శిక్షించడానికి, సృష్టిలోని సర్వాంతర్యామిని వెదుకుచుండు కళ్ళు కలది.

3) పూర్వ పుణ్య శుభలక్షణాలను సూచించే ధనూరాశిని లగ్నముగా గలిగినది.

4) సృష్టిలోని జీవులకు జీవిత ధ్యేయాలను సూచించే కన్నులు గల మార్గదేశికురాలు – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 562. మోహినీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మోహిన్యైనమః' అని చెప్పాలి.

మోహినీ = మోహమును కలిగించునది.

'మోహం' అంటే 'భ్రమ' (Glamour). జరగవలసిన సృష్టి కార్యానికి ఊరికే సహకరించమంటే జీవులు సహకరించరు. తమకేదైనా ప్రతిఫలం దక్కితే గాని సృష్టికార్యానికి జీవులు సహకరించరని దేవునికి తెలుసు. అందువల్ల 'కామపరితృప్తి' (Sex)ని ఎఱవేసి (అంటే పణంగా పెట్టి) జీవుల చేత తన సృష్టి కార్యాన్ని జరుపుకుంటున్నపుడు, సృష్టి కార్యనిర్వహణలో కలిగే 'కామపరితృప్తి'నే 'మోహము'

(Glamour) అనవచ్చును. అలాగే, ఆకలికి – రుచి మోహం అవుతుంది. అంటే, ఏ పనిని మన చేత చేయించుకోవాలన్నా లంచంగా, లేదా – ఎఱగా ఏదో పెట్టినట్లు అనిపింప చెయ్యడాన్ని 'మోహపెట్టడం' అనవచ్చును. ఇలా 'మోహపెట్టి' తన పని చేయించుకొనేది కాబట్టి అమ్మవారు 'మోహిని'.

గడ్డి యొక్క రసాయన శాస్త్రం(Chemistry) తెలిస్తే గొడ్డు దానిని తినకపోవచ్చు. అందుకని ఆ గడ్డిని చూడంగానే నచ్చి, తినెయ్యాలన్న ఆకర్షణ గడ్డిలో గొడ్డుకు కనబడేలా చేస్తుంది అమ్మవారు. తవుడు, కుడితి కూడా అలాంటివే ! మనం వాటిని తినమన్నా తినం, త్రాగమన్నా త్రాగం. మనం తినాల్సిన వాటి మీదే మనకు మోహం కలుగ చేస్తుంది. ఈ 'మోహం' అవధులు దాటితే 'వ్యామోహాని'కి దారితీస్తుంది. అప్పుడు – తినవలసినవి మితిమీరి తినడం, త్రాగవలసినవి మితిమీరి త్రాగడం, అవకరమైన రుచులతో వాటిని రకరకాలుగా భ్రష్టు పట్టించడం చేస్తాము. అవధులు దాటి అలా ప్రవర్తించడం వల్ల మన ఆరోగ్యాన్ని మనమే పాడుచేసుకుంటాము.

'కమలాక్షనిషేవితా' నామంలో చెప్పినట్లు – అమృతాన్ని దేవదానవులకు పంచడానికి విష్ణుమూర్తి జగన్మోహినీ రూపాన్ని దాల్చాడు గదా! ఆ రూపం దానవులను విపరీతమైన మోహంలో పడేసింది. తత్ఫలితంగా అమృతం అమరుల పాలైంది.

'మోహనం' అంటే – ఏదో మనకు దక్కుతుందని మనలను భ్రమ పెట్టడం కాబట్టి – మోహనం అంటే 'మాయ' అని కూడా చెప్పుకోవచ్చును. కాబట్టి, ఈ మోహనానికి బీజాక్షరం మాయా బీజం అయిన 'హ్రీం' అవుతుంది. ఈ హ్రీంలో 'హ' కార, 'ర' కార 'ఈం' కారాలుంటాయి. ఇవి వరుసగా నిశ్వాసాన్ని, నాదాన్ని, శక్తిని సూచిస్తాయి.

ప్రకృతిలో ఉండే శోభ, వైభవము – ఉత్తేజ, ఉత్సాహాలను కలుగచేస్తే, మోహ, వ్యామోహాలు – ఉద్వేగ, ఉద్రేకాలను కలుగ చేస్తాయి. ఈశ్వరుడు జగత్తంతా నిండి ఉన్నప్పటికీ (ఈశావాస్య మిదం సర్వం – ఈశావాస్యోపనిషత్తు) ఆ ఈశ్వరుడు కనబడకుండా పంచభూతాలే కనబడేట్లు చెయ్యడం కూడా అమ్మవారి 'మోహనప్రక్రియ' క్రిందకే వస్తుంది.

'మోహనమును కలుగచేయునది' – అని ఈ నామానికి అర్థం.

## 563. ముఖ్యా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ముఖ్యాయైనమః' అని చెప్పాలి.

ముఖ్యా = ముఖ్యమైనది. (ముఖ సంబంధమైన వాగ్దేవి)

'అగ్రగణ్యా' నామం ఎలాంటిదో ఈ నామం కూడా అలాంటి అర్థం గల నామమే!

ముఖ్యంగా – ముఖము నుండి పనిచేస్తుంది కాబట్టి అమ్మవారు – 'ముఖ్య'. ప్రధానంగా అమ్మవారు వాగ్దేవి. వాక్ప్రపంచానికి ఎలా ప్రథమురాలో, ముఖ్యమో, – భౌతిక ప్రపంచానికి కూడా అలాగే ముఖ్యమైనది. భౌతికలోకానికి(Physical World) ముందు వెలుగు లోకం(Plane of light), దానికి ముందు నాదలోకం(Plane of sound) ఉంటాయి. నాదంలోంచి యావత్ప్రపంచం ఉద్భవించింది కాబట్టి, ఆ నాదం ముఖం నుండి వ్యక్తమయేది కాబట్టి, అమ్మవారు వాగ్దేవత కాబట్టి – అమ్మవారికి 'ముఖ్యా' అనే నామం బిరుదు నామంగా వచ్చింది.

1. ముఖ్యురాలు.

2) ముఖ సంబంధమైనది (వాగ్దేవి) – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 564. మృడానీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మృడాన్యైనమః' అని చెప్పాలి.

'మృడు' డంటే శివుడని అర్థం. ద్వితీయభాగంలో వచ్చిన 211వ నామం అయిన 'మృడప్రియా' నామ వివరణ ఇక్కడ మళ్ళీ చదువుకోవచ్చును. మృత్యువుకు పైన ఎరుగున్నవాడు కాబట్టి శివుణ్ణి 'మృడు' డన్నారు. భౌతిక ప్రపంచం అంతా తనలోకి లీనమై పోయి దానికి అతీతంగా, సాక్షీభూతుడుగా పైన ఉన్నవాడు కాబట్టి సదాశివుణ్ణి 'మృడు' డంటారు. ఈ మృడుని ఇల్లాలు కాబట్టి అమ్మవారిని 'మృడానీ' అన్నారు.

'మృడుని పత్ని' – అని ఈ నామానికి అర్థం.

## 565. మిత్రరూపిణీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మిత్రరూపిణ్యై నమః' అని చెప్పాలి.

మిత్ర = మిత్రుని, రూపిణీ = రూపముగా ఉండునది.

తూర్పున ఉదయిస్తూ ఉండే సూర్యుణ్ణి మిత్రుడంటారు. 'మితి' అంటే 'కొలత' అని అర్థం. కొలతకు సంబంధించిన 'మీటర్' (Meter) అనే ఆంగ్లపదం కూడా 'మిత్ర' పదం నుండే వచ్చి ఉండాలి. 'మిత్రుడు' మన లోని 'కొలతకు సంబంధించిన ప్రజ్ఞ' (Consciousness of Measures). సాధారణంగా సూర్యోదయంతోనే ప్రతిరోజూ కాలాన్ని లెక్కించడం ప్రారంభిస్తాము. తర్వాత అన్ని కార్యక్రమాలు, సన్నివేశాలు, సంఘటనలు, ఈ కాలాన్ని అనుసరించి జరుగుతాయి. అందుకే – ఉదయ సూర్యుణ్ణి 'మిత్రు' డన్నారు. అమ్మవారు 'భానుమండల మధ్యస్థా', 'ఉద్యద్భానుసహస్రాభా' (ఒకేసారి ఒకే సమయంలో ఉదయిస్తున్న వెయ్యి సూర్యుల కాంతికి సమానమైన కాంతితో విరాజిల్లునది) కాబట్టి అమ్మవారిని 'మిత్రరూపిణి' అనడం సమంజసమే!

మనకు సహాయపడేవారిని, మేలుకోరే వారిని, 'ఉపకారులనీ, 'శ్రేయోభిలాషుల'నీ అంటాము. ఈ రెండూ చెయ్యడమే కాక మన మనస్సులో మనస్సు కలిసి, మనకు సన్నిహితులుగా ఉండి, మసలే వారిని 'స్నేహితు' లంటాము. స్నేహితులనే 'మిత్రు' లని కూడా అంటారు. మన జీవితంలో ఇలా మనకు తారసపడే వారి మిత్రుల రూపంలో – అమ్మవారు మనలను ఒక కంట కనిపెడుతూ, తప్పుగా పోతుంటే సరిదిద్దుతూ, కాపాడుతూ, ఆదుకుంటూ కష్టసుఖాలను ఆనందాన్ని పంచుకుంటూ ఉంటుంది కాబట్టి అమ్మవారు 'మిత్రరూపిణి' ఔతుంది. అంటే – మేలు కోరేవాడిలో మేలు కోరేది అమ్మవారు అన్నమాట.

సర్వ లోకాలకు తన వెలుగుల శక్తిని వెదజల్లి జీవన కారకుడయే వాడు కాబట్టి సూర్యుణ్ణి 'లోక బాంధవుడని' కూడా అంటారు. సూర్యునికి ఈ వెలుగుల శక్తినిచ్చేది అమ్మవారి కుడికంటి కనికరమే కాబట్టి (అమ్మవారికుడి కన్ను సూర్యుడు) అమ్మవారే ఆ 'మిత్రరూపిణి'.

1) మిత్రుడనిపిలవబడే ఉదయ సూర్యుని రూపముగా ఉన్నది.

2) ఉదయసూర్యునివలె అరుణ కాంతులు విరజిమ్మే రూపము గలది.

3) మిత్రులుగా జీవులతో సాన్నిహిత్య రూపము గలది.

4) సర్వలోక బాంధవుని తన (కంటి) రూపముగా గలది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 566. నిత్యతృప్తా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'నిత్యతృప్తాయై నమః' అని చెప్పాలి.

నిత్య = ఎల్లపుడు, తృప్తా = సంతుష్టిని కలిగియుండునది.

ఏ ఒక్కటీ లేకపోతే ఎన్ని ఉన్నా జీవి సుఖంగా, ఆనందంగా ఉండలేడో – దాన్ని 'తృప్తి' అనవచ్చును. ఎన్నో వంటకాలతో మృష్టాన్న భోజనం చేసినా – ఇంకా ఏదో ఉంటే బావుంటుందనుకునే అసంతృప్తి పరుడికి ఆనందంగా ఉండే అవకాశం లేదు. ఎన్ని ఉన్నా, ఎంత చేసినా సుఖం లేవదు. ఏమీ లేకపోయినా పచ్చడి మెతుకులు తృప్తిగా తినేవాడికి ఆ ఆనందం దక్కుతుంది. ఇచ్చిన దాన్ని, వచ్చిన దాన్ని, ఉన్నదాన్ని స్వీకరించేవాడికి ఆనందం ఉంటుంది. వాటికి పడిన తృప్తిని బట్టి వాడికి ఆ ఆనందం వస్తుంది. అందుకే భగవద్గీతలో 'యదృచ్ఛాలాభసంతుష్టో' – అన్నాడు గీతచార్యుడు. ఇటువంటి తృప్తితో ఎల్లవేళలా ఉండేది అమ్మవారు. ప్రపంచంలో ఏం జరిగినా, ఎలా జరిగినా తృప్తిగానే ఉంటుంది. సాధకులైన వారు కూడా ఈ గుణం అలవరచుకోవాలి. త్రికరణ శుద్ధితో ప్రయత్నం చేసి తత్ఫలితంగా వచ్చిన ప్రతిఫలాన్ని తృప్తిగా స్వీకరించాలి – అని ఈ నామం సూచిస్తుంది.

నిత్యమూ ఎక్కడో అక్కడ ఎవరో ఒకరు ఏదో విధంగా అమ్మవారిని ఆరాధిస్తూనే ఉంటారు, అర్చిస్తూనే ఉంటారు, అర్పిస్తూనే ఉంటారు. కాబట్టి ఆవిడ 'నిత్యతృప్తా' (వేంకటేశ్వరస్వామినిత్య పెళ్లికొడుకన్నట్లు)

'నిత్యసంతుష్టి స్వభావము కలది' – అని ఈ నామానికి అర్థం.

## 567. భక్తనిధిః

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'భక్తనిధయే నమః' అని చెప్పాలి.

భక్త = భక్తులకు, నిధి = పెన్నిధి, లేదా గని, లేదా - ఆశ్రయ స్థానం.

ఎన్నటికీ తరగని, మార్పుచెందని, నశించని దాన్ని 'నిధి' అంటారు.

భక్తులకు ఎన్నో రకాల ఆశలు, ఆశయాలు, అవసరాలు, ఆదర్శాలు, కోర్కెలు ధ్యేయాలు ఉంటాయి. వాటన్నిటినీ భక్తులకు అమ్మవారు తీరుగా, తీర్చగల సకలైశ్వర్య నిధి. అందుకని - అమ్మవారు వారి పట్ల 'నిధి' అని చెప్పుకోవాలి.

భక్తులకు నిధి వంటిది - అని ఈ నామానికి అర్థం చెప్పుకోవచ్చు.

## 568. నియంత్రీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'నియంత్ర్యై నమః' అని చెప్పాలి.

నియంత్రీ = నియమించునది.

'నియంతా' అనే పుంలింగ శబ్దానికి 'నియంత్రీ' అనేది స్త్రీ లింగ శబ్దమౌతుంది. 'యంతా' అంటే 'యమించువాడు' అని, 'నియంతా' అంటే నియమించువాడు అనే అర్థాలు. 'యంత్రా' అన్నా, 'నియంతా ' అన్నా ఆంగ్లంలో Controller or Regulator అని అర్థాలుగా చెప్పుకోవాలి గాని Director (దర్శకుడు) అని చెప్పుకోకూడదు. 'నియంత్రణ' అంటే'Steering' అని కూడా ఆంగ్లంలో అర్థం చెప్పుకోవచ్చును. అన్నిటినీ నియమించే అధికారం కేవలం ఉన్నతోన్నత స్థితిలో ఉన్న అధికారికే ఉంటుంది. గ్రహతారక లోకాలలో ఉండే సమస్త విశ్వానికి అధి నాయకురాలు, అధిష్ఠాత్రి కాబట్టి - అమ్మవారు అన్నిటినీ నియంత్రణ చెయ్యగలదు. ఏది అవకూడదో అలా అవకుండా ఉండేట్లుగాను, ఎలా ఉండాలో అలా ఉండే విధంగాను నియంత్రణ చేస్తుంది అమ్మవారు. నైపుణ్యంతో

చేసే ఈ నియంత్రణ వల్లనే గ్రహతారకాదు లేవీ వాటి నిత్య గమనాలలో మార్పులు రాకుండా, సృష్ట్యాది నుండి ఇప్పటి వరకు తిరుగుతున్నాయి. మరి ఎప్పటికైనా తిరుగుతాయి కూడా ! పదార్థ ధర్మాలు, లక్షణాలు మారడం లేదు. తత్ఫలితంగా జగత్తు ఎలా ఉండాలో అలా ఉండి, ఎలా ఉండకూడదూ అలా ఉండకుండా ఉంటుంది.

(సర్వమును) నియమించునది – అని ఈ నామానికి అర్థం.

## 569. నిఖిలేశ్వరీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'నిఖిలేశ్వర్యై నమః' అని చెప్పాలి.

నిఖిల = సమస్తమునకు, ఈశ్వరీ = అధినాయకురాలు.

'నిఖిలము' అంటే 'సమస్తము' అనే అర్థం కాబట్టి 'నిఖిలేశ్వరి' అంటే 'సమస్తానికి అధికారిణి' అనే అర్థం చెప్పుకోవాలి. ఇంతకు పూర్వం నామం 'నియంత్రణ' అయితే ఈ నామం 'నిఖిలేశ్వరీ'. ఈ రెండు నామాలు ఒక దానితో ఒకటి సంబంధం కలిగినవే ! 'నిఖిలేశ్వరి' అయితే గాని 'నియంత్రీ ' కాలేదు. అమ్మవారు యావత్సృష్టి స్వరూపిణి అయినపుడు 'నిఖిలేశ్వరి' ఎందుక్కాదు !

'సమస్తమునకు ఈశ్వరి' – అని ఈ నామానికి అర్థం.

## 570. మైత్ర్యాదివాసనాలభ్యా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మైత్ర్యాది వాసనాలభ్యాయై నమః' అని చెప్పాలి.

మైత్రి = స్నేహము, ఆది = మొదలైన, వాసనా = సంస్కార బీజముల ద్వారా, లభ్యా = పొందబడునది.

మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష, అనే సంస్కార బీజాలకు – మైత్రాది వాసనా చతుష్టయం అంటారు. వీటిని గురించే భగవద్గీతలో గీతాచార్యుడు – 'అద్వేష్టా సర్వ

భూతానాం మైత్రః కరుణ ఏవచ' అన్నాడు. ('సర్వజీవులయందు ద్వేషం లేకుండా ఉండి, ఈ మైత్రాది వాసనా చతుష్టయం యోగసాధకునికి ఉండాలి' అని దీని అర్థం)

సఖ్యభావం – 'మైత్రిని'; దయాదాక్షిణ్య స్వభావం – 'కరుణ'ను; పుణ్య పురుష సాంగత్యం – 'ముదిత' లక్షణాన్ని; దుష్టుల పట్ల ఉదాసీన వైఖరిని – 'ఉపేక్ష'ను సూచిస్తాయి. ఇదే విషయం యోగ సూత్రాల్లో కూడా చెప్పబడింది. అమ్మవారు కూడా వాసనా చతుష్టయము గల వారికే సులభంగా ప్రసన్నురాలవుతుంది.

ఈ మైత్ర్యాది నాలుగు గుణాలను వాసనలంటారు. వాసనలంటే మనతో కలిసి పోయి ఉండేవి గాని – అంటినవి కాదు. మనస్సులో వీటిని గురించిన వివరాలు విడిగా ఉంటే అవి అంటినవిగా ఉన్నట్లు లెక్కగాని వాసనలుగా ఉన్నట్లు లెక్కకాదు. మనస్సులో కలసిపోయి ఉంటేనే – అవి వాసనలవుతాయి.

ఉదా: మంచుగడ్డమీద సిరాపడితే మంచుకు సిరా అంటి ఉంటుంది. నీళ్ళతో కడిగేస్తే – ఆ సిరా రంగు మంచుగ డ్డ నుండి వేరై పోతుంది. కాని, సిరా నీళ్ళతోనే మంచుగడ్డ తయారయితే – కడిగినా, తుడిచినా – ఆ సిరారంగు మంచుగడ్డ నుండి వేరై పోదు. ఇలా ఉండే లక్షణాన్ని 'వాసనాలక్షణం' అంటారు. పొట్ల తాలుకు లక్షణాలన్నీ సూక్ష్మంగా పొట్ల విత్తనంలో వాసనా రూపంలో ఉంటాయి. అలాగే, ఇతర విత్తనాల్లో వాటి వాటి లక్షణ తత్త్వాలన్నీ వాసనా రూపంలో ఉంటాయి. అలాగే, ప్రతి జీవిలోను ఆయా జీవలక్షణాలు వాసనలుగా ఉంటాయి. ఈ వాసనా సంస్కారాలను గురించే రఘువంశ మహాకావ్యంలో మహాకవికాళిదాసు ప్రథమ సర్గలోని 20వ శ్లోకంలో 'ఫలానుమేయాః ప్రారంభాః సంస్కారాః ప్రాక్తనాఇవ' అన్నాడు. 'ఇచ్చిన ప్రతి ఫలాలను బట్టి వాటి ఉనికిని గుర్తించే విధంగానే మనలో వాసనా సంస్కారాలు ఉంటాయి గాని, అవి బాహ్యంగా ఉన్నట్లు కనబడవు తెలియవు' అని శ్లోకభావం.

ఈ మైత్ర్యాది వాసనా చతుష్టయాన్నే వైష్ణవంలో – 'కళ్యాణ గుణా' లంటారు. శాక్తేయంలో 'ఉత్సాహశక్తు'లనీ, 'సిద్ధుల'నీ అంటారు. 1) ప్రభుశక్తి, మంత్రశక్తి, ఉత్సాహశక్తి – ఈ మూడింటిని శక్తిత్రయం అంటారు. ఈ శక్తులే కాక మళ్ళీ వేరువేరుగా సిద్ధులుంటారు. వీరిలో 1000 మంది సైన్యం అయితే, ముప్పై మూడు మంది సేనా

నాయకుల లాంటి వాళ్ళు ఉంటారు. ఈ 33 సేనానాయకులనే సిద్ధులంటారు. (సాంఖ్యంలో వీళ్ళని 33 కోట్ల దేవతలుగా చెబుతారు) ఈ 33 సిద్ధులలో 'మిత్రుడు' కూడా ఒకడు. మొత్తం మీద వీళ్ళందరూ కలసి 1033 మంది ఉంటారు. (త్రయత్రింశత్సహస్రాణి) 'మిత్రుని' భార్యను 'మైత్రి' అని, 'జైత్రుని' భార్యను 'జైత్రి' అని 'చైత్రుని' భార్యను 'చైత్రి' అని సంకేతిస్తారు. ఇలా ఈ సంకేత నామాలతోనే ఈ వాసనలను అర్థం చేసుకోవాలి. (ఈ విషయాలన్ని కాశ్మీర తంత్రంలో ఇంకా విపులంగా చెప్పబడతాయి)

'మైత్రి మొదలైన వాసనా చతుష్టయము గలవారిచే పొందబడునది' - అని ఈ నామానికి అర్థం.

## 571. మహాప్రళయ సాక్షిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈనామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహా ప్రళయ సాక్షిణ్యై నమః' అని చెప్పాలి.

మహా = గొప్పదైన, ప్రళయ = ప్రళయమునందు, సాక్షిణీ = సాక్షీ భూతురాలుగా ఉండునది.

'లయం' అంటే లీనమవడం అని అర్థం. పంచదార – నీళ్ళలో కరిగి ఉంటే – ఆ స్థితి పంచదారకు – 'లయస్థితి' అవుతుంది. ఆ నీళ్లల్లో పంచదార ఉంటుంది కాని కనబడదు. తన వ్యక్తిత్వాన్ని(Individuality) నీళ్ళలో కోల్పోతుందన్నమాట. దీనిని బట్టి 'లయం' అంటే – మరణించడం లేదా 'వినాశం' కావడం కాదని – లయకారుడంటే 'వినాశకారుడు' కాదని అర్థంఔతుంది. నాశం కాకుండా లీనమై ఉంటాయి కాబట్టి ఈ స్థితిని 'ప్రళయం' అన్నారు. లయం కంటే 'ప్రళయం', ప్రళయం కంటే 'మహాప్రళయం పెద్ద పన్నాలో (Major scale) జరిగే ప్రక్రియలు. ఉదా: ప్రతిరోజూ – మన పేరు, మన వేష భాషలు, చిరునామాలు మొదలైన వన్నీ మన నిద్రలో లీనమై ఉంటాయి. కాబట్టి, నిద్ర మనకు లయం లాటి స్థితి. మరణించినపుడు కూడా – విత్తనంలో చెట్టు లక్షణాలు ఇమిడి ఉన్నట్లు – విషయసారం పంచేంద్రియ జ్ఞానం మనస్సులలో వాసనలుగా జీవిలో

ఇమిడి ఉంటాయి. మరుజన్మ ఎత్తి దేహాన్ని పొందినపుడు అవి తిరిగి ఆ దేహంలో వ్యక్తమై మొలకెత్తుతాయి. కాబట్టి, ఈ మరణం జీవికి 'ప్రళయం' లాంటిదే గాని 'అంతం' కాదు. విశ్వంలోని అన్ని జీవులకు ఈ ప్రళయ స్థితి ఉంటుంది. ఇలా అర్థం చేసుకుంటూ పోతూ చిట్ట చివరకు ఈ మొత్తం బ్రహ్మాండానికి, విశ్వానికి, సృష్టికి సంబంధించిన ప్రళయాన్ని ఊహిస్తే అది 'మహాప్రళయం' అవుతుంది.

వివిధ స్థాయిలలో ఉండే ఈ లయ, ప్రళయ, మహా ప్రళయ స్థితులలో అందరూ, అన్నీ లీనమై పోతున్నా - తాను మాత్రం అన్ని రకాల స్థాయిలలోని ప్రళయ స్థితులలో సాక్షీ భూతురాలుగా ఉంటుంది అమ్మవారు. అందుకని అమ్మవారు 'మహా ప్రళయ సాక్షిణి'.

'మహా ప్రళయ స్థితి యందు సాక్షీ భూతురాలుగా ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 572. పరాశక్తిః

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పరాశక్త్యై నమః' అని చెప్పాలి.

పరాశక్తిః = అన్నిటికీ అతీతమైన శక్తి.

విశ్వంలో (ప్రకృతిలో) ఎన్నో రకాల శక్తులున్నాయి. ఈ శక్తులన్నిటికీ అతీతంగా ఉంటూ, ఈ శక్తులన్నిటికీ నేపథ్యంగా ఉండే శక్తిని 'పరాశక్తి' అంటారు. తీరీయ స్థితిలో మనలో ఈ శక్తి 'పరావాక్కు'గా ఉంటుంది.

గీతాచార్యుడు - 'భూమిరాపోఽనలో వాయుః ఖం మనోబుద్ధి రేవచ, అహంకార ఇతీయం మేభిన్నాః ప్రకృతి రష్టధా' - అంటాడు. నేల, నీళ్ళు, నిప్పు, గాలి, ఆకాశం, మనస్సు, బుద్ధి, అహంకారం వీటిని అష్టప్రకృతులంటారు అని దీని అర్థం. ఈ అష్ట ప్రకృతులే భాగవతంలో శ్రీకృష్ణుని అష్టభార్యలుగా చెప్పబడ్డాయి. ఈ అష్ట ప్రకృతులకు అతీతంగా ఉంటూ వీటికి నేపథ్యంలో ఉండే ప్రకృతిని 'పరాప్రకృతి' అంటారు. ఈ పరాప్రకృతి యొక్క శక్తినే 'పరాశక్తి' అంటారు. ఈ పరాశక్తి భూర్భువస్సువరాది

లోకాలకు కారణలోకమైన 'గోలోకానికి' సంబంధించినది. 'గో' లోకానికి సంబంధించిన ఈ పరాశక్తిని పురాణాల్లో 'రాధ' గా చెబుతారు. మహా ప్రళయంలో సాక్షీభూతురాలుగా ఉండే అమ్మవారిని 'పరాశక్తి' గా అర్థం చేసుకోవాలి.

'అన్ని శక్తులకు అతీతంగా ఉండి, వాటన్నిటికీ నేపథ్యంలో వర్తించే శక్తి' – అని ఈ నామానికి అర్థం.

## 573. పరానిష్ఠా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పరానిష్ఠాయైనమః' అని చెప్పాలి.

పరా = అన్నిటికీ మూలమైన పరబ్రహ్మ యందు, నిష్ఠా = నిశ్చితముగా ఉండునది.

మనం సాధారణంగా మన ఇంద్రియాల్లో వసిస్తాము. అవి చెప్పినట్లు నడుచుకుంటూ ఉంటాము. ఇది సాధకునికి ప్రాథమిక స్థితి. ఈ ప్రాథమిక స్థితి నుండి ఉన్నత స్థితికి పోతున్న కొలది ఇంద్రియాలు మనస్సు చెప్పినట్లు, ఆ మనస్సు బుద్ధి చెప్పినట్లు – చిట్టచివరకు బుద్ధి ఆత్మ చెప్పినట్లు నడుచుకునే స్థితి వస్తుంది సాధనలో. ఇలా మనలో ఆత్మ యందు ప్రతిష్ఠితమైన బుద్ధి స్థితిని సూచించే అమ్మవారిని 'పరానిష్ఠా' అనవచ్చును.

సర్వాంతర్యామిని సర్వులలోను చూడకలిగే నిష్ఠను కూడా 'పరానిష్ఠ' గా అర్థం చెప్పుకోవచ్చును. నిజమైన తురీయ స్థాయిలోనే ఇది సాధ్యం.

1) పరమాత్మ యందు ప్రతిష్ఠితమైన బుద్ధిని సూచించునది'.

2) సర్వాంతర్యామిని సర్వమునందు చూడ కలుగు నిష్ఠను సూచించునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 574. ప్రజ్ఞాన ఘనరూపిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ప్రజ్ఞాన ఘనరూపిణ్యై నమః' అని చెప్పాలి.

ప్రజ్ఞాన = ప్రజ్ఞానము, ఘన = గడ్డకట్టిన, రూపిణీ = రూపము గలది.

ప్రజ్ఞకు సంబంధించిన ప్రకృష్టమైన జ్ఞానాన్ని - 'ప్రజ్ఞానం' అంటారు.

నీటి యూవిరి ఎటువంటి రూపాన్నైనా పొందకలదు. ఎంతటి ఘనపరిమాణాన్ని (Volume) అయినా పొందకలదు. కాని, అది చల్లబడితే నీరౌతుంది. ద్రవస్థితిలో ఉన్న ఆ నీరు ఎటువంటి ఆకారాన్నైనా పొందగలదు. కాని, ఘనపరిమాణం మాత్రం మారదు. మళ్ళీ అదే నీటియూవిరి ఇంకా చల్లబడి ద్రవస్థితిలోని నీటిస్థితిని గూడా దాటి మంచు గడ్డగా తయారైతే - ఒక ఆకారానికి బద్ధమౌతుంది. ఘన పరిమాణం కూడా మారదు. స్థిరంగా ఉంటుంది. ఈ వాయు, ద్రవ, ఘన స్థితులు ఎలా ఉంటాయో, అలాగే - ప్రజ్ఞానాన్ని కూడా ఊహిస్తే, ఘనస్థితిలో ఉండే ప్రజ్ఞానం యొక్క రూపంగా, అమ్మవారిని అర్థం చేసుకోవచ్చునని ఈ నామం చెబుతుంది. 'నిరాకార నిర్గుణ పరబ్రహ్మానికి సాకార సగుణ రూపంగా అమ్మవారు ఎలా అయిందో - కళ్ళతో చూడబడలేని 'జ్ఞానం' ఘనీభవిస్తే ఏర్పడే సాకార సగుణ జ్ఞానరూపమే అమ్మవారుగా దర్శించాలి' అని ఈ నామం చెబుతోంది. అంటే - ఎదురుగా మనుష్యులను చూడ గలుగుతున్నట్లే ప్రజ్ఞానాన్ని గూడా మనం చూడాలనుకుంటే అమ్మవారిని చూస్తే సరిపోతుందని ఈ నామం యొక్క అర్థం.

(అనురాగం ఘనీభవిస్తే - అమ్మ ఔతుంది.

అజ్ఞానక్రోధాలు ఘనీభవిస్తే - అసురుడౌతాడు.

ప్రజ్ఞానం ఘనీభవిస్తే - పరమేశ్వరి ఔతుంది.)

'ఘనరూపం దాల్చిన ప్రజ్ఞానం - అని ఈ నామానికి అర్థం.

## 575. మాధ్వీపానాలసా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మాధ్వీ పానాలసాయై నమః' అని చెప్పాలి.

మాధ్వీ = మధు సంబంధమైనవి (అనగా తేనె సంబంధమైన), పానా = త్రాగుటవలన, అలసా = అలసత్వము చెందినది.

'మధువు' అంటే – 'తేనె' అని, 'మద్యము' – అని, రెండు అర్థాలు ఉన్నాయి. ఎవరికి' వారు – వారి వారి సంస్కారాన్ని బట్టి, వారి వారి అభిరుచులను బట్టి, అవసరాలను బట్టి ఆయా అర్థాలు తీసుకుంటారు. సమయాచారులు 'తేనె' అనే అర్థాన్ని తీసుకుంటారు. అమ్మవారికి తేనెనే నైవేద్యం పెడతారు. వామాచారులు 'మద్యము' అనే అర్థాన్ని తీసుకోడానికే ఇష్టపడతారు. అంతేకాదు, అమ్మవారికి నైవేద్యం పెట్టి ఎక్కువ మోతాదులో స్వీకరిస్తారు కూడా! ఇలా మద్యపాన అలసులైన వారికి తాము పెట్టిన నైవేద్యం స్వీకరించిన అమ్మవారు కూడా అలసత్వంతో ఉన్నట్లు భావించి, అటువంటి అమ్మవారితో తాము సమాన స్థాయిలో తాదాత్మ్యం చెందినట్లు అనుభూతి చెందుతారు. ఆరాధనలో ఇది ఒక రకమైన పద్ధతి. సమయాచారులకి ది నచ్చదు. ఇలా చేసే వారిని ఏవగించుకుంటారు కూడా!

మధువు త్రాగకుండానే మధుసేవ నానుభూతిని పొందవచ్చును. అనురాగము, ఆప్యాయత, స్నేహము, భక్తి, వాత్సల్యము, ఆరాధన ఉన్న వ్యక్తులసాన్నిధ్యంలో, సాంగత్యంలో, సంభాషణాదులు చేస్తున్నప్పుడు; సంతోష, ఆనందాలను కలుగచేసే ఇలాంటి ఏ సన్నివేశమైనా ఏ వ్యక్తి సమక్షంలో అయినా ఒక మధురానుభూతి (తీపి అనుభవం) ఉంటుంది. ఆ మధురానుభూతిలో మనస్సు నిండా ఆనందం ఉండి, పరవశత్వంతో ఒళ్ళు తెలియని ఒక అలసత్వంతో ఉండటం సంభవిస్తుంది. తన సృష్టి పట్ల అమ్మవారికి ఇటువంటి అనుభూతి ఉంటుంది. ఆనందపానాల సత్వం ఉంటుంది. ఈ మధురానుభూతిని అనుభవించే అమ్మవారిని ఉద్దేశించి వ్రాసిన నామం ఇది అని చెప్పుకోవచ్చును.

'మధుపానాలసా' అనకుండా 'మాధ్వీపానాలసా' అని వ్రాయడంలో ఉద్దేశ్యం ఇదే! 'మధుపాన' అంటే మధువు త్రాగుటవలన, 'మాధ్వీపాన' అంటే – మధు సంబంధమైన, అనగా – 'తీపి అనుభూతి' కి చెందిన అనే అర్థం వస్తుంది కాబట్టి – ఈ నామంలోని మధువును సూటిగా 'నామవాచకం' గా కాకుండా 'విశేషణం' గా చెప్పుకుని అలంకారిక భాష(Figurative language) ప్రయోగంగా స్వీకరించడమే సముచితము, సమంజసము అవుతుంది.

(ఆయన – 'నిండుకుండ' అన్నపుడు 'కుండ' అనే అర్థంలో కాకుండా అన్నీ తెలిసినట్లు ఉండి, తెలియనట్లుగా నిలకడగా ఉన్నవాడు' – అని ఎలా అర్థం చేసుకుంటున్నామో, ఇక్కడ కూడా 'మాధ్వీపానం' అంటే – 'తీపి అనుభూతి వలన' అనే అర్థాన్ని స్వీకరించాలి. (ఆలంకారిక భాషా ప్రయోగం అంటే తెలియని వారినుద్దేశించి ఈ వివరణ వ్రాయడం జరిగింది – వివరణ కర్త).

ప్రతి సన్నివేశంలోను, సంఘటనలోను, వ్యక్తిసాన్నిధ్యంలోని మాధుర్యాన్ని అనుభవించాలని; నెమ్మదిగా, నిలకడగా, ఉండాలని ఈ నామం ద్వారా యోగ సాధకులకు సూచన.

శీలవతియైన స్త్రీ నడకలో (అంటే – ప్రవర్తనలో గూడా!) అలసత్వం' అంటే నెమ్మదితనం, నిలకడతనం ఉంటాయి.

'మధుసంబంధిత పానము వలన అలసత్వము చెందినది' – అని ఈ నామానికి అర్థం.

## 576. మత్తా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మత్తాయైనమః' అని చెప్పాలి.

మత్తా = అంటే పరవశత్వముతో నుండునది.

'మత్త' అంటే 'మదము చెందిన' అని అర్థం. 'మదము' అంటే 'పరవశత్వం' అని మొదటగా ఉన్న అర్థం. కాని, ఈ అర్థం మారిపోయి 'వళ్ళు తెలియక పోవడం' 'పొగరెక్కడం', 'పెద్దా చిన్నా తేడా తెలియక పోవడం' – అన్ని రకరకాల అర్థాలు వాడుకలోకి వచ్చాయి. పరవశత్వంలో కూడా 'వళ్ళు తెలియక పోవడం ఉంటుంది కానీ – 'వళ్ళు పొగరెక్కడం' ఉండదు.

''మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ
మయిసర్వమిదం ప్రోతం సూత్రేమణి గణాఇవ. (గీత – 7.7)

'నా కంటె వేరుగా మరియొకటి ఏదీ లేనేలేదు. దారమందు మణుల వలె నాయందు ఈ సమస్త ప్రపంచము కూర్చబడింది.' అని ఈ శ్లోకానికి అర్థం. ఈ శ్లోకంలోని 'మత్తః' అన్న పదానికి ఏది అర్థమో – 'మత్తా' అన్న ప్రస్తుత నామానికి అదే అర్థం. అంటే – సర్వం ఆమె చేతనే నిండి ఉన్నది. ఆమె యందే సర్వం కూర్చబడి ఉంది అనే అర్థాన్ని సూచిస్తుంది.

1) (నిత్యము) పరవశత్వములో ఉండునది.

2) తనయందే, తనచేతనే సర్వము కూర్చబడి ఉన్నది – అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 577. మాతృకావర్ణరూపిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మాతృకావర్ణరూపిణ్యై నమః' అని చెప్పాలి.

మాతృకా = మాతృకములైన, అనగా – మౌళికములైన, వర్ణ = వర్ణముల చేత, అనగా రంగులు, స్వరములు, అక్షరముల, రూపిణీ = రూపముగా ఉన్నది.

సంస్కృత భాషలోని అక్షరాల్లో మాతృకావర్ణాలు 32 ఉంటాయి. అవి – అ – ఇ – ఉ – ఋ – ఌ – క – ఖ – గ – ఘ – ఙ – చ – ఛ – జ – ఝ – ఞ – ట – ఠ – డ – ఢ – ణ – త – థ – ద – ధ – న – ప – ఫ – బ – భ – మ – స – హ – అనే అక్షరాలు. మిగిలిన అక్షరాలన్నీ ఈ 32 అక్షరాలతోనే ఎలా ఏర్పడ్డాయో ప్రథమ భాగంలోని 'శుద్ధవిద్యాంకురా కార ద్విజపంక్తి ద్వయోజ్జ్వలా' అనే 25వనామంలో వివరింపబడింది. మాటలైనా, పాటలైనా, స్తోత్రాలైనా, కావ్యాలైనా, మంత్రాలైనా తంత్రాలైనా ఏవైనా ఈ 32 మాతృకావర్ణాక్షరాలతోనే రూపొందింపబడతాయి. కాబట్టి, వాగ్దేవిగా దేవభాషకు సంబంధించిన మౌళికమైన, అంటే – ప్రధానమైన, లేదా – మాతృకలైన అక్షరాల రూపముగా ఉన్నది – అని ఈ నామానికి అర్థం.

'వర్ణ' పదానికి 'అక్షరం' అనే అర్థం కాకుండా 'రంగు' అనే అర్థం చెప్పుకుంటే - అన్ని రంగులకు మూలమైన, మాతృకమైన రంగు ఏదైతే ఉంటుందో ఆ రంగు యొక్క రూపంగా కూడాఅమ్మవారే ఉంటుందని ఇంకో అర్థం.

'వర్ణ' పదానికి 'చతుర్వ్వర్ణాలు' అంటున్నపుడు వచ్చే 'వర్ణ' పదంగా(Class) అర్థం చేసుకుంటే – నాలుగు వర్ణాలకు (బ్రహ్మ క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలు) మూలమైన వర్ణం, అనగా – తల్లి వంటి వర్ణం యొక్క రూపంలో ఉండేది కూడా అమ్మవారే' అని ఇంకో అర్థం.

'వర్ణ' పదానికి 'స్వరం' అని అర్థం చెప్పుకుంటే సప్తస్వరాలకు మూలమైన 'నాదం' యొక్క రూపంగా ఉండేది కూడా అమ్మవారే అని ఇంకో అర్థం.

1) వాఙ్మయంలోని అక్షరాలకు మౌళికమైన అక్షరాల రూపంగా ఉండునది.

2) అన్ని రంగులకు తల్లివంటి రంగు యొక్క రూపంలో ఉండునది.

3) వర్ణాలకు తల్లివంటి వర్ణము యొక్క రూపంలో ఉండునది.

4) అన్ని స్వరాలకు తల్లివంటి నాదము యొక్క రూపంలో ఉండునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 578. మహాకైలాసనిలయా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహాకైలాసనిలయాయై నమః' అని చెప్పాలి.

మహాకైలాస = గొప్పదైన కైలాసమే, నిలయా = నిలయముగా గలది.

'కైలాసం' అంటే శివుడు ఉండే చోటు. 'మహాకైలాసం' అంటే 'సదాశివుడు' నివసించే చోటు 1) మొత్తం శరీరం అంతా మనిషి అయినప్పటికీ, మనిషి ముఖమే ఆ మనిషిని పోల్చుకోడానికి, తెలుసుకోడానికి ఎలా ప్రధానమో 2) క్షీరం ఆవులోనే ఉన్నా పొదుగు ద్వారా మాత్రమే అవి ఎలా వ్యక్తమవుతాయో – అలాగే విశ్వమంతా విశ్వేశ్వరుడు నిండి ఉన్నా, విశేషించి వసించే స్థానం 'మహాకైలాసం'. ఈ స్థానం మనలోని సహస్రార

పద్మంలోని మధ్య బిందువు. అలాగే శ్రీ చక్రం లోని - కేంద్రం వద్ద ఉన్న బిందుస్థానం. అలాగే, విశ్వంలో తూర్పు ఉత్తరాల మధ్య ఉండే ఈశాన్య దిక్కు. అలాగే, మన ఇంటి స్థలంలో శంకు స్థాపన జరిగిన చోటు.

మూలాధారం అనే పుట్టింటిలోనే పుట్టినా, అమ్మవారు సహస్రారం అనే మెట్టినింటిలోనే అయ్యవారైన సదాశివునితో కాపురం కాబట్టి - అమ్మవారు ఈ సహస్రార బిందువు సూచించే 'మహాకైలాసం'లో వసిస్తూ ఉంటుంది.

నెమ్మదిగా క్రమక్రమంగా పై స్థాయికి వెళ్ళి తిరిగి మొదటి స్థాయికి చేరుకునే నాదోచ్చారణ సందర్భంలో అత్యున్నత స్థాయిని సూచించేదే మనలో 'కైలాసం'. ఉచ్ఛ్వాసంలో పైదాకా వెళ్ళి తిరిగి నిశ్వాసరూపంలో తగ్గుతూ తొలిస్థాయికి చేరుకునే మనలోని శ్వాసప్రక్రియలో ఉన్నత స్థాయిని సూచించేదే కైలాసం.




'ఓ-మ్'లను గాని, 'ఉచ్ఛ్వాస - నిశ్వాస'లను గాని, 'సో-హం'లను గాని, పటంలో చూపిన విధంగా వరుసగా వాటిని, వాటి దిశలను AO, BO భుజాలుగా సూచిస్తే అవి రెండూ కలసిన బిందువు'O'ను కైలాసంగా సూచించవచ్చును. ఎందుకంటే అయ్యవారు, అమ్మవారు కలసి ఉండే చోటే కైలాసం కాబట్టి. ఉల్లాస, విలాస, హ్లాద, ఆహ్లాద - మొదలైన వాటి అర్థమే కైలాసం ఔతుంది.

1) సహస్రార పద్మం మధ్య బిందువు సూచించే మహాకైలాసమును నిలయముగా కలిగినది.

2) శ్రీ చక్రమధ్య బిందువును నిలయంగా కలిగినది.

3) ప్రణవోచ్చారణలో ఉన్నత స్థాయిని సూచించు స్థానమును నిలయముగా గలది.

4) శ్వాసప్రక్రియలో ఉచ్ఛ్వాసం, నిశ్వాసం పై స్థాయిలో కలుసుకునే బిందుస్థానమును నిలయముగా గలది - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 579. మృణాల మృదుదోర్లతా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మృణాళమృదుదోర్లతాయై నమః' అని చెప్పాలి.

మృణాళ = తామర తూడువంటి, మృదు = సుకుమారమైన, దోర్లతా = తీగెలవంటి బాహువులు కలది.

'మృణాళము' అంటే – తామరతూడు. ఈ తామరతూడు చాలా సున్నితంగాను, సుకుమారంగాను, మృదువుగాను ఉంటుంది. అమ్మవారి రెండు బాహువులు ఇలా ఉంటాయిట. ఇది **బాహ్యార్థం.**

వెన్నెముక వెంబడి ఉండే కుండలినీ మార్గంలోని సుషుమ్నా నాడితో అమ్మవారిని సమన్వయపరచు కోవాలి. ఈ సుషుమ్నా నాడికి ఇరువైపులా – సూక్ష్మంగా ఇడా, పింగళా నాడులు ఎలా ఉంటాయో – అలాగే తామర తూడులులాగా సుకుమారంగా ఉండే బాహువులు అమ్మవారికి ఇరువైపులా ఉంటాయన్నమాట ! ఇది యోగపరమైన సూక్ష్మార్థం. ఆది శంకరులు గూడా అమ్మవారి బాహువులను ''మృణాలీమృద్వీనాం...'' అని సౌందర్యలహరిలోని 70వ శ్లోకంలో చెప్పారు.

1) తామరతూడు వంటి మృదువైన బాహువులు గలది.

2) సుషుమ్నా నాడికి ఇరువైపులా ఇడా పింగళానాడుల వలె తనకు ఇరువైపులా సుకుమారమైన బాహువులు కలది. – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 580. మహనీయా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహనీయాయైనమః' అని చెప్పాలి.

మహనీయా = గొప్పగా అందరిచేత ఆరాధింపబడునది.

అమ్మవారిని ధ్యానం చేస్తే ధ్యానంచేసిన వాళ్ళు అమ్మవారు అయిపోవడం గూడా జరుగుతుంది. (అంటే – సాయుజ్యం సిద్ధిస్తుందని అర్థం) విష్ణుమూర్తి – ధ్యానం చేసి ఇలాగే జగన్మోహినిగా అమ్మవారై పోయాడు. ఇదే విషయం ఆది శంకరులు

సౌందర్యలహరిలో' భవానిత్వం దాసే' అనే 22వ శ్లోకంలో చెప్పారు) తనను ఆరాధించినవారికి, ధ్యానం చేసిన వారికి ఇటువంటి మహత్తరమైన ఫలాన్నిచ్చేది కాబట్టి అమ్మవారు 'మహనీయా'.

'గొప్పగా ఆరాధింపబడునది' - అని ఈ నామానికి అర్థం.

## 581. దయామూర్తిః

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'దయామూర్త్యై నమః' అని చెప్పాలి.

దయ = దయాలక్షణము, మూర్తి ః = మూర్తీ భవించినది.

అమ్మవారు 1) 'కరుణాతరంగితాక్షీం' అని ధ్యానశ్లోకంలోను, 2) కరుణా సముద్రురాలు అని – 'కరుణారససాగరా' అనే, 326వ నామంలోను చెప్పబడింది. 1) 'కరుణకలిగిన కళ్ళు' 2) అమ్మవారి కరుణ సముద్రము వంటిది' అని చెప్పే ఈ రెంటి అర్థాలకు మించిన అర్థం ప్రస్తుత నామంలో ఉంది. 'దయ' అనే గుణం ఒక రూపుకట్టుకుంటే ఆ రూపం అమ్మవారు అని – ఈ నామానికి అర్థం. అంటే – అమ్మవారి లోని ప్రతి అణువు, పరమాణువు అమ్మవారి కరుణతోనే తయారై ఉంటాయన్నమాట. ఇటువంటి 'దయామూర్తి' కాబట్టే – అమ్మవారిని ఒక బీజాక్షరంగా 'హృల్లేఖ' అయిన 'హ్రీం' గా చెబుతారు. (హృత్ + లేఖ = హృల్లేఖ. హృత్ + అయము = హృదయము. ఈ హృదయ లక్షణమే 'దయ').

అందరూ అమ్మవారి అనుగ్రహం మీద ఆధారపడిన వారే ! అంతటి మహనీయురాలు కాబట్టే, అంతటి దయాస్వరూపిణి కాబట్టే – హరిహర బ్రహ్మేంద్రాదులందరూ అమ్మవారిని ఆరాధిస్తారు.

'మూర్తీభవించిన అనగా – రూపు గట్టుగొనిన దయాలక్షణము' – అని ఈ నామానికి అర్థం.

## 582. మహాసామ్రాజ్యశాలినీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహాసామ్రాజ్యశాలిన్యై నమః' అని చెప్పాలి.

మహా = గొప్పదైన, సామ్రాజ్యశాలినీ = సామ్రాజ్యమును పరిపాలించునది.

పది ఇళ్ళు కలిగిన గ్రామాన్ని గురించి, దాని మంచి చెడ్డలను గుఱించి చూసుకునే వారినే ఏదో చిన్న రాజ్యానికి రాజుగా - 'గ్రామాధికారి' అంటున్నపుడు, సమస్త విశ్వ సామ్రాజ్యాన్నీ తిన్నగా పరిపాలించే అమ్మవారు 'మహా సామ్రాజ్యశాలినీ' అవదా ! అందుకని విశ్వంలోని మహత్తరమైన పరబ్రహ్మకు చెందిన ఈ విశ్వసామ్రాజ్యానికి అధినాయకురాలని ఒక అర్థం.

పరాకాష్ఠకు చెందిన గొప్పదనం, వైభవం, మంచిదనం, పరిపాలనాదక్షతాలక్షణాలను సూచించే ఒకే ఒక పదం 'మహా'. ఈ గుణానికి, లక్షణానికి అమ్మవారు అధిష్ఠాత్రి. అధిష్ఠాత్రే గాదు ఆ లక్షణ ఉత్పత్తి స్థానం గూడా ! ఇటువంటి 'మహా' అనే సామ్రాజ్యానికి అమ్మవారు 'ప్రభ్వీ', లేదా - 'అధికారిణి' - అని ఇంకొక అర్థం.

మనలో ఏ ఒక్కటి లేక పోతే మన అస్తిత్వానికే అవకాశం ఉండదో - దాన్ని 'ఆత్మ' అంటారు. అటువంటి 'ఆత్మ' సామ్రాజ్యానికి అమ్మవారు అధినాయకురాలు - అని మరి ఒక అర్థం.

మొత్తం మీద ఈ నామానికి ఈ క్రింది అర్థాలు చెప్పవచ్చును.

1) పరబ్రహ్మకు చెందిన ఈ విశ్వసామ్రాజ్యానికి అధినాయకురాలు, లేదా - పరిపాలకురాలు.

2) 'మహా' అను లక్షణ వైభవానికి అధిష్ఠాత్రి.

3) ఆత్మ సామ్రాజ్యానికి అధినాయకురాలు, లేదా - పరిపాలకురాలు.

## 583. ఆత్మవిద్యా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ఆత్మవిద్యాయైనమః' అని చెప్పాలి.

ఆత్మ = ఆత్మకు సంబంధించిన, విద్యా = విద్యా స్వరూపురాలు.

ఈ నామం నుండి 'దివ్య విగ్రహా' నామం వరకు ఆత్మవిద్య, మహావిద్య, బ్రహ్మవిద్యాదుల ఉపదేశ విశేషాలు చెప్పబడతాయి.

మనం సాధారణంగా చూసేది పదార్ధమయమైన ప్రపంచం, ఈ ప్రపంచం తాలూకు విషయాలన్నిటినీ 'ప్రాపంచిక విద్యలు' లేదా 'పదార్ధ విజ్ఞాన శాస్త్రము' అంటారు. కాని, ఈ పదార్ధమయమైన ప్రపంచానికి కారణభూతమై, వెనక ఉండినడిపించే చైతన్య శక్తి గూడా ఉంటుందని పరిశీలనాత్మక పరిశోధనా క్రమంలో తెలుస్తుంది. ఈ చైతన్య శక్తి ప్రతి వ్యక్తిలోను, ప్రతిజీవిలోను గూడా అంతర్గతంగా ఉండి నడిపిస్తుంది. వ్యక్తిలో ఉండే ఆ అంతర్గత శక్తి యొక్క అంశాన్ని 'ఆత్మ' శక్తి అని, విశ్వంలో ఉండే అంతర్గత శక్తిని 'అమ్మవారు' అనీ అంటారు. ఆత్మశక్తిని గూర్చి చెప్పే విద్యను 'ఆత్మవిద్య' అంటారు.

విశ్వాన్ని నడిపించే అంతర్గత శక్తి అయిన అమ్మవారే ప్రతి జీవిలోను అంశ రూపంలో ఆత్మశక్తిగా పనిచేస్తుంది. ఈ అమ్మవారిని గురించి వివిధ స్థాయిలలో సందర్భోచితంగా చెప్పే విషయాలను ఆత్మ విద్యగాను, బ్రహ్మవిద్యగాను, మహావిద్యగాను, శ్రీవిద్య గాను, శ్రీ షోడశాక్షరీ విద్యగాను చెబుతారు. ఇవన్నీ 'యోగవిద్య' క్రిందకే వస్తాయి.

ప్రతి వ్యక్తికీ సంబంధించిన మూలాధారాది సహస్రార పర్యంతానికి సంబంధించిన విజ్ఞాన విశేషాలన్నీ ఆత్మ విద్య క్రిందకే వస్తాయి.

'ఆత్మవిద్యాస్వరూపిణి' – అని ఈ నామానికి అర్థం.

## 584. మహావిద్యా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహావిద్యాయై నమః' అని చెప్పాలి.

మహా = గొప్పదైన, విద్యా = విద్యాస్వరూపురాలు.

యోగవిద్యలో ఆత్మశక్తికి సంబంధించిన జ్ఞానంతో పాటు విశ్వ విజ్ఞానాన్ని గూడా జోడిస్తే అది 'మహావిద్య' ఔతుంది. అమ్మవారికి సంబంధించిన పరిపూర్ణజ్ఞానం ఉండడం వలన ఈ విద్యను 'మహావిద్య' అన్నారు.

'వ్యక్తిగత విశ్వగత సమన్వయ జ్ఞాన స్వరూపిణి' – అని ఈ నామానికి అర్థం.

## 585. శ్రీవిద్యా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శ్రీ విద్యాయైనమః' అని చెప్పాలి.

శ్రీ విద్యా = శ్రీ విద్యా స్వరూపిణి.

ఆత్మ పరంగా ఉండేది 'ఆత్మవిద్య' అయితే, బ్రహ్మపరంగా ఉండేది బ్రహ్మవిద్య అయితే, అంతటా నిండి ఉండే అమ్మవారిని గురించి చెప్పేది 'శ్రీవిద్య' అంటారు.

'శ్రీవిద్య' సర్వ ప్రయోజన కారకమైన విద్య. కర్మ, భక్తి, జ్ఞాన, భోగ, భాగ్య, మోక్ష, వైరాగ్య ప్రదమైన విద్యే 'శ్రీవిద్య'. 'శ్రీం' ప్రధాన బీజాక్షరమైన ఈ విద్య అత్యంత ఆదరాభిమానాలతో ఆరాధింపబడుతుంది. కుటుంబములోని అందరి వ్యక్తులకంటె 'తల్లి' ఎంత ముఖ్యమైనదో, ఆదరణీయమైనదో, అన్ని విద్యలలోను 'శ్రీవిద్య' అంత ఆదరణీయమైనది.

శ్రీ విద్యా స్వరూపిణి – అని ఈ నామానికి అర్థం.

## 586. కామసేవితా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కామసేవితాయైనమః' అని చెప్పాలి.

కామ = కాముని చేత, సేవితా = సేవింపబడునది.

'కాముడు' అంటే ప్రధానంగా మూడర్థాలు చెప్పవచ్చును. అవి – 1) శివుడు (కామేశ్వరుడు) 2) మన్మథుడు 3) కోర్కెలు గలవాడు. శివుని కోసం అమ్మవారు ఎలా తపస్సుచేసిందో, అలాగే శివుడు కూడా అమ్మవారు తన 'అర్ధాంగి' అవ్వాలని అంతగాను తపన చెందాడు. అంటే ఆ ఇద్దరూ ఒకరి కోసం ఒకరు తపస్సు చేసి చేసి, చిక్కి సగమై పోయారు. చివరకు వారి వారి తపస్సులు ఫలించి చిక్కి సగమైన ఆ రెండు శరీరాలు ఒకటై అర్ధనారీశ్వరులుగా అయినారు. ఈ విషయాన్ని ఆదిశంకరులు శివానందలహరిలోని

'కలాభ్యాం చూడాలంకృత శశికలాభ్యాం నిజతపఃఫలాభ్యాం....'' అన్న మొదటి శ్లోకంలోనే చెబుతారు. ఇలా శివుని చేత కోరబడి, సేవింపబడినది కాబట్టి అమ్మవారు ''కామసేవితా''.

శివుని మంటకు, ఆహుతి అయి, శరీరాన్ని కోల్పోయిన మన్మథుని శరీరం – మన్మథుని భార్యఅయిన రతీదేవికి కనబడేటట్లు చేసి, రతీదేవి వైధవ్యాన్ని తొలగింపచేసిన అమ్మవారిని నిరంతరము రతీ మన్మథులిద్దరూ ఆరాధిస్తారు. అందుచేత అమ్మవారు 'కామసేవితా', అంటే మన్మథ సేవిత. ప్రపంచంలోని భార్యా భర్తల మధ్య, ప్రేయసీ ప్రియుల మధ్య – ఒకళ్ళ చూపులు ఒకరి కోసం ఖర్చైపోయేలా మన్మథుడు వాడిపోతాడు. చివరకు ఆది దంపతుల చూపుల మధ్య కూడా ఇరుక్కొని – వాడిపోడమే కాదు, మాడిపోయాడు కూడా ! కాని అందరి ఎడల ఆ అమ్మవారి అనురాగ పూరితమైన చూపులు ఉండడంతో చివరకు మన్మథుడు బ్రతికి బట్టకడతాడు. అందుచేత – అమ్మవారు 'కామసేవితా'. ఈ విషయాన్నే ఆది శంకరులు సౌందర్యలహరిలో 'ధనుః పౌష్పం .... అపాంగాత్తేలబ్ధ్వా జగదిద మనంగో విజయతే' అన్న శ్లోకంలో చెబుతారు.

('శ్రీ విద్యను ఉపాసించిన పన్నెండు మందిలో మన్మథుడు కూడా ఒకడు. మన్మథుడు ఉపాసించిన మంత్రాలను మన్మథుని పేర 'మన్మథుద్ధారవిద్య' అని అంటారు. మిగిలిన వారి విద్యలకంటె ఈ విద్యబాగా ప్రచారం పొందింది.)

కోర్కెలు గల కాముకు లందరూ – 'వరదా', 'కామదాయినీ', 'కల్పవల్లీ', 'వాంఛితార్థ ప్రదాయినీ' – అయిన అమ్మవారిని ఆరాధిస్తూనే ఉంటారు. అందుకని అమ్మవారు 'కామసేవిత'.

1) శివునిచే సేవింపబడునది.

2) మన్మథునిచే సేవింపబడునది.

3) కోర్కెలు కలవారిచే సేవింపబడునది – అనే అర్థాలు ఈ నామానికి చెప్పుకోవచ్చును.

## 587. శ్రీ షోడశాక్షరీ విద్యా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శ్రీ షోడశాక్షరీ విద్యాయైనమః' అని చెప్పాలి.

శ్రీ = శ్రీ తో కూడినదైన, లేదా సకల మంగళప్రదమైన, షోడశ = పదహారు, అక్షరీ = అక్షరాల మంత్రమునకు సంబంధించిన, విద్యా = విద్యాస్వరూపిణి.

పదిహేను తిథులను సమన్వయపరచే విధంగా పంచదశాక్షరీ మంత్రం ఉంటుంది. ఈ తిథులు వృద్ధిక్షయాలు కలిగిన కళలు. వృద్ధి క్షయ లక్షణాలు లేకుండా ఎప్పుడూ ఒకే విధంగా ఉండే కళ ఒకటుందని – ఆ కళయే వృద్ధి క్షయ లక్షణాలు కలిగిన పదిహేను తిథులలోను మారుతూ పనిచేస్తూ ఉంటుందని అర్థం చేసుకోవాలి. ఎప్పుడూ ఒకే రకంగా ఉండే ఈ కళకు సంబంధించిన బీజాక్షరాన్ని 'శ్రీం' గా తీసుకుంటే – ఈ 'శ్రీం'తో కూడిన పంచదశి – 'షోడశాక్షరి' అయి – షోడశ కళాప్రపూర్ణ అయిన అమ్మవారిని సూచించే 'షోడశాక్షరీ మంత్రం' ఔతుంది. దీనికి సంబంధించిన వివరాలను 'శ్రీ షోడశాక్షరీ విద్య' అంటారు.

'శ్రీ షోడశాక్షరీ విద్యా రూపము' – అని ఈ నామానికి అర్థం చెప్పవచ్చును.

## 588. త్రికూటా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'త్రికూటాయైనమః' అని చెప్పాలి.

త్రి = మూడు, కూటా = కూటములుగా ఉన్న మంత్ర స్వరూపిణి.

'మూల కూటత్రయ కళేబరా' అనే 89వ నామ వివరణ కూడా ఇక్కడ మళ్ళీ చదువుకోవాలి.

నిర్దిష్ట సంఖ్యలో ఉండే అక్షర సమూహాలను 'కూటము' అంటారు. 'కూటము' అంటే 'విభాగము' అని చెప్పుకోవచ్చును. అమ్మవారి పంచదక్షాశరీ మంత్రం 'క, ఏ, ఈ, ల, హ్రీం; హ, స, క, హ, ల, హ్రీం; స, క, ల హ్రీం' అని మూడు కూటములుగా

ఉంటుంది. ఈ మూడు కూటములు వరుసగా - 'క'తో 'హ'తో 'స'తో ప్రారంభింపబడతాయి. అందుకే, ఈ మూడు కూటాలను వరుసగా 'కాదికూటము', 'హాదికూటము', 'సాదికూటము' - అని అంటారు. ఈ మూడూ వరుసగా అమ్మవారి మస్తకంపై నుండి కంఠం వరకు ఉండే భాగాన్ని; కంఠం నుండి నాభివరకు ఉండే భాగాన్ని; నాభి నుండి దిగువ భాగాన్ని సూచిస్తాయి. వీటినే వరుసగా వాగ్భవ కూటము, కామరాజ కూటము, శక్తికూటము - అంటారు. అందుకని, అమ్మవారు ఈ 'త్రికూట' అనే నామంతో పిలువబడుతుంది.

మంత్ర శాస్త్రాన్ననుసరించి ఏ మంత్రాన్నైనా, బీజము 'శక్తి' 'కీలకము' అని మూడు కూటములుగా చెబుతారు. అమ్మవారి మంత్రం కూడా ఈ త్రికూటాలతో ఉంటుంది. అందుకని అమ్మవారు 'త్రికూటా' అయింది.

1) కాది, సాది, హాది కూటత్రయంలో నుండు మంత్రస్వరూపిణి.

2) బీజ, శక్తి, కీలకములు - అని మూడు కూటములుగా చెప్పబడు మంత్రస్వరూపిణి - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 589. కామకోటికా

అయిదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కామకోటికాయైనమః' అని చెప్పాలి.

కామ = కామమునకు, కోటికా = పై అంచునగలదాని స్వరూపిణి.

చతుర్విధ పురుషార్థాలైన ధర్మ, అర్థ, కామ, మోక్షాలలో కామమునకు అగ్రము లేదా అంచున ఉన్నది 'మోక్షము' కాబట్టి - 'కామకోటికా' అంటే 'మోక్షము' అని అర్థం చెప్పుకోవాలి. అందువల్ల 'కామకోటికా' అన్న నామం - అమ్మవారు - 'మోక్షస్వరూపిణి' అన్న అర్థాన్ని సూచిస్తుంది. (అంతేకాని, 'కోటిరెట్లు కామం గలది' అని కాదు)

'కాముడు' అంటే - శివుడు కాబట్టి - 'కామకోటికా' అంటే శివుణ్ణి అవధిగా గలిగినది' అని ఇంకో అర్థం చెప్పవచ్చును.

1) మోక్ష స్వరూపిణి.

2) శివుణ్ణి అవధిగా, అంటే - ధ్యేయంగా, లేదా ప్రీతిగా కలిగినది - అనే అర్థాలు ఈ నామానికి చెప్పవచ్చును.

## 590. కటాక్షకింకరీ భూతకమలాకోటిసేవితా

పదహారు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కటాక్ష కింకరీ భూత కమలా కోటి సేవితాయై నమః' అని చెప్పాలి.

కటాక్ష = అనుగ్రహ వీక్షణ మాత్రముచే, కింకరీ = భృత్యులుగా, భూత = చేయబడిన, కమలా = శ్రీ సతుల, కోటి = సమూహము చేత, సేవితా = సేవింపబడునది.

లోపల ఉన్న భావాలను వ్యక్తం చెయ్యడంలో కళ్ళకు ఉన్న శక్తి మరియే ఇతర అవయవానికి లేదనే చెప్పాలి. నవరస భావాలను కళ్ళతో చెప్పవచ్చును. అమ్మవారు ఈ విషయంలో ఎంత బాగా చెయ్యకలదో ఆదిశంకరులు సౌందర్యలహరిలో 'శివేశృంగారార్ద్రా...' అన్న 51వ శ్లోకంలో చెబుతారు.

నవరసాలలో ఒకటి అయిన కరుణరసానికి సంబంధించిన కటాక్ష వీక్షణ మహత్యాన్ని గురించి ఈ నామంలో చెప్పబడుతుంది.

అమ్మవారు ఒక్కసారి కరుణతో కటాక్ష వీక్షణాన్ని ప్రసరిస్తే చాలు ఆ అవకాశం కోసం ఎదురు చూసే - సకల భోగ భాగ్యాలకు సంబంధించిన లక్ష్మలందరూ - గుంపులు గుంపులుగా వరుసలో నిలబడి అమ్మవారిని అన్ని విధాల సేవించుకుంటారు.

అమ్మవారు కమలాసతులకు ఈ అవకాశం ఇవ్వబట్టే - అమ్మవారి భక్తులకు - ఈ కమలాసతులందరూ సకల సంపదలను ప్రసాదిస్తూ, తమ కృతజ్ఞతా భావాన్ని తెలుపుకుంటారు. ఈ విషయాన్ని సౌందర్యలహరీ స్తోత్ర పఠనానికి ఫలశ్రుతిగా ఆదిశంకరులు స్తోత్రానికి చివర్లో వచ్చే 'సరస్వత్యాలక్ష్మ్యా .....' అన్న 99వ శ్లోకంలో చెబుతారు. (బ్రహ్మ దగ్గర కంటె కూడా అమ్మవారి భక్తుణ్ణి అనుగ్రహించడంలోనే సరస్వతీ దేవి ఎక్కువ కాలం గడుపుతుందని, అలాగే - విష్ణుమూర్తి దగ్గరకంటె కూడా అమ్మవారి భక్తుణ్ణి అనుగ్రహించడంలోనే లక్ష్మీదేవి ఎక్కువ కాలం గడుపుతుందని - అంటే అమ్మవారి

భక్తుణ్ణి ఆ ఇద్దరూ అంత అమితంగా అనుగ్రహించి, తద్వారా అమ్మవారిని మంచి చేసుకుంటారని ఈ ఫలశ్రుతి శ్లోకపాదానికి తాత్పర్యం)

'కటాక్షం' అంటే 'అనుగ్రహపూరితమైన చూపు' దీన్నే 'ఈక్షణ'మని కూడా అంటారు. ఇది 'ఈక్షతి' స్వరూపానికి చిహ్నమైన 'బిందువు'ను సూచిస్తుంది. ఈ బిందువు లోంచే అన్ని రకాల ఆకారాల్లో ఉండే త్రిభుజాలు, కోణాలు, చక్రాలు, పద్మాలు, దళాలు మొదలైనవన్నీ వస్తాయి. శ్రీ చక్రంలో ఉండే కమల (పద్మ), దళ, కోణాదులన్నీ (అంటే - షోడశదళ పద్మం, అష్టదళ పద్మం, రకరకాల త్రికోణాదులు మొదలైనవన్నీ) ఈ బిందు వికసనం వల్ల ఏర్పడినవే ! ఈ కమలదళ కోణాదుల వద్దనే, సేనానులు, మంత్రిణులు, పరివార దేవతలు, నిత్యాదేవతలు, యోగినీ దేవతలు, అష్టసిద్ధులు మొదలైన వారందరూ అమ్మవారికను సన్నల ఆజ్ఞలకై నిరీక్షిస్తూ ఉంటారు. ఇటువంటి 'కమలదళకోణాదులచే సూచింపబడు దేవతలచే సేవింపబడునది' - అని కూడా ఈ నామానికి అర్థం చెప్పవచ్చును.

1) అనుగ్రహ మాత్రం చేత భృత్యులుగా చేయబడిన శ్రీ సతుల సమూహము చేత సేవింపబడునది.

2) తన కటాక్షమునకు నోచుకొని, తన భక్తులను సకల సంపదలతో అనుగ్రహించు - శ్రీ సతుల సమూహముచే సేవింపబడునది.

3 శ్రీ చక్రము నందలి కమలదళ కోణాదులచే సూచింపబడు దేవతలచే సేవింపబడునది.

## 591. శిరఃస్థితా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శిరఃస్థితాయైనమః' అని చెప్పాలి.

'శిరస్సు' అంటే 'తల' అని అర్థం. తలమీద పెట్టుకోవలసినవే తల మీద ఉంటాయి. 'నా తల మీద పెట్టుకుంటాను' అని అంటే - 'అంత గౌరవంగా భక్తితో చూసుకుంటాను' - అనే అర్థం. ఈ భావంతోనే భరతుడు తన స్వామి అయిన శ్రీరాముని పాదుకలను తల మీద పెట్టుకున్నాడు - మనకు భక్తి గౌరవాలు ఉండే గురువుల, మహానుభావుల పాదుకలు

శిరోధార్యములు అని శ్రీ మద్రామాయణంలో పాదుకా పట్టాభిషేక ఘట్టం సూచిస్తుంది. అలాగే – ఇక్కడ అమ్మవారి విషయంలో కూడా అన్వయం చేసుకోవాలి – అనే అర్థంలో అమ్మవారు 'శిరఃస్థితా'.

అమ్మవారు 'బైందవాసనా' అంటే అమ్మవారు శ్రీ చక్రంలో ఉండే బిందుస్థానంలో ఉంటుంది. ఈ బిందుస్థానం సహస్రార చక్రం ఉండే – ఉపాసకుల శిరః స్థానాన్ని సూచిస్తుంది. కాబట్టి, అమ్మవారు ప్రతి ఉపాసకుని 'శిరఃస్థితా' అవుతుంది.

ఉపాసనలో సహస్రారం దాకా వెళ్ళిన ప్రజ్ఞ కలవారికి ఇక అక్కడ మనస్సు ఉండదు, అమ్మవారే! ఆ స్థితిలో ఉన్న ఉపాసకుడు సాక్షాత్తు శివుడే అవుతాడు. ఈ స్థితిలో శివుడి నెత్తిపై చంద్రుణ్ణి చూసి అమ్మవారని భ్రమించడమో – లేదా, శివుడి నెత్తిమీద అలా ఉన్న అమ్మవారిని చూసి చంద్రుడని భ్రమించడమో జరుగుతుంది. అంటే – అమ్మవారు శివుని నెత్తిపై చంద్రుని వంటిది అని కూడా ఈ నామానికి అర్థం చెల్లేస్థితి ఇదన్నమాట! అందుకనే రాబోయే నామంలో అమ్మవారు **'చంద్రనిభా'** అని చెప్పబడుతుంది. సాయంకాల ధ్యానంలో అమ్మవారిని 'శిరఃస్థితా' గా భావించి ధ్యానం చెయ్యాలి అనే సూచన గూడా ఈ నామం తెలుపుతుంది. పెళ్లి మంత్రాల్లో కూడా 'మూర్ధానం పత్యురారోహ' అని వధువును – వరుడి నెత్తిపై ఎక్కమనే అర్థంలో ఈ విషయం సూచింపబడుతుంది. మనస్సు, చంద్రులను సూచించే – వధువును; ఆత్మ, సూర్యులను సూచించే – వరుని యొక్క నెత్తి పైకి ఎక్కమనడం అంటే – ఆత్మను పొందమని మనస్సును, సూర్యుణ్ణి పొందమని చంద్రుణ్ణి సూచించడమన్నమాట!

1) శిరస్సు నందు ఉంచదగిన గురుపాదుకారూపమున ఉండునది.

2) శ్రీ చక్రము నందలి బిందు స్థానమును సూచించు ఉపాసకుల శిరము నందలి సహస్రార స్థానము నందు ఉండునది.

3) సహస్రారం దాకా వెళ్ళిన మనస్సు ప్రజ్ఞా స్వరూపిణిగా శివుని నెత్తిపై చంద్రుని వలె భాసించునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 592. చంద్రనిభా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'చంద్రనిభాయై నమః' అని చెప్పాలి.

చంద్ర = చంద్రుని కాంతితో, నిభా = సమానమైన కాంతిని కూడి యుండునది.

మనం ఎరుగున్న వాటిలో చంద్రుని కాంతి ప్రత్యేకతలు, విశిష్ట లక్షణాలు ఇంక వేటికీ లేవు. చంద్రుని కాంతి అమితమైన తెల్లగా ఉంటుంది. తెల్లగా ఉండి కళ్ళలో పొడుచుకునేట్లుగా, సూటిగా, చురుకుగాను ఉండదు. శరీరం దహించేట్లుగా వేడిగాను ఉండదు. హాయిని చేకూర్చే చల్లదనంతో ఉంటుంది. ఒంటికి సుఖస్పర్శను కలుగజేస్తూ, తాపాన్ని తీరుస్తూ, మనస్సుకు ఆహ్లాదాన్ని, ఆత్మకు ఆనందాన్ని చేకూరుస్తుంది. ఇటువంటి ఆహ్లాదకరమైన విశిష్ట లక్షణాలన్నీ అమ్మవారి సాన్నిధ్యంలో గూడా మనం పొందుతాము కాబట్టి అమ్మవారు 'చంద్రనిభా'.

సహస్రారానికి ఆజ్ఞా చక్రానికి మధ్యన ఉన్న ఒక దివ్య ప్రదేశాన్ని 'ఆనంద కందము' అంటారు. దీనినే 'చంద్రకళా' 'చంద్రనిభా' అంటారు. సహస్రారాన్ని సాక్షాత్తు 'సుధాసింధు' వనే అంటారు. కాబట్టి, ఈ ప్రాంతమంతా చంద్రమండలం క్రిందకే వస్తుంది. **ఈ ప్రదేశం వద్దనే ఇంద్రస్థానం ఇంద్రగ్రంథి (Pineal gland)ఉంటాయి. సూర్యుని నుండే** కాక ఈ ఇంద్రుని నుండి కూడా చంద్రునిపై కిరణాలు పడి చంద్రుడు వెలుగుతూ ఉంటాడు. అంటే – చంద్రుడు అటు సూర్యుని కిరణాలను, ఇటు ఈ ఇంద్రుని కిరణాలను గూడా పొంది వాటిని పరావర్తనం(Reflect) చేస్తాడు.

ఈ ఇంద్రుణ్ణే జ్యోతిశ్శాస్త్రంలో గాని, ఖగోళశాస్త్రంలో గాని నెప్ట్యూన్(Neptune) అంటారు. (ఈ ఇంద్రుడిపై తన గురువైన 'సోముడ'నే ఒక గంధర్వుడి నుండి కిరణాలు పడతాయి. విశ్వావసువు, ఇంద్రుడు, సోముడు – ఈ మూగ్గురూ సంగీతానికి **అధిష్ఠానవర్గం (Hierarchy) లాంటి వాళ్ళు. ఛందస్సులు కూడా వీరి ఆధిపత్యంలోనే** ఉంటాయి. ('ఛందస్సులు' అంటే గణాలు కాదు. ఈ గణాలను వేటిద్వారా అయితే కనిపెట్టారో అవి ఛందస్సులు). వీరి యందు మేల్కొన్నవారే సిద్ధులు. సంగీత లలిత

కళాదులయందు ప్రావీణ్యం ఉండే 'జీవుడు గారు' – 'ఆనందం గారు' గా ఉండాలంటే ఈ స్థితి రావాలి. జీవునికి ఈ ఆనందోత్పాదనం (Expansion of Consciousness) జరగడానికే షట్చక్ర, షట్పద్మ వికసనానికి దారితీసే ఈ కుండలినీ యోగం, శ్రీ విద్య.

వాస్తవానికి 'శిరఃస్థితా' – 'చంద్రనిభా' ఈ రెండు నామాలు జంటగా చెప్పుకోవాలి.

1) చంద్రుని కాంతితో సమానమైన కాంతితో కూడి యుండునది.

2) జీవునికి ఆనందోత్పాదన స్థితిని కలుగచేయునది – అని ఈ నామానికి అర్థాలుగా చెప్పవచ్చును.

## 593. ఫాలస్థా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ఫాలస్థాయైనమః' అని చెప్పాలి.

ఫాల = ఫాల భాగమునందు, స్థా = ఉండునది.

ఆజ్ఞాచక్రం ఉండే భాగం కంటె కొద్దిగా పైన ఉండే ప్రదేశాన్ని 'ఫాలభాగం' అంటారు. దీన్నే 'లలాటస్థానం' అని కూడా అంటారు. ఈ లలాట స్థానంలో అమ్మవారు – భువనేశ్వరీ బీజరూపంలో ఉంటుంది. ఉదయకాల ధ్యానంలో అమ్మవారిని ఈ ఫాలభాగంలో ఉన్నట్లుగా భావించి ధ్యానం చెయ్యాలి అనే సూచన కూడా ఈ నామంలో ఉంది. (ఎందుకంటే ఈ ఫాలభాగంలోని భ్రూమధ్య ప్రదేశం మనకు తూర్పు దిశను సూచిస్తుంది. ఈ దిక్కు వద్దనే కదా సూర్యోదయం అయేది – అందుకని)

'ఫాలభాగము నందు ఉండునది' – అని ఈనామానికి అర్థం.

## 594. ఇంద్రధనుఃప్రభా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ఇంద్రధనుః ప్రభాయై నమః' అని చెప్పాలి.

ఇంద్రధనుః = ఇంద్రధనుస్సు (హరివిల్లు) నందలి రంగుల కాంతులతో సమానమగు కాంతులతో, ప్రభా = వెలుగొందునది.

ఫాలభాగ ప్రాంతంలోనే ఇంద్రుడు, ఇంద్రుడికి సంబంధించిన ఇంద్రగ్రంథి ఉంటాయి. ఇది తూర్పును సూచించే స్థానం. అంటే – సూర్యోదయ స్థానాన్ని సూచించే ప్రదేశం (ఇదే ఆజ్ఞా చక్రస్థానం గూడా!) ఇంద్రధనుస్సులో ఎన్ని రంగులుంటాయో అన్ని రంగులను చూడగలగటానికి వాటి వివరాలను తెలుసుకోడానికి సంబంధించిన ప్రజ్ఞా కేంద్రం ఇక్కడ ఉంటుంది. ఈ కేంద్రం తిన్నగా పనిచెయ్యకపోతే వర్ణభేదం తెలియదు. 'వర్ణం' అంటే 'రంగు' అనే కాక 'స్వరం' 'అక్షరం' అనే అర్థాలు కూడా ఉన్నాయి కాబట్టి రంగుతో పాటు, స్వరజ్ఞానం, అక్షరజ్ఞానం కూడా దెబ్బతింటుంది. సంగీత జ్ఞానానికి సంబంధించిన శ్రుతిలయజ్ఞానం కూడా దెబ్బతింటుంది. అందుకే ఈ ఫాల భాగం మనిషికి ఒక విశిష్టమైన ప్రయోజనాత్మకమైన ప్రదేశం. ఈ ఫాలభాగం విశాలంగాను, ఉన్నతంగాను అంటే – ఉబ్బెత్తుగాను, గుంటలు లేకుండాను ఉండాలి. ఇది అంగ సాముద్రిక ఉత్తమ లక్షణం గూడా !

ఉదయకాలం అమ్మవారిని ఈ ఫాలభాగంలో ఇంద్రధనుస్సు కాంతులు విరజిమ్ముతున్నట్లుగా భావించి, ధ్యానం చెయ్యాలనే సూచన ఈ రెండు నామాల్లోను (593, 594) ఉంది.

ఇంద్రధనుస్సులో సప్త వర్ణాలుంటాయి. ఈ వర్ణ సంఖ్య సప్త జిహ్వుడైన – 'అగ్ని'ని కూడా సూచిస్తుంది కాబట్టి, ఈ ఉదయ కాలంలో అమ్మవారిని 'అగ్ని తేజస్స్వరూపిణి' గా ఫాలభాగంలో ధ్యానించాలి.

అమ్మవారి ఫాలభాగం బహుళ అష్టమి నాటి చంద్రుని పోలి ఉంటుందని 'అష్టమీ చంద్ర విభ్రాజ దళికస్థల శోభితా' అనే నామంలో చెప్పబడింది. ఒక దాని ప్రక్కన ఒకటి వరుసగా ఉండే కనుబొమ్మలపైన అర్ధవృత్త రూపంలో ఉండే ఫాలభాగం ఇంద్రధనుస్సు ఆకారాన్ని కూడా సూచిస్తుంది. కాబట్టి – 'ఇంద్ర దనుఃప్రభా' అనే నామం అమ్మవారికి చాలా సార్థకమైనది. సముచితమైనది కూడా! (వాస్తవానికి 'ఫాలస్థా – ఇంద్రధనుఃప్రభా' – ఈ రెండు నామాలు జంటగా చెప్పుకోవాలి.)

ఇంద్రధనుస్సు రంగుల కాంతులతో సమానమైన కాంతులతో వెలుగొందునది – అని ఈ నామానికి అర్థం.

# 595. హృదయస్థా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'హృదయస్థాయైనమః' అని చెప్పాలి.

హృదయ = హృదయమునందు, స్థా = ఉండునది.

హృదయం - జీవన ప్రసారానికి, జీవన వ్యాపార నిర్వహణకు, అనురాగ ప్రసారానికి కేంద్రం. జీవకారకుడు, శక్తికారకుడు అయిన సూర్యునికి ఈ హృదయం స్వస్థానం. అందుకే - ఈ హృదయాన్ని సూచించే సింహరాశి సూర్యునికి స్వస్థానంగా జ్యోతిశ్శాస్త్రంలో చెప్పబడింది.

మనలో పాపం అంటని ప్రదేశం ఈ 'హృదయమే' ! దీంట్లోనే 'దహరాకాశం' - అంటే, పంచభూతాల్లోని ఆకాశానికి (Space) మచ్చు (Sample) లాంటిది ఉంటుంది. దీన్నే 'దభ్రం' అని కూడా అంటారు. ఈ హృదయం వద్దనే అనాహత పద్మం ఉంటుంది. అందుకే - ఈ హృదయాన్ని 'హృత్పుండరీకం' అన్నారు. (పుండరీకం అంటే 'పద్మం' అని అర్థం) ఈ హృత్పుండరీకం శరీరంలోని 'మధ్యస్థానం'గా, ప్రధాన కేంద్రంగా ఉంటుంది. ప్రతి జీవిలోను ఈశ్వరునిగా పరమేశ్వరాంశ ఉండేది ఇక్కడే ! ('ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే అర్జున తిష్ఠతి' - గీత) మనలో శోకము ఉండని ప్రదేశం - పరమాత్మ ఉండే ప్రదేశం ఇదే ! ఈ విషయాన్ని తైత్తిరీయంలో కూడా -

''దభ్రంవిపాపం పరమేశ్మభూతం
హృత్పుండరీకం పురమధ్యసగ్గంస్థమ్
తత్రాపి దభ్రం గగనం విశోకః
తస్మిన్ యదన్తస్తదుపాసితవ్యమ్''

అని - మహానారాయణంలో చెప్పబడింది. హృదయాన్ని సూచించే సింహరాశినే పరమేశ్వరి వాహనంగా కలిగి ఉంటుందని 'సింహాసనేశ్వరి' అనే నామం కూడా ఈ లలితా సహస్ర నామాల్లో మొదట్లో వస్తుంది. (అసలు సింహాసనం అనే పదమే ఈ విశిష్టార్థంతో

ఏర్పడింది) ఇటువంటి లక్షణాలు గల హృదయంలో అమ్మవారు ఉన్నట్లుగా మధ్యాహ్న కాలంలో భావించి ధ్యానం చెయ్యాలి.

'హృదయమునందు ఉండునది' - అని ఈ నామానికి అర్థం.

## 596. రవిప్రఖ్యా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రవిప్రఖ్యాయైనమః' అని చెప్పాలి.

రవి = సూర్యునితో సమానమైన కాంతితో, ప్రఖ్యా = **వెలుగొందునది, లేదా** ఉచ్చారణతో ప్రకాశించునది.

మధ్యాహ్న సూర్యుణ్ణి 'రవి' అని చెప్పుకోవచ్చును. ఎందుకంటే 'ర' - అంటే రగులుతూ, వి = అంటే విజృంభించినవాడు - అని ఒక క్రొత్త అర్థాన్ని చెప్పుకుంటే - విజృంభించి, పరాకాష్ఠ స్థితికి చేరిన సూర్యుడే 'రవి' ఔతాడు కాబట్టి - అంటే మధ్యందిన మార్తాండుణ్ణి 'రవి' గా అర్థం చెప్పుకుంటే ఈ 'రవి' లాగా ప్రఖ్యాతి నొందినదిగా - అంటే మనలో వెలుగొందునదిగా, లేదా - ఉచ్చారణతో ప్రకాశించునదిగా అమ్మవారిని సమన్వయ పరచుకోవాలి. - అని ఈ 'రవిప్రఖ్యా' నామం సూచిస్తుంది.

మధ్యాహ్న కాలంలో హృదయమునందు అమ్మవారు ఉన్నట్లుగా భావించి, ధ్యానించాలని గత రెండు నామాలు కలిసి సూచిస్తాయి. అందుకే - 'హృదయస్థా' - 'రవి ప్రఖ్యా' - అనే ఈ రెండు నామాలు జంటగా చదువుకోవాలి.

భౌతికమైన వెలుగే (Physical light) కాకుండా - అర్థం చేసుకోడం (Understanding) అనేది కూడా ఒక వెలుగే ! ఈ వెలుగును మానసిక ప్రకాశము(Mental light) అన్నారు. జ్వాలాకూలుడనే ఒక గురువు(Master D.K.) - దర్శన జ్ఞాన ప్రకాశాన్ని 'ఆధ్యాత్మికమైన వెలుగు' (Spiritual light) అన్నారు. ఇలా భౌతిక, మానసిక, ఆధ్యాత్మికమైన వెలుగులన్నిటికీ సూర్యుడే మూలం. ఈ మూడు కక్ష్యలలోని సూర్యునికి, వెలుగులకు మూలకారణంగా అమ్మవారిని హృదయంలో ధ్యానం చెయ్యాలి.

'సూర్యునితో సమానమైన కాంతితో వెలుగొందునది' అని ఈ నామానికి అర్థం.

# 597. త్రికోణాంతర దీపికా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'త్రికోణాంతరదీపికాయై నమః' అని చెప్పాలి.

త్రికోణ = మూడు బిందువులతో ఏర్పడు త్రిభుజము యొక్క, అంతర = మధ్యమున, దీపికా = వెలుగుచుండునది.

శ్రీ చక్రంలోని కేంద్ర బిందువు చుట్టూ ఆవరించి ఉండే ప్రథమ త్రిభుజాన్నే అష్టమావరణ త్రికోణంగా అనుకుంటే - ఆ త్రిభుజం మధ్యలో కేంద్ర బిందువు వద్ద వెలుగులు విరజిమ్ముతూ ఉండేది' అని ఒక అర్థం.

ఇంతకు పూర్వం చెప్పిన నామాల్లోని చంద్రుడు, అగ్ని, సూర్యుడు ఈ మూడు వెలుగుల మూర్తులను మూడు బిందువులుగా (శీర్షాలుగా) ఊహించి, వాటితో ఏర్పడే త్రిభుజాన్ని ఊహిస్తే అటువంటి త్రిభుజ త్రికోణాల మధ్య ఆ మూడింటికి మూలకారణ ప్రకాశ బిందువుగా వెలుగులు విరజిమ్ముతూ అమ్మవారు ఉంటుందని ఈ నామానికి అర్థం. ఈ విషయాన్ని ఈ క్రింది పటంలో చూపిన విధంగా దర్శించి అర్థం చేసుకోవచ్చును. అలాగే - భూత, భవిష్యత్, వర్తమానాలను మూడు బిందువులుగా తీసుకుంటే, ఆ మూడు బిందువుల త్రిభుజానికి మధ్యగా అమ్మవారు సర్వజ్ఞగా ఉంటుందని కూడా ఈ నామానికి అర్థం చెప్పవచ్చును. అలాగే - ప్రథమ, మధ్యమ, ఉత్తమ పురుషులకు(IIIrd, IInd, Ist Person) మధ్యగా మూలపురుషుడైన శివుని రూపంగా ప్రకాశిస్తూ ఉంటుందని ఈ నామాన్ని అర్థం చేసుకోవచ్చును.



## 598. దాక్షాయణీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు దాక్షాయణ్యై నమః' అని చెప్పాలి.

దాక్షాయణీ = దక్షుని కుమార్తె.

ప్రజానంసర్గానికి సంబంధించిన వారే ప్రజాపతులు. ఈ ప్రజాపతులలో 'దక్షుడు' ఒకడు. ఈ దక్షుడు పరమేశ్వరీ భక్తుడు. అతని భక్తికి ప్రతిఫలంగా దక్షుని కూతురుగా అమ్మవారు పుట్టింది. అందుకని అమ్మవారికి 'దాక్షాయణి' అనే పేరు వచ్చింది. ఈ విధంగా ఉన్న అమ్మవారి అవతార విశేషాలు రాబోయే రెండు నామాల్లోను చెప్పబడతాయి.

'దక్షప్రజాపతి కుమార్తె అని – ఈ నామానికి అర్థం.

## 599. దైత్యహంత్రీ

నాలుగు అక్షరాల నామం. ఈనామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'దైత్యహంత్ర్యై నమః' అని చెప్పాలి.

భండాసుర మహిషాసురాది దైత్యులను – అనగా, రాక్షసులను సంహరించి వారి బారి నుండి శిష్టులను కాపాడినది కాబట్టి 'దైత్య హంత్రీ' అనే నామం వచ్చింది.

కశ్యపప్రజాపతికి అదితి, దితి అని ఇద్దరు భార్యలు. అదితికి పుట్టినవారే అమరులైన దేవతలు. దితికి పుట్టినవారే దైత్యులైన రాక్షసులు. జ్ఞాన ప్రకాశ సంపర్క భావాలకు దేవతలు ప్రతీకలైతే – అజ్ఞాన తిమిర సంపర్క భావాలకు రాక్షసులు ప్రతీకలు.

ఈ అజ్ఞాన తిమిర ఆసురీ ప్రవృత్తులను హననం చేసేది కాబట్టి అమ్మవారికి 'దైత్యహంత్రీ' అనే నామం వచ్చింది.

1) భండాసుర మహిషాసురాది దైత్యులను సంహరించునది.

2) అజ్ఞాన, ఆసురీ ప్రవృత్తులను నిర్మూలించునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## ౬౦౦. దక్షయజ్ఞవినాశినీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'దక్షయజ్ఞ వినాశిన్యై నమః' అని చెప్పాలి.

దక్షయజ్ఞ = దక్షయజ్ఞమును, వినాశినీ = నాశము చేసినది.

అహంకార దర్పంతో చేసిన దక్షుని యజ్ఞానికి వెళ్ళి, అక్కడ జరిగిన శివనిందను భరించలేక, పరాభవింపబడిన దక్షుని కూతురు ఐన సతీదేవి రూపంలో ఉన్న అమ్మవారు అగ్నిలో తన దేహాన్ని ఆహుతి చేసుకున్నట్లు పురాణ గాథ!

(ఈ కథ చాలా అర్థవంతమైన అంతరార్థంతో ఉన్న కథ. ఈ గాథ యొక్క అంతరార్థాన్ని ఇక్కడ వివరించడం సమంజసం కాదు. వివరాలు కావాలనుకునే వారు మా గురుదేవులు వ్రాసిన భాగవతంలోని దక్షయజ్ఞ కథను చదువుకోండి.) తనసతి అలా అవడంతో శివునికి కోపం వచ్చింది. శివుని ప్రేరణతో వీరభద్రుడు దక్షుని యాగాన్ని ధ్వంసం చేశాడు. ఇలా దక్షయజ్ఞ వినాశానికి కారణం అయింది కాబట్టి అమ్మవారికి 'దక్షయజ్ఞ వినాశినీ' అనే నామం వచ్చింది.

దక్షుని యజ్ఞమునకు వినాశకారిణి – అని ఈ నామానికి అర్థం.

## 601. దరాందోళితదీర్ఘాక్షీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'దరాందోళిత దీర్ఘాక్ష్యై నమః' అని చెప్పాలి.

దర = కొంచెముగా, ఆందోళిత = చలించు, దీర్ఘ = ఆకర్ణాంతవిశాలమైన, అక్షీ = కన్నులు గలది.

అమ్మవారి కళ్ళు – చైతన్యవంతంగా, చురుగ్గా, ఆకర్షణీయంగా, విశాలంగా, ప్రకాశవంతంగా, అనురాగ అనుగ్రహపూరితంగా, ఆజ్ఞాపించగలిగే వీక్షణాలతో ఉంటాయి. వీటిలో కొన్ని లక్షణాలుగల కళ్ళుఉండేవారు ఉండవచ్చుగాని ఈ అన్ని లక్షణాలు ఉన్న కళ్ళు ఒక్క అమ్మవారికే ఉంటాయి. చంచలమైన మనస్సు ఉండకూడదు

గాని, చంచలమైన కళ్ళు – చక్కదనానికి దోహదపడే కనుముక్కు తీరుకు శోభను ఆకర్షణను చేకూరుస్తాయి. కంటి చూపులు – చురుక్కుమనేట్టుగా ఉండకూడదు కాని చురుకుతనంతో ఉండవచ్చు).

సౌందర్యలహరిలో ఆదిశంకరులు ''దృశాద్రాఘీయస్యా.... హిమకరః'' అన్న 57వ శ్లోకంలో అమ్మవారి దీర్ఘ నేత్రాల గురించి వర్ణిస్తారు. ఈ శ్లోక వివరణ, ఈ లలితా సహస్ర నామ వివరణ ప్రథమ భాగంలోని 'వక్త్రలక్ష్మీ పరీవాహ చలన్మీ నాభలోచనా' అనే 18వ నామ వివరణ, ద్వితీయ భాగంలోని 'లోలాక్షీకామరూపిణీ' అనే 454 నామం యొక్క వివరణ గూడా ఇక్కడ చదువుకోవాలి. అమ్మవారి మూడు కళ్ళు – 'పగలు', 'సంధ్య', 'రాత్రి' కాలాలను సూచిస్తాయి. ఈ కాలలు ఒక దాని తరువాత ఒకటి గాని రావు. అంధుకని అమ్మవారి కళ్ళు కాలగమనంలో వీటిని సూచిస్తున్నప్పుడు మారి పోతూ చంచలంగా ఉంటాయని ఈ నామం సూచిస్తుంది.

1) కొంచెముగా చంచలముగా ఉన్న (ఆకర్ణాంత) విశాల నేత్రములు గలది.

2) పగలు, సంధ్య, రాత్రి కాలాలను సూచించడంలో కొంచెం చంచలంగాను, దీర్ఘంగాను, ఉండే విశాల నేత్రాలు గలది' – అని ఈ నామానికి అర్థాలు చెప్పుకోవచ్చును.

## 602. దరహాసోజ్జ్వలన్ముఖీ

ఎనిమిది అక్షరాల నామం. ఈనామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'దరహాసోజ్జ్వలన్ముఖ్యై నమః' అని చెప్పాలి.

దరహాస = మందహాసము చేత, ఉజ్జ్వల = ప్రకాశించు, ముఖీ = ముఖము కలది.

అమ్మవారి ముఖం వికసించిన పద్మంలాగా ఉంటుంది. పద్మానికి వికాసం ఉన్నట్లే అమ్మవారి ముఖానికి కూడా ఈ వికాసం సహజంగా ఉంటుంది. ఇంక నవ్వుతున్నప్పుడు అమ్మవారి ముఖం విశేషంగా ప్రకాశిస్తూ వికాసవంతంగా ఉంటుంది.

అమ్మవారి ముఖం నుండి వాఙ్మయం వ్యక్తమౌతుంది. సారస్వత సృష్టి, భౌతిక సృష్టికూడా అమ్మవారి ఉచ్చారణ వల్లనే జరుగుతాయి. అంటే – ఈ రెండూ అమ్మవారి ముఖ వినిర్గతాలే ! అందుకే అమ్మవారు ఉజ్జ్వలమైన ముఖం కలిగినది. ఈ ఉజ్జ్వలమైన

ముఖానికి అమ్మవారి చిరునవ్వే కారణం అని ఈ నామం చెబుతుంది. అమ్మవారి ముఖంలో ఈ చిరుదరహాసం ఎప్పుడూ చెదరకుండా ఉంటుంది. అందుకే - అమ్మవారి ముఖం చెక్కు చెదరని ప్రకాశంతో ఉంటుంది.

'చిరుదరహాసంచేత ప్రకాశించే ముఖం కలది' అని ఈ నామానికి అర్థం.

## 603. గురుమూర్తిః

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'గురుమూర్త్యై నమః' అని చెప్పాలి.

గురు = గురువు యొక్క; మూర్తిః = రూపముగా ఉన్నది.

'ఉపదేశం' చేసే వారిని 'గురువు' అంటారు. అయితే -

'గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః

గురస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః - అన్న శ్లోకాన్ని బట్టి సత్వ రజస్తమోగుణ ప్రకృతులకు అధిదేవతలైన త్రిమూర్తులే కాకుండా, త్రిగుణాతీతమైన పరబ్రహ్మను గూడా సూచించేవాడే గురువు. అంతేకాదు -'గు' కారో అంధకారస్తు 'రు' కార స్తన్నిరోధకః-అంధకారనివృత్యాతు (అంధకార వినాశిత్వాత్) 'గురు' రిత్యభిదీయతే''.'గురు' పద నిర్వచనాన్ని తెలిపే ఈశ్లోకంలో-'గురు' పదంలో - 'గు' కారం మనలోని అంధకారాన్ని, అజ్ఞానాన్ని సూచిస్తే - 'రు' కారం ఆ అంధకారాన్ని, షజ్ఞానాన్ని నిర్మూలించి ప్రజ్ఞాన ప్రకాశవంతుల్ని చెయ్యడాన్ని సూచించే అక్షరంగా తీసుకోవాలని ఈ శ్లోకానికి అర్థం. కాబట్టి-ఆ గురువు ఉపదేశించేది అందుకు తగ్గ స్థాయిలో ఉండే-ఆత్మవిద్య, బ్రహ్మవిద్య, శ్రీవిద్య అయిఉండాలి. ఇలాంటి మంచి విషయాలు ఉపదేశించే గురువులందరి రూపంలోను అమ్మవారే ఉంటుందని అర్థం చేసుకోవాలి.

మనకు ఏది కావలసినా ఏదో ఒక రూపం ద్వారా దర్శన మిచ్చి ఆదుకుని, అవసరాలు, అనుమానాలు తీర్చే గురువు రూపంలో ఉండేది అమ్మవారే అని ఈ నామాన్ని బట్టి గ్రహించాలి.

విశ్వంలో ప్రథమ గురువు నారాయణుడే ! ప్రథమ శిష్యుడు బ్రహ్మ. నారాయణుడు చెప్పింది చెప్పినట్లుగా బ్రహ్మ చెయ్యడం జరిగింది. కాలగమనంలో గురుశిష్యుల మధ్య రాను రాను అంతరాలు, అభ్యంతరాలు, అభిప్రాయ భేదాలు గల గురుశిష్యులే వస్తూ వచ్చారు. అందుకే గురుపరంపరను స్మరించి, నమస్కరించి ప్రసంగాలను, ప్రవచనాలను ప్రారంభించేవారు -

'నారాయణ సమారంభాం శంకరాచార్య మధ్యమాం

అస్మదాచార్య పర్యంతాం వందే గురు పరంపరాం. - అని గురు ప్రార్థన చేస్తారు.

కాబట్టి, 'నారాయణుడే' ఆది గురువు. అలాగే నారాయణునితో అభేదం అయిన 'నారాయణీ' అనే పేరుతో పిలువబడే అమ్మవారే ప్రథమ గురుమూర్తి. (''సదాశివ సమారంభాం...'' అని గూడా ఈ శ్లోకాన్ని కొందరు చెబుతారు. అప్పుడు గూడా శివస్వరూపిణి అయిన అమ్మవారే ఆదిగురు స్వరూపిణి అవుతుంది.)

గురువు రూపంలో ఉండునది - అని ఈ నామానికి అర్థం.

## 604. గుణనిధిః

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'గుణనిధయే నమః' అని చెప్పాలి.

గుణ = గుణములకు, నిధి = గనివంటిది.

గుణములంటే మంచి గుణాలనే తీసుకోవాలి. 'గుణ' పదానికి వ్యతిరేకం 'దోషం'. ఈ రెంటినీ కలిపి గుణదోషాలంటారు. అంటే - 'మంచీ - చెడూ' అని అర్థం. అయితే - అమ్మవారు మంచి గుణాలకే గని వంటిది.

'గుణము' అనే పదాన్ని త్రిగుణాలకు సంకేతంగా సూచించడం కూడా ఉంది. అప్పుడు - 'త్రిగుణాలైన సత్త్వ, రజస్తమోగుణాలకు నేపథ్యము, లేదా - మూలకారణమైన నిధి అమ్మవారు' - అని ఇంకో అర్థం. (మిగిలిన గుణాలన్నీ ఈ మూడింటి రకరకాల కలయికతో ఏర్పడేవే!)

'గుణ' పదం త్రిగుణాలను సూచిస్తుంది కాబట్టి, సాధారణంగా ఆ త్రిగుణాలను త్రిభుజంలోని మూడు భుజాలు, లేదా - శీర్షాలు, లేదా - కోణాలతోను సూచిస్తారు.

కాబట్టి – అటువంటి త్రికోణ, త్రిభుజ శీర్షాలతో కూడిన – త్రిభుజాలతో ఉండే (చతుర్భి శ్రీ కంఠైః శివయువతిభిః పంచభిరపి, ప్రభిన్నాభిః శంభోః నవభిరపి మూలప్రకృతిభిః – అంటే నాలుగు అయ్యవారికి (శివునికి) సంబంధించినవి, ఐదు అమ్మవారికి సంబందించినవి మొత్తం 9 త్రిభుజాలు శ్రీ చక్రంలో ఉంటాయి – అని సౌందర్యలహరిలో ఆదిశంకరులు శ్రీ చక్ర వర్ణన చేస్తారు) శ్రీ చక్రం అమ్మవారి స్వరూపానికి ప్రతీక కాబట్టి – 'గుణనిధిః' అంటే త్రికోణాదులకు నిధి వంటిది అని మరో అర్థం కూడా చెప్పవచ్చును.

1) సద్గుణములకు నిధి వంటిది.

2) సత్త్వరజస్తమోగుణములకు నేపథ్య నిధిగా ఉండునది.

3) త్రిభుజములకు నిధి వంటిది (శ్రీ చక్రంతో అభేదం వలన) – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 605. గోమాతా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'గోమాతాయైనమః' అని చెప్పాలి.

మాత, గోమాత, భూమాత – ఈ మూడూ పుణ్యవంతమైనవి. ఈ మూడింటికి మూలమైనది, పరమ పుణ్యవంతమైనది 'శ్రీమాత' కాబట్టి, అమ్మవారు – 'గోమాత'గా అర్చింపబడునది – అనే అర్థం చెప్పుకోవచ్చును.

గో = గోవులకు, మాతా = తల్లివంటిది.

'గో' అనే ఏకాక్షర పదానికి సంస్కృతంలో చాలా అర్థాలు ఉన్నాయి. ఈ అర్థాలే కాక సంకేతార్థాలు కూడా చాలా ఉన్నాయి.

'గో' పదానికి 'కిరణము' అనే అర్థం ఉంది. ఈ అర్థంలో 'గోమాత' అంటే – 'కిరణముల ఉత్పత్తికి కారణమైనది' అంటే సూర్యుడు అని ఒక అర్థం వస్తుంది. అపుడు ఈ నామం 'సవితృమండల మధ్యవర్తీ' అనే అర్థాన్నిసూచిస్తుంది.

'గో' అంటే భూమి అని కూడా అర్థం వుంది. 'మాతా' అంటే 'తల్లి' లేదా

'మూలము' లేదా 'నేపథ్యము' - అనే అర్థాలు తీసుకుంటే 'భూమి మొదలైన వాటి ఉనికికి కారణమైనది' - అనే అర్థం వస్తుంది.

'గో' అంటే 'ఇంద్రియము' అనే అర్థాన్ని బట్టి 'ఇంద్రియములను, 'మాతా' - అంటే, కొలతలు వేయునది - అంటే, మన చిత్త వృత్తులకు కొలతలు వేయునది - అని అర్థం.

1) గోమాతగా అర్చింపబడునది.

2) సవితృమండల మధ్యవర్తి.

3) భూమి మొదలైన గ్రహాదుల ఉనికికి కారణమైనది.

4) చిత్తవృత్తులను కొలచునది - అనే అర్థాలు ఈ నామానికి చెప్పుకోవచ్చును.

## ౬౦౬. గుహజన్మభూః

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'గుహజన్మ భువే నమః' అని చెప్పాలి.

గుహ = కుమారస్వామి, జన్మ = పుట్టుటకు, భూః (తల్లి) అయినది.

ఈ నామానికి సాధారణంగా అర్థం చెప్పుకోవాలంటే - 'కుమారస్వామికి జన్మనిచ్చినది' - అని అర్థం చెప్పుకోవచ్చును.

దాగి యున్న యవ్వనానికి (Conceived Youth) సంకేతం సుబ్రహ్మణ్యేశ్వర స్వామి. షట్చక్రాలతో న్యాసం చేసుకోడానికి, సమన్వయపరచుకోడానికి సరిగ్గా, 'శ, ర, వ, ణ, భ, వ' అనే ఆరు బీజాక్షరాలు కలిగిన మంత్రంతో ఈ సుబ్రహ్మణ్యేశ్వర స్వామిని ధ్యానించి, ఆరాధించాలి. ఈ మంత్రాన్నే 'షడక్షరీ మంత్రం' అంటారు. ఈ సుబ్రహ్మణ్యేశ్వర స్వామికి ఆరుముఖాలు (నోళ్ళు) ఉంటాయి. అందుకే - ఈ యన్ని 'షడాననుడు', 'షణ్ముఖుడు' - అని సంస్కృతంలోను 'ఆర్ముగం' అని తమిళ దేశస్థులు అంటారు. షట్చక్రాలకు, షట్కృత్తికలకు, ఈ షడాననుడైన సుబ్రహ్మణ్యేశ్వరస్వామికి - యోగపరంగా చాలా సంబంధము ఉంటుంది. ఈయన జన్మతిథి కూడా షష్ఠి. (నేను వ్రాసిన అక్షర గణపతి - కుండలినీవతి' అనే పుస్తకంలో మరిన్ని విశేషాలుంటాయి.) ఈ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి ప్రతిజీవిలోను ఉండే వ్యక్తిగతమైన కుండలినికి (వ్యష్టికుండలినికి)

అధిపతి. 'కుండలినీశక్తి' అనే తల్లివేరు లాంటి అమ్మవారికి – ఈ వ్యష్టి కుండలిని - పిల్లవేరు లాంటి కుండలినీ ఔతుంది. అందుకని అమ్మవారు 'గుహజన్మభూః' – అయింది.

(వృశ్చికరాశికి అధిపతి కుజుడు. కుమారస్వామినే కుజుడంటారు. ఈ కుమారస్వామిని గుహుడు అని కూడా అంటారు. ఈ వృశ్చికరాశి మనలో గుహ్యేంద్రియాలను సూచిస్తుంది. వృశ్చికరాశిని ఆంగ్లంలో 'Scorpio' అంటే 'తేలు' అంటారు. పాము గూడా దీనిలాంటిదే గాబట్టి పురాణాల్లో 'పాము' ను గూడా ఈ రాశికి చెందిన దానిగా సూచిస్తారు. సర్పాకార దేవత అయిన కుమారస్వామి (సుబ్రహ్మణేశ్వరస్వామి) యొక్క ఆధిపత్యంలో ఉండే వృశ్చికరాశి – పామును సూచిస్తుందని గూడా చెబుతారు.)

1) కుమారస్వామికి జన్మ నిచ్చినది.

2) పిల్లవేరు లాంటి వ్యష్టి కుండలినీశక్తికి తల్లి వేరు లాంటికుండలినీశక్తి –అనే అర్థాలు ఈ నామానికి చెప్పవచ్చును.

## 607. దేవేశీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'దేవేశ్యై నమః' అని చెప్పాలి.

దేవ = దేవతలకు, ఈశీ = పాలకురాలు.

'దివ్' అంటే వెలుగు అని అర్థం. 'దివము' అంటే – 'వెలుగులలోకము' అని అర్థం. దేవతలు అంటే 'వెలుగులలోకమునకు చెందిన వారు' అని అర్థం. అంటే వెలుగుల లోకం సూక్ష్మమైనదే. ఈ వెలుగుల లోకానికి చెందిన దేవతలూ సూక్ష్మమైన వారే! ఇటువంటి సూక్ష్మమైన వెలుగులలోకమునకు సంబంధించిన దేవతలందరికీ కారణభూతురాలు, ప్రధానమైన పాలకురాలు అయినది – అని ఒక అర్థం.

'దేవః' అంటే ప్రత్యేకంగా ఈశ్వరుడు, లేదా – శివుడు అని అర్థం వస్తుంది. 'కామేశ్వర ప్రాణనాడీ' అన్న నామం యొక్క వివరణ కూడా ఇక్కడ చదువుకోవాలి.

'కామేశ్వరుడు సృష్టికి ఉన్ముఖం కావాలంటే కావలసిన వ్యక్త స్వరూపిణి' అమ్మవారే!!

1) దేవతలకు పాలకురాలు.

2) శివుని ప్రాణేశ్వరి.

3) వెలుగుకు సంబంధమైన వాటి మూలకారకురాలు – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 608. దండనీతిస్థా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'దండనీతిస్థాయైనమః' అని చెప్పాలి.

'సమస్త విశ్వాన్ని పరిపాలించే 'శ్రీమహారాజ్ఞి' అమ్మవారు. రాజ్య పాలనాధికారులు ఆచరించవలసిన విధానాలు, అవలంబించవలసిన పద్ధతులు చాలా ఉంటాయి. పరిపాలన సక్రమంగా ఉండాలంటే ఎవరు చేయవలసిన, చేయగలిగిన పనులను వారిచేత చేయించాలి. అలా చేయిస్తూ పై నుండి పర్యవేక్షణ చెయ్యాలి. ఇదంతా రాజనీతి క్రిందకు వస్తుంది. దీనితో పాటే 'లోకనీతి' 'దండనీతి' కూడా ఉంటాయి. అనురాగవల్లి అయిన అమ్మవారు అందరినీ మాతృస్వరూపిణిగానే సాకుతుంది. రక్షిస్తుంది. అవసరమైతే శిక్షిస్తుంది కూడా ! తప్పుడు త్రోవలో పోయే వారిని, దుష్టబుద్ధులు గల దుర్మార్గులనీ శిక్షిస్తుంది. అయితే ఈ దుర్మార్గులందరినీ ఒకే విధంగా శిక్షించదు. వారి వారి దుష్టత్వాన్ని బట్టి, వారు చేసే దుష్కార్యాలను బట్టి శిక్షిస్తుంది. ఇలా శిక్షించడానికి దోహదపడే శాస్త్రమే 'దండనీతి శాస్త్రము' అంటారు. ఈ దండనీతిని పరిపాలకులందరూ అమలు పరుచుకోవచ్చును. ఈ దండనీతిలో కూడ అమ్మవారి ఆజ్ఞలు, అవలంబించిన విధానాలే ఉంటాయి కాబట్టి అమ్మవారు 'దండనీతిస్థా' అయింది.

'దండం' అంటే 'దండన' అనే అర్థం కాకుండా మనలో సూటిగా ఉండే 'వెన్నెముక' అని కూడా సంకేతార్థం ఉంది. యోగదండం, మేరుదండం, బ్రహ్మదండం – అని కూడా ఈ వెన్నెముకకు పేర్లు ఉన్నాయి. 'నీతి' అంటే దోహదము(Guidance) అని, ప్రణాళిక (Plan) విధానము (Manner of Conducting one self) అని కూడా అర్థాలు ఉన్నాయి. ఈ రెండు అర్థాలను బట్టి 'దండనీతి' అంటే – 'వెన్నెముకకు సంబంధించిన ప్రణాళిక' – అనే అర్థం వస్తుంది. వెన్నెముకకు సంబంధించిన ప్రణాళిక

అంటే – 'కుండలినీ యోగమే ! 'దండనీతిస్థా' అంటే ఈ కుండలినీ యోగమునందు ప్రధానముగా ప్రతిపాదింపబడునది – అని అర్థం వస్తుంది.

1) దండనీతి శాస్త్రము నందలి విషయములుగా ఉండునది.

2) కుండలినీ యోగమునందు ప్రధానముగా ప్రతిపాదింపబడునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 609. దహరాకాశరూపిణి

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'దహరాకాశరూపిణ్యై నమః' అని చెప్పాలి.

దహర = హృదయములో ఉండు, ఆకాశ = చోటు, రూపిణీ = రూపముగ ఉండునది.

'ఆకాశం గగనం శూన్యం' – అని అనడంలో 'ఆకాశ' మంటే 'శూన్యం' **(Vacuum) అనే అర్థం చెప్పుకోవాల్సి వస్తుంది. కాని, 'ఆకాశాద్వాయుః వాయోరగ్నిః...** అన్నాత్పురుషః' అనే తైత్తిరీయంలోని బ్రహ్మవల్లి ప్రకారం ఆకాశంలో నుండే మిగిలిన (పంచ) భూతాలు, ఓషధులు, అన్నాదికాలు వస్తున్నాయని చెప్పబడుతోంది. దీనిని బట్టి చూస్తున్నప్పుడు ఏమీ లేనట్లుగా కనబడేదే (Seeming Nothingness) గాని, వాస్తవానికి ప్రపంచంలోని సమస్తాన్ని తనలో లీనంచేసుకుని ఉన్నదే ఆకాశం (పంచదార పటికబెల్లం, ఉప్పు మొదలైనవి కరిగి ఉన్న నీళ్ళలాగా) అందుచేత ఆకాశాన్ని పూర్ణం అనాలిగాని 'శూన్యం' కాదు అని తెలుస్తోంది కదా !

తనలో అన్నీ కరిగి ఉన్న నీళ్ళు వేడెక్కడం ప్రారంభిస్తే – ఆ నీళ్లల్లో లీనమై ఉన్న పంచదార మొదలైనవన్నీ మళ్లీపునః స్ఫటికీకరణ క్రియగా బయటకు వ్యక్తమైనట్లే ఆకాశంలోంచి సృష్టిగా అన్ని పదార్థాలు బయటకు వ్యక్తమౌతాయి.

ఇలాంటి పూర్ణమైన ఆకాశమే ప్రతి జీవి హృదయంలోను చోటు రూపంలో ఉండేది. హృదయంలో ఈ చోటు కనబడకుండా ఉంటుంది. కాబట్టి దీనిని 'మాటు' అనవచ్చును. బయట వున్న ఆకాశాన్ని 'చోటు' అనాలి. ఈ చోటుకు 'స్పందన' అనేది

అభిలక్షణంగా ఉంటుంది. (Space Pulsates) బయట ఉండే ఈ చోటు యొక్క స్పందనను బట్టి - పాలపుంత - గెలాక్సీలు సంకోచిస్తూ, వ్యాకోచిస్తూ జీవనానికి కారకమౌతున్నాయి. అలాగే, జీవి హృదయంలోని చోటు యొక్క స్పందనను బట్టే - ఊపిరితిత్తులు సంకోచించి వ్యాకోచించి తద్వారా శ్వాస ప్రసారం జరగడం, ధమనులు మంచి రక్తాన్ని హృదయంనుండి తీసుకువెళ్లడం, సిరలు చెడురక్తాన్ని హృదయానికి తీసుకురావడం, తద్వారా రక్తప్రసరణ జరగడం - ఇత్యాది ముఖ్యమైన కార్యక్రమాలు మనలో నిర్వహింపబడుతున్నాయి.

ఈ బయట వుండే చోటుకు రూపం (ఆకారం) ఉండకపోవచ్చు. కాని, హృదయంలో ఉండే చోటుకు (దహరాకాశం లేదా 'మాటు'కు) రూపం ఉంటుంది. ఈ రూపంగా ప్రతి జీవి హృదయంలోను ఉన్నది అమ్మవారే! అని ఈ నామంచెబుతోంది. సంకల్పాలన్నీ ఇక్కడ నుండి పుట్టి బుద్ధిలోకి పోతాయి. అవి తరువాత దేహం ద్వారా బాహ్యంగా ఆచరింపబడతాయి. 'హృదయస్థా' నామ వివరణ కూడా ఇక్కడ చదువుకోవాలి.

హృదయమందలి చోటు రూపములో ఉండునది - అని ఈ నామానికి అర్థం.

## 610. ప్రతిపన్ముఖ్యరాకాంతతిథిమండల పూజితా

పదహారు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ప్రతి పన్ముఖ్యరాకాంత తిథిమండల పూజితాయై నమః' అని చెప్పాలి

ప్రతిపత్ = పాడ్యమి నుండి, ముఖ్య = ముఖ్యమైన, రాకా + అంత = రాకాంత = పూర్ణిమ వరకు ఉండు, తిథి మండల = తిథివర్గముచే, పూజితా = పూజింపబడునది.

ఈ నామం చాలా ముఖ్యమైన నామం. ఈనామానికి చాలా హేతుబద్ధమైన, శాస్త్రీయమైన యోగపరమైన వివరణ ఉంది.

అమ్మవారి పంచదశాక్షరీ మంత్రానికి 15 అక్షరాలు ఉంటాయని మనకు తెలుసు. అలాగే ఒక్కొక్క పక్షంలో 15 తిథులుంటాయని తెలుసు. ఒక్కొక్క తిథికి ఒక్కొక బీజాక్షరం చొప్పున సమన్వయించుకుంటే - సరిగా 15 తిథులకు 15 బీజాక్షరాలు

సరిపోతాయి. 'ప్రతిపత్' అంటే శుద్ధపాడ్యమి, 'రాకా' అంటే 'పూర్ణిమ' కాబట్టి, ఈ పంచదశీ మంత్రాన్ని శుక్ల పక్షానికి చెందిన15 తిథులతో సమన్వయ పరచుకుని అమ్మవారిని ధ్యానించి అర్చించాలి. 'ప్రతి మాసానికి చెందిన శుక్ల పక్షంలోని పాడ్యమి నుండి పూర్ణిమ దాకా పూజింపబడేది' అని ఈ నామానికి సూటి అర్థం.

తిథులకు సంబంధించిన నిత్యాదేవతల వర్గంచే పూజింపబడునది – అని ఇంకో అర్థం చెప్పుకోవచ్చును.

పై రెంటిలో మొదటి అర్థానికి ఇంకా శాస్త్రీయమైన వివరణ కావలసి ఉంది. ఈ నామంలో 'ప్రతిపత్' 'ముఖ్య'' 'రాకా' పదాలకు ప్రత్యేకమైన అర్థాలున్నాయి.

'ప్రతిపత్' అంటే 'పాడ్యమి' అనే అర్థం అయినా బహుళ పాడ్యమి కాకుండా శుద్ధ పాడ్యమి అనే నిర్ధారణ ఈ పదంలో ఉంది. ప్రతిపత్ అంటే 'ప్రతిపాదన చేయునది' – అంటే మాసంలోని తిథులవరుసను ప్రతిపాదన చేయునది. అంటే – మొదటి తిథి అని అర్థం. మాసంలో మొట్టమొదటగా వచ్చేది శుద్ధ పాడ్యమే కదా!

**'ముఖ్య' అనే పదం 'ముఖము' పదం నుండి ఉత్పాదింపబడింది. 'ముఖము' లేదా 'ఆముఖము' అంటే 'ముందర' (Commencement) లేదా మొదలు (Beginning) అనే అర్థం కూడా ఉంది. దీనిని బట్టి 'ముఖ్య' అంటే – 'ప్రారంభానికి సంబంధించిన అనే అర్థం వస్తుంది.**

'రాకా' అంటే 'పూర్ణిమా' అనే అర్థం అయినా 'పరిపూర్ణమైన పూర్ణిమ' (లేదా వెన్నెల పొర్లిపోవునట్లుండు చంద్రుడున్న రాత్రి' అని చెప్పుకోవాలి. ఇలాంటి పూర్ణిమలు సంవత్సరం మొత్తం మీద రెండు వస్తాయి. ఒకటి ఆశ్వయుజ పూర్ణిమ రెండోది 'కార్తీక పూర్ణిమ'. ఈ రెండూ శరదృతువుకు సంబంధించిన పూర్ణిమలు. ఖగోళశాస్త్రంలో ఈ రాకాచంద్రుణ్ణి 'Harvest Moon' అంటారు. (దీనికి సంబంధించిన విశేషాలు ప్రథమ భాగంలోని పీఠికలో చదువుకోండి). మళ్ళీ రెండు పూర్ణిమలలో మొదట వచ్చేది 'ఆశ్వయుజ పూర్ణిమ' ఔతుంది.

'ముఖ్య' అనే పదం– పైన చెప్పిన 'ఆశ్వయుజ పూర్ణిమ' అనే అర్థాన్ని నిర్ధారిస్తుంది. ఎందుకంటే అమ్మవారికి సంబంధించిన వన్నీ చంద్రుని పరంగానే సమన్వయ పరచుకోవాలి.

ఈ చంద్రుడు మొట్టమొదటి రాశి అయిన 'మేషం'లో మొట్టమొదటి నక్షత్రం అయిన 'అశ్విని'లో ఉండగా వచ్చే మాసమే – 'ఆశ్వయుజ మాసం'. అశ్విని ఉన్న చంద్రునికి సరిగా 180$^0$ (సమసప్తకంలో) ఎదురుగా సూర్యుడు ఉన్నపుడు వచ్చే పూర్ణిమ 'ఆశ్వయుజ పూర్ణిమ' అవుతుంది. ఈ పూర్ణిమ దినానికి ముందు 15 రోజులు తర్వాత 15 రోజులు కలిసి ఆశ్వయుజ మాసం అవుతుంది. అమ్మవారి పరంగా సంవత్సరంలో ఆశ్వయుజ మాసం మొదటిది ఔతుంది. కాబట్టి – 'ప్రతిపన్ముఖ్యరాకాంత', అంటే – 'ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నుండి ఆశ్వయుజ పూర్ణిమ వరకు' అనే అర్థం వస్తుంది. ఈ 15 రోజులు అమ్మవారు విశేషంగా పూజింపబడుతుంది. ఇది యోగపరమైన ఆరాధనా విధానం.

అయితే 'శరన్నవరాత్రులివేనా' ? అంటే – ఈ 15 రోజుల్లోనే ఆశరన్నవరాత్రులు కూడా వస్తాయి. మరైతే నవరాత్రులేమిటి ? అది వేరే కథ. భండాసుర సంహారం – ఆశ్వయుజ శుద్ధ నవమి రోజున జరిగింది. ఆ మర్నాడు దశమి రోజున ఆనందంగా పండుగ చేసుకుంటారు. కాబట్టి, మొత్తం దశ రాత్రులుగా – దసరా అనే పదం వచ్చింది. విజయానికి సంబంధించిన దశమి కాబట్టి 'విజయదశమి' అయింది. ఇది సాధారణంగా దసరా ఉత్సవాలు జరుపుకునే ఆరాధనా విధానం.

1) పాడ్యమి నుండి పూర్ణిమ వరకు ఆరాధింపబడునది.

2) నిత్యాదేవతలచే పూజింపబడునది.

3) ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నుండి ఆశ్వయుజ పూర్ణిమ వరకు ఆరాధింపబడునది. – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 611. కళాత్మికా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కళాత్మికాయై నమః' అని చెప్పాలి.

కళ = కళలయొక్క, ఆత్మికా = రూపమైనది.

సకల కళలు అమ్మవారి పాదయుగళం నుండి వెలువడే కిరణోద్భూతములే ! ఈ కిరణాల గురించి సౌందర్యలహరిలో ''క్షితౌ షట్పాంచాశత్'' ...

అప్ప్యపరితవపాదాంబుజయుగమ్'' - అన్న శ్లోకంలో ఆదిశంకరులు వివరంగా చెబుతారు. ఈ శ్లోకంలో చెప్పిన దాని ప్రకారం పృథివీతత్వానికి చెందిన మూలాధార చక్రం అమ్మవారి పాదాల నుండి 56 కిరణాలను సంగ్రహిస్తుంది. అలాగే మణిపూర చక్రం 52, స్వాధిష్ఠానం 62, అనాహతం 54, విశుద్ధి 72, ఆజ్ఞాచక్రం 64 కిరణాలను గ్రహిస్తాయి. ఆరు చక్రాలు మొత్తం గ్రహించే కిరణాలు 360 ఔతాయి. ఈ కిరణాలన్నీ అమ్మవారి పాదార వింద యుగళం నుండి వెలువడినవే ! ఈ షట్చక్రకిరణాలకు అగ్ని, చంద్ర, సూర్య కళలకు గల సంబంధం 'అరుణోపనిషత్తు' లో చెప్పబడుతుంది. దీని ప్రకారం -

మూలాధార, మణిపూర చక్రాలకు సంబంధించిన 56 + 52 = 108 - అగ్నికి సంబంధించిన కళలు గాను, స్వాధిష్ఠాన, అనాహత చక్రాలకు సంబంధించిన 62 + 54 = 116 సూర్య సంబంధమైన కళలుగాను విశుద్ధి, ఆజ్ఞాచక్రాలకు సంబంధించిన 72 + 64 = 136 చంద్ర సంబంధమైన కళలుగాను సమన్వయ పరచుకోవాలి. అగ్ని కళలనే 'అర్చిష్మతీ కళలనీ, చంద్రకళలనే జ్యోతిష్మతీ కళలని, సూర్య కళలనే 'మహస్వత్' కళలనీ గూడా ఈ అరుణోపనిషత్తులో చెప్పబడుతుంది. ఈ 360 అమ్మవారి పాదోద్భూత కిరణాలే !

పైన చెప్పినవి కాక 327 వ నామంలో చెప్పిన చతుష్షష్టివిద్యా కళలు, చతుష్షష్టి వృత్తి కళలు కూడా అమ్మవారి స్వరూపాలే !

ఇవి కాక ప్రతి మంత్రంలోను ప్రతిపాదింపబడే బీజ, శక్తి, కీలక రూపంలో ఉండే ప్రధాన బీజాక్షరాలు గూడా అమ్మవారికళారూపాలే !

పైన చెప్పినవే కాక చతురవస్థలకు ఒక్కొక్క దానికి నాలుగు చొప్పున 4 X 4 = 16 కళలు గూడా ఉంటాయి. వీటి వివరాలు అనుబంధంలో తెలుపబడ్డాయి.

పైన తెలిపిన కళలన్నీ - అమ్మవారి స్వరూపాలే.

'సకల కళల స్వరూపిణి' - అని ఈ నామానికి అర్థం.

## 612. కళానాథా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కళానాథాయై నమః' అని చెప్పాలి.

కళ = కళలకు, నాథా = అధినాథురాలు.

(న + అథ = ఇటుపైన ఎవరూ లేరు అని అర్థం).

ఎవరికైనా ఇటుపైన ఎవరూ లేరు అనే వారు ఎవరైనా ఉంటే అలా ఉండే రెండోవారు మొదటి వారికి 'నాథ' లేదా 'నాథా' అవుతారు. సకల కళలు అమ్మవారి స్వరూపాలే! కాబట్టి కళలన్నిటిలో తెలియవలసినది - అమ్మవారే! కళలన్నిటికి పరమావధి కూడా అమ్మవారే!

'కళానాథు' డంటే చంద్రుడనే అర్థం కూడా ఉంది. చంద్రుడు - అమ్మవారికి; సూర్యుడు - అయ్యవారికి సంకేతాలని పీఠికలో చెప్పబడింది. కాబట్టి 'కళానాథా' అంటే 'చంద్రస్వరూపిణీ' అనే అర్థం కూడా వస్తుంది.

ఇంద్రియములను కళలతో పోలిస్తే ఇంద్రియాధిపతి అయిన మనస్సును సూచించే చంద్రుడు కళానాథుడౌతాడు. కాబట్టి, ఇంద్రియాధినాథురాలుగా కూడా అమ్మవారిని సూచించే అర్థం ఈ నామం తెలుపుతుంది.

1) కళలన్నిటిలో తెలియవలసినది.

2) కళలన్నిటికి పరమావధి.

3) ఇంద్రియాధినాథురాలు - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 613. కావ్యాలాపవినోదినీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కావ్యాలాపవినోదిన్యైనమః' అని చెప్పాలి.

కావ్య = కావ్యముల, ఆలాప = ఆలాపము నందు, వినోదినీ = వినోదించునది.

అమ్మవారి మణిద్వీపసభావేదికపై నిత్యము సాహిత్య గోష్ఠులతో, వేదాంత చర్చలు, లలితా రహస్య నామాలాపములు, సరస్వతీ దేవతా సంగీతకచేరీలు, వశిన్యాది వాగ్దేవతలచే స్తోత్ర పఠనాలు, అంతా ఆహ్లాదకరంగా, శ్రవణ పేయంగా ఉంటాయి. అమ్మవారు వీటన్నిటినీ వింటూ వినోదిస్తూ ఉంటుంది. చదివేవారిలోను, వినేవారిలోను గూడా

ఆనందించేది అమ్మవారే అని గ్రహించాలి. 'వాగర్థంబులు శ్రోతృవక్తలు తలంపన్ స్వామినీవే కదా!' అన్నాడు మహాకవి ధూర్జటి శివుణ్ణి స్మరిస్తూ.

మోక్షప్రాప్తికి - సాధారణంగా కావ్యాలాపాంశ్చవర్జయేత్' అంటారు. కాని అమ్మవారి 'కావ్యాలాపవినోదినీ' అన్న నామం దీని వ్యతిరేక భావాన్ని సూచిస్తుంది. అమ్మవారి నామాన్నే ప్రామాణికంగా తీసుకుని – ఇంద్రియ లౌల్యానికి, మనోవైకల్యానికి, చిత్త చాంచల్యానికి దారితీయకుండా, ఆహ్లాదకరంగా, ఆనందానుభూతి పరంగా ఉండేవి ఏవి ఎన్ని వినోదించినా తప్పులేదని, అదేమీ మోక్షప్రాప్తికి అడ్డుకాదని ఈ నామం సూచిస్తుంది.

'కావ్యాలాపములను వినోదించునది – అని ఈ నామానికి అర్థం.

## 614. సచామర రమావాణీ సవ్యదక్షిణ సేవితా

పదహారు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సచామరరమావాణీ సవ్యదక్షిణ సేవితాయై నమః' అని చెప్పాలి.

సచామర = వింజామరలను కలిగియున్న, అనగా – చేత పట్టుకుని విసురుచున్న, సవ్య = ఎడమవైపున, దక్షిణ = కుడివైపున – ఉన్న (వరుసగా) రమా = లక్ష్మీదేవిచేత, వాణీ = సరస్వతీ దేవి చేత, సేవితా = సేవింపబడునది.

విత్తానికి, విజ్ఞానానికి వరుసగా అధిష్ఠాన దేవతలైన సంపన్నలక్ష్మి, విద్యాసరస్వతి. ఈ ఇద్దరూ సింహాసనారూఢురాలైన అమ్మవారికి వరుసగా ఎడమవైపున, కుడివైపున నిలబడి వింజామరలు వీస్తూ ఉంటారని ఈ నామం సూచిస్తుంది. దీనిని బట్టి అమ్మవారిని సేవిస్తే ఈ ఇద్దరి వలన పొందవలసినవి గూడా అనుగ్రహింపబడతాయని సూచన ఈ నామంలో ఉంది. ఆదిశంకరులు గూడా సౌందర్యలహరీ స్తోత్రఫలశ్రుతిగా చెప్పిన "సరస్వత్యాలక్ష్మ్యా విధిహరిసపత్నో విహరతే..." అన్న 99వ శ్లోకంలో ఇదే విషయాన్ని ప్రతిపాదిస్తారు. అమ్మవారికి సంబంధించిన అష్టోత్తర శతనామావళిని పఠించేటప్పుడు గూడా 'ఓం, ఐం, హ్రీం, శ్రీం' బీజాక్షరాలు నామానికి ముందుగా ఉచ్చరిస్తాము. వీటిలో అమ్మవారి శక్తి బీజమైన 'హ్రీం'కు ఇరువైపులా సరస్వతీ బీజం 'ఐం', లక్ష్మీబీజం 'శ్రీం' ఉండటం గూడా ఇక్కడ గుర్తుచేసుకోవాలి. అమ్మవారికి కుడివైపు సరస్వతి, ఎడమవైపు

లక్ష్మీదేవి ఉంటారు. అమ్మవారికి ఎడమవైపు లక్ష్మీదేవి, కుడివైపు సరస్వతీదేవి ఉండి **వింజామరలతో** వీస్తూ ఉంటారని చెప్పబడిన ఈ నామంలో స్థూలంగా చెప్పకుండానే ఒక చక్కని విషయాన్ని వ్యాసులవారు నిగూఢంగా పొందపరచారు.

ఎప్పుడూ ఎడమవైపు ఉన్నవారి కంటె కుడివైపు ఉన్నవారి ఆధిక్యత ఎక్కువగా ఉంటుంది. ఈ నామంలో సరస్వతి – అమ్మవారికి కుడివైపున; లక్ష్మీదేవి – ఎడమవైపున ఉన్నట్లు చెప్పబడింది. అంటే – లక్ష్మీ సరస్వతుల విషయంలో ముందు సరస్వతీ దేవికే ప్రాముఖ్యం ఇవ్వబడిందని తెలుస్తోంది. సరస్వతి ఉంటే, అంటే – విద్య ఉంటే, ఆ విద్యతో లక్ష్మిని, అంటే – ధనాన్ని సంపాదించవచ్చు. ఇది గౌరవప్రదమైన విషయమే గూడా ! అయితే, లక్ష్మి – అంటే ధనం ఉన్నంతమాత్రాన, ఆ ధనంతో సరస్వతిని, అంటే – విద్యను స్వంతం చేసుకోవటం అంత తేలికైన విషయం కాదు. ఒకవేళ అలా డబ్బుతో విద్యను పొందినా, అలా పొందిన విద్య గౌరవప్రదం గూడా కాదు కదా! అందుకని, సరస్వతిదేవికి అమ్మవారి కుడి ప్రక్క స్థానం ఇచ్చి, ఎక్కువ గౌరవాన్ని సూచించారు వ్యాసులవారు. (కటాక్షకింకరీభూత కమలాకోటిసేవితా' అన్న 590వ నామం యొక్క వివరణ గూడా ఇక్కడ చదువుకోవాలి.

''వింజామరలు వీచుచూ తనకు ఎడమ ప్రక్కన, కుడి ప్రక్కన, నిలబడి ఉన్న లక్ష్మీ సరస్వతుల చేత సేవింపబడునది'' అని ఈ నామానికి అర్థం.

## 615. ఆదిశక్తిః

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు **'ఆదిశక్త్యై నమః' అని చెప్పాలి.**

ఆది = ప్రథమముగా నున్న, శక్తిః = శక్తి స్వరూపిణి.

మెలకువ వస్తే అన్ని శక్తులూ పనిచెయ్యడం ప్రారంభిస్తాయి. మెలకువ రాకపూర్వం కూడా మనలో చైతన్యవంతమైన శ్వాసప్రక్రియ జరుగుతూ, ప్రాణశక్తి పనిచేస్తూ ఉంటుంది. మెలకువకు సంబంధించిన చిచ్ఛక్తి, మెలకువ రాకముందు కూడా పనిచేసే చైతన్యవంతమైన ప్రాణశక్తి – ఈ రెండూ కూడా అమ్మవారే !

అలాగే సృష్టికి పూర్వం కూడా అయ్యవారికి సృష్టిగా వ్యక్తమౌదామనే కోరిక రూపంలోని ప్రేరణ శక్తి కూడా అమ్మవారే ! (సోఽ కామయత - బహుస్యాం - ప్రజాయేయేతి - తైత్తిరీయం)

అంటే - అటు బ్రహ్మాండపరంగాను ఇటు పిండాండపరంగాను కూడా అన్ని శక్తులకూ ఆదిలోను, నిర్వహణా కాలంలోను, అంతంలోను కూడా ఉండే శక్తిస్వరూపిణి - అమ్మవారే !

ఈ ఆదిశక్తి ఎక్కడ నుండి వస్తుందో మనం చెప్పలేం. మనకు అనిపించడానికి ముందే మనలో అనిపింపచేసే రూపంలోను, కనిపించడానికి ముందే కనిపింపచేసే రూపంలోను ఉంటుంది. ఈ ఆదిశక్తి మనలో - మనం నిద్రపోయిన తర్వాత నిద్రిస్తుంది, మనకన్నా ముందే మేలుకుంటుందేమో ననిపించేట్లుగా ఉంటుంది.

'అన్నిటికీ మూలకారణంగా ప్రప్రథమంగా ఉన్న శక్తిస్వరూపిణి' అని ఈ నామానికి అర్థం.

## 616. అమేయా

మూడు అక్షరాలనామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అమేయాయై నమః' అని చెప్పాలి.

అమేయా = కొలుచుటకు, గణించుటకు గాని, నిర్వచించుటకు గాని అలవి కానిది లేదా వీలుకానిది.

''నాయమాత్మా ప్రవచనేనలభ్యః'' పరమాత్మ - మన వచనాలకు, ప్రవచనాలకు, నిర్వచనాలకు లొంగేవాడు కాదు, లభ్యమయే వాడు కాదు - అని ఈ సంస్కృత వాక్యానికి అర్థం. ఆత్మేశ్వరి అయిన అమ్మవారు కూడా అంతే ! తైత్తిరీయంలో కూడా 'యతోవాచోనివర్తంతే అప్రాప్యమనసాసహా' అని చెబుతుంది. మన వాక్కులు, మనస్సుతో సహా ఎక్కడ దాకా వెళ్ళి, ముందుకు వెళ్ళ లేక ఆగిపోయి, వెనక్కి తిరుగుతాయో దానికి అవతల, అన్నిటికీ అతీతంగా ఉండే తత్త్వమే పరమాత్మతత్త్వం - అని దీని అర్థం.

'కొలతలకు, వచనాలకు, నిర్వచనాలకు, ప్రవచనాలకు లొంగనిది, లోబడనిది' – అని ఈ నామానికి అర్థం.

## 617. ఆత్మా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ఆత్మాయైనమః' అని చెప్పాలి.

ఆత్మా = ఆత్మ స్వరూపిణి.

సకలమునకు ప్రాణాధారమైన ఆత్మస్వరూపిణి అమ్మవారు. అన్నీ ఉన్నప్పటికీ ఏ ఒక్కటి లేకపోతే వాటన్నిటికీ విలువ ఉండదో, ఏ ఒక్కటి ఉండి మిగతావి ఏవీ లేకపోయినా ఆ ఒక్కదానికి విలువ ఉంటుందో దాన్ని 'ఆత్మ' అంటారు. ఈ ఆత్మ స్వరూపిణియే అమ్మవారు.

1) ఆత్మ స్వరూపిణి, ఆత్మేశ్వరి.

2) శివుని అష్టమూర్తులలో ఒక మూర్తి – అని ఈ నామానికి అర్థాలు.

## 618. పరమా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పరమాయై నమః' అని చెప్పాలి.

పరమా = సర్వోత్కృష్టమైనది (Supreme or Greatest conceivable)

అన్ని విషయాలకు – ఆది, మధ్య, అంతములందు ఉండగలిగి, అన్ని విషయాల పరిపూర్ణత్వం చెల్లుతూ – నిరాధార, నిరాశ్రయ, నిరపేక్షక లక్షణమే తత్త్వంగా గలది.

తైత్తిరీయం ఈ తత్త్వాన్ని గురించే బ్రహ్మవల్లిలో 'బ్రహ్మవిదాప్నోతిపరమ్' అని చెబుతుంది. బ్రహ్మవేత్త ఈ 'పరమ' సూచించే 'తత్త్వాన్ని' పొందుతాడు – అని దీని అర్థం. అంతేకాదు. 'పరమేవ్యోమన్ ప్రతిష్ఠితా' అని గూడా తైత్తిరీయం చెబుతుంది. ఈ మంత్రంలోని 'వ్యోమన్' అంటే – ఆకాశానికి 'పరమ' పదం సూచించే లక్షణం ఉంటుంది. ఎందుకంటే – ఆకాశానికి పైన చెప్పిన – ఆది మధ్య అంతములందు ఉంటూ,

అన్ని విషయాల పరిపూర్ణత్వం చెల్లుతూ, నిరాధార, నిరాశ్రయ, నిరపేక్షక లక్షణం ఉంటుంది కాబట్టి.

సర్వోత్కృష్టమైనది – అని ఈ నామానికి అర్థం.

## 619. పావనాకృతిః

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పావనాకృత్యైనమః' అని చెప్పాలి.

మనస్సుకు పవిత్రతను చేకూర్చేది ఏ ఆకృతిగా నేపథ్యంలో (Back ground) ఉన్నదో అది అమ్మవారే ! 'రమ్యాణి వీక్ష్యనిశయ్యశబ్దాః... అంటాడు కాళిదాసు. సంభాషణాదుల్లో – వాతావరణం ఎవరికీ బాధ కలగకుండా ఆనందదాయకంగా, ఆహ్లాదకరంగా ఉండే విధంగా ఉంటే – అక్కడ అమ్మవారు ఈ 'పావనాకృతి' లో ఉన్నట్లే! ఈ పావనాకృతిని ఆంగ్లంలో 'Beauty of consciousness' అనవచ్చును. జీవిత మాధుర్యాన్ని (Elexir of life) చవిచూడాలంటే – తప్పనిసరిగా కళాత్మకమైనటువంటి పవిత్రమైనటువంటి సౌందర్యం ఉండి తీరాలి. దీన్ని పొందనివాడు – అలా పొందనంత మేరకు – జీవితంలో కొంత కోల్పోయినట్లే (He is shaved of his beauty, sanctity and aesthetic consciousness) గతనామంలో చెప్పిన 'పరమ' మైన దానికే ఈ నామంలో చెప్పిన 'పావన' లక్షణం కూడా చెల్లుతుంది.

ప్రపంచంలో పవిత్రత అంతా ఒక రూపు కట్టుకుంటే – ఆ రూపమే అమ్మవారి 'పావనాకృతి' ఔతుంది. 'నహిజ్ఞానేన సదృశం పవిత్రమిహవిద్యతే – అన్న గీతావాక్యాన్ని బట్టి జ్ఞానాన్ని మించిన పవిత్రమైనది మరొకటి లేదు. కాబట్టి, అమ్మవారు 'జ్ఞానరూపిణి' – అని ఈ పావనాకృతి నామం సూచిస్తుంది.

1) పవిత్రమైన స్వరూపముగలది.

2) పవిత్రమైన ఆకృతులకు మూలమైనది.

3) ప్రపంచంలోని పవిత్రత అంతా రూపుకట్టుకొనిన ఆకారము కలది.

4) జ్ఞానరూపిణి – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 620. అనేకకోటిబ్రహ్మాండజననీ

పదకొండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అనేకకోటి బ్రహ్మాండ జనన్యై నమః' అని చెప్పాలి.

అనేక = అనంతమైన, కోటి = సమూహములుగా నుండు, బ్రహ్మాండ = బ్రహ్మాండములకు, జననీ = తల్లి

ప్రజాపతులు, దిక్పాలకులు, గ్రహతారకలు, సమస్త జీవ వస్తు జీవజాలములతో ఉండేదే - బ్రహ్మాండం. ఇటువంటి బ్రహ్మాండాలెన్నో ఉత్పన్నమవడం విలీనమవడం ఈ సృష్టి ప్రళయాల మధ్య జరుగుతూ ఉంటుంది. ఈ బ్రహ్మాండ సముదాయలన్నీ తనలో బీజప్రాయంగా ఉండేదే అమ్మవారు.

ఈ నామంలోని 'జననీ' పదం స్త్రీ స్వరూపిణిని తెలియ చేస్తుంది. కాబట్టి - స్త్రీ శరీరంలో ప్రతి కానుపుకీ అండాశయాలు((Ovaries) విచ్చుకున్నట్లు - ఈ బ్రహ్మాండాలన్నీ అమ్మవారి లోంచి ఉద్భవమౌతాయనే సమన్వయ భావంతో ఈ నామాన్ని అర్థం చేసుకోవచ్చును. ఇలాంటి నామాలను బట్టే అమ్మవారంటే ఎంతటిదో మనకు అవగాహన అయ్యేది. ఆవిడకు ఆవిడ ఎంతటిదో కూడా తెలియకపోవచ్చు! భాగవతం ద్వితీయ స్కంధంలో బ్రహ్మ నారదుడితో 'ఈ హరికి (దేవుడికి) ఆయన ఎంతటి వాడో ఆయనకే ఒక అవగాహన లేక పోవచ్చు గూడా!' అంటాడు. భాగవతంలోని ఈ బ్రహ్మ మాటలను గాని, లలితా సహస్రనామంలోని ప్రస్తుత నామం వివరణ గాని వింటున్నపుడు - ఇలాంటి వాళ్ళు కూడా ఉంటారా అని అనిపిస్తుంది. ఇది అర్థం అవాలంటే - ఆకాశాన్ని చూస్తే ప్రత్యక్ష నిదర్శనం ఏర్పడుతుంది. ఆకాశానికి తెలుసా అది ఎంతటిదో? అయినా - ఆ ఆకాశం ఉండటం ఎదురుగా చూస్తునే ఉన్నాం గదా!

మనకళ్ళలోను, మన మనస్సులోను ఎన్నైనా ఇమడకలవు కదా! అంత అనంతమైన శక్తి(Capacity) మనకళ్ళకు, మనస్సుకే ఉన్నపుడు - అనేక కోటి బ్రహ్మాండాలు తనలో ఇమడగలగడం, సకలసృష్టి స్వరూపిణి, పరబ్రహ్మస్వరూపిణి అయిన అమ్మవారికి ఉండటంలో ఆశ్చర్యమేముంది?

'అనంతమైన బ్రహ్మాండముల సముదాయమునకు తల్లి - అని ఈ నామానికి అర్థం.

## 621. దివ్యవిగ్రహా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'దివ్యవిగ్రహాయైనమః' అని చెప్పాలి.

'దివ్' అంటే 'వెలుగు' అని – 'విగ్రహా' అంటే 'రూపము' అని అర్థం కాబట్టి - దివ్య విగ్రహా అంటే 'వెలుగుచుండు రూపము ' లేదా 'రూపముగా మలచబడిన వెలుగు' – అనే అర్థాలు వస్తాయి.

'దివ్' అంటే వెలుగుల లోకము. 'విగ్రహా' అంటే 'యుద్ధము' (మిత్రలాభ, మిత్రభేద సంధి విగ్రహాది పంచతంత్రాల్లోని 'విగ్రహం' అంటే 'యుద్ధ'మనే అర్థంలో) కాబట్టి, వెలుగుల సూక్ష్మలోకంలో జ్ఞానస్వరూపిణిగా అజ్ఞానాసురలను దివ్యమైన పద్ధతిలో సంహరించి, జ్ఞాన ప్రకాశాన్ని నింపింది కాబట్టి అమ్మవారు 'దివ్య విగ్రహా'.

1) వెలుగుచుండు రూపము

2) రూపముగా మలచబడిన వెలుగు.

3) దివ్యమైన పద్ధతిలో యుద్ధము చేసినది – అని ఈ నామానికి అర్థం.

## 622. క్లీంకారీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'క్లీంకార్యైనమః' అని చెప్పాలి.

క్లీం = 'క్లీం' అను బీజాక్షరమునకు, కారీ = కారణభూతురాలు.

ఈ 'క్లీంకారీ' నామం నుండి 'ద్వైత వర్జితా' నామం దాకా 'వాగధీశ్వరీ' విద్యా విశేషాలు చెప్పబడతాయి.

'క్లీం' అక్షరాన్ని కామకళా బీజమంటారు. ఈ క్లీం బీజంలో 'క' కార 'ల'కార 'ఈం' కారాలుంటాయి. ఈ మూడు వరుసగా సరస్వతి, లక్ష్మి 'శక్తిస్వరూపిణి' అయిన పార్వతీ తత్త్వాలను సూచిస్తాయి. అంటే – అన్ని రకాల కళలకు సమన్వయం ఈ

బీజాక్షరంలో ఉన్నదన్నమాట! అందుచేతనే- ఈ బీజాక్షరం కూడా 'శ్రీం', 'హ్రీం' ల వంటి బీజాక్షరాలతో సమానంగా ఎంచబడుతూ పంచప్రణవాలైన 'ఐం క్లీం సౌః శ్రీం హ్రీం'లలో ఒకటైంది. దీనిని ప్రధానంగా 'మన్మథబీజంగా' చెబుతారు. సమస్త సృష్టిగా తాను అవుదామనే కోరిక కలిగే ఈశ్వరుడు కామేశ్వరుడుగా మారే ప్రక్రియకు ప్రేరణకారి అయిన అమ్మవారి బీజాక్షరం ఇది. కృష్ణమంత్రానికి బీజాక్షరం కూడా ఇదే!

1) క్లీం బీజాక్షర కారకురాలు.

2) సృష్టి ప్రక్రియకు దోహదపడే బీజాక్షరకారకురాలు.

3) మన్మథ, కృష్ణమంత్ర బీజాక్షర కారకురాలు - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 623. కేవలా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కేవాలయైనమః' అని చెప్పాలి.

ఏ విధమైన భేదములు గాని, ఇతరములు గాని లేని పరబ్రహ్మ స్వరూపిణి.

ధ్యానములోని అనుభూతి పరాకాష్ఠలో ఉన్నపుడు అన్ని రకముల మనోరూపములు ఆకారములు, నామములలో ఉండు సన్నివేశానుభవములు ఆగిపోయి, అవి అన్నీ ఒకే ఒక అనుభూతిగా స్థిరపడిన రూపమును సూచించు నామము 'కేవలా'.

1) ఒకే ఒక తత్త్వమును సూచించునది.

2) పరాకాష్ఠస్థితి యందు ధ్యానములో స్థిరపడిన ఒకే ఒక అనుభూతి రూపము - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 624. గుహ్యా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'గుహ్యాయైనమః' అని చెప్పాలి.

గుహ్యా = రహస్యాతి రహస్యమైనది.

ఎంత చెప్పినా, ఎంత వివరించినా, ఎన్ని నామాలతో స్మరించినా ఇంకా రహస్యంగా మిగిలిపోయిన తత్త్వం గల అమ్మవారిని 'గుహ్యా' అనవచ్చును.

మనలో గుహ్యాతి గుహ్యంగా ఉండే అంతఃకరణంలో కనబడకుండా ఉండి, సమస్త జీవన వ్యాపారాన్ని నిర్వహించేది కాబట్టి అమ్మవారు – 'గుహ్యా'. అన్ని శ్రుతుల్లోను, స్మృతుల్లోను, శాస్త్రాల్లోను, సూక్ష్మంగా, అతిరహస్యంగా ప్రతిపాదింపబడునది కాబట్టి, అమ్మవారు – 'గుహ్యా'.

'ధర్మస్యతత్త్వంనిహితం గుహాయాం' (భారతం) అని – యక్షునితో ధర్మరాజు అన్న వాక్యానికి అర్థాన్ని తెలిపే హృదయ గుహలో ధర్మ స్వరూపిణిగా ఉన్నది – అని ఇంకో అర్థం.

1) రహస్యాతిరహస్యమైనది.

2) ఎంత ప్రతిపాదించినా ఇంకా రహస్యంగా మిగిలి ఉండేది.

3) శ్రుతి, స్మృతి శాస్త్రాలలో సూక్ష్మంగా ప్రతిపాదింపబడునది.

4) హృదయమనే గుహలో ఉండే ధర్మస్వరూపిణి.

5) అంతఃకరణ మనే గుహలో ఉండి సమస్త జీవన వ్యాపారాన్ని నిర్వహించేది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 625. కైవల్యపదదాయినీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కైవల్యపదదాయిన్యైనమః' అని చెప్పాలి.

కైవల్యపద = మోక్షస్థితిని, దాయినీ = ఇచ్చునది.

'కేవలము' – పదం యొక్క భావార్థ తద్ధితమే కైవల్యం. 'ఏకమతము', 'ఐకమత్యము' గా ఎలా మారుతుందో – 'కేవలము' – కైవల్యంగా అలాగే మారుతుంది. భావనలేని స్థితిని తెల్పేది కైవల్యం – అంటే ఇది 'అనన్యస్థితి' ని తెల్పే ఒక అద్వైతానుభూతి. అనుభూతికి సంబంధించినది కాబట్టి దీనిని మాటలతో వివరించడం కష్టమే. ఈ 'కైవల్య

స్థితి'నే 'సాయుజ్యం' అని కూడా అంటారు. సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్య స్థితులలో సాయుజ్యం చిట్టచివరికి సాధనలో పొందే అనుభూతి. ఇటువంటి అసాధ్యమైన, దుర్లభమైన ఉత్తమ గతిని, స్థితిని అమ్మవారు భక్తులకు ఇస్తుంది. దీని తర్వాత జీవుడు ఇంక పొందాలనుకునేది, పొందతగ్గది, పొందవలసినది, ఏదీ లేదు, ఉండదు.

1) ఉపాసకులకు సాధనలో 'అనన్యస్థితి' ని కలుగచేయునది.

2) 'మోక్షస్థితి' ని ప్రసాదించునది.

3) ఇంక పొందవలసినది ఏమీ లేని 'ఉత్తమగతి' ని ఇచ్చునది. - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 626. త్రిపురా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'త్రిపురాయైనమః' అని చెప్పాలి.

త్రి = మూడు, పురా = పురములను కలిగి ఉన్నది.

స్థూల, సూక్ష్మ, కారణ దేహాలు - అనే మూడు పురాల రూపంలో ప్రతిపాదింపబడునది, లేదా - భూః భువః, సువః - లోకాల రూపంలో ఉండునది.

'పురా' అంటే పూర్వమే (ముందుగానే) ఉండునది అని అర్థం చెప్పుకుంటే త్రిమూర్తి, త్రికాల, త్రేతాగ్ని మొదలైన త్రితత్వాల రూపంలో ప్రతిపాదింపబడే వాటికన్నా ముందే ఉండునది - అని ఈ నామానికి క్రొత్త అర్థం వస్తుంది.

1) స్థూల, సూక్ష్మ, కారణ దేహాది - భూర్భువస్సువర్లోకాది త్రితత్వాల రూపంలో ఉండునది.

2) త్రితత్వాల రూపంలో ప్రతిపాదింపబడే త్రిమూర్త్యాదులకు ముందే ఉండునది - అని ఈనామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 627. త్రిజగద్వంద్యా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'త్రిజగద్వంద్యాయైనమః' అని చెప్పాలి.

త్రిజగత్ = మూడులోకములచే, వంద్యా = పూజింపబడునది,.

1) గతనామంలో 'త్రి' అక్షరం సూచించే భూర్భువస్సువర్లోకాల వారందరిచేతను, - స్వర్గ, మర్త్య, పాతాళలోకాల వారందరి చేతను పూజింపబడునది - అని ఒక అర్థాన్ని

2) పదార్థ కక్ష్యలోను (Plane of Matter), మనో కక్ష్యలోను (Plane of Mind), ప్రజ్ఞా కక్ష్యలోను (Plane of Consciousness) గూడా పూజింపబడునది - అని ఇంకో అర్థాన్ని - ఈ నామానికి చెప్పవచ్చును.

## 628. త్రిమూర్తిః

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'త్రిమూర్త్యై నమః' అని చెప్పాలి.

త్రిమూర్తిః = త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, రుద్రుల రూపములో ఉండునది.

సృష్టి కార్యాన్ని నిర్వహించడంలో బ్రహ్మరూపంగాను, పోషణ కార్యం నిర్వహించడంలో విష్ణురూపంగాను, లయకార్యాన్ని నిర్వహించడంలో రుద్రుని రూపంలోను అమ్మవారే ఉంటుంది - అని ఈ నామం సూచిస్తుంది.

(సృష్టి, స్థితి, లయ కార్యాలను సృష్టించుటకు) బ్రహ్మ, విష్ణు, రుద్రులు - అనే త్రిమూర్తుల రూపములో ఉండునది - అని ఈ నామానికి అర్థం.

## 629. త్రిదశేశ్వరీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'త్రిదశేశ్వర్యై నమః' అని చెప్పాలి.

త్రిదశ = దేవతలకు, ఈశ్వరీ = ఈశ్వరి.

'అమరా, నిర్జరా, దేవాః త్రిదశా, విబుధాః సురాః - అని అమరకోశంలో చెప్పబడిన దానిని బట్టి దేవతలకు 'త్రిదశులు' అనే పేరు ఉంది కాబట్టి త్రిదశేశ్వరి, అంటే - దేవతలకు 'ప్రభ్వీ' అనే అర్థం వస్తుంది. సర్వదేవతల ప్రార్థన వలన, ఆరాధన వలన, అభ్యర్థన వలన, 'చిదగ్ని కుండ సంభూతా' గా వ్యక్తమై అందరి ప్రాణాలను అసురుల బారి నుండి రక్షించి వారిని నడిపించింది కాబట్టి అమ్మవారు 'త్రిదశేశ్వరీ'.

'దశ' అంటే 'అవస్థ' అనే అర్థంలో - 'తిదశ' లంటే జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలు - అని అర్థం వస్తుంది. ఈ మూడు దశలలోను ఏ మాత్రము మార్పు లేకుండా వీటికి పైన అతీతంగా ఉండేది అని ఒక అర్థం. అలాగే సృష్టి, స్థితి, లయ దశలలో కూడా మార్పు చెందకుండా వాటికి పైన అతీతంగా ఉండి వాటిని నిర్వహింపచేసేది' అని మరో అర్థం.

1) దేవతలకు ఈశ్వరి.

2) జాగ్రత్స్వప్న సుషుప్త్యావస్థలకు అతీతంగా ఉండునది.

3) సృష్టి, స్థితి, లయలకు అతీతంగా ఉండి వాటిని నిర్వహింపచేయునది.

4) పదార్థ, మనో, ప్రజ్ఞాస్థాయిలపై ఆధిపత్యం కలిగినది.

## 630. త్ర్యక్షరీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'త్ర్యక్షర్యై నమః' అని చెప్పాలి.

త్రి = మూడు, అక్షరీ = అక్షరముల స్వరూపిణి.

'క్లీంకారీ' నామం నుండి 'వాగేశ్వరీ విద్య' గురించిన విశేషాలు చెప్పబడు తున్నాయి కాబట్టి, వామకేశ్వర తంత్రంలో 'వాగేశ్వరీ' విద్యకు - 'త్ర్యక్షరీ' నామానికి గల సంబంధాన్ని తెలిపే ఈక్రింది శ్లోకాన్ని ఇక్కడ ఉదహరించడం సముచితం.

శ్లో. వాగేశ్వరీ జ్ఞానశక్తిః వాగ్భవే మోక్షరూపిణీ
కామరాజే క్రియాశక్తిః కామేశీకామరూపిణీ
శక్తిబీజే పరాశక్తిః ఇచ్ఛైవ శివరూపిణీ
ఏవందేవీ త్ర్యక్షరీతు మహా త్రిపురసుందరీ.

1) జ్ఞాన శక్తిని సూచించేది, మరియు మోక్షరూపిణీ అయిన వాగ్భవ కూటం,

2) క్రియాశక్తిని సూచించేది మరియు కామరూపిణి అయిన కామరాజ కూటం,

3) పరాశక్తిని సూచించేది మరియు శివరూపిణి అయిన శక్తి కూటము - ఈ మూడు కూటముల బీజాత్మక మంత్ర స్వరూపంగా చెప్పబడే మహా త్రిపురసుందరీ దేవీ స్వరూపమే 'త్ర్యక్షరీ' నామంతో పిలువబడే అమ్మవారు. ఈ దేవికి సంబంధించిన బీజాక్షరాల్లో హృదయస్థానమైనది - 'క్లీం' కారం. 'క' కార 'ల' కార 'ఈం' కారాలతో రూపొందింపబడే బీజాక్షర రూపంగా ఈ 'త్ర్యక్షరీ' నామాన్ని అర్థం చేసుకోవాలి.

'క' కార 'ల' కార 'ఈం' కార బీజాత్మక స్వరూపిణి - అని ఈ నామానికి అర్థం.

## 631. దివ్యగంధాఢ్యా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'దివ్యగంధాఢ్యాయైనమః అని చెప్పాలి.

దివ్య = దివ్యమైన, గంధ = పరిమళ ద్రవ్య గంధములచే, ఆఢ్యా = ఒప్పునది.

పరమ పవిత్రమైన హరిచందనాది పరిమళ గంధ ద్రవ్యాలతో దివ్యమైన సువాసనలు వెదజల్లుతూ అమ్మవారి సాన్నిధ్యం పరమాహ్లాద కరంగా ఉంటుంది. ఆ సాన్నిధ్యంలో స్థూలశరీరాన్ని వదిలి సూక్ష్మ శరీరంతో సూక్ష్మాతి సూక్ష్మమైన దివ్యలోకాల్లో విహరించడం జరుగుతుంది. వళ్ళు తెలియని పరవశత్వంతో మధురాతి మధురమైన అనుభూతిని పొందడం జరుగుతుంది. అందుకనే అమ్మవారి పూజలో తప్పనిసరిగా ఈ హరిచందనాది గంధ ద్రవ్యాలు వాడతారు సమయాచారులు. ఇవి కాకుండా మైకాన్ని, మత్తును, నిషాను తెప్పించే ద్రవ్యాలను వామాచారులు వాడతారు. (ఎవరి అభిరుచిని బట్టి వారు ఆయా

ద్రవ్యాలను వాడతారు) శ్రీ సూక్తంలోని 'గంధద్వారాం .. అన్న మంత్రాన్ని ఇక్కడ సమన్వయ పరచుకోవాలి.

దివ్యమైన పరిమళ గంధ ద్రవ్యాలచే ఒప్పునది - అని ఈనామానికి అర్థం.

## 632. సిందూర తిలకాంచితా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సిందూర తిలకాంచితాయైనమః' అని చెప్పాలి.

(పాపటయందు) సిందూరతిలక = సిందూరతిలకముచే, అంచిత = ప్రకాశించునది.

అమ్మవారి ఫాలభాగములో కస్తురి బొట్టు ఉంటే, పాపటలో సిందూర రేఖ ఉంటుంది. సౌందర్యలహరిలో ఆదిశంకరులు చెప్పిన 'వహంతీ సిందూరం - అని వచ్చే 44వ శ్లోకాన్ని కూడా ఇక్కడ చదువుకుంటే - అరుణారుణ సిందూర రేఖాంచిత సీమంతంతో అమ్మవారు ఎంత రమణీయంగా ఉంటుందో అవగాహన చేసుకోవచ్చును. పుణ్య స్త్రీలకు మంగళకర చిహ్నాలలో సీమంత సిందూరం కూడా ఒకటి.

సీమంత సిందూర తిలకంతో ప్రకాశించునది - అని ఈ నామానికి అర్థం.

## 633. ఉమా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ఉమాయైనమః' అని చెప్పాలి.

ఉమా = ఉమానామాన్వితురాలు.

శిరీష కోమల శరీరం కల అమ్మవారు కనీసం పత్రభక్షణ కూడా చెయ్యకుండా తీవ్రంగా శివునికై తపస్సు చేస్తున్నపుడు - ఆమె తల్లి తండ్రులకు బాధ కలిగి, 'ఉ' - ఇంక తపస్సు చాలు అన్నారు. అయినా తపస్సు ఆపలేదు. 'మా' - ఇంకవద్దు అన్నారు. అప్పటికీ మానకుండా తపస్సు చేసి చివరకు శివుణ్ణి పొందింది. ''ఇలా 'ఉ', 'మా'

అన్నప్పటికీ గూడా శివునకై తపస్సు చేసిన అమ్మవారు ఆనాటి నుండి 'ఉమా' అని పిలువబడుతూ వచ్చింది'' - అని మహాకవి కాళిదాసు తన - 'కుమారసంభవం' కావ్యంలో చమత్కరిస్తాడు. (ఈ విషయాన్నే నేను వ్రాసిన 'తైత్తిరీయోపనిషత్' గ్రంథంలో ఈ క్రింది ప్రార్థనా పద్యంగా వ్రాసుకున్నాను.

కం. 'ఉ' యనిన ఆపకుండగ
'మా' యనినను కూడ తపము మానక సేయన్
ధ్యేయార్థ దేహమందిన
'మాయమ్మ'ను మను తలతును మానసమందున్.

పైవిధంగా తపస్సు చేసి తన తపస్సుకు ఏది ధ్యేయమో ఆ ధ్యేయమైన శివుని శరీరంలో సగభాగమై పోయిన 'మాయమ్మ' (మాయకు అమ్మ) లేదా మా 'అమ్మ' అయిన 'ఉమ'ను మనస్సులోనే తలుస్తూ ఆరాధిస్తాను - అని ఈకంద పద్యానికి అర్థం. ('ఉమ' అనే పేరు గల అమ్మవారంటే నాకు అంత ఇష్టం అందుకని ఇక్కడ కూడా ఈ పద్యం దాని వివరణ మళ్ళీ వ్రాశాను - వివరణ కర్త)

కేనోపనిషత్తులో ప్రతిపాదింపబడిన అమ్మవారే ఈ 'ఉమ'. కొందరు ఈ నామంలోని 'ఉ' - శివుణ్ణి, 'మా' పార్వతిని సూచిస్తాయనీ, 'ఉమా' అంటే - అర్ధనారీశ్వర తత్త్వాన్ని సూచించే నామమనీ చెబుతారు.

అమ్మవారు 'ఉమా' నామాన్వితురాలు - అని నామం సూచిస్తుంది.

## 634. శైలేంద్రతనయా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శైలేంద్రతనయాయైనమః' అని చెప్పాలి.

శైలేంద్ర = హిమవత్పర్వతము యొక్క, తనయా = కుమార్తె.

దక్షుని కూతురైన సతీదేవి దక్షయజ్ఞంలో శివనింద భరించలేక యోగాగ్నిలో దేహాన్ని ఆహుతి చేసుకుని, మళ్ళీ తన భక్తుడైన హిమవంతునికి కూతురుగా పుట్టింది.

అప్పటినుండి అమ్మవారు 'హైమవతీ' 'శైలజ' అనే పేర్లతో పిలువబడుతోంది. ప్రస్తుత నామం 'శైలేంద్రతనయా' అన్నా కూడా అదే అర్థం.

స్థిరత్వానికి, ధృఢత్వానికి విశాలత్వానికి, ఉన్నతత్వానికి వివిధ రకాల జీవుల ఆశ్రయానికి అనుగుణంగా ఉండి, పేరెన్నిక గన్న హిమవత్పర్వతునికి – సాక్షాత్తు సృష్టి స్వరూపిణి అయిన అమ్మవారు పుత్రికగా పుట్టడం, సార్ధక నామ ధేయంగా 'పార్వతి' అని పిలవబడటం ఎంతో ఔచిత్యానికి సంబంధించిన విషయం. అలాంటి పార్వతి నామం ఎలాంటిదో 'శైలజ' శైలేంద్రతనయా' కూడా అలాంటివే. ఇక్కడ 'పార్వతీ' అన్న 246 వ నామ వివరణ కూడా చదువుకుంటే పర్వతాల గురించి చాలా శాస్త్రీయ మైన విషయాలు తెలుస్తాయి.

'హిమవత్పర్వత రాజు యొక్క కుమార్తె – అని ఈ నామానికి అర్థం.

## 635. గౌరీ

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'గౌర్యై నమః' అని చెప్పాలి.

గౌరీ = గౌర వర్ణములో ఉండునది.

'హిమవత్పర్వతరాజు పుత్రిక' అన్నా 'పార్వతీ' అన్నా 'ఉమా' అన్నా 'గౌరి' అన్నా అమ్మవారే !

''యోగాగ్నిలో ఆహుతి అయిన దక్షుని కూతురైన సతీదేవియే హిమవంతునికి కూతురుగా పుట్టిందని, ఆమె దేహఛ్ఛాయ – శంఖము, బంగారం, చంద్రుడు ఈ మూడింటి రంగుల సమ్మేళనంగా కనబడుతూ ఉండడంతో 'గౌరీ' అనే పేరు వచ్చిందనీ'' దేవి పురాణంలోని ఈ క్రింది శ్లోకం తెలుపుతుంది.

శ్లో. యోగాగ్ని నాతుయాదగ్ధాపునర్జాతా హిమాలయాత్
శంఖుకుందేందు వర్ణా చేత్యతో గౌరీతి సాస్మృతేత్.

అమ్మవారి గౌరవర్ణానికి వేరే ఇంకొక కారణం ఉందని చెప్పే ఒక ఇతి హాసం కూడా ఉంది. 'పరమేశ్వరుడు తన భార్య అయిన కాళీదేవిని చూచి 'నల్లపిల్లా' అని

పరిహసించినపుడు – ఆవిడ తపస్సు చేసి, బ్రహ్మ వరం వలన గౌరవర్ణ శరీరాన్ని పొందింది. అప్పటి నుండి 'గౌరీ' అని పిలువబడింది. అని ఈ ఇతి హాసం చెబుతుంది.

దేవీ పురాణంలో ఇంతకు ముందు చెప్పబడిన అమ్మవారి రంగు – 'చాంపేయగౌర' వర్ణమని ఆదిశంకరులు అర్ధనారీశ్వర స్తోత్రంలో తెలియపరుస్తారు.

మంత్రశాస్త్ర ప్రకారం – ఉచ్ఛారణకు ముందున్న అమ్మవారు – 'త్రిపురసుందరి' అయితే, ఉచ్ఛారణకు చేసే ప్రయత్నంలో ఉండే అమ్మవారి పేరు 'గౌరీ'. మనస్సులో భావాలు కలిగి, ఆ భావాల్ని వ్యక్తపరుద్దామనుకున్నపుడు ఆ భావాలు – అక్షరాలుగా - ఆ అక్షరాలు ఒక పదంగా, రెండు పదాలుగా, నాలుగు పదాలుగా, ఎనిమిది పదాలుగా, తొమ్మిది పదాలుగా ఇలా ఎన్నో – పదాలుగా మారుతూ ఉచ్చరింపబడుతూ నీటిమీద వ్రాసే అక్షరాల్లాగా వ్యక్తమై వెంట వెంటనే నీటిలోనే కలసిపోయినట్లు చోటులో కలిసి పోతాయి.

సరిగ్గా ఈ భావాన్ని తెలిపే ఈ క్రింది మంత్రమే మంత్రశాస్త్రంలో గౌరీదేవికి సంబంధించిన మంత్రంగా చెబుతారు.

''గౌరీర్మిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సా చతుష్పదీ

అష్టాపదీ నవపదీ బభూవుషీసహస్రాక్షరాపరమేవ్యోమన్.

ఉచ్ఛారణ సరిగ్గా రాని వారి కోసం – నమ్మకంతో, త్రికరణ శుద్ధిగా పై మంత్రాన్ని స్మరిస్తూ హోమగుండంలో పసుపు కొమ్ములు గాని, పసుపుగాని సమర్పిస్తూ హోమం చేస్తే – ఆ ఉచ్ఛారణ చక్కబడుతుంది. 'అనబోయే మాట' – 'పుట్టబోయే కొడుకు పేరు' లాంటిది. ఈ గౌరీ నామం.

1) గౌరవర్ణములో ఉండునది.

2) ఉచ్ఛారణకు చేసే ప్రయత్నంలో ఉండే అమ్మవారు. అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 636. గంధర్వసేవితా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'గంధర్వసేవితాయైనమః' అని చెప్పాలి.

గంధర్వ = గంధర్వుల చేత, సేవితా = పూజింపబడునది.

దేవతలు వేరు. గంధర్వులు వేరు, దేవతలు వెలుగుల లోకాలకు(Plane of Light) సంబంధించినవారు. గంధర్వులు నాదలోకానికి సంబంధించినవారు(Plane of Sound) అందుకే – గంధర్వులు మంచి గాయకులు. మంచి సంగీతం వీరి సొత్తు. శ్రుతి, లయలు, నాదము. అనునాదము మొదలైనవాటికి ఈ గంధర్వులే అధిష్ఠానం వహిస్తారు.

గంధర్వులు పర్వత శిఖర ప్రాంతాల్లో విహరిస్తారు. 'ఉమ', 'గౌరి', 'శైలేంద్రతనయ' అయిన అమ్మవారిని ఈ గంధర్వులు రసవత్తరమైన, కర్ణపేయమైన మానసోల్లాసాన్ని కలిగించే గానాలతో స్తుతిస్తూ, సేవించుకుంటారు. 'ఉమా, శైలేంద్రతనయా, గౌరీ గంధర్వ సేవితా' అనే నామాలు విడివిడిగానూ చెప్పుకోవచ్చును, లేదా – కలిపి చెప్పుకున్నా అర్థం మారదు.

'గంధర్వుల చేత సేవించబడునది' – అని ఈ నామానికి అర్థం.

## 637. విశ్వగర్భా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విశ్వగర్భాయైనమః' అని చెప్పాలి.

విశ్వ = విశ్వమును, గర్భా = గర్భమునందు ధరించునది.

స్త్రీ గర్భాశయములో పిండాండం పెరిగి శిశువుగా ప్రసవింపబడినట్లు అమ్మవారు గర్భంగా ధరించి, ప్రసవించగా ప్రభవించినదే – ఈ దృశ్యమాన మైన సమస్త విశ్వం – అని అర్థంచేసుకోవాలి. అంటే, ఈ నామం అమ్మవారి జగన్మాతృకా(Universal Mother) లక్షణాన్ని నిర్ధారిస్తుంది.

'విశ్వమును తన గర్భమునందు ధరించునది' అని – ఈనామానికి అర్థం.

## 638. స్వర్ణగర్భా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'స్వర్ణగర్భాయైనమః' అని చెప్పాలి.

స్వర్ణ = బంగారు, గర్భా = గర్భము గలది.

'స్వర్ణం' అంటే బంగారం. శ్రేష్ఠమైన పదార్థాన్ని గాని, వస్తువులను గాని, వ్యక్తులను గాని బంగారంతో పోలుస్తారు. ఎందుకంటే – రాగి, ఇత్తడి, ఇనుము మొదలైన ఇతర పదార్థాల లాగా వాతావరణ ప్రభావానికి లోనై పాడవనిది బంగారం కనుక. తన దైన లక్షణాన్ని నిలుపుకునేది బంగారం. అందుకని బంగారం అన్నిటి కన్న శ్రేష్ఠమైనదిగా చెప్పబడుతుంది. అందుకే – సమస్త విశ్వాన్ని ధరించి, ప్రసవించే అమ్మవారి గర్భం బంగార మంతటి శ్రేష్ఠమైనదని చెప్పడం.

బంగారం భూమిలోనే ఉంటుంది. భూమాత రూపంలో అమ్మవారు తన గర్భమునందు బంగారాన్ని కలిగినది' అని కూడా ఈ నామానికి అర్థం చెప్పవచ్చును.

బ్రహ్మదేవుణ్ణి 'హిరణ్యగర్భుడు' అంటారు. 'హిరణ్యం' అంటే బంగారమే! ఆ హిరణ్య గర్భుడైన బ్రహ్మరూపంలో కూడా సృష్టి కార్యాన్ని చక్కబెడుతుంది కాబట్టి, అమ్మవారు 'స్వర్ణగర్భా'.

'స్వర్ణం అంటే 'సువర్ణ' మని అర్థం. 'సువర్ణ' మంటే – మంచి అక్షరాలు. లేదా వేదవేదాంగ శాస్త్రాక్షరాలు అని చెప్పుకోవచ్చును. ఈ వేదవేదాంగ శాస్త్రాలన్నీ అమ్మవారి నుండే వ్యక్తమయి, అమ్మవారి గురించి చెప్పబడ్డాయి. కాబట్టి, అమ్మవారు 'స్వర్ణగర్భా'.

సు + అర్ణమ్ = స్వర్ణం అని చెప్పుకుంటే ఇంకో అర్థం వస్తుంది. 'అర్ణమ్' అంటే 'వెలుగుల వెల్లువ', (Flood of light) అని గాని – 'నాదనిధి' అని గాని అర్థం చెప్పుకోవచ్చును. ఈ అర్థాలనుబట్టి నాదాత్మకమైన, ప్రకాశాత్మకమైన సృష్టిని గర్భమునందు కలది – అని అర్థం వస్తుంది.

1) బంగారు – అంటే శ్రేష్ఠమైన గర్భము కలది.

2) బంగారమును గర్భము నందు కలది.

3) హిరణ్య గర్భునిగా ఉండునది.

4) వేదవేదాంగ శాస్త్రాదులను గర్భమునందు కలది.

5) నాదాత్మక, ప్రకాశాత్మక సృష్టిని గర్భనమునందు కలది - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 639. అవరదా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అవరదాయై నమః' అని చెప్పాలి.

ఈ నామంలోని అక్షరాలను విడదీయడాన్ని బట్టి వేరు వేరు అర్థాలువస్తాయి.

అ + వరదా - అని విడదీస్తే (తనకు సాటి) లేనటువంటి, వరదా = వరదాతలు కలది. అనగా, 'తనకు మించిన వరదాతలు లేనిది' అని అర్థం వస్తుంది.

అవ + రదా - అని విడదీస్తే - అవ = కాంతివంతమైన, రదా = దంతపంక్తి కలది అనే అర్థం వస్తుంది.

అవర + దా = అని విడదీస్తే - అవర = తనకన్న చిన్నవారగు సోదరీ సోదరులను, దా = ప్రసాదించునది - అనే అర్థం వస్తుంది.

(పూర్వనామంతో ఈ నామాన్ని సవర్ణదీర్ఘ సంధి లాగా వ్రాసుకుంటే స్వర్ణ గర్భా + అవరదా - అని రెండు నామాలు వస్తాయి. అలా కాకుండా సవర్ణదీర్ఘ సంధిని పాటించకపోతే 'స్వర్ణగర్భా' 'వరదా' అనే రెండు నామాలు వస్తాయి. కాని 'వరదా' అనే నామం 331వ నామంగా ఇంతకు పూర్వమే 'వరదా, వామనయనా' అన్న నామాల వరసలో వచ్చింది. అక్కడ 'వరదా' అనే నామం శ్లోకానికి తృతీయ పాదారంభంలో వచ్చింది కాబట్టి ద్వితీయ పాదాంతంలో ఉండే 'కాదంబరీప్రియా' నామంతో సవర్ణదీర్ఘ సంధిగా కలపకూడదు. కాబట్టి, 'అవరదా' అనే నామంగానే ఇక్కడ వివరణ ఇవ్వబడింది - వివరణ కర్త.)

1) తనకు మించిన వరదాతలు లేనిది.

2) కాంతివంతమైన దంతపంక్తి కలది.

3) తనకన్న చిన్న వారగు సోదరీ సోదరులను ఇచ్చునది. – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 640. వాగధీశ్వరీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వాగధీశ్వర్యైనమః' అని చెప్పాలి.

వాక్ = వాక్కునకు, అధీశ్వరీ = అధిదేవత.

నాదానికి వాక్కు ఎలాగో, నాదబ్రహ్మకు వాగధీశ్వరి అలాంటిది. వాక్కు గురించి తెలిస్తే వాగధీశ్వరి గురించి తెలుసుకోడానికి అవకాశం ఉంటుంది. వాక్కు నాలుగు స్థితులలో ఉంటుందని, ఆ స్థితులే పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ స్థితులనీ - పూర్వనామాల్లో చెప్పబడింది. ఈ నాలుగు స్థితులలోను మొదటి మూడు స్థితులు బయటకు వ్యక్తం కాకుండా లోపలే ఇమిడి ఉంటాయని, నాల్గవదైన వైఖరీ వాక్కు మాత్రమే బయటకు ఉచ్చారణగా వ్యక్తమౌతుందనీ ఇంతకు ముందే వివరించబడింది.

ఉచ్చరించే వాటిలో సంకల్పరూపంలో ఉండే వాక్కు స్థితినే 'పరావాక్కు అంటారు. ఈ పరావాక్కే అన్ని స్థితులలోని వాక్కులకు ప్రేరణ స్థానం. ప్రారంభస్థానం ఉత్పత్తి స్థానం కాబట్టి – ఈ పరావాగ్దేవతయే 'వాగధీశ్వరీ' ఔతుంది.

1) పరావాగ్దేవతా స్వరూపిణి.

2) వశిన్యాది దేవతలకు అధినాథురాలు – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 641. ధ్యానగమ్యా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ధ్యానగమ్యాయైనమః' అని చెప్పాలి.

ధ్యాన = ధ్యానమునకు, గమ్యా = లక్ష్యమైనది.

ధ్యాన = ధ్యానము చేత, గమ్యా = పొందబడునది.

'ధ్యాన, ధ్యాతృ, ధ్యేయ, రూపా' అన్న 254వ నామవివరణ కూడా ఇక్కడ చదువుకోవాలి.

ఎన్ని విధాలుగా అర్చించినా, ఎన్ని మంత్రాలు వల్లించినా, ఎన్ని స్తోత్రాలు చేసినా ధ్యానముతోకాని వాటికి సంపూర్ణత చేకూరదు. అందుచేతనే షోడశోపచార పూజ మొదట్లో - మొదటి ఉపచారంగా 'ధ్యానాన్ని' ఏర్పాటు చేశారు. ఈ ధ్యానంలో వర్ణించిన రూపాన్ని పొందటమే మొత్తం పూజకు - 'లక్ష్యం', లేదా - 'ధ్యేయం' కాబట్టి అమ్మవారు 'ధ్యానగమ్యా'. కళ్ళు తెరచినా, మూసినా మనం చూడకలిగేదే **ధ్యాన గమ్యం అవాలి.** అంతేకాని, కళ్ళు మూసినపుడు ఒకటి - కళ్ళు తెరచినపుడు మరొకటి కాకూడదు. ఈ స్థితి వచ్చిన వారు - సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్య స్థితులలో ఉన్నట్లే !

ధ్యానము యొక్క లక్ష్యమైనది - లేదా - ధ్యానము చేత పొందబడునది - అని ఈ నామానికి అర్థం.

## 642. అపరిచ్ఛేద్యా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అపరిచ్ఛేద్యాయైనమః' అని చెప్పాలి.

అ = వీలుకాని, లేదా - పొసగని, పరిచ్ఛేద్యా = విభజనము కలది, అనగా - విభజింప వీలులేనిది అని అర్థం.

ప్రపంచంలోని ఏ వస్తువునైనా, ఏ పదార్థాన్నైనా ఆకార పరంగాను, పరిమాణపరంగాను, కాలపరంగాను విడగొట్టి నిర్దేశించవచ్చును. కాని, ఒక రూపానికి కట్టుబడని, పరిమాణానికి కట్టుబడని, కాలానికి కట్టుబడని అమ్మవారిని ఏ విధంగా విడగొట్టగలం ? సత్యము, జ్ఞానము, అనంతము అనేవే అమ్మవారి లక్షణాలు. ఆకార, పరిమాణాదులు లేని ఆకాశంలాంటిది అమ్మవారు. ఆకాశానికి ఒక నిర్దిష్టమైన ఆకారాన్ని చెప్పగలమా ! ఒక నిర్దిష్ట మైన పరిమాణాన్ని చెప్పగలమా ? 'ఆకాశం ఏఏ కాలాల్లో,

ఎక్కడెక్కడ, ఎంతెంత పరిమాణాల్లో ఏఏ ఆకారాలలో ఉంటుంది ?' అని ప్రశ్నించడం ఎంత అర్థరహితమో, ఎంత అవివేకమో అమ్మవారి విషయంలో అలా ప్రశ్నించడం కూడా అంతే !

'దేశకాలపరిధులలో విభజనకు వీలులేనిది' అని ఈ నామానికి అర్థం.

## 643. జ్ఞానదా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'జ్ఞానదాయైనమః' అని చెప్పాలి.

జ్ఞాన = జ్ఞానమును , దా = ఇచ్చునది.

మానవ జన్మకు కావలసింది ముఖ్యంగా వివేక జ్ఞానం. ఈ వివేక జ్ఞానం వల్లనే ఏవి తాత్కాలికమో – ఏవి శాశ్వతమో; ఏవి అవసరమో – ఏవి అనవసరమో; ఏది సత్యమో, ఏది నిత్యమో, ఏది మోసపూరితమైనదో – ఏదికాదో తెలుసుకోగలిగేది. ఈ వివేక జ్ఞానం లేనివారు అన్నిరకాలుగాను ఇబ్బందులపాలవుతూ, కష్ట నష్టాలకుగురి అవుతారు. అటులౌకికమైన జ్ఞానాన్ని, ఇటు పారమార్థికమైన జ్ఞానాన్నీ కూడా అమ్మవారు తన భక్తులకు ఇస్తుంది. మిగిలిన దేవతలు ధర్మార్థ కామాలను మాత్రమే ఇవ్వకలరు కాని మోక్షజ్ఞానాన్ని ఇవ్వలేరు.

'విజ్ఞానం' కావాలంటే విదేశాలకు కూడా వెళ్ళవలసిన అవసరం ఉండవచ్చునేమో కాని – 'జ్ఞానం' కావాలంటే స్వదేశాన్ని విడవకుండానే పొందవచ్చును. ఒక చోట స్థిరంగా ఉండి కూడా పొందవచ్చును. అయితే, మళ్ళీ అలా పొందిన జ్ఞానం నలుగురికీ తెలియాలని, తెలియ చెప్పాలనే తాపత్రయం ఉన్నా – లేదా ఆ పనిని నిర్వహించాల్సిన బాధ్యత ఉండి తప్పనిసరి అయితేనే తప్ప ఉన్న చోటనే ఉండి కూడా ఈ జ్ఞానాన్ని పొందగలిగే విధంగా అమ్మవారు తన భక్తులను అనుగ్రహించకలదు. అయితే – అమ్మవారి అటువంటి అనుగ్రహాన్ని పొందటానికి కావలసిన సాధన మాత్రం మనం చెయ్యాలి.

జ్ఞానమును ప్రసాదించునది – అని ఈ నామానికి అర్థం.

## 644. జ్ఞానవిగ్రహా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'జ్ఞానవిగ్రహాయైనమః' అని చెప్పాలి. జ్ఞాన = జ్ఞానమును, విగ్రహా = మూర్తిగా దాల్చినది.

అమ్మవారు జ్ఞానాన్ని కలిగి యున్నది కాదు. జ్ఞానమునే మూర్తిగా దాల్చినది. సాధారణంగా డబ్బు కలవారు, తెలివికలవారు అందాన్ని కలిగి యున్నవారు... అంటూ, వాటి వాటిని కలిగియున్న వారిని ఆ విధంగా చెప్పుకుంటారు. 'కలిగి యుండటం' అంటే మిగిలిన వాటితో పాటు ఇది కూడా వారిలో ఒకటిగా కలిగి ఉండటం. ఉదా: 'తెలివి' కలవారు అంటే – మిగిలిన గుణగణాలతో పాటు ఈ తెలివి కూడా వారిలో కలిసి ఉంటుంది. అంటే – వారిలో తెలివి కొంతమేరకే ఉంటుంది. మిగిలిన భాగం తెలివికానిదౌతుంది. ఈ నామం యొక్క అర్థం – ఈ విధంగా చెప్పే 'జ్ఞానము కలిగిన మూర్తి' అని కాదు, 'జ్ఞానమును మూర్తిగా దాల్చినది' (Embodiment of wisdom in flesh blood and frame) అని చెప్పుకోవాలి. దీనిని బట్టి – అమ్మవారిలో జ్ఞానమే నిండి ఉంటుంది తప్ప జ్ఞానంలేని భాగం ఉండదు – అని అర్థం అవుతుంది.

జ్ఞానమనంగానే పరిమితంగా ఒక శాస్త్రానికి సంబంధించిన జ్ఞానమే కాదు. వివిధ విషయాలకు, శాస్త్రాలకు సంబంధించిన జ్ఞానమంతా రూపం దాల్చినదని అర్థం చేసుకోవాలి.

జ్ఞానమును మూర్తిగా దాల్చినది – అని ఈ నామానికి అర్థం.

## 645. సర్వవేదాంత సంవేద్యా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వవేదాంత సంవేద్యాయైనమః' అని చెప్పాలి.

సర్వ = అన్ని, వేదాంత = ఉపనిషత్తులచే, సంవేద్యా = చక్కగా తెలియబడునది.

'వేదాంతము' అంటే – 'వేదము అంతమైనద'ని కాదు అర్థం. 'వేదమునకు చివరలో చెప్పబడు సారవంతమైన (Essential) విషయ సంగ్రహం' అనే అర్థం. వీటినే

'ఉపనిషత్తులు' అంటారు. వీటిలో బ్రహ్మవిద్య, యోగము, యోగజీవన విధానము అన్నీ కలిసే ఉంటాయి. అన్ని ఉపనిషత్తులలోను చెప్పబడే జ్ఞానమంతా - 'జ్ఞానజ్ఞేయ స్వరూపిణి', 'ధ్యాన, ధ్యాతృ, ధ్యేయ, రూపిణి', 'ముక్తిరూపిణీ', 'జ్ఞానగమ్యా' అయిన అమ్మవారి గురించే! అందుకే అవి - 'ఉప - నిషత్తులు', 'శ్రుతిశిరస్సులు' అనే సార్థక నామాలతో - జిజ్ఞాసువులకు, యోగులకు, మోక్షగాములకు శిరోధార్యాలయాయి.

సర్వోత్కృష్టమైన అన్ని ఉపనిషత్తుల చేత చక్కగా తెలుసుకొనబడునది - అని ఈ నామానికి అర్థం.

## 646. సత్యానంద స్వరూపిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సత్యానందస్వరూపిణ్యై నమః' అని చెప్పాలి.

సత్య = నిత్యసత్యమైన, ఆనంద = ఆనందమును, స్వరూపిణి = స్వరూపముగా గలది.

సాధారణంగా మనకు నచ్చేది కాని, మంచిది కాని, కలిసొచ్చేది కాని జరిగినపుడు ఆనందం కలుగుతుంది. అప్పుడు ఉప్పొంగిపోయి ముఖమంతా ఆనందాన్ని పులిమేసుకుని 'ఆనందరావు' లై పోతాము. కాని, మళ్లీ నచ్చనిది గాని, చెడ్డది గాని, కలిసిరానిది గాని జరిగితే ఆ ఆనందం బుగ్గలై బ్రద్దలౌతుంది. వదనంలో విషాదం పులుము కుంటుంది. అంటే, ఇలా మనకు కలిగే ఆనందాలు నిత్యమూ ఉండేవి కావు. నిత్యమూ ఉండ కలిగే ఆనందాన్నే 'సత్యానందము' అంటారు. ఇటువంటి నిత్యసత్యమైన నిరతిశయ సత్యానందాన్నే 'మోక్ష' మంటారు. ఈ సత్యనందాన్నే తన రూపంగా కలిగినది అమ్మవారు.

''నిత్య సత్య నిరతశయానందమే స్వరూపంగానున్నది' - అని ఈ నామానికి అర్థం

## 647. లోపాముద్రార్చితా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'లోపాముద్రార్చితాయైనమః' అని చెప్పాలి.

లోపాముద్ర = లోపాముద్రచే, అర్చితా = అర్చింపబడినది.

అగస్త్యమహాముని భార్యే 'లోపాముద్ర' అమ్మవారి పంచదశాక్షరీ మంత్రాన్ని ఉపాసించి, అమ్మవారిని సాక్షాత్కరింప చేసుకున్న వారు చంద్ర, కుబేరాదులు పన్నెండుమంది ఉన్నారు. ఈ పన్నెండు మందిలో లోపాముద్ర కూడా ఉంది.

హయగ్రీవుని ద్వారా శ్రీ విద్యా రహస్యాలన్నీ తెలుసుకున్న అగస్త్య మహాముని తన భార్య అయిన లోపాముద్రకి వివరిస్తే ఆమె వినడంతోనే సరిపుచ్చక అమ్మవారి పంచదశాక్షరీ మంత్రాన్ని త్రికరణ శుద్ధిగా ఉపాసించి, ప్రధానమైన శ్రీవిద్యోపాసకుల్లో ఒకే ఒకామె అయింది. మిగిలిన వారందరూ పురుషులే ! భార్యాభర్తలంటే ఇలా ఉండాలి.

భర్తలద్వారా పొందిన జ్ఞానాన్ని వినడంతోనే సరిపుచ్చుకోకుండా అలా పొందిన జ్ఞానాన్ని స్వయంకృషితో సాధన ద్వారా మరింత ఫలప్రదం చేసుకోవాలని ఈ నామం సూచిస్తుంది. అంతేకాదు ఎటువంటి సత్కార్యాలనైనా సత్సంకల్పంతో స్త్రీలు కూడా నిర్వహించవచ్చునని, నిర్వహించకలరని, అందుకు అమ్మవారి అనుగ్రహ పూర్వకమైన అండదండలు ఎప్పుడూ ఉంటాయని కూడా ఈ నామం సూచిస్తుంది.

'లోపాముద్రాదేవిచే అర్చింపబడినది' అని ఈ నామానికి అర్థం.

## 648. లీలాక్లుప్త బ్రహ్మాండమండలా

పది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'లీలాక్లుప్త బ్రహ్మాండ మండలాయైనమః' అని చెప్పాలి.

లీలా = క్రీడావినోదానికై, క్లుప్త = కల్పింపబడి క్లుప్తీకరింపబడే, బ్రహ్మాండ = బ్రహ్మాండముల, మండలా = సమూహము గలది.

ఊరికే ఉంటే ఎవరికీ తోచదు. ఏదో పనిలోనో, ఆటలోనో, వినోదంలోనో కాలం గడపాలి. సృష్టి ఏర్పడక పూర్వం పరమేశ్వరి ఇచ్ఛాశక్తిగా పరమేశ్వరునిలో ఉంటుంది. జీవేశ్వరునికైనా, పరమేశ్వరునికైనా ఈ ఇచ్ఛాశక్తి ప్రేరణ వల్లనే సంకల్పాలు కలుగుతాయి. క్రీడలో 'వినోదం' కూడా కలసి ఉంటే అది 'లీల' ఔతుంది. ప్రపంచంలో జరిగేవన్నీ పరమేశ్వరీ పరమేశ్వరుల యొక్క లీలలే !

ఆది దంపతుల క్రీడాత్మక వినోదంలో భాగమే ఈ బ్రహ్మాండాల కల్పన. పిల్లలకు బంతి ఆట ఎలా క్రీడ అవుతుందో – వీరికి బ్రహ్మాండాల ఆట అలాగే ఔతుంది. ఆట ముగిసిన తరువాత పిల్లలు బంతుల్ని దాచేసుకున్నట్లు ఆ ఆది దంపతులు ఈ బ్రహ్మాండాలను తమలోనే ముడుచుకుపోయేట్లు చేస్తారు. ఈ లీలకు ప్రేరణ అమ్మవారే కాబట్టి – ఆవిడ 'లీలాక్లుప్త బ్రహ్మాండమండలా' ఔతుంది.

'క్రీడావినోదానికై కల్పించబడి క్లుప్తీకరింపబడే బ్రహ్మాండసమూహం కలది' - అని ఈ నామానికి అర్థం.

## 649. అదృశ్యా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అదృశ్యాయైనమః' అని చెప్పాలి.

అదృశ్యా = చూడబడనిది.

గత నామంలో అమ్మవారు బ్రహ్మాండాలన్నిటినీ తనలో ఇముడ్చుకొనినప్పుడు ఇంక ఆ స్థితిలో అమ్మవారు ఒక్కతే ఉంటుంది. అప్పుడు అమ్మవారిని చూడకలిగేవారు ఒక్కరు కూడా ఉండరు. ఇలా అమ్మవారు ఇంకొకరి చేత చూడబడలేని స్థితిలో కూడా ఉంటుంది. అంటే – ఈ స్థితిలో అమ్మవారు తనను తాను చూడాల్సిందే గాని, ఇంకొకరు తనను చూడలేరు. ఈ స్థితిలోని అమ్మవారిని 'అదృశ్యా' అనాలి.

అస్తి, భాతి, ప్రియం, రూపం, నామం – ఈ ఐదు లక్షణాల్లోని మొదటి మూడు లక్షణాలు బ్రహ్మకు చెందినవైతే చివరి రెండు లక్షణాలు జగత్తుకు చెందినవి. బ్రహ్మకు చెందిన మొదటి మూడు లక్షణాలనే సత్, చిత్, ఆనందాలు అంటారు. ఇవి దృగ్గోచరములు కావు. అంటే చూడబడలేనివి, దర్శింప వీలులేనివి. ఈ లక్షణాలు కల అమ్మవారిని 'అదృశ్యా' నామంతో పిలువవచ్చును.

(వేరే ఇంకొకరిచే) చూడబడుటకు అవకాశము లేని స్థితిలో ఉండునది - అని ఈ నామానికి అర్థం.

## 650. దృశ్యరహితా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'దృశ్యరహితాయై నమః' అని చెప్పాలి.

దృశ్య = దృశ్యము అనగా చూడబడునది, రహితా = లేనిది.

బ్రహ్మాండాలన్నీ తనలో ఇముడ్చుకుని ఉన్నపుడు ఇంక అమ్మవారికి ఎదురుగా చూడ్డానికి ఏముంటుంది ? అంటే – అమ్మవారికి ఇది – 'చూడ్డానికి ఏమీ లేని స్థితి' అన్నమాట! ఈ స్థితిలోని అమ్మవారిని 'దృశ్యరహితా' అనాలి. అంటే – ఈ స్థితి – తాను తప్ప వేరే వేరొక వస్తువు లేని స్థితి. కనీసం రెండు వస్తువులు ఉంటే తప్ప, ఒక దానిని ఒకటి చూడటం జరుగదు. రెండవ వస్తువేలేనపుడు 'చూడబడేది' అనే అర్థం గల 'దృశ్య' పదానికి అవకాశమే ఉండదు కదా!

(తనచే) చూడబడుటకు వేరే ఏమీ లేని స్థితిలో ఉండునది – అని ఈ నామానికి అర్థం.

## 651. విజ్ఞాత్రీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'విజ్ఞాత్ర్యై నమః' అని చెప్పాలి.

విజ్ఞాత్రీ = విజ్ఞానమును కలిగించునది.

'విజ్ఞాత' అంటే 'విజ్ఞానము కలవాడు' అని అర్థమైతే, 'విజ్ఞాత్రీ' అంటే – ఆ విజ్ఞానమును కలిగించునది – అని అర్థం. అంటే – 'జ్ఞానశక్తి స్వరూపిణి' అని అర్థం.

మనలోని నరుడు 'విజ్ఞాత' అయితే – ఆ విజ్ఞాతకు ఉన్న దాన్ని 'విజ్ఞానం' (Intellect) అంటారు. ఈ రెంటినీ, అంటే – విజ్ఞాతను, విజ్ఞానాన్ని కలిగి ఉన్న దాన్ని గూడా 'విజ్ఞాత్రీ' అనవచ్చును. అంటే – తెలియబడేది 'విజ్ఞానం' తెలుసుకునే వాడు 'విజ్ఞాత' తెలియచెప్పేది 'విజ్ఞాత్రీ' అన్నమాట!

విజ్ఞానమును కలిగించునది – అని ఈనామానికి అర్థం.

## 652. వేద్యవర్జితా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వేద్యవర్జితాయైనమః' అని చెప్పాలి.

వేద్య = తెలుసుకొనబడునది, వర్జితా = లేనిది.

తెలుసుకోవలసిన విషయాలు, తెలుసుకోబడినవి మనకు ఉంటాయి గాని అమ్మవారికి ఉండవు. ముందు చెప్పిన 'విజ్ఞాత్రీ' నామం ప్రకారం అన్ని విషయాలు మనందరికీ చెప్పే స్థితిలో ఉండేదే అమ్మవారు. అలాంటి అమ్మవారికి తెలుసుకోవలసిన విషయాలంటూ ఉండవు - అనే అర్థంలోనే ఈ నామం చెప్పబడింది.

తెలుసుకొనబడవలసినవి ఏమీ లేనిది - అని ఈ నామానికి అర్థం.

## 653. యోగినీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'యోగిన్యైనమః' అని చెప్పాలి.

యోగినీ = యోగముతో కూడి ఉన్నది.

'యోగి' అనే పుంలింగపదానికి 'యోగినీ' అనేది స్త్రీలింగ పదం అవుతుంది. జీవేశ్వర సర్వేశ్వరుల కలయిక వియషయమే యోగము; 'జ్ఞాన, జ్ఞాతృ, జ్ఞేయముల ఏకత్వభావనయే యోగము అని చెప్పవచ్చును.

ఎంతో దీక్ష, శ్రద్ధ ఉంటే గాని ఈ యోగం కుదరదు. అంటే - ఈ నామం దీక్షకు, శ్రద్ధకు సంబంధించిన శిక్షణను ఇచ్చే అమ్మవారి నామాన్ని సూచిస్తుంది. యోగాభ్యాసం చేసే వారిలో - ఆ యోగాభ్యాసాన్ని వదలకుండా - ఆ చేసే వారిని అదే విధంగా కొనసాగించేటట్లు చేసే శక్తిని 'యోగినీ' అంటారు.

'యోగసంబంధమైనది' - అని ఈనామానికి అర్థం.

# 654. యోగదా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'యోగదాయైనమః' అని చెప్పాలి.

యోగదా = యోగమును ఇచ్చునది.

'యోగము' అంటే ప్రధానంగా 'కలయిక' అని అర్థం. జీవేశ్వర సర్వేశ్వరుల ఐక్యస్థితిని - 'యోగము' అంటారు. ఈ స్థితి సిద్ధించాలంటే ఎన్నో రకాల పద్ధతులున్నాయి. వాటన్నిటినీ వివిధ యోగపద్ధతులుగా చెబుతారు. భక్తియోగం, కర్మయోగం, జ్ఞాన యోగం, రాజయోగం - మొదలైన వన్నీ ఈ వివిధ యోగపద్ధతులలోకే వస్తాయి. శ్రీ విద్యకు సంబంధించిన 'కుండలినీ యోగం' కూడా ఈ యోగపద్ధతుల్లో విశిష్టమైనది, విశేషంగా ఆచరింపబడేది. ఈ యోగాన్ని ఇచ్చేది అని ఒక అర్థం.

'యోగము' అంటే - లేని వాటిని పొందడం. 'క్షేమము' అంటే - అలా పొందిన వాటిని రక్షించుకోగలగడం. గీతాచార్యుడుగా భగవంతుడు - భక్తులకు ఈ రెంటి విషయాలలోను తాను బాధ్యత పడతానన్నాడు (యోగ క్షేమం వహా మ్యహం). అలాగే, అమ్మవారు తన భక్తులకు యోగవిషయం తాను చూచుకుంటుందని ఈ నామం చెబుతుంది. ('రక్షాకరీ' అనే 317వ నామం క్షేమానికి సంబంధించినది).

ఏయే ఇంద్రియాలకు సంబంధించిన విషయాలను ఆయా ఇంద్రియాలతో జతపరచి సమన్వయించే మహాశక్తిని గూడా 'యోగదా' అనవచ్చును. ఈ శక్తిలేకపోతే అంతా అస్తవ్యస్తమై గందరగోళం అవుతుంది. (వినికిడికి సంబంధించిన విషయాలను 'కన్నుకు, చూడవలసిన విషయాలను చెవులకు - ఇలా సంబంధం కుదరని విధంగా జతపరిస్తే అంతా అస్తవ్యస్తమై పోతుంది కదా! ఇలాంటి దుష్కర పరిస్థితి రాకుండా వేటి వేటికి సంబంధించినవి వాటి వాటికే జతచేయడం కూడా యోగ ప్రక్రియ క్రిందకే వస్తుందని చెప్పుకోడం తప్పుకాదు) మనలో అమ్మవారు ఇలాంటి స్థితి రాకుండా యోగిస్తుంది కాబట్టి 'యోగదా'.

యోగమును ఇచ్చునది - అని ఈ నామానికి అర్థం.

## 655. యోగ్యా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'యోగ్యాయైనమః' అని చెప్పాలి.

యోగ్యా = యోగ్యమైనది.

జీవితంలో ఎన్నో విధాలైన వాటిని పొందడానికి ప్రయత్నించి పొందుతాము. ఆ విధంగా పొందిన వాటిని క్రొత్తగా మొదటిసారి పొందుతున్నపుడు చాలా ఆనందంగా ఉంటుంది. ఇది ఒక్కటీ ఉంటే చాలు జీవితానికి అనిపిస్తుంది దాన్ని పొందే ముందు. కాని, దాన్ని పొందిన తరువాత అది పాతబడిపోతుంది. మోజు తీరిపోతుంది. మనస్సు మళ్ళీ క్రొత్త దాని మీదకు పోతుంది. ఇలా ఒకటి విడిచి ఒకటి పొందుతూ ఉన్నా, ఏదీ శాశ్వతమైన ఆనందాన్ని ఇవ్వడం లేదని గ్రహించటానికి చాలా కాలం పడుతుంది. అదృష్టం పండి ఏదో ఒక రోజు యోగంతో పరిచయమై సాధనలో ఒకరకమైన దివ్యానుభూతిని, ఆనందాన్ని పొందడం జరుగుతుంది. అలా ఆనందం పొందిన స్థితిలోనే శాశ్వతంగా ఉండి పోవాలనిపించేటంతగా ఆ యోగానుభూతి ఉంటుంది. ఈ యోగానుభూతికి దారితీసే యోగవిధానమే యోగ్యమైనదిగా తెలుసుకోవాలి. ఇట్టి యోగ స్వరూపాన్ని సూచించే అమ్మవారి పేరు 'యోగ్యా' ఇంతకంటె పొందవలసినది ఏదీ లేదు అనే దాన్నే వాస్తవానికి 'యోగ్యమైనది' అనాలి. అంతేకాని చిల్లర ఆనందాన్ని ఇచ్చే ప్రతి దాన్ని యోగ్యమైంది అనకూడదు.

యోగ్యమైనది. (దివ్యమైన యోగస్వరూపిణి) – అని ఈ నామానికి అర్థం.

## 656. యోగానందా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'యోగానందాయైనమః' అని చెప్పాలి.

యోగ = యోగముల వలన పొందు, ఆనందా = ఆనంద స్వరూపిణి.

ఏ యోగం వలన దివ్యమైన ఆనందానుభూతిని, ఆనందాన్ని పొంది, ఆ ఆనంద

స్థితిలోనే అలా ఉండి పోవాలనిపిస్తుందో - అట్టి యోగ్యమైన యోగ విధాన స్వరూపాన్ని సూచించే అమ్మవారి నామం 'యోగ్యా' అని గత నామంలో చెప్పబడింది. ఈ విధమైన యోగసాధనలో పొందే దివ్యమైన అనుభూతిపరమైన ఆనందాన్ని సూచించే అమ్మవారి నామమే 'యోగానందా'. ఈ నామం కుండలీ యోగ ప్రతిఫల రూపాన్ని సూచిస్తుంది.

యోగ ప్రతి ఫలానంద స్వరూపిణి - అని ఈ నామానికి అర్థం.

## 657. యుగంధరా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'యుగంధరాయైనమః' అని చెప్పాలి.

యుగం = జంటను, ధరా = ధరించునది.

'యుగం' అంటే - 'జంట' అని అర్థం. ఈ 'జంట' అనే పదం ఒక జంటనే సూచించదు. విశ్వంలో జంటలు జంటలుగా సయోధ్యగాను, పరస్పర వైరుధ్యంగాను ఉండేవి చాలా ఉన్నాయి. వీటి సమన్వయ స్వరూపిణిగా అమ్మవారిని అర్థంచేసుకోవాలని ఈ నామం సూచిస్తుంది. ఉదా : స్థూలం, సూక్ష్మం, అంటే పదార్థం (Matter) ప్రజ్ఞ (Consciousness); 'దేహము - ఆత్మ', 'సుఖము - దుఃఖము'; 'ఆనందం - విషాదం'; 'వెలుగు - చీకటి'; 'పగలు - రాత్రి'; 'జడము - చైతన్యము'; - ఇటువంటి జంటలతో కూడినదే ఈ సృష్టి. అమ్మవారు సృష్టి స్వరూపిణి కాబట్టి ఈ జంటలను తన యందు ధరించవలసినదే ! అందుకని అమ్మవారు 'యుగంధరా'.

1) జంటల సమన్వయ స్వరూపిణి.

2) కలియుగాదులను తన యందు ఇముడ్చు కొనిన కాల స్వరూపిణి.

3) శివా శివసమన్వయ స్వరూపిణి - అని ఈ నామానికి అర్థం.

## 658. ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి స్వరూపిణీ

పదహారు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి స్వరూపిణ్యై నమః' అని చెప్పాలి.

ఇచ్ఛాశక్తి = స్వేచ్ఛాసంకల్పశక్తి, జ్ఞానశక్తి = జ్ఞానకారకమైన శక్తి, క్రియాశక్తి = కార్యాచరణశక్తుల, స్వరూపిణీ = స్వరూపిణిగా ఉన్నది.

ఏ పని జరగాలన్నా, ముందు ఆ పని చేద్దామనే సంకల్ప శక్తిని, 'ఇచ్ఛాశక్తి' అంటారు. ఒంటరిగా ఉన్న శివుడు ప్రపంచంగా మారుదామనే కోరిక ఈ ఇచ్ఛాశక్తి రూపంలో పనిచేసే అమ్మవారి వల్లనే కలిగింది. ఏ పనైనా ఏవిధంగా జరగాలో నిర్ణయించే శక్తి 'జ్ఞానశక్తి' అంటారు. తను కాబోయే సృష్టి స్వరూప విశేషాలు ఎలా ఉండాలో జరిగే నిర్ణయం ఈ శివునిలో ఈ జ్ఞానశక్తి వల్లనే కలుగుతుంది. 'కార్యాచరణ'ను సూచించే శక్తిని 'క్రియాశక్తి' అంటారు. ఈ క్రియాశక్తి ద్వారానే శివునిలోంచి ప్రపంచం వ్యక్తమైంది. ఈ విధమైన మూడు శక్తులకు ఆధారభూతమైనది, నేపథ్యంలో ఉండి మూడింటిపై ఆధిపత్యం వహిస్తూ మూడింటిని సమన్వయించే శక్తిస్వరూపిణి – అయిన అమ్మవారిని సూచించేదే ఈ నామం.

శ్రీచక్రంలోని బిందువుకు దగ్గరలో ఉండే త్రిభుజ త్రికోణాల వద్ద ఈ మూడు శక్తులను సూచించే దేవతలే – కామేశ్వరి, వజ్రేశ్వరి, భగమాలిని.

'ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తుల సమన్వయ శక్తి స్వరూపిణి' – అని ఈ నామానికి అర్థం.

## 659. సర్వాధారా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వాధారాయైనమః' అని చెప్పాలి.

సర్వ = సమస్తమునకు, ఆధార = ఆధారమైనది.

గ్రహ తారక గోళాదులతో ఉండే విశ్వంలో – ఆ గ్రహాల తత్త్వాలు, తారకల తత్త్వాలు ఏమీ మారకుండా, వాటి గమనాల మధ్య విధ్వంసక మార్పులు ఏమీ లేకుండా – అత్యంత నిశితమైన, నిపుణమైన పర్యవేక్షణతో తిన్నగా నడుపుకుంటూ – ఈ విశ్వనిర్వహణా కార్యక్రమాలన్నిటికీ మూలనియంత్రణా శక్తిగా ఉన్నది కాబట్టి అమ్మవారు 'సర్వాధారా'.

పైనున్న స్వాధిష్ఠానాదిశక్తి కేంద్రాలన్నిటికీ మూలధారవే ఆధారం. పృథివీతత్త్వమైన మూలాధారంలో అన్నీ ఇమిడి ఉంటాయి. అటువంటి మూలాధారాధిష్ఠాన దేవతగా అమ్మవారిని 'సర్వాధారా' అనవచ్చు.

మిగిలిన గ్రహాలకు మన భూమి మీద ఉన్నంత పృథివీత్వం లేదు. అందుకే మన భూమిని 'పృథివీ' అన్నారు. పురుష సూక్తం కూడా 'పద్భ్యాంభూమి' అని చెప్పింది. అంటే, మనిషి నిలబడటానికి పాదాలు ఎలా ఆధారమో – ఈ విశ్వానికి భూమి రూపంలో ఉండే అమ్మవారు అలా ఆధారం అని కూడా చెప్పుకోవచ్చును.

మూలానక్షత్రం ఈ సౌరకుటుంబాలన్నిటికీ ఇరుసు, కేంద్రం లాంటిది. అందుకే దాన్ని చూసి మనలో పృథివీ తత్త్వాన్ని నియంత్రించే శక్తిని మూలాధారం – అని పేరు పెట్టారు.

అన్నిటికినీ ఆధారమైనది – అని ఈ నామానికి అర్థం.

## 660. సుప్రతిష్ఠా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సుప్రతిష్ఠాయైనమః' అని చెప్పాలి

సు = చక్కగా, ప్రతిష్ఠా = స్థాపించుకొనినది (Well established)

పేరు ప్రతిష్ఠలు తెచ్చుకొన్నవారు సమాజంలో బాగా సుప్రతిష్ఠులు అవుతారు. అలాగే, – మన్వంతరాలు, కల్పాలు మారినా తిరుగులేని, సమర్థవంతమైన తన జగత్పరిపాలనా పటిమతో ఈ విశ్వంలో సుస్థిరంగా సుప్రతిష్ఠురాలైంది కాబట్టి అమ్మవారు 'సుప్రతిష్ఠా'.

సృష్టి నిండా అమ్మవారు, లేదా – అమ్మవారి నిండా సృష్టి ఉంటే – అమ్మవారు 'సుప్రతిష్ఠా' అన్న ఈ నామం పూర్తిగా అర్థవంతమౌతుంది. అయితే – అమ్మవారి నిండా సృష్టిఉంది అనడమే ఎక్కువ ఔచిత్యం. ఎందుకంటే భగవద్గీతలో 'నత్వహంతేషుతేమయి' అన్నాడు గీతాచార్యుడు. (అన్నిటియందు నేను ఉండటం కాదు. నాయందే అన్నీ ఉన్నాయి – అని అర్థం).

(మనకు కనపడేది వేరు. అక్కడ ఉండేది వేరుగా ఉంటుంది ఒక్కొక్కప్పుడు. అలా ఉన్నట్టు అనిపించడాన్నే 'మాయ' అంటారు. 'ఈ మాయను పూర్తిగా సృష్టి ప్రణాళికలో ఎత్తేస్తే బాగుంటుంది గదా!' అని అనిపిస్తుంది. కాని ఇది ఏ మాత్రం వీలు కాదు. మాయ లేని సృష్టిలేదు. మాయను తీసెయ్యడం ఎవరి తరమూ కాదు)

ఈ నామంలోని 'ష్ఠా' అనే అక్షరం వేదాల్లో ఒక మంత్రాక్షరంగా చెప్పబడింది. ఈ 'ష్ఠా' మంత్రాన్ని -

'బృహన్నిమాయా జమదగ్నిదత్తా' అంటారు. ఈ మంత్రాన్ని 'జమదగ్నిదత్తా' అంటారు. ఈ మంత్రాన్ని జమదగ్ని కూతురైన 'సరస్వతీ' అని గూడా అంటారు. అసలు సరస్వతి – బృహస్పతి కూతురు. ఈ అసలు సరస్వతి అంగీరసుల ఆడపడుచు, భృగువుల కోడలు, తెల్లగా ఉంటుంది. (సర్వశుక్లా సరస్వతీ) జమదగ్ని కూతురైన సరస్వతి - భృగువుల ఆడపడుచు, అంగీరసుల కోడలూ – ఔతుంది. ఈమె నీలంగా ఉంటుంది. భృగువులు – వెలుగులకు (Light) కేంద్రాల్లాంటి వాళ్ళు. అంగీరసులు – శబ్దాలకు (Sound) కేంద్రాల్లాంటివాళ్ళు. (వెలుగు కనబడుతుంది అందుకని భృగువుల సరస్వతి తెలుపు, శబ్దం కనబడదు. అందుకని, అంగీరసుల సరస్వతి నీలం (నలుపు) అంటే - భృగువులు రూపవైభవాలకు, అంగీరసులు – శబ్దవైభవాలకు సంబంధించిన వారన్నమాట!)

ఈ నీల సరస్వతీ బీజాక్షరాన్ని 'ష్ఠా' అంటారు. అసలు సరస్వతీ బీజాక్షరాన్ని 'ఐం' అంటారు. జమదగ్ని దత్తమైన ఈ నీలసరస్వతీ బీజాక్షరాన్ని జమదగ్ని భార్య అయిన 'రేణుకా మంత్రం' గా కూడా చెబుతారు.

'సుప్రతిష్ఠా' అనే నామానికి - 'ష్ఠా' వైపుకు చక్కగా ఉచ్చారణ తెచ్చుకోండి' అనే సూచన ఉన్నట్లు కొందరు మంత్రశాస్త్రజ్ఞులు చెబుతారు.

ఎవరైనా వాక్కును దిగ్బంధం చేస్తే ఈ 'ష్ఠా' అనే మంత్రం దానికి విరుగుడుగా పనిచేసి ఆ దిగ్బంధనాన్ని తీసెయ్యగలదు.

(విశ్వామిత్రుడు ఒక కుఱ్ఱవానికి వాగ్బంధం చేస్తే - వశిష్ఠుడు ఈ రేణుకా మంత్రమైన 'ష్ఠా' తోనే తీసేశాడు)

'సు + ప్రతి + ష్ఠా – అని ఈ నామాన్ని విడదీస్తే' సు – చక్కగా, ప్రతి = ప్రతిగా, అంటే – విరుగుడుగా పనిచేసే, ష్ఠా = 'ష్ఠా' అనే మంత్రం' – అనే అర్థం కూడానిగూఢంగా ఈ నామంలో ఉంది.

శుక్ల సరస్వతీ బీజాక్షరమైన 'ఐం'లో – 'అ + ఎ + మ్' – ఉంటాయి. ఎ = అ + ఇ కాబట్టి 'ఐం'లో – అ + అ + ఇ + మ్ – ఉంటాయి. అంటే, మూడు అచ్చులు ఒక హల్లు ఉంటాయి. సరిగ్గా దీనికి వ్యతిరేకంగా, నీలసరస్వతీ బీజాక్షరం ఐన 'ష్ఠా'లో – 'ష్ + ఠ్ + ఆ' – ఉంటాయి. 'ఠ్ = ట్ + హ్' కాబట్టి, 'ష్ఠా'లో 'ష్ + ట్ + హ్ + ఆ' ఉంటాయి. అంటే – మూడు హల్లులు ఒక అచ్చు ఉంటాయి. అందుకే, వాగ్భవ బీజమైన 'ఐం' బంధింపబడితే – ఈ 'ష్ఠా' బీజాక్షరం దానికి ప్రతి మంత్రంగా, అంటే – విరుగుడు మంత్రంగా పనిచేసి, వాగ్బంధాన్ని తీసేస్తుంది. (ఒకరి అమ్మాయిని ఇంకొకరి అబ్బాయికి, వాళ్ళ అమ్మాయిని వీళ్ళ అబ్బాయికి పెళ్లి చేసుకుని వియ్యం పొందితే – ఒక అమ్మాయి నిరాదరింపబడితే రెండో అమ్మాయి ద్వారా అది పరిష్కరించవచ్చు. సరిగ్గా అలాంటిదే ఈ తెల్ల సరస్వతీ, నీల సరస్వతీ విషయం – అని అర్థం చేసుకోవచ్చును).

(ఈ మంత్రం సిద్ధించాలంటే – హృదయంలో 'ష్ం', కంఠంలో 'ఠం' ధ్యానం చెయ్యాలి. 'బృహన్నిమాయయా జమదగ్ని దత్తానిష్ఠ నిష్ఠ' అని చెప్పాలి. గోమూత్రాన్ని స్వేదనం (Distillation) చేస్తే వచ్చే లవణాన్ని, సరస్వతీ ఆకుని కలిపి చూర్ణం చేసి హోమం చెయ్యాలి. మూగ, చెవిటి (Deaf and Dumb) వారల విషయంలో గూడా ఈ మంత్రాన్ని ఉపయోగించవచ్చును.

1) చక్కగా స్థాపించుకొనినది.

2) చక్కగా విరుగుడుగా పనిచేసే 'ష్ఠా' మంత్రమును కూడి ఉన్నది' అని ఈ నామానికి అర్థం.

## 661. సదసద్రూపధారిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సదసద్రూపధారిణ్యై నమః' అని చెప్పాలి.

సత్ = వ్యక్తమైనదిగాను, అసత్ = వ్యక్తము కాని దానిగాను, రూప = రూపమును, ధారిణీ = ధరించునది.

వ్యక్తమై కళ్ళకు కనబడేదంతా – 'సత్'. వ్యక్తం కాకుండా కనబడకుండా ఉండేది – 'అసత్'. అమ్మవారు ఈ రెంటి సమన్వయ స్వరూపిణి గా ఉంటుంది. తైత్తిరీయంలో కూడా 'నిర్తుకంచానిరుక్తంచ, నిలయనంచానిలయనంచ, విజ్ఞానంచావిజ్ఞానంచ - సత్యంచానృతంచ సత్యమభవత్' అని పరమాత్మతత్త్వం చెప్పబడుతుంది. అలాగే – 'మత్తః స్మృతిః జ్ఞాన మపోహనంచ' – 'మత్తః పరతరం నాస్తికించిదస్తి ధనంజయ' – అని గీతలో భగవానుడు చెబుతాడు. స్కాంద పురాణంలో –

'యద్యదస్తి తయాభాతి యద్యన్నాస్తితయాపిచ
తత్సర్వం మహాదేవ మాయ యాపరికల్పితామ్' – అని చెప్పబడుతుంది. ఇవన్నీ చెప్పేది ఒక్కటే ! 'భావ – అభావాలు', 'సత్యం – అసత్యం', 'అస్తిత్వం – నాస్తిత్వం', 'మంచి – చెడు' మొదలైన వ్యతిరేకంగా అనిపించే ద్వంద్వాలన్నీ కూడా కలిసి పరమాత్మ తత్త్వాన్ని ప్రతి పాదిస్తాయి, పరమాత్మలో సమానమైన భాగాలుగా ఉంటాయి' అని

'వ్యక్తా వ్యక్తములు, భావా భావములు మొదలైన ద్వంద్వములు కలసియున్న రూపమును ధరించినది – అని ఈ నామానికి అర్థం.

## 662. అష్టమూర్తిః

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అష్టమూర్త్యైనమః' అని చెప్పాలి.

అష్ట= ఎనిమిది చొప్పున ఉండే వాటిని, మూర్తిః = స్వరూపము ( గా ఉండునది)

పరమేశ్వరాష్టమూర్తులు, అష్టప్రకృతులు, అష్టలక్ష్మలు మొదలైన అష్టకము లన్నిటికి స్వరూపముగా ఉండేది అమ్మవారే ! అందుకని అమ్మవారు 'అష్టమూర్తి' ( అష్టమూర్తుల వివరాలు అనుబంధంలో తెలుపబడ్డాయి)

'వివిధ అష్టకముల స్వరూపముగా ఉన్నది' – అని ఈ నామానికి అర్థం

## 663. అజాజైత్రీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అజాజైత్ర్యై నమః' అని చెప్పాలి.

అజా = అవిద్య, లేదా - మాయ, లేదా - మూలజడ ప్రకృతిని, జైత్రీ = జయించునది.

సాంఖ్యం (Samkhya Philosophy) ప్రకారం 'అజా' అంటే 'మూల ప్రకృతి' లేదా 'మాయా' అని అర్థం. ఇవి అనాదియైన అవిద్యా సూచకాలు. వీటిని జయించునది - అని ఈ నామానికి అర్థం.

'అజా' అంటే - 'మేక మెడనుండి వ్రేలాడే నిరర్థక, నిరుపయోగమైన స్తనం' అని గూడా అర్థం ఉంది. దీన్నే 'అజాగళస్తనం'(The fleshy protuberance or nipple hanging down from the neck of goat ) అంటారు. నిరర్థకమైన వాటిని, నిరుపయోగమైన వాటిని తెలియచెయ్యడానికి సంకేతపదంగాను(An emblem of any-thing worthless or useless), అలంకారికంగాను (Figurative) ఈ మాటను వాడతారు. ఉదా:

'ధర్మార్థ కామ మోక్షాణామ్ యస్యైకోఽపి నవిద్యతే
అజాగళస్తనస్యేవ తస్యజన్మ నిరర్థకమ్'

(ధర్మార్థ కామ మోక్షాలు అనే చతుర్విధ పురుషార్థాలలో ఏ ఒక్కటి అయినా తెలుసుకోనివాని జన్మ 'మేక మెడ నుండి వ్రేలాడే స్తనం' లాగా నిరర్థకమే ఔతుంది' - అని పై శ్లోకానికి అర్థం).

దీనిని బట్టి 'అజా' అంటే నిరర్థకమైన, నిరుపయోగకరమైన వాటిని సూచించే పదం కాబట్టి, అటువంటి వాటిని జయించునది అని ఈ నామానికి అర్థం.

(ఈ నామాన్ని 'అజా', 'జైత్రీ' అని విడదీసి రెండు నామాలుగా గూడా కొందరు చెబుతారు కాని, అప్పుడు మొత్తం 1001 నామాలౌతాయి). అప్పుడు మళ్ళీ వెయ్యి నామాలు రావడం కోసం ఎక్కడో ఒక చోట రెండు చిన్న నామాలను కలిపి ఒకే నామంగా

చెప్పాల్సి వస్తుంది. కాబట్టి 'అజాజైత్రీ' అని చెప్పుకోడమే సంప్రదాయంగా వస్తున్న పద్ధతి. ఒక వేళ 'అజా' 'జైత్రీ' అని రెండు నామాలుగా చెప్పుకుంటే వాటి అర్థాలు ఎలా ఉంటాయో వివరణ ఎలా మారుతుందో తెలుసుకోవాలనే కుతూహలం ఉండే వారి కోసం అలా విడదీసిన రెండు నామాలకు కూడా వివరణ ఇస్తున్నాను-వివరణ కర్త.)

(అజా

రెండు అక్షరాల నామం. అజాయైనమః అని చెప్పాలి.

అజా = జననము, లేదా పుట్టుక లేనిది.

పుట్టడం అనేది జనన మరణాలు ఉన్నవాడికి ఉంటుంది. ఎప్పుడూ ఉండే అమ్మవారికి – పుట్టక పూర్వం, పుట్టినపుడు, పోయిన తర్వాత అనే స్థితులు ఉండవు. అంటే, అమ్మవారు ఆద్యంతాలు లేని ఆత్మస్వరూపిణి. అంతేకాదు పుట్టడం, పెరగడం, ఉండడం మార్పు చెందడం, కృశించడం, నశించడం – వంటి షడ్వికారాలు అమ్మవారికి ఉండవు. ఈ వికారాల్లో మొట్టమొదటిదైన 'పుట్టడం' ఉంటే మిగిలిన ఐదు వికారాలు ఉంటాయి. అసలు పుట్టడమనేదే లేనపుడు మిగిలిన ఐదు వికారాలకు అవకాశమే రాదు కదా!

'పుట్టుకలేనిది' – అని ఈ నామానికి అర్థం.

జైత్రీ

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'జైత్ర్యైనమః' అని చెప్పాలి.

జైత్రీ = జయించు శీలము కలది.

స్థూలంగా దుష్టశిక్షణ, సూక్ష్మంగా అజ్ఞాన నిర్మూలన, బాధ్యతగా పంచ కృత్య పరాయణత్వం – వీటిని సాధించి, దిగ్విజయ సూచకంగా జైత్రయాత్ర నడిపే అమ్మవారిని 'జైత్రీ' అంటారు.

జయించిన ఉత్సాహము కలది – అని ఈ నామానికి అర్థం.)

## 664. లోకయాత్రావిధాయినీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'లోకయాత్రావిధాయిన్యైనమః' అని చెప్పాలి.

లోక = లోకములయొక్క, లోకవాసుల యొక్క పోకడలను, లేదా - స్వభావాలను, విధాయినీ = విధానము చేయునది.

అమ్మవారి సామ్రాజ్యం సామాన్యమైంది కాదు. చతుర్దశ భువనాలూ అమ్మవారి పాలన క్రిందకే వస్తాయి. ఒక లోక లక్షణాలు స్వభావాలు ఇంకో లోకానికి ఉండవు. ఉదా: (భూగోళంలో విత్తనం పాతిపెడితే మొక్క వస్తుంది. అదే సూర్యలోకం (సంకల్పలోకం)లో అయితే విత్తనం వెయ్యాలని సంకల్పం వస్తే చాలు మొలకెత్తుతుంది. ఇలాగే వివిధ లోకాల పదార్థ ధర్మాలు వేరు వేరు విధంగా ఉంటాయి). ఒక జీవి లక్షణాలు ఇంకో జీవికి ఉండవు. ఒకే జాతికి చెందిన వారిలో కూడా వారి వారి మనో లక్షణాన్ని బట్టి నైపుణ్యాన్ని బట్టి మళ్ళీ వర్ణాశ్రమ విధానాలన్నీ మారిపోతూ ఉంటాయి. ఇంత వైవిధ్యమున్న సృష్టిలో వేటి వేటికి సంబంధించిన విధానాలను, పద్ధతులను వాటి వాటికి ఏర్పాటు చేస్తుంది కాబట్టి - అమ్మవారు 'లోకయాత్రా విధాయినీ'.

లోకముల యొక్క, లోకవాసుల యొక్క స్వభావాది లక్షణాలను తదనుగుణముగా ఏర్పాటు చేయునది' అని ఈ నామానికి అర్థం.

## 665. ఏకాకినీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ఏకాకిన్యైనమః' అని చెప్పాలి.

ఏకాకినీ = ఒకే ఒక దానిగా ఉండునది.

భౌతిక విశ్వంలోని సమస్తమూ పదార్థమయమే! పదార్థ మంటే - ప్రకృతే! ఆ ప్రకృతి - అమ్మవారి స్వరూపమే! అలాగే మానసిక మైన ఆలోచనలు, సంకల్పాలు - ఆత్మకు సంబంధించిన సంతోషానందాహ్లాది లక్షణాలు, గుణాలు అన్నీ అమ్మవారి

సంకల్పాలే - ఇవన్నీ ఉన్నపుడు ప్రకృతి స్వరూపంగాను, ఇవన్నీ తనలో లీనమైనపుడు ప్రళయ సాక్షిణి గాను ఒక్క అమ్మవారే ఉంటుంది కాబట్టి అమ్మవారు 'ఏకాకినీ' అందుకే 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' అని 'ఏకంసత్ విప్రాః బహుధావదంతి' అనే - ఒకే తత్త్వాన్ని సూచించే సూక్తుల మంత్రాలు వచ్చాయి. ఆ ఒకే ఒక తత్త్వాన్ని సూచించే అమ్మవారి నామం 'ఏకాకినీ'. అనన్యభక్తి కలవారికి 'ఏకాంతులకు' 'ఏకాంత భక్తుల'కు ఈ 'ఏకాకినీ' తత్త్వం బాగా తెలుస్తుంది.

ఒకే ఒక తత్త్వముగా నిలిచి ఉండునది - అని ఈ నామానికి అర్థం.

## 666. భూమరూపా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'భూమరూపాయైనమః' అని చెప్పాలి.

భూమి = రెండవ దాని గురించి ఆలోచించుటకు అవకాశము లేని తత్త్వమునకు, రూపా = రూపమైనది.

'భూమము' అనేది ఒక స్థితిని సూచించే సంకేత పదం. ఏ తురీయావస్థలో రెండవది చూడబడదో, వినబడదో, తలంపబడదో, అట్టి తురీయావస్థను 'భూమావస్థ' అనే ఒక ప్రత్యేకమైన పేరుతో సంకేతిస్తారు. గత నామంలో చెప్పిన 'ఏకాకినీ' నామాన్ని ఈ ప్రస్తుత నామం మరింత నిర్ధారిస్తుంది. అమ్మవారు నిత్యమూ ఈ స్థితిలోనే ఉంటుంది కాబట్టి 'భూమరూపా'.

మనలో ఇంద్రియాలు మనస్సులోకి, ఆ మనస్సు బుద్ధిలోకి, ఆ బుద్ధి ఏకోన్ముఖమై ఆత్మయందు లీనమై ఉండే స్థితిని గూడా మన పరిధిలో 'భూమాస్థితి' అంటారు.

'రెండవ దాని గురించి ఆలోచించుటకు అవకాశము లేని తత్త్వమునకు రూపము' - అని ఈ నామానికి అర్థం.

## 667. నిర్ద్వైతా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'నిర్ద్వైతాయైనమః' అని చెప్పాలి.

నిర్ద్వైతా = ద్వైత భావమునకు అవకాశము లేనిది.

ప్రపంచం చూడ్డానికి ద్వైత లక్షణ తత్త్వమేమో అనిపిస్తుంది. బ్రహ్మవేరు జగత్తు వేరు అనిపిస్తుంది. కాని, ఈ రెంటికీ అభేదమనే విషయం శాస్త్ర జ్ఞానం ద్వారా అయినా తెలుస్తుంది. ఆత్మజ్ఞానం ద్వారా అయినా తెలుస్తుంది. రెండవ దంటూ లేని అమ్మవారి తత్త్వాన్ని సూచించే నామమే 'నిర్ద్వైతా' ఈ నామం 'ఏకాకినీ' 'భూమరూపా' అన్న ముందునామాల అర్థాలను మరింత నిర్ధారిస్తుంది.

'ద్వైత భావమునకు సమన్వయము కానిది' – అని ఈ నామానికి అర్థం.

## 668. ద్వైత వర్జితా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ద్వైత వర్జితాయైనమః' అని చెప్పాలి.

ద్వైత = ద్వైత భావములనుండి, వర్జితా = విడువబడినది.

'జీవేశ్వరుడు వేరు – సర్వేశ్వరుడు వేరు; జీవుడు పరతంత్రుడు – సర్వేశ్వరుడు స్వతంత్రుడు' అనుభావములు – అన్వయించని తత్త్వమే అమ్మవారిది.

ఒకే నూలు (దారం) పోగుతో అల్లబడిన 'ద్వారపు తెర'(Door courtain) మీద రకరకాల బొమ్మలుంటే ఆ తెరలాంటిది అమ్మవారు. ఆ తెరమీద బొమ్మల లాంటివి సృష్టిలోని జీవవస్తు పదార్థాదులు. జాగ్రత్తగా ఆ నూలు (దారపు) పోగును ఓర్పుతో లాగితే – అది బయటకు వచ్చి తెరమీద బొమ్మలన్నీ ఆ నూలుపోగు (దారం)లోకే లీనమౌతాయి. ఇంక తెరకు బొమ్మలకు భేదంగాని ద్వైత భావంగాని ఎలా ఉంటుంది? అమ్మవారికి జగత్తుకీ మధ్య సంబంధం కూడా ఇలాగే ఉంటుందని ఊహించి అమ్మవారి తత్త్వాన్ని అర్థంచేసుకోవాలి. ఈ తత్త్వాన్ని నిర్ధారించే 'ఏకాకినీ' 'భూమరూపా' 'నిర్ద్వైతా' నామాలలాంటిదే ఈ ప్రస్తుత నామం 'ద్వైతవర్జితా' గూడా!

ద్వైత భావముల నుండి విడవబడినది – అని ఈ నామానికి అర్థం.

## 669. అన్నదా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'అన్నదాయైనమః' అని చెప్పాలి.

అన్న = అన్నమును, దా = ఇచ్చునది.

'అన్నం' అంటే మనం తినేది అని మాత్రమే అర్థం చేసుకోకూడదు. 'మనని తినేది' అని గూడా తెలుసుకోవాలి. ఈ విషయమే 'తైత్తిరీయోపనిషత్తు'లో, 'అద్యతేత్తిచభూతాని' అని అన్నం గురించి చెప్పబడింది. అద్యతే + అత్తి + చ = 'అద్యతేత్తిచ' - అంటే - మనచేత తినబడేది, మనని తినేది - అని అర్థం. తగినంత మాత్రమే తింటూ ఉంటే శరీరం ఉన్నంతవరకు అది మనలోకి వస్తూ ఉంటుంది. వయస్సు మళ్ళినా, మితిమీరి తిన్నా, దాంట్లోకి శరీరం క్రమంగా మ్రింగబడి రోగగ్రస్తమౌతుంది. జలం విషయంలో కూడా ఇంతే! నీరు అవసరమైనంత వరకు త్రాగితే - ఆరోగ్యం. మితిమీరి త్రాగితే - నీరుపట్టి, అనారోగ్యాన్ని గూడా సూచించవచ్చు. అలాగే - శ్వాస విషయము కూడా! సమంగా గాలి ఉంటే ప్రాణం నిలుస్తుంది. ఎగశ్వాసతో ఎక్కువైతే ప్రాణం లేస్తుంది. అలాగే తగినంత ఉష్ణోగ్రత ఉంటే శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. మితిని దాటితే మనగతులు మారతాయి.

'ఆయురన్నం ప్రయచ్ఛతి' అంటే ఆయువు అన్నాన్ని ఇస్తుంది. అమ్మవారు ఆ ఆయువును, తద్వారా అన్నాన్ని గూడా ఇస్తుంది. ఎప్పుడైనా మనకు హితమైన ఆహారాన్ని - ప్రియమైన రుచులలో, మితంగా తింటే ఆరోగ్యం బాగుంటుంది. హితం కానిది మితంగా తిన్నా, హితమైంది కదా అని అమితంగా తిన్నా అనారోగ్యానికి దారి తీస్తుంది (అన్నానికి సంబంధించిన కొన్ని విషయాలు తైత్తిరీయోపనిషత్తులో ఎలా చెప్పబడ్డాయో నేను వ్రాసిన తైత్తిరీయోపనిషత్తు గాని, శ్రుతిగీత - 2 గాని చదివితే తెలుస్తుంది.)

'ఏం కావాలి' అని అడిగితే - ముందు - 'అన్నం' చెప్పి, ఆ తర్వాతే ఏవైనా చెప్పాలి. ప్రాణం నిలవాలంటే కావలసినవి అన్నం, నీరు, గాలి. (ఈ మూడు అన్నం క్రిందకే వస్తాయి.) ఇక కోర్కెలన్నీ కుక్క గొడుగుల లాగా పుట్టుకొస్తాయి. కాబట్టి

ముందు – కావలసిందేదో ఇచ్చేది అమ్మవారు. ఎందుకంటే – ముందు కాస్త తింటే ఏ పనైనా చెయ్యగలం. ఎవరు చెప్పిందైనా వినగలం. ఎవరు చేయిచేసుకున్నా ఆపగలం.

తల్లి తన పిల్లలకు కావలసినవి ఎన్ని ఉన్నా ముందు ముఖ్యంగా అన్నం సంగతి చూస్తుంది. పోషకురాలుగా అమ్మవారు కూడా తన సృష్టి జీవులకు అన్నం సంగతి ముందు చూస్తుంది. (మిగిలినవి ఎంత ఇచ్చినా సంతృప్తి పరచి 'చాలు' అనిపించలేము. కాని అన్నం పెట్టి – 'చాలు' అనిపించి సంతృప్తిపరచవచ్చు)

'అన్నమును ఇచ్చునది' – అని ఈ నామానికి అర్థం.

## 670. వసుదా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వసుదాయైనమః' అని చెప్పాలి.

వసు = సంపదను, దా = ఇచ్చునది.

ప్రాణం నిలవడానికి కావలసిన అన్నం ముందు ఇచ్చిన తరువాత, ఉండటానికి అవసరమయే అవసరాలను కూడా అమ్మవారు ఇస్తుంది. ఈ 'అవసరాలు' (Needs) అంటే, – 'కోరికలు' (Desires) కాదు. అమ్మవారు అవసరాలను తీరుస్తుంది కాని – కోరికలను కాదు. తీరుతున్న కొలది కోరికలు పెరుగుతూ ఉంటాయి. అవసరాలు దేహానికి సంబంధించినవైతే, కోరికలు మనస్సుకు సంబంధించినవి. మనం ఇంతకు పూర్వజన్మలో ఏదైనా పుణ్యకార్యాలు చేసి – ఆ పుణ్య ఫలాన్ని దాచుకుని ఉంటే – ఈ జన్మలో ఆ దాచుకున్న దాని నుండి మనకు అవసరమైనవి అమ్మవారు ఇస్తూ ఉంటుంది. దాచుకున్న దాన్ని మించి అడిగితే అమ్మవారు ఇవ్వదు. ఇది సరిగ్గా అర్థం చేసుకోవాలంటే – బ్యాంకు ఎకౌంటులో మనపేర డబ్బు జమ చేసి ఉంచుకుంటే అవసరమై, అడిగినప్పుడల్లా బ్యాంకు వారు ఇస్తారు. జమ చేసి ఉంచినదాన్ని (Deposit amount) మించి అడిగితే ఇవ్వరు కదా! అలాగే అమ్మవారు కూడా మనకు మన పూర్వ పుణ్యఫలాన్ని బట్టి ఈ జన్మలో ఇస్తుంది. అంటే – మనం ఎంతకు పెట్టి పుట్టామో అంతే మనకు దక్కుడన్నమాట! (We receive only what we deserve but not desire). 'చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవా' అంటే ఇదే!

అవసరాలను తీర్చడంలో అవసరాన్ని బట్టి ఆ సమయంలో అక్కడ ఎవరుంటే, ఏది ఉంటే - వారి, లేదా - దాని రూపంలో పనిచేస్తూ ఆలస్యం జరక్కుండా ఆదుకుంటుంది' ఇంత గొప్ప పొదుపు పద్ధతి (Economical Method) ఎక్కడా ఉండదు. ఎవ్వరూ ఆచరించలేరు.

సంపదను ఇచ్చునది - అని ఈ నామానికి అర్థం.

## 671. వృద్ధా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'వృద్ధాయైనమః' అని చెప్పాలి.

వృద్ధా = వృద్ధి చెందునది.

'వృద్ధులు' అంటే ముసలివారు అనే అర్థం కాకుండా 'వృద్ధి చెందిన వారు' అని గూడా అర్థం చేసుకోవాలి.

'స్వస్తిన ఇంద్రోవృద్ధ శ్రవాః' అన్నపుడు - 'నలుగురు పెద్దలు చెప్పిన మంచి విషయాలు బాగా వినడం మూలంగా అభివృద్ధి చెందిన వాడైన ఇంద్రుడు మనకు శుభముచేకూర్చుగాక ! అని అర్థం కాని 'పెద్దచెవులున్న ఇంద్రుడు మనకు శుభము చేకూర్చుగాక!' అని గాని, 'ముసలివాడైన ఇంద్రుడు మనకు శుభములు చేకూర్చుగాక' అని గాని అర్థాలు కాదు.

'వృద్ధాః' అంటే పెద్దవారు(Elders) అని అర్థంచేసుకోవాలి. (పెద్దవారు వేరు - ముసలివారు (Elders) వేరు. పెద్దవారు అంటే - జ్ఞానులు, గౌరవించతగినవారు' అని అర్థం. భారతంలో -

'ఉత్తమ జ్ఞాన వృద్ధుగానుండెనేని - బాలుడయ్యును పూజ్యుండు బ్రాహ్మణుండు' - అని చెప్పబడింది. సృష్టికి పూర్వం ఉన్న అమ్మవారు అందరికంటె పెద్దది. తైత్తిరీయంలో కూడా 'అహమస్మిప్రథమజా' అని చెప్పబడింది. దేవీ భాగవతంలో - 'అహమేవ పూర్వంతు నాన్యత్కించిన్నగాధిప' అని చెప్పబడింది. కాబట్టి అమ్మవారు ఈ అర్థంలో 'వృద్ధా'.

## 672. బ్రహ్మాత్మైక్యస్వరూపిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'బ్రహ్మాత్మైక్యస్వరూపిణ్యై నమః' అని చెప్పాలి.

బ్రహ్మ = బ్రహ్మము, ఆత్మ = ఆత్మ, ఐక్య = ఒకటి అయిన, స్వరూపిణీ = స్వరూపము గలది.

'సోఽహం' అనే పదానికి 'వాడేనేను' అని అర్థం. (ఇక్కడ 'వాడు' అంటే - 'పరబ్రహ్మ', 'అహం', అంటే - 'నేను' అనే 'ఆత్మ') ఆ సోఽహం యొక్క అర్థానికి స్వరూపంగా అమ్మవారిని ఈ నామం ద్వారా అర్థం చేసుకోవాలి.

బ్రహ్మ - బ్రహ్మవిద్యను (Universal Knowledge), ఆత్మ - ఆత్మవిద్యను (Subjective knowledge) సూచిస్తాయి. అంటే - అమ్మవారు అటు బ్రహ్మాండ జ్ఞానాన్ని ఇటు పిండాండ జ్ఞానాన్ని ఐక్యంచేసే, లేదా - సమన్వయంచేసే శ్రీ విద్యా స్వరూపురాలు అని కూడా ఈ నామాన్ని అర్థంచేసుకోవచ్చును. మహా వాక్యాలైన 'అహం బ్రహ్మాస్మి', 'తత్త్వమసి', 'అయమాత్మా బ్రహ్మ', 'ప్రజ్ఞానం బ్రహ్మ' అనే మహా వాక్యాల అర్థాలకు స్వరూపమైన అమ్మవారిని ఈ నామం ద్వారా గ్రహించాలి. తురీయస్థితిరూపమైన అమ్మవారి ఈ బ్రహ్మాత్మైక్య స్వరూపాన్ని 'సావిత్రీరూపం' అని కూడా అంటారు.

## 673. బృహతీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'బృహత్యైనమః' అనిచెప్పాలి.

బృహతీ = బృహ్మణము చెందునది, లేదా - విచ్చుకొనునది.

'బృహత్' అంటే = బృహ్మణము చెందుట, అంటే - 'విచ్చుకొనుట', 'ఉబ్బుట' అని అర్థాలు. 'బృహత్' అనే పుంలింగ పదానికి 'బృహతీ' స్త్రీలింగ పదమౌతుంది. అటు బ్రహ్మాండపరంగాను, ఇటు పిండాండ పరంగాను 'బృహ్మణము' అంటే విచ్చుకునే (Sprouting) తత్త్వము కలిగినది కాబట్టి, అమ్మవారిని 'బృహతీ' అన్నారు.

'బృహత్త్వాత్బృంహణత్వాచ్చ బ్రహ్మబృహత్' అన్నారు. దీనిని బట్టి 'బృహత్' అంటే - 'పెద్దది' అని - 'బృహ్మణము' అంటే - 'విచ్చుకోవడ' మనే అర్థాలు చెల్లే తత్త్వం గలది కాబట్టి, అమ్మవారికి కూడా 'బృహతీ' అనే నామం చెల్లుతుంది. తైత్తిరీయంలోని నారాయణంలో కూడా అమ్మవారి ఈ పరబ్రహ్మతత్త్వాన్ని ఈ 'బృహతీ' పదంతో 'హగ్ంసశ్శుచిషత్... ఋతజా **అద్రిజాఋతం బృహత్' అని చెప్పబడింది.**

'బృహతీ' అనే పదం ఒక ఛందస్సును గూడా సూచిస్తుంది.

వివిధ సంఖ్యాక్షరాలతో ఛందస్సులుంటాయి. వాటిలో ఏకాక్షర ఛందస్సే ప్రణవం (ఓం). గాయత్రి - 6 అక్షరాలు, ఉష్ణిక్ - 7 అక్షరాలు, అనుష్టుప్ - 8 అక్షరాలు, త్రిష్టుప్ - 11 అక్షరాలు, జగతీ - 12 అక్షరాలు కలిగి ఉంటాయి. వీటన్నిటితో పాటు - 9 అక్షరాలు ఛందస్సు గూడా ఉంటుంది. దాన్నే 'బృహతీ ఛందస్సు' అంటారు. ఈ ఛందస్సులో పాదానికి 9 అక్షరాల చొప్పున మొత్తం మీద 4 పాదాల్లో 4 X 9 = 36 అక్షరాలుంటాయి. ఇది ప్రజాపతులనబడే అంకెల గూర్చి, అధిదేవతల గూర్చి తెలియచేస్తుంది. ఇంకా మండలాత్మక పరిభ్రమణానికి కావలసిన కొలతలు దీని వలన తెలుస్తాయి. దశాంశపద్ధతిలో ఈ కొలతలు తెలియవు. కాబట్టే, ఈ కొలతలకు సంబంధించిన డిగ్రీలు - 9చే గుణింపబడేవిగా ఉంటాయి.

దశాంగుళముగా (10) పురుషుడు విరాట్ నుండి దిగివచ్చుట (అత్యతిష్టత్ దశాంగుళమ్ - పురుషసూక్తం), 4 పాదముల వాక్కుగా దిగివచ్చుట (4) బృహతీ ఛందస్సుగా (9) దిగివచ్చుట - అనునవి సృష్టి గుణింతాలుగా డిగ్రీలుగా (Degrees) పుట్టాయి. ఈ డిగ్రీలనే జ్యోతిశ్శాస్త్రంలో 'భాగలు' అంటారు. (ఈ విధంగా 10 X 4 X 9 = 360 ఔతుంది. సూర్యుని చుట్టూ తిరుగు గ్రహాల గణితం దశాంశ పద్ధతిలో సరిపోదనే ఉద్దేశ్యంతోనే - ప్రాచీన ఖగోళ శాస్త్రజ్ఞులు' - నవాంశ గణితాన్ని (System of 1/9 quantities) ఉపయోగించేవారు. ఇప్పుడా గణితం వ్యాప్తిలో లేదు. వరాహమిహిరుడు నవాంశ గణితం అనే గ్రంథాన్ని కూడా రచించాడు. ఇప్పుడది లభ్యం కాదు. దశాంశ గణితంలో 1/10 = 0.1 అయితే, ఈ నవాంశ గణితంలో 1/9 = 0.1 అవుతుంది. (మిగిలిన ఛందస్సుల వివరాలు తెలుసుకోదలచినవారు మా గురుదేవులు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారు వ్రాసిన 'సువర్ణసూక్తం' చదవండి - వివరణకర్త)

ఈ 'బృహతీ' పదం సూచించే - విచ్చుకునే పద్ధతి అక్షర సంకేతాలతో ఈక్రింద తెలిపిన ఉదాహరణ ద్వారా గ్రహించవచ్చును. 'అ - హ - గ - క - ఖ' ఇది అహంకార బృహ్మణాన్ని తెలియచేసే పద్ధతి. 'అ' అనే అక్షరం సూచించే పరబ్రహ్మ రాను రాను ఉచ్చారణలో గట్టిపడుతూ, చివరకు 'ఖ' కార ఉచ్చారణలో పూర్తిగా గట్టిపడి, పదార్థమయమైన సృష్టికి నాందీభూతంగా ఉండే - 'ఆకాశతత్వాన్ని సూచించే 'ఖ' (ఖం - అంటే ఆకాశం) అక్షరంగా మారడాన్ని ఈ బృహ్మణపద్ధతి సూచిస్తుంది. 'అ' నుండి 'ఖ' వరకు జరిగే ఈ అక్షర బృహ్మణం సృష్టిపరంగా జరిగే అఖండ సచ్చిదానంద స్వరూపుడైన పరబ్రహ్మ బృహ్మణాన్ని సూచిస్తుంది.

1) బృహ్మణము చెందునది, లేదా - విచ్చుకొనునది.

2) బృహతీ ఛందస్సు రూపంలో ఉండునది - అని ఈ నామానికి అర్థాలు.

## 674. బ్రాహ్మణీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'బ్రాహ్మణ్యైనమః' అని చెప్పాలి.

బ్రాహ్మణీ = బ్రాహ్మణ స్త్రీ స్వరూపిణి.

'బ్రాహ్మణుడు' అంటే - ఏ విషయాన్నైనా - మొగ్గ పువ్వులాగా విచ్చుకునే విధంగా - విడమరచి చెప్పే లక్షణం కలవాడని అర్థం. ఈ లక్షణాన్నే 'బృహ్మణ' లక్షణం అంటారు. ఈ కీలక లక్షణం ఉన్నవాడే బ్రాహ్మణుడు కాని - గుండు, పిలక, గోచీ, యజ్ఞోపవీతం, నుదిటిమీద **ఊర్ధ్వపుండ్రములు, లేదా - విభూతిరేఖలు ధరించినవాడు కాదు.** బృహ్మణ లక్షణం ఉంటే ఈ చెప్పినవేవీ లేకపోయినా బ్రాహ్మణుడే అవుతాడు. అంటే - వర్ణానికి చెప్పిన కీలక లక్షణాన్ని బట్టి బ్రాహ్మణ వర్ణానికి చెందిన వాడని నిర్ణయించాలి గాని - బాహ్యమైన వేషభాషలను బట్టి కాదు, జన్మని బట్టి కాదు (ఈ విషయం వర్ణాశ్రమ విధాయినీ అన్న 289 నామ వివరణలో విపులంగా చెప్పబడింది.) వేదోచిత కర్మానుష్ఠాన బద్ధుడై ఉండే పై లక్షణం గల బ్రాహ్మణుని స్వరూపంలో సాంబమూర్తి ఉంటాడని - ఆ బ్రాహ్మణుని భార్యను 'బ్రాహ్మణీ' అంటారని కూర్మపురాణంలో చెప్పిన ఈ క్రింది శ్లోకం తెలియచేస్తుంది.

శ్లో. బ్రాహ్మణో భగవాన్సాంబో బ్రాహ్మణానాంహిదైవతమ్
విశేషాద్బ్రాహ్మణో రుద్రమీశానం శరణం వ్రజే.

అమ్మవారి ఉపాసనా మార్గంలో ఉండేవారు – వేదోచిత కర్మానుష్ఠాన బద్ధుడై ఉండే పైన చెప్పిన కీలక లక్షణం గల బ్రాహ్మణుని, ఆ బ్రాహ్మణుని భార్యను సాక్షాత్తు పరమేశ్వరుని గాను, పరమేశ్వరిగాను తలంచి, గౌరవించి పూజించాలి.

'బ్రాహ్మణ స్త్రీ రూపంలో ఉండునది' అని ఈ నామానికి అర్థం.

## 675. బ్రాహ్మీ

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'బ్రాహ్మ్యై నమః' అని చెప్పాలి.

బ్రాహ్మీ = బ్రహ్మయొక్క సృజనాత్మక శక్తి స్వరూపిణి.

'బ్రహ్మ' 'బ్రహ్మము' అనే రెండు పదాలు ఒకే అర్థానికి చెందినవైనా ఈ రెంటినీ ఈ క్రింద తెలిపిన తేడాలో వాడుతూ ఉండటం జరుగుతూ ఉంటుంది.

| బ్రహ్మకు చెందినవి | బ్రహ్మమునకు చెందినవి |
|---|---|
| వేదము | వేదాంతము |
| చతుర్ముఖుడు | యోగము, తత్త్వము |
| బ్రాహ్మణుడు | తపస్సు, శాస్త్రము మొదలగునవి |
| పురోహితుడు | |

బ్రహ్మ యొక్క సృజనాత్మక శక్తి స్వరూపంలో ఉండే సరస్వతీ దేవిని ఈ నామం సూచిస్తుంది. మనస్సులోని అభిప్రాయాన్ని వాక్కుగా ఇచ్చే శక్తికి సంబంధించిన సరస్వతీ దేవిని ఆవాహన చేస్తూ సరస్వతీ ఆకులు నేతిలో ముంచి హోమం చేస్తే సరస్వతీ కటాక్షం, ధారణశక్తి, ధీశక్తి, పెరుగుతాయి – ఇలా హోమం చేస్తున్నపుడు

'ఓం ప్రణోదేవీ సరస్వతీ
వాజేభిః వాజినీవతీ

ధీనాం అవిత్ర్యవతు

'ఓం' 'ఐం' సరస్వత్యై నమః' అనే మంత్రం చెప్పాలి.

బ్రహ్మ యొక్క సృజనాత్మక శక్తి స్వరూపిణి' అని ఈ నామానికి అర్థం

## 676. బ్రహ్మానందా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'బ్రహ్మానందాయైనమః' అని చెప్పాలి.

బ్రహ్మ = బ్రహ్మమే, ఆనందా = ఆనందముగా గలది.

మానవానందం నుండి బ్రహ్మానందం దాకా మధ్యలో ఎన్నో స్థాయిలలో ఎన్నో రకాల ఆనందాలుంటాయి. వీటి వివరాలన్నీ 'స్వాత్మానందలవీభూతా బ్రహ్మాద్యానంద సంతతిః' - అనే 365వ నామంలో వివరించబడినాయి. అన్ని ఆనందాలకు పరాకాష్ఠగా చివరిస్థాయిలో ఉండే బ్రహ్మానందం యొక్క స్వరూపిణి అమ్మవారు అని ఈ నామం సూచిస్తుంది.

తన శరీర పరమైన ఆనందాన్ని అనుభవిస్తే అది 'ఆత్మానందం' ఔతుంది. మొత్తం విశ్వపరమైన ఆనందాన్ని అనుభవిస్తే అది 'బ్రహ్మానందం' ఔతుంది.

బ్రహ్మానంద స్వరూపిణి - అని ఈ నామానికి అర్థం.

## 677. బలిప్రియా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'బలిప్రియాయైనమః' అని చెప్పాలి.

బలి = నివేదనా ద్రవ్యములందు, ప్రియా = ప్రీతికలది.

అమ్మవారికి ఆత్మ సమర్పణ భావంతో ఏ ద్రవ్యాన్నైనా సమర్పిస్తే - దాన్ని చాలా ప్రీతిగా అమ్మవారు గ్రహించి - అనుగ్రహిస్తుంది. ఈ ద్రవ్యాలను నివేదనగా సమర్పించడంలో ఎవరి పద్ధతులు వారికిఉన్నాయి. అవి వారి వారి సంస్కారాలను బట్టి,

పారంపర్యంగా వస్తున్న ఆచార వ్యవహారాలను బట్టి ఉంటాయి. జంతువులను, మనుష్యులను కూడా నివేదనకై బలి ఇచ్చేవారున్నారు. తాము ఏమి తింటారో, ఏవి త్రాగుతారో వాటినే బలి ఇచ్చేవారు కూడా ఉంటారు. 'సంస్కారాన్ని పెంచుకోండి' - అని చెప్పడం దాకానే మనం చెయ్యకలం కాని - వారి పద్ధతులను ఒక్క మాటలో మార్చేలాగా చెయ్యలేము.

'అజంవా, మేషంవా, మహిషమపిమార్జారమపివా' అన్నారు. మనస్సనే బలిపీఠం మీద మూర్ఖత్వం - అనే గొఱ్ఱెను, పిరికితనం - అనే మేకను, మదం - అనే దున్నపోతును, దొంగబుద్ధి - అనే పిల్లిని బలి ఇవ్వమని సంకేతార్థాలతో ఈ శ్లోకం చెప్పినా - ఆయా జంతువుల్ని బలి ఇవ్వాలనే అర్థాన్నే తీసుకుని అలా బలి ఇచ్చేవారు కూడా ఉంటారు.

ప్రతి గృహస్థు పంచ పాతక నివృత్తికై ఐదురకాల బలులు ఇవ్వాలని చెప్పబడింది. జీవరాశులకు ఇచ్చే బలులు ఇవి. గృహ వాతావరణంలో జీవరాశులకు ఐదు చోట్ల బలి విదిలిస్తూవుండాలన్నారు. అవి 1. ఱోలు, పాత్రము వుండేచోట 2, పొయ్యివద్ద 3. వాకిట్లో ముగ్గువేసేచోట 4. దొడ్లో తులసికోట వుండేచోట 5. చీమల పుట్టల వద్ద. పైన చెప్పిన ప్రాంతాల్లో ఎక్కువగా మన వల్ల సూక్ష్మ జీవులు, కీటకాలు ప్రాణాలు కోల్పోతూ ఉండటానికి అవకాశం ఉంది. ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకుని ఈ పంచబలులు ఏర్పాటు చేశారు. మనం తినబోయే అన్నాన్ని పైన చెప్పిన ప్రదేశాల్లో విదిలిస్తే చాలు.

ఇదే విధంగా దేవాలయ ప్రాంగణంలో కూడాచెయ్యాలి. ఇవి ఊరిలోని జనం మొత్తం చేసే పంచ మహాపాతకాల నివృత్యర్థం ఏర్పాటు చేసినవి. నాలుగు వర్ణాల వారికి నాలుగు రకాల బలి ద్రవ్యాలు కేటాయించారు.

శ్లో. కూష్మాండ మిక్షు దండంచ శ్రీ ఫలం నారికేళకమ్
ఏతేబలి సమాః ప్రోక్తా, తృప్తా, భాగసమాః సదా.

'బ్రాహ్మణులు గుమ్మడి కాయను, క్షత్రియులు చెఱకు గడును, వైశ్యులు శ్రీ ఫలాన్ని, శూద్రులు కొబ్బరికాయను బలిగా, అంటే - నైవేద్యంగా సమర్పిస్తే అమ్మవారు బాగా తృప్తి చెందుతుంది అని పై శ్లోకానికి అర్థం.

నివేదన ద్రవ్యములందు ప్రీతి గలది - అని ఈ నామానికి అర్థం.

## 678. భాషారూపా

నాలుగు అక్షరాల నామం. ఈనామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'భాషారూపాయైనమః' అని చెప్పాలి.

భాష= భాషయొక్క, రూపా = రూపముగా ఉన్నది.

మనస్సులోని భావాలను నిర్దిష్టమైన పద్ధతిలో వ్యక్తం చెయ్యడానికి అవసరమయే దాన్ని 'భాష' అంటారు. ఏవిధమైన భాషకైనా ఇదే ధ్యేయం. కాబట్టి ప్రపంచంలో ఎన్నో రకాల భాషలున్నా ఆ అన్ని భాషల రూపంలో ఉండేది అమ్మవారే అని గ్రహించాలి. భాషారూపంలో ఉండే మనభారతీయ వాఙ్మయం యొక్క ప్రణాళిక ఈ క్రింది విధంగా ఉంటుంది.

'ఓం' నుండి 'సో' 'హం' అక్షరాలు విడివడితే – ఆ రెంటిలో 'సో' నుండి – అక్షరాలు, పదాలు, వాక్యాలు వ్యక్తమౌతాయి. 'హం' నుండి అర్థాలు, టీకా తాత్పర్యాలు, ఆమ్నాయాలు, శాస్త్రాలు, సాంఖ్యాది యోగాలు వ్యక్తమౌతాయి. ఇది కేవలం స్థూలంగా ఉండే విశ్లేషణ మాత్రమే !

భాష యొక్క రూపంగా ఉండునది – అని ఈ నామానికి అర్థం.

## 679. బృహత్సేనా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'బృహత్సేనాయైనమః' అని చెప్పాలి.

బృహత్ = గొప్పదైన, సేన = సేనగలది.

అమ్మవారికి ఉండే చతురంగ బలసైన్యాల గురించి - భండాసురవధకు సంబంధించిన నామాలున్న ప్రథమ భాగంలో విపులంగా వివరించబడింది. ఇవి భౌతిక బల ప్రదర్శనకు, జ్ఞాన దర్శనమునకు సంబంధించిన వివరాలు.

అనంతములైన వేదాలలోని ఋక్‌లు, సామలు, యజుస్సులు తదితర మంత్రాలు అన్నీ - జ్ఞాన స్వరూపిణి, భాషారూపిణి అయిన అమ్మవారికి సంబంధించిన జ్ఞాన సంకేతసేనా వాహిని క్రిందకే వస్తాయి.

1) బృహత్తరమైన సేన కలది.

2) బృహత్తరమైన జ్ఞాన సంకేత సేనా వాహిని కలది - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## ౬౮౦. భావాభావవివర్జితా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'భావాభావవివర్జితాయైనమః' అని చెప్పాలి.

భావ = ఉండటం, అభావ = ఉండకపోవటం (అను రెండుస్థితులచే) వివర్జితా = విడువబడినది.

ఉండే స్థితిని భావమని, ఉండకుండా ఉండే స్థితిని 'అభావ' మనీ అంటారు. 'ఉండకుండా ఉండటం ఏమిటి ?' - ఇది కూడా ఒక స్థితేనా ? అనిపించవచ్చు. అవును ఇది కూడా ఒక స్థితే! ఈ ఉండకుండా ఉండే స్థితి, అంటే - 'అభావం' - ఒక రకంగాదు నాలుగు రకాలుగా ఉంటుందని గూడా తార్కికులు చెప్పారు. వాటిపేర్లే 1) ప్రాక్ + అభావం = ప్రాగభావం, 2) ధ్వంస + అభావం = ధ్వంసాభావం, 3) అన్యోన్య + అభావం = అన్యోన్యాభావం 4) అత్యంత + అభావం = అత్యంతాభావం.

(ఒక వస్తువు తయారుకాక పూర్వం ఆ వస్తువు ఉండని స్థితిని దాని 'ప్రాగభావం' అంటారు. ఒక వస్తువు పూర్తిగా నాశమైపోయిన తరువాత ఆ వస్తువు ఉండని స్థితిని దాని 'ధ్వంసాభావం' అంటారు. ఒక వస్తువు ఇంకొక వస్తువులాగా ఉండలేని స్థితి, 'అన్యోన్యాభావం' అంటారు. 'గొడ్రాలిబిడ్డ' లాంటి అసలు ఉండటానికే అవకాశంలేని ఆ వస్తువు స్థితిని 'అంత్యంతాభావం' అంటారు).

ఈ భావాభావాలు సూచించే - 'ఉండడం', 'ఉండకపోవడం' - క్రింద ఉండే వారికి గాని - పైనుండి చూచే వాడికి అర్థరాహిత్యంగా అనిపిస్తాయి.

భావా భావస్థితుల కతీతమైనది - అని ఈ నామానికి అర్థం.

## 681. సుఖారాధ్యా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సుఖారాధ్యాయైనమః' అని చెప్పాలి.

సుఖ = సుఖముగా, ఆరాధ్య = ఆరాధింపబడునది.

హైరానుపడకుండా, పెద్ద ఎత్తులో పూజాదిక ద్రవ్యాలు ఇతర బాహ్య వటాటోపాలు గూడా అవసరం లేకుండానే, మానసికంగా భావనా మాత్రంగా, అంతర్యాగ విధానంలో, హాయిగా ఆరాధించినా - ఆనందపడి అమ్మవారు అనుగ్రహిస్తుంది. ఆవిడ క్కావాలసింది త్రికరణ శుద్ధి, ఆత్మ సమర్పణ బుద్ధి - అంతే గాని, ఆడంబరాలు, ఆర్భాటాలు కాదు.

సుఖముగా ఆరాధింపబడునది - అని ఈ నామానికి అర్థం.

## 682. శుభకరీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శుభకర్యైనమః' అని చెప్పాలి.

శుభ = శుభములను, కరీ = కలిగించునది.

అందరికీ ఒకే రకమైనవి కావలసినవి ఉండవు. అందరూ ఒకే రకంగా కోరుకోరు. కోరుకునే వాటిలో కూడా ఏవి తమకు శుభాన్ని చేకూరుస్తాయో కూడా తెలియకుండా అనవసరమైన వాటిని కూడా కోరుకోవచ్చు. వాళ్ళు అలా కోరినా - అమ్మవారు వారికి శుభం జరిగేవే కలుగ చేస్తుంది. అశుభాలను, ఆపదలను తప్పిస్తుంది. అయితే - మనకు వచ్చే అశుభాలే తెలుస్తాయి కాని, తప్పిన అశుభాలు తెలియవు.

శుభాలను కలుగచేయడమే కాదు - 'తన భక్తుల చేత శుభమైన పనులను కూడ చేయిస్తుంద'నే అర్థంకూడా ఈ నామానికి ఉంది.

1) శుభములను కలుగచేయునది.

2) శుభమైన పనులను చేయించునది.

3) శుభములైన కరములు (చేతులు) కలది.

## 683. శోభనాసులభాగతిః

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శోభనాసులభాగత్యై నమః' అని చెప్పాలి.

శోభనా = శోభనములైన వాటిని (పురుషార్థములను) పొందుటకు, సులభా = సులభమైన, గతి = మార్గమైనది.

ఏవి ప్రతిమనిషికీ అవసరమో, వీటిని క్రమమైన రీతిలో పొందితే చిట్ట చివరకు ముక్త సంగులై జీవిత ధ్యేయాల్ని పొందుతారో – వాటిని 'శోభనములు' అంటారు. అవే ధర్మార్థ కామ మోక్షములనే పురుషార్థాలు. వీటిని పొందడంలో సులభమైన మార్గముగా ఉండేది అమ్మవారి ఆరాధనే ! మోక్షమార్గం కష్టసాధ్యం కాదు. సులభమైనదే ! అది అమ్మవారి కటాక్షానికి సంబంధించినది. ఆత్మ సమర్పణ బుద్ధులకు అది సులభమే !

'కుపుత్రోజాయేత్ క్వచిదపి కుమాతానభవతి' అన్నారు. ఆది శంకరులు అపరాధ క్షమాపణ స్తోత్రంలో (తల్లికి చెడుచేసే) చెడ్డపుత్రుడుండవచ్చునేమో కాని (కొడుక్కి చెడుచేసే) చెడ్డతల్లి ఉండదు – అని దీని అర్థం. అందుకే అమ్మవారు 'సులభాగతిః'. ఈ విషయం తెలిసినవారు – 'సులభేవహ్నివల్లభా' అంటే – 'సులభేస్వాహా' అని మంత్రాన్ని ఉచ్చరించి, వత్తివేసి ఆవునేతితో దీపం వెలిగించి, మంచి గంధ పరిమళాన్ని ప్రసరింపచేసి, అమ్మవారిని ధ్యానిస్తే – మనలో దుర్బుద్ధి పుట్టనంతవరకు – అన్నీ చేసి పెడుతుంది. అయితే జీవితం నీతివంతమై ఉండాలి !

1) శోభనములైన పురుషార్థములు పొందుటలో సులభమైన మార్గమైనది.

2) శోభనులైన సువాసినులచే సులభముగా పొందబడునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 684. రాజరాజేశ్వరీ

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రాజరాజేశ్వర్యైనమః' అని చెప్పాలి.

రాజ = రాజులకు, రాజు = రాజులైనవారిని, ఈశ్వరీ = పరిపాలించునది; రాజు = చంద్రుని యొక్క, రాజ = యజమాని అయిన శివునికి, ఈశ్వరీ = భార్య.

'రాజాప్రకృతిరంజనాత్' అన్నారు. ప్రకృతిని, ప్రజలను - రంజింప చేసేవాడు రాజు. చంద్రుడు కూడా ప్రజలను రంజింప చేస్తాడు. కాబట్టి, 'రాజు' అంటే - 'చంద్రుడు' అని కూడా అర్థం ఉంది. 'రాజు' అంటే పరిపాలించేవాడు - అని అర్థం. 'యజమాని' ఇంటిలోని కొందరిని పరిపాలించేవాడే కాబట్టి 'యజమాని' కూడా రాజు పదానికి అర్హుడే! ఈ అర్థాలను బట్టి -

'రాజరాజు' అంటే చంద్రునికి యజమాని. అంటే - 'శివుడు' అని అర్థం వస్తుంది. ఈ రాజరాజుకు ఈశ్వరీ' అంటే 'శివునికి ప్రాణేశ్వరి' అని అర్థం చెప్పుకోవచ్చును.

ప్రజలను పరిపాలించేవారు రాజులైతే - ఈ రాజులను పై నుండి పరిపాలించే అష్ట దిక్పాలక, త్రిమూర్త్యాదులు 'రాజరాజు'లౌతారు. మళ్ళీ ఈ 'రాజరాజులు సర్వ జగత్పరి పాలనా ధికారిణి అయిన అమ్మవారిచే పరిపాలితులే కాబట్టి - అమ్మవారు - 'రాజరాజేశ్వరి'. ఈ రాజరాజేశ్వరీ దేవిని శ్రీ విద్యాషోడశాక్షరీ మంత్ర విద్యాధిదేవతగా చెబుతారు.

1) శివుని యొక్క ప్రాణేశ్వరి.

2) రాజుల యొక్క, దిక్పాలక త్రిమూర్త్యాదుల యొక్క పరిపాలకురాలు.

3) శ్రీ విద్యాషోడశాక్షరీ మంత్ర విద్యాధిదేవతా స్వరూపిణి - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 685. రాజ్యదాయినీ

అయిదు అక్షరాల నామం. ఈనామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రాజ్యదాయిన్యై నమః' అని చెప్పాలి.

తన భక్తులకు, ఉపాసకులకు, శ్రేష్ఠులకు, వారి వారి అర్హతను బట్టి - దీక్షా బల సామర్థ్యాలను బట్టి వారి వారికి రాజ్యాలను ఇస్తుంది. ఈశ్వరునికి కైలాసం, విష్ణువుకి

వైకుంఠం, బ్రహ్మకు సత్యలోకము, ఇంద్రునికి అమరావతి మొదలైనవి. (ఎవరెవరికి ఏఏ రాజ్యాలిచ్చిందో అనుబంధంలో వివరంగా ఇవ్వబడ్డాయి)

పైన తెలిపినవన్నీ పైకి రాజ్యాలుగా కనిపించినా, ఈ రాజ్యాలకు ఆధ్యాత్మికమైన అర్థం వేరే ఉంది. దీన్నే - 'స్వారాజ్యం' లేదా 'స్వరాజ్యం' అంటారు. తైత్తిరీయంలో 'ఆప్నోతిస్వారాజ్యం' అని చెప్పబడే 'స్వారాజ్యమే' ఈ 'స్వరాజ్యం'.

'స్వ' తనకు సంబంధించిన (Subjective), రాజ్యమ్ = ప్రభుత్వము' - అనగా ఆత్మసామ్రాజ్యం' అని అర్థం. అంటే - ఆత్మోన్ముఖమైన బుద్ధి, బుద్ధి చెప్పినట్లుగా వినే మనస్సు - మనస్సు ఆజ్ఞలను పాటించే జ్ఞానేంద్రియాలు, జ్ఞానేంద్రియాలతో సమన్వయ పరచుకుంటూ పనిచేసే కర్మేంద్రియాలు - ఇటువంటి చక్కని పద్ధతి ప్రకారం నడిచే జీవిత సామ్రాజ్యానికి తన భక్తుని అధిపతిగా చేస్తుంది. ఇంతకంటె వాస్తవానికి మనిషికి, కావలసింది ఏదీ లేదు. దీన్నే 'యోగజీవనం' అంటారు. బ్రతికినన్నాళ్ళు ఈ యోగ జీవన యాత్రలో యాత్రికునిగా జీవితాన్ని పవిత్రవంతం చేసుకుంటూ చిట్ట చివరకు పరమాత్మ దర్శనంతో సాధకుడు పరమానందమైన పరమపదాన్ని పొందుతాడు.

'ఆత్మసామ్రాజ్యం' అంటే 'తనకు సంబంధించిన సామ్రాజ్యం' అని అర్థం చెప్పుకుంటే అమ్మవారు తన భక్తులను తన దగ్గరకు చేర్చుకుని తన పరివారంలో ఒకరిగా చేసుకుంటుంది. ఇక అప్పటి నుండి భక్తుడి వల్ల జరిగే పనులన్నీ అమ్మవారి పర్యవేక్షణలో, నియంత్రణలో జరుగుతాయి. అంటే - ఆ భక్తుడు విశ్వ ప్రభుత్వ' నిర్వహణకు ఉత్తమ వాహికగా (Best Conductor) పనిచేస్తాడన్నమాట! ఇలా ఉన్నవారు స్వర్గంలో ఉన్నట్లే! స్వర్గం అనే పదం - 'సు + వర్గం' అనే రెండు పదాల కలయిక వల్ల వచ్చింది అని అర్థం చేసుకోవాలి. అప్పుడు - మిత్ర పరిజనాదులు, వస్తువాహనాది సౌకర్యాలు అన్నీ తనకు అనుకూలంగాను, శ్రేయస్సు కలుగ చేసేవి గాను ఉండే వర్గాన్ని కలిగి ఉండటం అని - ఈ 'సువర్గ' పదం సూచిస్తుంది. ఇలా ఉన్న వాతావరణాన్ని 'స్వర్గం' అనీ, ఈ సౌఖ్యాలను స్వర్గలోక సౌఖ్యాలనీ అంటారు. ఈ స్వర్గలోక సౌఖ్యాలనిస్తుందని కూడా ఈ నామాన్ని అర్థం చేసుకోవచ్చును.

1) తన భక్తులకు వారి వారి అర్హతను బట్టి రాజ్యాలను ఇచ్చునది.

2) తన భక్తులను ఆత్మ సామ్రాజ్యాధినేతలుగా చేయునది.

3) తన భక్తులకు స్వర్గ సౌఖ్యాదులను చేకూర్చునది.

4) విశ్వ ప్రభుత్వ రాజ్య సభ సభ్యునిగా చేయునది - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 686. రాజ్యవల్లభా

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రాజ్యవల్లభాయైనమః' అని చెప్పాలి.

రాజ్య = సమస్త విశ్వసా మ్రాజ్యమునకు, వల్లభా = ప్రభ్విలేదా అధికారిణి.

'రాజ్యం' అంటే - చతుర్దశభువనాలతోను, అష్టదిక్పాలక త్రిమూర్త్యాది దేవతల ప్రాతినిధ్యంతోను నిర్వహింపబడే 'విశ్వ సామ్రాజ్యం'. దీనికంతకూ ఏకైక అధినాథురాలు కాబట్టి అమ్మవారు 'రాజ్యవల్లభా'.

'రాజ్యం' అంటే మన అంతరంగ సామ్రాజ్యం అని అర్థం చెప్పకుంటే మన 'ఆత్మ సామ్రాజ్యరాజ్ఞి' అనే అర్థం కూడా ఈ నామానికి చెల్లుతుంది.

'వల్లభా' అనే పదానికి కేవలం అధినాథురాలు, ప్రభ్వి, రాజ్ఞి - అనే అర్థాలే కాకుండా 'రాజ్ఞి' - గా బృహత్తర బాధ్యతను, అత్యంత ప్రేమానురాగాలతో నిర్వహించునది' - అని కూడా అర్థం చెప్పుకోవాలి. ఈ ప్రేమ అటు విశ్వసామ్రాజ్యం పట్ల, ఇటు ఆత్మ సామ్రాజ్య విషయంలోను కూడా చెల్లుతుంది.

'సమస్త విశ్వ సామ్రాజ్యానికి, వ్యక్తి ఆత్మ సామ్రాజ్యానికి అనురాగపూరితమైన అధినాథురాలు' అని ఈ నామానికి అర్థం.

## 687. రాజత్కృపా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రాజత్కృపాయైనమః' అని చెప్పాలి.

రాజత్ = విరాజిల్లు, కృపా = దయకలిగినది.

క్రిందటి 'రాజ్యవల్లభా' నామంలో అమ్మవారి ప్రేమ పూర్వక అధినాయకత్వం గురించిచెప్పబడింది. ప్రస్తుత నామంలో అమ్మవారి 'దయ'ను గూర్చి చెప్పబడుతోంది.

విశ్వంలోని సమస్త జీవజాలానికి ఏవేవి, ఏయేవేళలలో అవసరమో ఆయా విధాలుగా ఆయా అవవసరాలన్నీ కాలానుగుణంగా ఋతువుల రూపంలోను, ఆహార పానీయాదుల రూపంలోను, దుష్ట శిక్షణ, శిష్టరక్షణాది కార్యనిర్వహణలలోను బాధ్యతపడి, తన అనురాగాన్ని తన సృష్టిపై వర్షింప చేస్తోంది కాబట్టి – ఆమె 'కృప' చతుర్దశ భువనాదుల్లోను వ్యాపిస్తూ విరాజిల్లుతోంది కాబట్టి – అమ్మవారు 'రాజత్కృపా'.

'విరాజిల్లు దయా స్వరూపిణి' అని ఈ నామానికి అర్థం.

## 688 రాజపీఠనివేశితనిజాశ్రితా

పన్నెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రాజపీఠనివేశితనిజాశ్రితాయైనమః' అని చెప్పాలి.

రాజ పీఠ = ప్రభుత్వాధికార స్థానములందు, నివేశిత = ఉంచబడిన, నిజ = తన యొక్క, ఆశ్రితా = భక్తులను కలది.

తనను నమ్ముకుని జీవనాన్ని సాగించే భక్తులకు, రాజ్యాధిపత్యాలను ప్రసాదించే ఉన్నతాధికారం గలది అమ్మవారు – అని ఈ నామం సూచిస్తుంది.

'నివేశము' అంటే 'గృహము' అనే అర్థంలో చెప్పుకుంటే ఈ నామానికి – 'తనను ఆశ్రయించిన వారికి తననే వాళ్ళకు ఇల్లుగా చేయునది – అనే ఇంకో అర్థం వస్తుంది.

ఈ నామంలోని 'నిజ' పదాన్ని 'ని + జ' అని విడదీస్తే – ని = లేని, జ = జననము – అనే అర్థాలు చెప్పుకుంటే – 'తన భక్తులను జననము లేనటువంటి ఆశ్రమము గల వారిగా చేయునది' అని మరో అర్థం వస్తుంది. మానవజన్మ దాకా శరీరావశ్యకత ఉంటుంది కాని అటుపైన శరీరావసరం లేకుండా కూడా జీవించే దేవ, యక్ష, కిన్నర, కింపురాషాది జాతులవారు కూడా ఉంటారు. (బ్రహ్మ అన్నా – బ్రహ్మలోకం అన్నా ఒకటే

– ఈ కక్ష్యలో ఉన్నవారికి) ఈ అర్థమైనా చెప్పుకోవచ్చును. లేదా – జన్మలేని మోక్షస్థితికై తనను ఆశ్రయించిన వారికి వేరే ఇల్లు (శరీరం) లేకుండా తన పీఠం వద్దనే వసింపచేయునది. – అనే అర్థం కూడా చెప్పుకోవచ్చును.

1) తనను నమ్ముకున్న భక్తులకు రాజ్యాధిపత్యాది పదవులను ప్రసాదించునది.

2) తనను ఆశ్రయించిన వారికి తననే వాళ్ళకు ఇల్లుగా చేయునది.

3) తన భక్తులను జననము లేనటువంటి ఆశ్రమము కలవారిగా చేయునది.

4) జన్మ లేని మోక్ష స్థితికై తనను ఆశ్రయించిన వారికి వేరే ఇల్లు (శరీరం) లేకుండా తన పీఠము వద్దనే వసింప చేయునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 689. రాజ్యలక్ష్మీః

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రాజ్యలక్ష్మ్యై నమః' అని చెప్పాలి.

రాజ్య = రాజ్యముల యొక్క, లక్ష్మీః = సకల సంపదల వైభవరూపిణి.

రాజ్యం ఉండగానే సరిపోదు. రాజ్యానికి ఉండాల్సిన వైభవం, శోభ, కూడా ఉండాలి. సకల భోగభాగ్యాలు, సకల సౌకర్యాలు, ముఖ్యంగా ప్రజాభిమానము ఉన్న రాజ్యమే రాజ్యం, ఏ రాజ్యానికి సంబంధించిన వైభవాన్నైనా ఒక రూపంగా ఊహిస్తే ఆ రూపంలో ఉండేది కూడా అమ్మవారే! ఆ రూపాన్ని 'రాజ్యలక్ష్మి' అనాలి గాని, రాజ్యాన్ని కాదు. ఈ వైభవం అంటే – పాలకులకి, పాలితులకి మధ్య ఉన్న సంబంధాన్ని బట్టి ఉంటుంది. ఇది సూర్య కిరణానికి – చంద్ర కిరణానికి మధ్య; భర్తకు – భార్యకు మధ్య; ప్రజ్ఞకు – మనస్సుకు మధ్య – ఉండే సంబంధం లాంటిది. ఈ నామం భౌతికంగా రాజుకు – ప్రజలకు మధ్య సంబంధాన్ని సూచిస్తే, ఆధ్యాత్మికంగా – ఆత్మకు, మనస్సుకు మధ్య సంబంధాన్ని తెలిపే వైభవాన్ని సూచిస్తుంది.

1) ప్రజా రాజ్య వైభవ రూపిణి.

2) ప్రజ్ఞారాజ్యవైభవ రూపిణి – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

# 690. కోశనాథా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు - 'కోశనాథాయైనమః' అని చెప్పాలి.

కోశ = మూలధనానికి (ఖజానాకి), నాథా = అధినాథురాలు.

రాజ్యం స్థిరంగా ఉండాలన్నా, తిన్నగా నిర్వహింపబడాలన్నా, రాజ్యాన్ని చూసి అందరూ మెచ్చుకుని ఆనందించాలన్నా, ముందు కావలసింది మూలధనం. ఈ మూలధనాన్నే 'కోశం' (ఖజానా) అంటారు. ఇది లేకపోతే ఎవరి చేతా ఏపనీ చేయించలేము. ఎవరినీ మెప్పించలేము. ఇది ప్రజల వద్ద వసూలు చేసిన పన్నుల వల్ల వచ్చే ధనరూపంలోనే ఉండక్కరలేదు. బ్రతకడానికి కావలసిన తిండి గింజల రూపంలోను, బట్టలరూపంలోను ఉన్నా ఫర్వాలేదు. వీటినే 'గిడ్డంగులు'(Godowns of Food Corporations) అంటారు. ప్రజల దగ్గర ఈ కోశం లేని రాజ్యం 'సు' వర్ణం లోపించిన సుమంగలి వంటిదౌతుందని ఒక లలితోపాసకులు చెప్పారు.

భౌతిక రాజ్యానికి ధనాగారమే కోశాగారం. విశ్వకోశాగారాధిపతి అయిన కుబేరుని స్వరూపురాలు - అని ఈ నామానికి ఒక అర్థం. మన అంతరంగరాజ్యానికి 'శుక్రం' లేదా 'శుక్లం' మూలధనం అవుతుంది. సప్తధాతువులకు పెట్టుబడి ఈ శుక్లం నుండే సంక్రమిస్తుంది. వాస్తవానికి మనలో 'శుక్రం' ఉండే చోటు గూడా 'కోశము' అనే పేరుతోనే పిలువబడుతుంది.

మనలను సుఖముగా ఉండనిచ్చేది ఈ కోశము. ఈ సుఖాన్ని కలుగచేసేది కాబట్టి అమ్మవారు 'కోశనాథా'. ఇంకా మనలో అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశాలను పంచకోశాలంటారు. ఆ పంచకోశాలకు కూడా అధినాథురాలు, మనలో ప్రాణరూపంలో ఉన్నది - అమ్మవారే ! ఈ కోశాలకు అధినాథురాలు కాబట్టి - అమ్మవారు 'కోశనాథా'

1) మూలధనానికి అధినాథురాలు.

2) మూలసంపదకు అధినాథురాలు.

3) విశ్వ కోశాగారాధిపతి స్వరూపురాలు.

4) అన్నమయ, మనోమయాది కోశాధినాథురాలు.

5) సప్త ధాతువులకు పెట్టుబడి అయిన శుక్ల కోశ నియంత్రిణి – అని ఈ నామానికి అర్థాలు.

## 691. చతురంగబలేశ్వరీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'చతురంగబలేశ్వర్యై నమః' అని చెప్పాలి.

చతురంగ = నాలుగు విధములైన, బల = బలములకు, ఈశ్వరీ = ఏకాధిపత్యము వహించునది.

రథ, తురగ, గజ, పదాతి సైన్యాలను చ తరంగ బలాలంటారు. రాజ్యానికి కోశబలం ఎంత అవసరమో, సైన్యబలం కూడా అంత అవసరం. లేకపోతే – శత్రువులు మనకోశాన్ని కొల్లగొట్టకుపోతారు. కోశం ఉండటం ఒక ఎత్తు – దాన్ని రక్షించుకోడం ఒక ఎత్తు. ఈ రెంటినీ కోశపటుత్వం, సైన్యపటుత్వం అంటారు. ఈ రెంటికీ కూడా అమ్మవారే ఏకాధిపత్యం వహిస్తుంది. ఈ రెంటితో అమ్మవారు సుస్థిరమైన జగత్పరిపాలన చేస్తుంది. ఇదంతా బాహ్యపరమైన, లేదా విశ్వపరమైన, లేదా ప్రజారాజ్య సంబంధమైన విషయం.

ఇక ఆత్మ సామ్రాజ్యపరమైన విషయంగా వస్తే ఈ నామాన్ని – చతుర్ + అంగ + బలఈశ్వరీ – అని విడదీయాలి. అప్పుడు – చతుర్ అంటే మనలోని 'మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము' అనే అంతఃకరణ చతుష్టయం అని – 'అంగ' అంటే మనలోని షడంగాలను అంటే – పాదాలు, హస్తాలు, ముఖము (నోరు) నాసిక (ముక్కు) అక్షులు (కన్నులు) శ్రవణములు (చెవులు) అనీ – సమన్వయించుకోవాలి. షట్శాస్త్రములు అంటే షడ్దర్శనముల (సాంఖ్యము, యోగము, న్యాయము, వైశేషికము, పూర్వమీమాంస, ఉత్తరమీమాంస) ద్వారా జ్ఞాన సంబంధమైన వివేకాన్ని పెంపొందించుకుని ఆత్మ సామ్రాజ్యాన్ని చక్కగా నిర్వహించుకోవాలి. (ఈ నామంలో తెలిపిన 'చతురంగ' పదమే 'చదరంగము' – చదర – నల్చదర – అనే పదాలుగా మారింది)

కార్యనిర్వహణకు వట్టి తెలివి(Pure Intelligence) చాలదు. ఏది మంచిదో - ఏది చెడ్డదో తెలిస్తే చాలదు. మంచిదైతే ఏం చేయాలి చెడ్డదైతే ఏం చెయ్యాలో కూడా తెలియాలి. అలాగే - మంచి వారెవరో, చెడ్డవారెవరో తెలిస్తే చాలదు. మంచివాడితో మనం ఎలా మెలగాలి - వాడితో ఏఏ పనులు మనం చేయించుకోవచ్చును, అలాగే చెడ్డవాడితో ఎలా మెలగాలి - వాడితో ఏఏ వ్యవహారాలలో జాగ్రత్తగా ఉండాలి - ఇవన్నీ తెలియాలి. దీనిని నిర్వహణాత్మక జ్ఞానం (Administrative Intelligence) లేదా 'వివేకజ్ఞానం' అంటారు. కౌటిల్యుని జీవిత చరిత్ర చదివినా, ఆ కౌటిల్యుడు వ్రాసిన అర్థ శాస్త్రాన్ని, కుటిల నీతిని చదివినా తెలుస్తుంది. రాజ్యాధిపతులు ముఖ్యంగా ఇవి తెలుసుకోవాలి.

మంత్ర విద్యకు సంబంధించిన 1. బీజ, 2. పద, 3. సంఖ్య, 4. రేఖాంగములకు అధీశ్వరి. కాబట్టి, అమ్మవారు 'చతురంగ బలేశ్వరి'.

1) రథ, తురగ, గజ, పదాతి బలసంపన్నురాలు.

2) మనలోని అంతఃకరణ చతుష్టయు, షడంగములకు అధినాథురాలు.

3) షడ్దర్శన, వివేక, జ్ఞాన, స్వరూపురాలు

4) మంత్ర విద్యా చతురంగాధీశ్వరి - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 692. సామ్రాజ్యదాయినీ

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సామ్రాజ్యదాయిన్యై నమః' అని చెప్పాలి.

సామ్రాజ్య = సామ్రాజ్యమును, దాయినీ = ఇచ్చునది.

కొన్ని గ్రామాలు, పట్టణాలు కలసి ఉన్నదాన్ని 'రాజ్యం' అంటే - అలాంటి కొన్ని మండలాలను 'సామ్రాజ్యం' అనీ - అలాంటి కొన్ని సామ్రాజ్య మండలాలను 'మహాసామ్రాజ్యం' అనీ అంటారు. ఈ మూడింటికి సంబంధించిన నామాలు అమ్మవారికి ఉన్నాయి.

రాజ్యాధిపతులను రాజులంటారు. వీరు పదహారు మంది ఉంటారు. (షోడశమహారాజులు) సామ్రాజ్యధిపతులనే 'చక్రవర్తు'లంటారు. వీళ్ళు ఆరుగురు ఉంటారు. ప్రస్తుత నామం ఈ చక్రవర్తులగురించే! దేవలోకంలో - మను, చంద్ర, కుబేరాదులు; భూలోకంలో - హరిశ్చంద్రాదులు (హరిశ్చంద్రోనలోరాజఃపురుకుత్సః పురూరవః సగరో కార్తవీర్యశ్చ షడేతే చక్రవర్తినః) వీరిని అమ్మవారు సామ్రాజ్యాధినేతలను చేసింది కాబట్టి అమ్మవారు సామ్రాజ్య దాయినీ. ఇది భౌతికమైన, బాహ్యమైన, విశ్వపరమైన అర్థం.

అమ్మవారి అనుగ్రహంతో - ఆత్మకు - మనస్సుకు, దేహానికి మధ్య సంబంధాన్ని అత్యంత అనుకూలంగా సాధించిన సాధకుణ్ణి కూడా సామ్రాజ్య అధినేతగా చెప్పవచ్చును.

1) మనమీద మనకు అన్ని విధాల ఆధిపత్యం, తెలివి ఉంటే - మనం 'స్వ' రాజ్యాధిపతులం అవుతాము.

2) మన ఊహలు మనకు దుఃస్థితి తేకుండా ఉంటే మనకు ఈ స్వరాజ్యాధిపత్యం వస్తుంది.

అంటే - మనకు గాని, ఎదుటివారికి గాని కష్టాన్ని కలిగించే అభిప్రాయాన్ని, మాటను, చేతను - మన నుండి రాకుండా ఉండే స్థితిలో మనం ఉంటే మనకీ 'స్వరాజ్యాధిపత్యం' వస్తుంది. ఈ రకమైన 'స్వ' రాజ్యాధిపత్యాన్ని కలిగి ఉన్ననాడు - మనం 'సామ్రాజ్యాధినేత'ల కంటే ఆధ్యాత్మికంగాపై స్థితిలోనే ఉంటాం. సామ్రాజ్యాధిపత్యానికి కావలసింది 'జయం' అయితే - స్వరాజ్యాధిపత్యానికి 'విజయం' కావాలి.

బయట పరిస్థితులపైన, వ్యక్తులపైన మనకు నియంత్రణ, అధిపత్యము వస్తే - దాన్ని 'జయం' (Conquest) అనీ, మనమీద మనకు - అంటే మన ఇంద్రియాలపైన, అరిషడ్వర్గాలపైన నియంత్రణ, ఆధిపత్యం వస్తే దాన్ని 'విజయం' (Success) అనీ అంటారు. బాహుబల పరాక్రమ చతురంగబల సంపన్నత్వంతో బయటవారిపై జయం సాధించవచ్చు నేమోగాని - అవి తనపై తన ఆధిపత్యానికి దోహదపడవు. (విశ్వామిత్రుడే

దానికి సరి అయిన ఉదాహరణ. 'విజయా' అన్న 346వ నామం వివరణ 'జయా' అన్న 377వ నామ వివరణ కూడా ఇక్కడ చదువుకోవాలి)

1) ప్రజా సంబంధమైన సామ్రాజ్యమును ప్రసాదించునది.

2) ప్రజ్ఞా సంబంధమైన 'స్వ' రాజ్యమును ప్రసాదించునది.

3) మోక్ష సామ్రాజ్యమును ప్రసాదించునది – అని ఈ నామానికి అర్థాలు.

## 693. సత్యసంధా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సత్యసంధాయై నమః' అని చెప్పాలి.

సత్య = సత్యమునకు, సంధా = స్థానముగాగలది.

ఈ విశ్వంలో సత్యమైనది బ్రహ్మ! (బ్రహ్మసత్యం జగన్మిథ్య) అందువలన 'సత్యం' అంటే – 'బ్రహ్మ' అనే అర్థం చెప్పుకుంటే – 'బ్రహ్మ యందు స్థానముగా గలది' అంటే బ్రహ్మ సూత్రాల అవధులను దాటకుండా, విశ్వ ప్రణాళికను అమలు పరచు సమన్వయ స్వరూపిణి. అమ్మవారి సత్యసంధత – ఆమె సృష్టిలోని సర్వవస్తు పదార్థ శాశ్వత లక్షణ ధర్మాలే నిరూపిస్తాయి. భక్తులకు ఆమె అనుగ్రహించి ప్రసాదించే వాటి ద్వారా ఆమె భక్తుల పట్ల ఆమె తీసుకున్న ప్రతిజ్ఞా సత్యసంధతను వెల్లడిస్తుంది.

'సత్యమునకు స్థానముగా గలది' అని ఈ నామానికి అర్థం.

## 694. సాగరమేఖలా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సాగరమేఖలాయైనమః' అని చెప్పాలి.

సాగర = సముద్రములే, మేఖలా = వడ్డాణముగాగలది.

'సాగరం' అంటే 'సముద్రం' – సముద్రం – అంటే 'ముద్రలను కలిగినది' అని అర్థం. సృష్టికి కావలసిన సమస్త జీవవస్తు జాలానికి సంబంధించిన అచ్చులను(Moulds) 'ముద్రలు' అంటారు. అందుకే తైత్తిరీయంలో సృష్టి ప్రారంభాన్ని సూచించే మంత్రం ''తతఃసముద్రో అర్ణవః సముద్రాదర్ణవాదధి.. సూర్యాచంద్రమసౌధాతా, యథా పూర్వమకల్పయత్'' అని చెప్పబడింది.

'సముద్ర' పదానికి 'ముద్రలు కలిగినది' అని – సృష్టికి సంబంధించిన ఒక లక్షణమే కాకుండా, సముద్రము జలమునకు నిధి కూడా! – ఆ జలములు భౌతిక సృష్టికి, గర్భానికి మూలకారణాలు కాబట్టి, ఈ నామంలోని 'సాగర' పదం సృష్టికి, గర్భానికి సంబంధించిన విశేషాలతో కూడినదిగా అర్థం చేసుకోవాలి.

ఇక 'మేఖల' పదం. 'మేఖల' అంటే 'వడ్డాణం' (మొలనూలు) ఈ వడ్డాణాన్ని సరిగ్గా ఆడవాళ్ళు కటి ప్రదేశం వద్ద ధరిస్తారు. స్త్రీలకు మొలకట్టు లోపల ప్రాంతంలోనే 'జీవోత్పత్తికి కారకమైన అండాలుంటాయి. అమ్మవారి మొలకట్టు కూడా విశ్వగర్భానికి సంబంధించినది కాబట్టి గ్రహతారకాది సంయుక్తమైన, విశ్వసృష్టికి కారణమైన ప్రాంతంగా అమ్మవారి వడ్డాణ స్థానాన్ని చెప్పుకోవాలి. సరిగ్గా ఇక్కడే సృష్టికి సంబంధించిన వివిధ వస్తు జీవ జాలాల ముద్రలు (మచ్చులు లేదా (Moulds)ఉండేది. సముద్ర జలాలు మేఖలలాగా ఉన్నాయని చెప్పడం ఎంతో ఔచిత్యమైన విషయం.

సముద్రానికి – అమావాస్య, పౌర్ణిమలు ఎలా పర్వదినాలౌతాయో – అలాగే, స్త్రీలకు – 'రజస్వలా' ( Menstruation) 'ఋతుమతి' (Fertilization) సమయాలను గూడా సూచిస్తాయి. సముదం రత్నాలకు, వివిధ జలచరాలకు ఉత్పత్తిస్థానం. అలాగే స్త్రీ గర్భం, మానవ జాతికి ఉత్పత్తి స్థానం. ఇలా అన్ని విధాలా ఈ నామం సార్థకమైంది. అందుకే అమ్మవారు 'సాగరమేఖలా'.

భౌతిక శరీరం అనే సంచీని తిరగెయ్యడానికి, బోర్లెయ్యడానికి ఉపయోగించేపట్టు (Central Grip) మన బొడ్డు వద్ద ఉంటుంది. అంటే – పదార్థానికి సంబంధించిన అధోలోకాలకు, ప్రజ్ఞకు సంబంధించిన ఊర్ధ్వలోకాలకు సమన్వయాన్ని తెలిపే సీమంతరేఖే (Boundary line) ఈ 'సాగరమేఖల'.

సూక్ష్మ స్థితిలో పైన ఉండే ఆకాశం, స్థూల స్థితిలో క్రింద ఉండే భూమి కలుసుకున్నట్లుగా అనిపింపచేసే దిక్చక్రం (Horizon)ను ఈ మేఖలగా గూడా అర్థం చేసుకోవచ్చును. అంటే, ఈ మేఖలను ఊర్ధ్వ, అధోలోకాలకు సమన్వయ సీమంతరేఖగా ఊహించాలి.

1) సముద్రాలను మేఖలగా కలిగినది. అంటే – 'సృష్టికి తోడ్పడే జలాలను, ముద్రలను, కలిగిన' సముద్రాలను – 'జీవ అండాలతో, గర్భధారణకు సంబంధించిన కటి ప్రదేశం వద్ద – వడ్డాణంగా ధరించినది' (అని అర్థం).

2) ఊర్ధ్వ (సూక్ష్మ), అధో (స్థూల) లోకాల సమన్వయ సీమాంతరేఖగా సాగరాలను మేఖలగా కలిగినది – అని ఈ నామానికి అర్థాలు.

## 695. దీక్షితా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'దీక్షితాయైనమః' అని చెప్పాలి.

దీక్షితా = దీక్ష వహించినది.

'దీక్ష' వహించినది అంటే – ''ఎవరైనా దీక్ష వహిస్తే వారికి మాత్రమే అందుతాను – అనే దీక్ష వహించినది'' – అని ఒక అర్థం.

'దీక్ష' లాంటి పదమే 'శ్రద్ధ' గూడా! ఈ రెండు పదాల అర్థాలు కలిసి సూచించే పదవే వ్రతం'. ఈ వ్రతం అనేది వేదానికి సంబంధించిన పారిభాషిక పదం. ''అన్నంననిన్ద్యాత్ – తద్వ్రతమ్; అన్నం న పరిచక్షీత – తద్వ్రతమ్'' ఇలా వ్రతం అనే పదం వేదాల్లో వాడబడుతుంది. ఈ పదాన్ని ఆంగ్లంలో పరమ గురువు జ్వాలాకూల్ (Master D.K) 'Initiation' అని వ్రాసారు. Initiation Human and Solar పుస్తకంలో) ఋగ్వేదంలో ఈ పదం 'మహావ్రతమ్' అనే విధంగా కూడా వ్రాయబడుతుంది. ఈ వ్రతానికి 'ఆవాహయామి' అని చెప్పి ప్రారంభించడమే ఉంటుంది కాని, చివరకు 'యజ్ఞేన యజ్ఞ మయజంతదేవాః... అని చెప్పే ఉద్వాసన ఉండదు. అందుకే ఈ వ్రతాన్ని 'మహా' నామ్నీ వ్రతం' – అన్నారు. అంటే వ్రతం పేరే 'మహా' అన్నమాట! (తస్య నామ మహాద్యశః)

ఇటువంటి 'మహావ్రతా' నికి చెందిన మాట లాంటిదే 'దీక్ష' కూడా! మనస్సులో ఒక విషయం మీద దృఢమైన నిర్ణయం తీసుకోడాన్ని 'దీక్ష' అంటారు.

బ్రహ్మవిద్యను 'దీక్ష'తోను 'కౌశలం' తోను పొందాలి. తేనెటీగ పువ్వులో తేనె త్రాగివెళ్ళింతర్వాత – అది తేనె త్రాగిందీ లేందీ చెప్ప వీలులే నివిధమైన కౌశలంతో, దీక్షతో – బ్రహ్మవిద్య నేర్చుకోవాలి. సర్వవేద, బ్రహ్మవిద్యా, శ్రీవిద్యాది సుధారసాలనూ, – అలాగే అందుకోవాలి. ఈ దీక్ష, ఈ శ్రద్ధ ఉన్న వారిని 'పూర్ణదీక్షాపరు'లుగా అమ్మవారు తీర్చి దిద్దుతుంది.

1) తన భక్తులను తీర్చి దిద్దటంలో దీక్షవహించినది.

2) సత్కార్య నిర్వహణకై కంకణం కట్టుకున్నవారిలోని దృఢమైన నిర్ణయ రూపంలోను, నిర్వహణా రూపంలోను ఉండునది.

3) సుప్రసిద్ధమగు విధముగా జగత్పరిపాలనను అందించుటకు దీక్ష బూనినది.

## 696. దైత్యశమనీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'దైత్యశమన్యై నమః' అని చెప్పాలి.

దైత్య = రాక్షసులను, దుష్టులను, దుర్గుణాలను, శమనీ = శమించునది అనగా నిర్మూలించునది.

ఒక పనికి 'దీక్ష' వహిస్తే ఎన్నో రకాలైన అవరోధాలను, ఆటంకాలను ఎదుర్కోవలసి వస్తుంది. భక్తుల్ని రక్షించి ఆదుకోడానికి అడ్డువచ్చే మహిషాసుర, భండాసురాది రాక్షసులను సంహరిస్తుంది. భక్తుల్ని తీర్చి దిద్దటానికి వారిలో ఉండే దుర్గుణాలను రూపుమాపుతుంది. సనాతన ధర్మ సంస్థాపన చెయ్యడానికి అడ్డు వచ్చే పాషండులను అదుపులో పెట్టడానికి అవసరమయ్యేచర్యలు తీసుకుంటుంది. ఈ పనులన్నీ చేస్తుంది. వీలైనంతవరకు సరిదిద్దటానికి ప్రయత్నిస్తుంది. అది కుదరని పక్షంలోనే సంహరించడానికి ప్రయత్నిస్తుంది. కాబట్టి – అమ్మవారు 'దైత్యశమనీ'.

దైత్యులను, దైత్యభావ లక్షణాలను నిర్మూలించునది – అని ఈ నామానికి అర్థం.

## 697. సర్వలోకవశంకరీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వలోకవశంకర్యైనమః' అని చెప్పాలి.

సర్వ = అన్ని, లోక = లోకములను, లోకవాసులను, వశంకరీ = వశము చేయునది.

అన్ని లోకాల వాళ్ళకు భయపడకుండా, వాళ్ళందరూ తన భక్తులకు వశంలోనే ఉండే విధంగా చేస్తుంది అమ్మవారు. (All will be favourable to Her devotees instead of threatening them) (అంటే 'భయంకరీ' కాకుండా 'వశంకరీ' అన్నమాట!)

కొంత వయస్సు వచ్చే వరకు పంచ భూతాల్లోంచి మనలోకి శక్తిని చేరుస్తుంది. అటుపైన వయస్సు వచ్చింతర్వాత మనలోంచి ఆ శక్తిని పంచభూతాల్లోకి కలిపి వెయ్యడం జరుగుతుంది. ఈ విధంగా సర్వలోకవాసులను, సర్వలోకాలను ఏ విధంగా చెయ్యాలనుకుంటే ఆ విధంగా చెయ్యగలిగి, తన వశంలో పెట్టుకుంటుంది కాబట్టి అమ్మవారు 'సర్వలోకవశంకరీ'.

1) అన్ని లోకాలను, అన్ని లోకవాసులను తన వశంలో ఉండునట్లు చేయునది.

2) అన్ని లోకాలను, అన్ని లోకవాసులను తన భక్తుల అధీనంలో ఉండునట్లు చేయునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 698. సర్వార్థ దాత్రీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వార్థ దాత్ర్యై నమః' అని చెప్పాలి.

సర్వ = అన్ని, అర్థ = ప్రయోజనములను, దాత్రీ = ఇచ్చునది.

సర్వ ప్రయోజనాలను అమ్మవారు తన భక్తులకు ఇస్తుంది.

ఈ నామంలోని 'అర్థ' పదానికి 'ధనము' 'సంపద' 'ప్రయోజనము' అనే అర్థాలు కాకుండా 'పురుషార్థాలు' అని గూడా చెప్పవచ్చును. అమ్మవారు తన భక్తులకు ధర్మార్థ కామ మోక్షాలనే చతుర్విధ పురుషార్థాలను గూడా ఇస్తుంది. ఇక్కడ 'పురుషార్థప్రదా' అనే 291వ నామ వివరణ కూడా చదువుకోవాలి.

1) సర్వ ప్రయోజనాలను, వాంఛితార్థములను సమకూర్చునది.

2) చతుర్విధ పురుషార్థాలను సమకూర్చునది - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 699. సావిత్రీ

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సావిత్ర్యై నమః' అని చెప్పాలి.

సావిత్రీ = సూర్యతేజస్సుతో ప్రకాశించునది.

'సవితా' అంటే సూర్యుడు. 'సవిత్రీ' అంటే సూర్యోదయానికి ముందు ఉండే తేజః స్వరూపిణి.

'సావిత్రీ' అంటే సూర్యోదయ సమయంలోని కాంతి స్వరూపిణి.

సూర్యగమన నిరోధకులైన మందేహాది రాక్షసులను సంహరించే సూర్యకిరణ శక్తిని - 'సావిత్రి' అంటారు. 'ఆదిత్య హృదయం' 'మహాసౌరం' - ఈ సావిత్రిని గురించే స్తుతిస్తాయి.

సావిత్రి, గాయత్రి, సరస్వతి - ఈ మూడింటికి భేదం ఉంది. ఉదయ సూర్యకిరణ శక్తి 'సావిత్రి'. సావిత్రి స్పర్శకు మేల్కొని వాళ్ళలోంచి వాక్కుగా వ్యక్తమయ్యేది 'గాయత్రి'. వాక్కుగా మనలో ప్రవేశించిన తర్వాత ఉండే స్థితి 'సరస్వతి'. ఈ మూడూ సూర్యునికి సంబంధించినవే అయినా ప్రాతఃకాలంలో గాయత్రిని, మధ్యాహ్న కాలమందు సావిత్రిని, సాయంకాల సమయంలో సరస్వతిని ప్రార్థించడం సనాతనంగా వస్తున్న ఆచారం. మళ్ళీ గాయత్రి మూడు రకాలుగా వ్యక్తమవుతూ ఉంటుంది.

1) మాట్లాడుదామనుకున్న తర్వాత మాట్లాడడం – సచేతన గాయత్రిని,

2) నిద్రపోతున్నపుడు మన ప్రమేయం లేకుండా మాట్లాడబడగలగడం – అచేతన గాయత్రిని

3) ఖనిజాల్లోని చైతన్యం – విచేతన గాయత్రిని సూచిస్తాయి. గాయత్రి, సావిత్రి, సరస్వతులను బ్రహ్మ యొక్క వాగ్బీజంగా ఉపాసించాలని ఈ క్రింది శ్లోకం చెబుతుంది.

'అక్షరం బ్రహ్మ వాగ్బీజం అహర్ది వముపాస్మహే

వ్యాహృతీం చైవ గాయత్రీం సావిత్రీంచ సరస్వతీమ్.

ఉదయ సూర్యకిరణ శక్తిస్వరూపిణి – అని ఈ నామానికి అర్థం.

## 700. సచ్చిదానందరూపిణి

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సచ్చిదానందరూపిణ్యై నమః' అని చెప్పాలి.

సత్ = ఉండటం, చిత్ = చేతనత్వం, ఆనంద = ఆనందించడం, రూపిణి = రూపముగా గలది.

సత్య, జ్ఞాన, ఆనంద లక్షణాలు చెల్లేదే అమ్మవారు. బ్రహ్మసత్యం కాబట్టి పరబ్రహ్మ స్వరూపిణి అయిన అమ్మవారు కూడా 'సత్యస్వరూపిణి'. చిదగ్ని కుండ సంభూత కాబట్టి అమ్మవారు 'జ్ఞాన స్వరూపిణి' నిరతిశయ సుఖస్వరూపిణి కాబట్టి అమ్మవారు - ఆనందస్వరూపిణి. ఈ మూడింటి సమన్వయ, సంకలిత రూపాన్ని తెలిపేదే ఈ నామం.

సత్, చిత్, ఆనందాల సమన్వయ, సంకలిత స్వరూపిణి – అని ఈ నామానికి అర్థం.

## 701. దేశకాలాపరిచ్ఛిన్నా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'దేశకాలాపరిచ్ఛిన్నాయైనమః' అని చెప్పాలి.

దేశ = ప్రదేశపరంగాను, కాల = కాలపరంగాను, అపరిచ్ఛిన్నా = విభజించుటకు గాని, కొలుచుటకు గాని వీలు లేనిది.

సాధారణంగా ఒక వ్యక్తి ఒకే కాలంలో ఒకే ప్రదేశం వద్ద ఉండటం కుదురుతుంది. కాని, ఒకే కాలంలో వేరు వేరు ప్రదేశాల వద్ద ఉండటం కుదరదు. ఈ నియమ నిబంధనలు సృష్టిలోని జీవులందరికీ వర్తిస్తాయి. కాని, ఈ సృష్టి స్వరూపిణి అయిన అమ్మవారు ఒకే సమయంలో వేరు వేరు ప్రదేశాల్లో కూడా ఉండకలదు. కాబట్టి, ప్రదేశపరంగాను, కాలపరంగాను మనం సాధారణంగా చెప్పుకునే నియమాలు అమ్మవారి పట్ల చెల్లవన్నమాటే కదా! అమ్మవారు చోటులాంటిది కాబట్టి భారతదేశంలో ఉన్నచోటు, అమెరికాలో ఉన్న చోటు, ఆఫ్రికాలో ఉన్న చోటు ఇలా అన్ని ప్రదేశాల్లో ఉండే చోటు ఆవిడే కాబట్టి - ఒకే కాలంలో భారతదేశంలోను, ఆఫ్రికాలోను, అమెరికాలోను అలాగే అన్నిచోట్లా ఉండకలదు అనడంలో ఆశ్చర్యం ఏముంది ? అదీకాక ఈ దేశ కాలాలకు అతీతంగా వాటికన్నా ముందు నుండే ఉన్నది. అవి ఉన్నపుడూ లేనప్పుడూ ఉంటుంది కూడా! ఇకముందు కూడా ఉంటుంది కాబట్టి అమ్మవారు దేశకాలాలకు పరిమితం కాదు. వాటి చేత కొలవబడి ఒక చట్రంలో బిగింపబడి పరిమితమయేది కాదు.

దేశకాలాల చేత కొలుచుటకు అవకాశము లేనిది - అని ఈ నామానికి అర్థం.

## 702. సర్వగా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వగాయైనమః' అని చెప్పాలి.

సర్వ = సర్వదేశకాలములందు, గా = అంతర్యామినిగా నుండునది.

'అమ్మవారు ఉన్నది' అని ఒకడు అన్నా, 'అమ్మవారు లేదు' అని ఇంకోడు అన్నా - ఆ ఇద్దరూ అమ్మవారిని స్మరించినట్లే! అమ్మవారు ఉన్నట్లే !! అమ్మవారు సర్వత్ర, సర్వకాలాల్లోను అంతర్యామిగా ఉంటుంది. అన్నిటా ఉంటూ అన్నిటినీ గమనిస్తూ, అన్నిటిలోను చరిస్తూ ఉంటుంది. అమ్మవారి 'దేశకాలావరిచ్ఛిన్నా' లక్షణమే ఈ 'సర్వగా' అన్న నామాన్ని కూడా నిర్ధారిస్తుంది. అన్ని జీవ జాతుల్లోను, అన్ని వస్తువుల్లోను,

అన్నిప్రదేశాల్లోను ఉండేదే అమ్మవారు. అందుకే ఆమె 'సర్వగా', 'సర్వత్రగా' కూడా అవుతుంది.

'సర్వదేశకాలములందు అంతర్యామిగా ఉండునది - అని ఈ నామానికి అర్థం.

## 703. సర్వమోహినీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వమోహిన్యైనమః' అని చెప్పాలి.

**సర్వ = సర్వ ప్రపంచమును, మోహినీ = మోహింపచేయునది, భ్రమింపచేయునది.**

నిజానికి అక్కడ ఏమీ లేకపోయినా ఏదో ఉన్నట్లు కనిపించడాన్ని, లేదా - అదే వస్తువుగా ఉండి అది కాకుండా కనిపించడాన్ని 'మోహం' అంటారు. ఆకాశం నీలం రంగుగా ఉండటం ఇలాంటి దానికి ఒక ఉదాహరణగా చెప్పుకోవచ్చును.

జీవించడానికి అమృతత్వాన్ని పంచి పెట్టడం ఈ మోహనం వల్లనే జరుగుతుంది. పరిశీలనలు (Observations) అన్నీ పరిశీలకునిలో (Observer) ఉంటాయి గాని పరిసరాల్లో (Environment) కాదు. ఫలాని వాడు ఇష్టం అని ఒకడు చెబితే - ఇలా చెప్పిన వాడికి అవతలివాడు ఇష్టం కాబట్టి అవతలివాడు ఇష్టుడవుతాడు, అంతేకాని 'ఇష్టుడ' ని వేరే ఉండడు. ఈ 'ఇష్టం' - చెప్పే వాడిలోదే కాని పరిసరాల్లోది కాదు. ఇది ఒకరకమైన మోహం క్రిందకే వస్తుంది. (గ్రీకు పురాణాల్లో, మోహ, రాక్షస, ఆసుర లక్షణాలు మూడింటినీ 'మాయాదేవి'కి కూతుళ్ళుగా సంకేతిస్తారు. ఈ మాయకుపైన 'మాయావి' అనే రాక్షసుడు కూడా ఉంటాడు)

ఈ మోహన లక్షణం అవసరనిమిత్తమే జగత్తులో అమ్మవారి చేత ఉంచబడింది. గడ్డిమీద మనకున్న అభిప్రాయమే గొడ్డుకు కూడా ఉంటే - ఇక అది తినకపోవచ్చు. అలాగే - కుడితి మొదలైనవి. మనం వాటిని తినం, త్రాగము కదా ! వాటి యందు గొడ్డుకు మోహం లేకపోతే అది గూడా వాటిని తినదు కాబట్టి అవి బ్రతకడం కోసం వాటి యందుగొడ్డుకు 'మోహం' పెట్టింది. మన విషయానికి వస్తే - మనకి వేటియందు 'మోహం' ఉండాలో వాటి మీదే మనకు మోహం ఉంటుంది. అయితే - ఈ మోహం పరిధులు దాటితే - వ్యామోహానికి దారితీసి మళ్ళీ వాటివల్లనే దెబ్బతింటాం.

జీవులందరినీ ఈ మోహంతో తన వశంలో పెట్టుకునే అమ్మవారు 'సర్వవశంకరీ', 'సర్వమోహినీ' – అనే పేర్లతో పిలవబడుతుంది. జగన్మోహినీ రూపంలో త్రిమూర్తులను, దేవ, దానవులను కూడా మోహంలో పడేసేది ఈవిడే ! ఆకాశం నీలంగా ఉన్నట్లు కనపడుతుంది – నిజానికి అక్కడ అలాంటి రంగు లేకపోయినా ! ఈ మోహినీ దేవిని ఈ ఆకాశ నీలవర్ణదేవిగా చెబుతారు. ఈ మోహినీ దేవినే 'శ్యామలా' అని కూడా అంటారు. మతంగమహర్షి ఈ శ్యామలా ఉపాసనావిధిని ఇచ్చాడు. అందుకని ఈవిడ 'మాతంగిని' అయింది. తైత్తిరీయంలో చెప్పబడిన 'తన్మహ ఇత్యుపాసీత – మహాన్భవతి, తన్నమ ఇత్యుపాసీత ....'' మొదలైన మంత్రాలన్నీ ఈ ఉపాసనకు సంబంధించినవే ! మహాకవి కాళిదాసు ఆశువుగా చెప్పిన ''జయ జయ సుధా సముద్రాంత ....'' అనే శ్యామలా దండకం ఈ మాతంగినీ దేవతకు సంబంధించినదే ! ఈ మాతంగిని ఒక వీణ పట్టుకుని ఉంటుంది. ఈ మాతంగీశ్వరీ ఉపాసనలో జగత్తంతా సంగీతమయంగా కనబడుతుంది. ఈ ఉపాసనలో ప్రకృతి (Nature)తో బాగా శ్రుతి (Tune)కలవాలి. ఈ మాతంగీశ్వరీ ఉపాసన ద్వారా – ఎదుటి వారికి కావలసిన విషయాలు, ముఖ్యంగా – ఉపన్యాసాలలో వస్తాయి. ఈ ఉపాసనా లక్షణాన్ని 'తన్మయీ కరణం' 'తూగు', 'మదం' అని కూడా అంటారు. 'జయహలామదప్రియే ! అని అమ్మవారిని సంబోధిస్తారు. పూర్ణ దీక్షాపరులకీ విషయాలు బాగా తెలుస్తాయి.

(ఈ ఉపాసకులు ప్రతి రోజు పూర్వామ్నాయ, దక్షిణామ్నాయ.....' ఊర్ధ్వ, అధోదిశలకు సంబంధించిన షడామ్నాయాల అధ్యయనం చెయ్యాలి. వాస్తవానికి ఈ ఆరూ చెయ్యడానికి చాలా సమయం పడుతుంది. వీటితో పాటు ప్రాతఃకాలం లేస్తూనే రశ్మిమాలా మహామంత్రాలు చెయ్యాలి. 1. ఓం 2. సోహం 3. హంసశ్శివస్సోహం 3. హ్రీం 4. హ్స్రౌమ్ 6. స్హ్రౌమ్ ఇలా ఎన్నో మంత్రాలు చెయ్యాలి. ఇవన్నీ శ్రీవిద్యానిత్యాహ్నికము అనే పుస్తకంలో ఉంటాయి. 'ఆహ్నికము' అంటే అహస్సునందు తాను చేయవలసినవి. అంటే – మెలకువ నుండి నిద్రవచ్చేంతవరకు చేయవలసినవి అన్నమాట ! సమస్యలు కల్పించుకునే వాడు, వాటిపై మనస్సు ఉన్నవాడు ఇవి చేయకూడదు. అలాగే – లౌక్యాన్ని ప్రదర్శిస్తూ శ్రీవిద్యనుపాసించే వారు గూడా

చెయ్యడం అంత మంచిది కాదు. చేస్తే – వారి పిల్లలు 'మూకాన్మత్త బధిరా ప్రేష్యాః - అంటే మూగవారు, చెవిటివారు, భృత్యులుగాను తయారౌతారు. తాస్మత్ జాగ్రత్త!)

సర్వ ప్రపంచమును మోహింపచేయునది – అని ఈ నామానికి అర్థం.

## 704. సరస్వతీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సరస్వత్యైనమః' అని చెప్పాలి.

సరస్వతీ = ప్రవహిస్తూ ప్రసరించు ప్రజ్ఞ (Under current of consciousness)

'సరస్' అంటే ప్రవహించుట. ఈ లక్షణం కలదానిని 'సరస్వతి' అంటారు.

మన అభిప్రాయాన్ని సూచించే పింగళానాడి – సూర్య సంబంధమైన దైతే, ఆ అభిప్రాయాన్ని వ్యక్తం చెయ్యడానికి కావలసిన వాక్కునుసూచించే ఇడానాడి – చంద్ర సంబంధమైనది అవుతుంది. అప్పుడు ఈ రెంటినీ సమన్వయ పరుస్తూ – సరస్వతీ రూపంలో వాక్ప్రసారాన్ని సూచించే సుషుమ్నానాడి అగ్ని సంబంధమైనదౌతుంది. ఈ సరస్వతి వెనుక 'సావిత్రి', గాయత్రి ఉంటారు. ఋగ్వేదంలోని సరస్వతీ సూక్తంలో ఈ సరస్వతి గురించి

ఓం ప్రణోదేవీ సరస్వతీ
వాజే భిర్వాజినీవతీ
ధీనా మవిత్ర్యవతు' – అని చెప్పబడుతుంది.

'ప్రకాశవంతమైన ఓ సరస్వతీ! వేగము కలిగిన నీవు నీ వేగము చేత మా బుద్ధులను రక్షించుదానవై మమ్ము రక్షించుదువు గాక! అని పై మంత్రానికి అర్థం. (బుద్ధి తిన్నగా ఉంటే కష్టాలు, నష్టాలు రావు. పెడబుద్ధి, దుష్టబుద్ధి ఉంటేనే వస్తాయి. కాబట్టి, ఆ బుద్ధిని ముందు రక్షించమని ఈ మంత్రంలో కోరడం జరుగుతుంది. గాయత్రీ మంత్రం కూడా ఇలాంటిదే!) సరస్వతీ అనుగ్రహ ప్రాప్తికి పై మంత్రాన్ని పఠిస్తూ, సరస్వతి ఆకును ఆవునేతిలో ముంచి హోమం చెయ్యాలి. సమస్త విద్యలకు సరస్వతి అధిదేవత. ఈ సరస్వతీ అనుగ్రహం ఉంటేనే జ్ఞానం వికసిస్తుంది. అజ్ఞానం తొలగుతుంది. తద్వారా మాయ,

మోహం, భ్రమ మొదలగునవి తొలగుతాయి. వాక్కులు చక్కబడతాయి. ధీ ధారణాశక్తులు తిన్నగా, మిన్నగా ఉంటాయి.

మన వెన్నెముక లోని సుషుమ్నా నాడీ స్వరూపమే ఈ సరస్వతి. తలకట్టుకి, మొలకట్టుకి మధ్య ఉండే వెన్నెముకను ఒక వీణ ఆకారంతో పోల్చవచ్చు. అలా పోల్చిన వీణ 'కచ్ఛపీ' అంటారు. దీన్ని ఆధారంగా చేసుకుని మన వాక్కులను సరస్వతి శ్రుతి, లయ బద్ధం చేస్తుంది. ఈ సరస్వతీ రూపంలో ఉండేది అమ్మవారే!

గంగా, యమునా నదులను ఇడా, పింగళా నాడులతో పోలిస్తే – అంతర్వాహిని అయిన సరస్వతీ నదిని సుషుమ్నా నాడితో పోలుస్తారు. ఈ మూడు నదుల సంగమ స్థానమే 'ప్రయాగ'. అదే నేడు మనం పిలిచే అలహాబాదు నగరం. పరమ గురువులు (Masters) వాళ్ళ విశ్వ ప్రణాళికను నిర్వహించుకోడానికి ఎన్నుకున్న కేంద్ర ప్రదేశాల్లో 'ప్రయాగ' కూడా ఒకటిఅని గుర్తు పెట్టుకోవాలి.

1) ప్రవహిస్తూ ప్రసరించే ప్రజ్ఞా స్వరూపిణి.
2) సుషుమ్నా నాడీ స్వరూపిణి
3) అంతర్వాహిని అయిన సరస్వతీ నదీ స్వరూపిణి.
4) సర్వవిద్యాధిదేవత.
5) అగ్నితత్త్వసూచిత – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

(పూర్వనామం (సర్వమోహినీ) జీవులను భ్రమలో పెట్టే అమ్మవారి ఒక శక్తి లక్షణాన్ని సూచిస్తే – ప్రస్తుతనామం (సరస్వతి) అటువంటి భ్రమల్లోను, మోహాల్లోను పడకుండా – జ్ఞానాన్ని ప్రసాదించే అమ్మవారి ఇంకో శక్తి లక్షణాన్ని సూచిస్తుంది.)

## 705. శాస్త్రమయీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శాస్త్రమయ్యైనమః' అని చెప్పాలి.

శాస్త్ర = సర్వశాస్త్రములలో, మయీ = నిండి యున్నది.

అమ్మవారు జ్ఞాన స్వరూపిణి. ఆజ్ఞానంలో వేద వేదాంగాలే కాదు, ఇతర శాస్త్రాలు, సృష్టిపరమైన ఇతర విజ్ఞాన శాస్త్రాలు – ఇవన్నీ కూడా శాస్త్రాల క్రిందకే వస్తాయి. ఏదైనా ఒక విజ్ఞాన విషయాన్ని చెప్పేవాడు, నిర్ధారించేవాడు (Verify) వీరందరూ – అధ్యాపకులు, రీడర్లు, ప్రొఫెసర్లు అవుతారేమోగాని శాస్త్రజ్ఞులు కాదు. జగత్సత్యాలు తట్టినవారు, తట్టిన విషయాలు ప్రయోగాల ద్వారా నిర్ధారపరచే వారే శాస్త్రజ్ఞులు. ఈ శాస్త్రజ్ఞులు తెలుసుకుని కనిపెట్టి నిర్ధారించిన విజ్ఞానం అంతా శాస్త్ర జ్ఞానం క్రిందకు వస్తుంది. అటుజ్ఞానము, ఇటు విజ్ఞానము నిండి ఉన్న వేద వేదాంగ శాస్త్రాదులన్నిటిలోను ప్రకృతి స్వరూపిణి అయిన అమ్మవారి గురించే ఉంటుంది కాబట్టి – అమ్మవారు 'శాస్త్రమయీ'. అమ్మవారి ఏఏ అవయవాల నుండి ఏఏ శాస్త్రాలు ఉద్భవించాయో అనుబంధంలో ఇవ్వబడినాయి.

సర్వశాస్త్రములలో నిండి ఉన్నది – అని ఈ నామానికి అర్థం.

## 706. గుహాంబా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'గుహాంబాయైనమః' అని చెప్పాలి.

గుహ = గుహకు (హృదయానికి), అంబా = అధీశ్వరి, లేదా – తల్లి.

'గుహ' అంటే చాలా అర్థాలున్నాయి.

'గుహ' అంటే పర్వతాల్లో ఉండే గుహ(Cave). ఈ గుహ సింహాన్ని సూచిస్తుంది. ఎందుకంటే సింహం గుహలో ఉంటుంది కాబట్టి. ఇలా చెప్పడం ఒక ఆలంకారిక పద్ధతి (దీన్నేఆంగ్లంలో Metonymy అనే అలంకారంగా చెబుతారు). గుహాంబా అంటే సింహానికి అధీశ్వరి. అంటే – సింహాసనాధీశ్వరి అన్నమాట. అంటే అమ్మవారే కదా! (ప్రథమ భాగంలోని 3వ నామవివరణ చదువుకోండి.)

'గుహ' అంటే (హృదయ) దహరాకాశము అని అర్థం. ఈ 'గుహ' పదం – ''సత్యం జ్ఞానమంతం బ్రహ్మ, యో వేదనిహితం గుహాయాం, పరమేవ్యోమన్'' అని – 'అంతశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు' – అని తైత్తిరీయంలోను,

మంత్రపుష్పంలోను చెప్పబడుతుంది. మనుష్యుల్లో ఉండే హృదయమే ఈ 'గుహ' అని దీన్ని బట్టి తెలుస్తోంది. అమ్మవారు హృదయం సూచించే అనాహత చక్రాధిష్ఠాన దేవత అని 'గుహాంబా'కి అర్థం చెప్పుకోవచ్చును. ఇదే విషయం యక్ష ప్రశ్నలలో ధర్మరాజు చేత ధర్మస్యతత్త్వం నిహితం గుహాయాం అని 'గుహ' అంటే 'హృదయం' అనే అర్థాన్ని సూచించే విధంగా చెప్పబడుతుంది.

ఇంక 'గుహుడు' అంటే – 'కుమారస్వామి' లేదా 'సుబ్రహ్మణ్యేశ్వర స్వామి'. అని కూడా అర్థం ఉంది. మనస్సుకు గురువైన వాణ్ణి 'గురుగుహ' అని అంటారు. ఈ 'గురుగుహ' ముద్రతోనే సంగీత చక్రవర్తుల్లో ఒకరైన ముత్తు స్వామి దీక్షితార్ ఎన్నో కృతులు వ్రాశారు. 'గుహ' అంటే ఎవరికీ కనబడకుండా లోపలదాగి ఉండే ప్రదేశం అని అర్థం. దీని నుండే 'గుహ్య' పదం (రహస్యం) ఉత్పత్తి అయింది. ఈ 'గుహ్య' పదం జననేంద్రియాలను కూడా సూచిస్తుంది. జ్యోతిశ్శాస్త్రంలో జననేంద్రియాలను సూచించే రాశి వృశ్చికం. ఈ రాశికి అధిపతి మళ్ళీ కుజుడే! అంటే కుమారస్వామి. ఇన్ని రకాల సమన్వయం కలిగిన 'గుహ' పదం కుమారస్వామిని సూచిస్తుంది. కాబట్టి, 'గుహాంబా' అనే నామం కుమరాస్వామి తల్లిగా అమ్మవారికి చెల్లుతుంది.

గుహ శబ్దం పరావాక్కును కూడా సూచిస్తుంది. అందుకని పరావాక్కు (కుమారస్వామి) యొక్క తల్లిగా 'గుహాంబా', వైఖరీ వాక్కు (గణపతి) యొక్క తల్లిగా 'గణాంబా' ముందు రాబోయేనామం ఏర్పడ్డాయి.

పిల్లవేరు లాంటి వ్యష్టి కుండలినిని సూచించే సుబ్రహ్మణ్యేశ్వర స్వామికి – సమష్టి కుండలినిని సూచించే అమ్మవారు తల్లివేరు లాంటిది' అని కూడా ఈనామం సూచిస్తుంది.

1) సింహాసనేశ్వరి.

2) హృదయేశ్వరి.

3) కుమారస్వామి తల్లి.

4) పిల్లవేరు లాంటి వ్యష్టి కుండలినికి తల్లివేరు లాంటిది.

5) పరావాక్కు యొక్క తల్లి – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 707. గుహ్యరూపిణీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'గుహ్యరూపిణ్యైనమః' అని చెప్పాలి.

అమ్మవారిని సూటిగా దర్శించలేము. జ్ఞాన దృష్టికి మాత్రమే గోచరము కాని, స్థూల దృష్టికి గోచరము కాదు. జ్ఞాన సంబంధమైన వేద వేదాంగాల్లోను, శాస్త్రాల్లోను, బ్రహ్మసూత్రాదుల్లోను సూక్ష్మంగా ప్రతిపాదింపబడింది కాబట్టి అమ్మవారు 'గుహ్యరూపిణీ' ఔతుంది. సూతసంహిత కూడా ఇలాగే ఈ క్రింది శ్లోకంలో చెబుతుంది.

''గురుమూర్తి ధరాం గుహ్యా గుహ్యావిజ్ఞానరూపిణీం
గుహ్యా భక్తజన ప్రీతాం గుహాయాం నిహతాంనుమః''

వెదుకు వానిలో అమ్మవారు వెదుకువాని రూపంలో ఉంటుంది. అందుకని ఆవిడ రూపం వెదుక్కునే వాడికి గోప్యంగానే ఉంటుంది.

1) గోప్యమైన రూపము కలది.

2) జ్ఞాన దృష్టికే కాని స్థూలదృష్టికి గోచరము కానిది.

3) వెదుకు వానిలో వెదుకు వాని రూపముగా గోప్యముగా ఉండునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 708. సర్వోపాధివినిర్ముక్తా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వోపాధివినిర్ముక్తాయైనమః' అని చెప్పాలి.

సర్వ = సర్వవిధములైన, ఉపాధి = ఆధారములచేత, వినిర్ముక్తా = నిశ్శేషంగా విడిచి పెట్టబడినది.

ఉప = అధి = ఉపాధి – అంటే సమీపంలో అధిష్టించి ఉండేది అని అర్థం. మనకు అత్యంత సమీపంలో సన్నిహితంగా ఉండేది మన శరీరమే! కాబట్టి మనకు మన శరీరం

ఒక ఉపాధి అవుతుంది. ఈ ఉపాధి మనకు ఉన్నప్పుడు అమ్మవారు మనరూపంలోనే తెలియబడుతుంది. ఈ ఉపాధి మనకు లేనప్పుడు ఆవిడరూపంలోనే ఉంటుంది.

మన నియమాలు, నిబంధనలు, ఆదర్శాలు, ఆశయాలు, లక్ష్యాలు మూల సూత్రాలు (Principles) ఇవి అన్నీ కూడా మన ఉపాధులే ! (Any of our concepts like ideals, rules, regulations, targets, motives etc in our body or mind is also called 'Upadhi')

సృష్టి, స్థితి, లయాత్మకంగా ఉండే మనశరీరంగాని, ఈ ప్రపంచం గాని ఒక కళాశాల (College) లాంటిది. కళాశాల తెరిచే కాలం (opening) సృష్టిని, పాఠాలు చెప్పే కాలం – స్థితిని, శెలవులు ఇచ్చేకాలం (Vacation) లయాన్ని సూచిస్తాయి. ఈ మూడు స్థితులకు అతీతంగా ఉండె అమ్మవారిని 'సర్వోపాధివినిర్ముక్తా' అనాలి.

ఈ నామానికి వేరే 'మంత్రం' 'బీజాక్షరం' కూడా ఉన్నాయి. రుద్రసూక్తంలోని నమకంలో చివరకు వచ్చే 'త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టి వర్ధనం ఉర్వారుక మివబంధనాత్ మృత్యోర్ముక్షీయమామృతాత్' అనేది మంత్రం.

మన ఉపాధులతో కలసి ఉన్న జీవులకు 'జీం' అనేది బీజాక్షరం అవుతుంది. మృత్యుంజయత్వం పొందడానికి సంబంధించిన కీలక బీజాక్షరం 'జూం' ఔతుంది. మొత్తం మంత్రం 'ఓం హౌం జూం స ః' అని మృత్యుంజయ మంత్రంతో దీన్ని జత చేసి చెప్పాలి.

( దీన్ని మృత్యుంజయ మంత్రం అంటారు. మహామృత్యుంజయం కూడా ఉంది).

శరీరంతో సంబంధం (Attachment) ఎంతగా పెట్టుకుంటే, లేదా – శరీరంతో సంబంధాన్ని ఎంతగా ఆలోచిస్తే అంతగా ఈ మంత్రం పట్టివ్వదు. ఉదా : బి.పి. ఉందని తెలీకుండా బి.పి.తో ఎన్నోరోజులు బ్రతికేవారు చాలా మంది ఉంటారు. వైద్యుడు బి.పి. ఉందని చెప్పగానే చస్తారు – శాపం పెట్టినట్లు. అంటే – తన ఆరోగ్యం గురించి ఎంతకాలం గుర్తుండదో వాడు అంతగా ఆరోగ్యవంతుడుగా జీవిస్తాడు. అనారోగ్యం గుర్తున్న దగ్గర నుండీ అనారోగ్యంగా ఉన్నట్లు బాధపడుతూ జీవిస్తాడు.

'సర్వవిధములైన ఆధారములచేత నిశ్శేషంగా విడిచి పెట్టబడినది' - అని ఈ నామానికి అర్థం.

## 709. సదాశివపతివ్రతా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సదాశివపతివ్రతాయైనమః' అని చెప్పాలి.

సదాశివ = సదాశివునియందు, లేదా సదా శివుని యందు, పతివ్రతా = పాతివ్రత్యధర్మము కలిగినది.

ఎల్లప్పుడూ మంగళకరమైన వాడే – సదాశివుడు.

మానసిక దారిద్ర్యం తీరినటువంటి వానికి ఈ శివత్వం ఉంటుంది. కొందరికి దరిద్రం భౌతికంగా లేకపోయినా మానసికంగా ఉంటుంది. అటువంటివారికి ఆ జన్మలో 'శివత్వం' వచ్చే ఆస్కారం లేదు. ఈ 'శివత్వం' ఉంటే – 'సత్యం' 'సుందరం' రెండూ ఉంటాయి.

నవవిధ భక్తులని సాధారణంగా చెబుతారు. ఈ పాతివ్రత్యాన్ని పదోదానిగా చెప్పవచ్చు. ఈ 'పాతివ్రత్యం' అన్నపదానికి ఆంగ్లంలో సరి అయిన మాట లేనే లేదు.

శివుని యందు జీవితం వ్రతంగా కలిగినది అమ్మవారు. అందుకని సదాశివపతివ్రత. శివునితో పూర్తిగా అన్నివిధాలా అనుబంధాన్ని, సంబంధాన్ని కలిగి ఉన్నది అమ్మవారు. రూపంలోను, నామంలోను, పంచకృత్యాల్లోను ఇలా అన్నిటిలోను సామ్యం సర్వసమానత్వం కలది అమ్మవారు. ఇలా రూపనామాలతో సహా తన జీవితాన్ని భర్త యందు వ్రతంగా కలిగినది కాబట్టి అమ్మవారు 'సదాశివపతివ్రతా'.

'సదాశివుని యందు పాతివ్రత్యము కలిగినది' అని ఈ నామానికి అర్థం.

# 710. సంప్రదాయేశ్వరీ

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సంప్రదాయేశ్వర్యైనమః' అని చెప్పాలి.

సంప్రదాయ = సంప్రదాయమునకు, ఈశ్వరీ = ప్రభ్వీలేదా అధినాథురాలు.

కాలంతోపాటుగా మార్చవలసిన అవసరం లేకుండా పారంపర్యంగా వస్తున్న పద్ధతులను 'సంప్రదాయం' (Tradition) అంటారు. ఇది ఒక్కొక్క జాతికి ఒక్కొక్క ప్రదేశంలో ఒక్కొక్క రకంగా ఉండవచ్చు. వారి వారి సంప్రదాయాలకు దెబ్బ తగలకుండా అదేవిధంగా వారిచే కొనసాగింపబడేట్లుగా చేస్తుంది కాబట్టి అమ్మవారు 'సంప్రదాయేశ్వరి'

విమర్శనాత్మకమైంది – తత్త్వశాస్త్రం అయితే
పరిశీలనాత్మకమైంది – తర్కశాస్త్రం
ఆచరణాత్మకమైంది – యోగశాస్త్రం ఔతాయి.
అలాగే – సమన్వయాత్మకమైంది – సత్యమైతే
ధారణాత్మకమైంది – ధర్మం ఔతుంది.

అందుకే విష్ణుసహస్ర నామాల్లో 'ఆచారః ప్రభవో ధర్మః' ధర్మస్యప్రభురచ్యుతః' – అని చెప్పబడింది. 'ఆచరించువాణ్ణి బట్టి ధర్మం ఉంటుంది. ఆ ధర్మానికి ప్రభువు విష్ణువు' అని దీని అర్థం. ధారణ చేసేదే ధర్మం ఔతుంది. 'ధర్మం' ఆచరింపబడితే 'గుణం' ఔతుంది.

సత్యం, క్షమ, శాంతి, దాంతి ఇవన్నీ – ధర్మాలు, లక్షణాలు అయితే వీటిని కలిగినవానిలో అవి గుణాలౌతాయి. ఇటువంటి గుణాలు కలిగిన భాగవతోత్తముల జీవిత చరిత్రలు చెప్పేదే భాగవతం. సత్యం గొప్పదే కాని – సత్యాన్ని పలికే వాడు సత్యంకన్నా గొప్పవాడు అనే విషయం భాగవత పఠనం వల్ల తెలుస్తుంది. ఇదంతా సంప్రదాయంచెప్పే విషయం.

''తాని ధర్మాణి ప్రథమాన్యాసన్'' అని పురుష సూక్తం చెబుతుంది. 'పూర్వం ఎలా ఉందో అలాగే ఈసారి గూడా' అనే విధంగా అన్నీ ఉంటే అది సంప్రదాయాన్ని తెలియచేస్తుంది. ఈ సూత్రాన్ని అనుసరించే ఆచారవ్యవహారాలు ఏర్పాటౌతాయి. 'పాలక - పాలిత' 'గురు-శిష్యాది' సంప్రదయాలాన్నిటినీ నడిపేది అమ్మవారే !

1) సంప్రదాయాలను కొనసాగునట్లు చూచు అధినాథురాలు.

2) మన ప్రవర్తనను సంప్రదాయముగా మలచునదిగా చేయునది - అని ఈ నామానికి అర్థం.

## 711. సాధు

రెండు అక్షరాల నామం. ఈనామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సాధునేనమః' అని చెప్పాలి.

సాధు = సాధులక్షణవతి.

ప్రవర్తనచే ఇతరులను ఆహ్లాదపరచే లక్షణాన్ని 'సాధు' లక్షణం అంటారు. ఈ లక్షణం కొందరిలో సహజంగా ఉంటే, మరికొందరిలో అభ్యాసం వల్ల వస్తుంది. అభ్యాసం వల్ల వచ్చేది సహజంగా ఉన్న దాని ముందు ఎబ్బెట్టుగానే ఉంటుంది. అదంతా లౌక్యమేమోననిపిస్తుంది. బ్రతకనేర్చినవారేమోననిపిస్తుంది. కాని, అమ్మవారికి ఈ లక్షణం సహజంగా ఉంటుంది.

(ఈ నామాన్ని 'సాధు' అని కాకుండా 'సాధ్వీ' అని కొందరు పరిగణిస్తారు. కాని ఈ 'సాధ్వీ' నామం ఇంతకు పూర్వమే 128వ నామంగా చెప్పబడింది. కాబట్టి, ఈ నామం పునరుక్తం కాకుండా 'సాధు + ఈ' అని రెండు నామాలుగా విడదీసి వివరణ ఇవ్వబడుతోంది - వివరణకర్త)

## 712. ఈ

ఏకాక్షర నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'య్యై' నమః అని చెప్పాలి.

ఈ = నాల్గవ అచ్చు అక్షరం.

'ఈ' అనే ఈ అక్షరానికి అమ్మవారి పరంగా ఏదైనా అర్థం రావాలంటే 'ఈ' అక్షరానికి బిందువు, అంటే – సున్నను కూడా చేర్చాలి. అప్పుడు 'ఈం' అవుతుంది. 'ఈం' అనేది ఒక బీజాక్షరం. ''తాం పద్మినీం 'ఈం' శరణమహం ప్రపద్యే'' – అని శ్రీసూక్తంలో ఈ 'ఈం' బీజం వస్తుంది. కాబట్టి, ఇది అమ్మవారికి సంబంధించిన బీజాక్షరం అని నిర్ధారణౌతోంది. దీన్నే అమ్మవారికి సంబంధించిన 'శక్తిబీజం' అంటారు. 'క' కార 'ల' కారాలు ఈ శక్తి బీజాన్ని కలుపుకుంటేనే కామకళా బీజమైన 'క్లీం' గా ఏర్పడేది. అలాగే – 'క' కార 'ర' కారాలు ఈ శక్తి బీజాన్ని కలుపుకుంటే ఆయుధాల్లో శూలాన్ని, గుణాల్లో పరాక్రమాన్ని సూచించే అమ్మవారి 'క్రీం' అనే కాళికాబీజం ఏర్పడేది. 'అ' కార శబ్దవాచ్యుడైన పురుషుడు ఈ 'ఈం' కార శక్తిబీజాన్ని కూడినప్పుడే జ్ఞానశక్తికి సంబంధించిన సరస్వతీ బీజాక్షరమైన 'ఐం' గా ఏర్పడేది. లక్ష్మీ బీజం కూడా దీంతో ఏర్పడేదే అన్నిటికీ 'ఈం' పరిపూర్ణ శక్తి నిచ్చే బీజాక్షరం కాబట్టి, దీనికి మాతృ కావర్ణమైన 'ఈ' అనే ఏకాక్షరాన్ని అమ్మవారి ఒక నామంగా స్తోత్రంలో చెప్పడం జరిగింది. ఈ స్తోత్రంలో 'త్వత్' 'త్వమ్' నామాల తర్వాత ఇదే ఏకాక్షరనామం.

శక్తి బీజ మాతృకావర్ణాన్ని – ఈ నామం సూచిస్తుంది.

## 713 గురుమండలరూపిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'గురుమండల రూపిణ్యై నమః' అని చెప్పాలి.

గురు మండల = గురుపరంపరల, రూపిణీ = రూపములో నుండునది.

వివేకము, విత్కరము, విచారము – ఇలా సిద్ధౌఘము ఆనందనాథుల రూపంలో ఉండే గురువులు ముప్పై ముగ్గురు ఉంటారు. వీళ్ళ అనుగ్రహం లేనిదే ఏవేవో వస్తాయి గాని అవన్నీ ఎందుకో అది రాదు. అంటే – ఆనందరహితంగా అన్నీ వస్తాయన్నమాట!

ఈ గురువులందరూ క్రతుస్వరూపులు. మనం వెళ్ళేది తిన్నైన మార్గం అవునా కాదా అని ఈ గురువులు చూస్తూ ఉంటారు. యజ్ఞార్థ కర్మ, భూతదయలేందే ఏ

ఉపాసనా, వేదాంతం, ఆధ్యాత్మికత రాణించవు. పండిత సంప్రదాయ కుటుంబాల్లో గూడా అప్పుడప్పుడు భ్రష్టులు పుట్టడానికి ఇదే కారణం. వీరికి కేవలం పాండిత్యం, ఉపన్యాసాలు; తాము, తమ మార్గం – ఉంటాయి గాని ఇంకొకరితో సంబంధం ఉండదు. అందుకని నలుగురికీ పనికి వచ్చే పని, నలుగురూ కలిసి చేసే పనులు లేనంతవరకు అది – ప్రముఖ వంశమైనా ప్రగతి ఉండదు, ప్రయోజనం సిద్ధించదు. ఇటువంటి యజ్ఞార్థ ప్రక్రియలో జీవిస్తున్నవారికి అబ్బినంతగా మిగిలిన పద్ధతుల వారికి జ్ఞానం అబ్బదు. ఈ విషయాల్లపై ప్రత్యక్షంగాను, పరోక్షంగాను; దృశ్యంగాను, అదృశ్యంగాను – పర్యవేక్షణ చేసేవారే గురువులు. ఆది గురువు సదాశివుడు లేదా నారాయణుని నుండి వ్యక్తిగత గురువు వరకు పనిచేసే గురుపరంపరను గురుమండలం అంటారు. అందుకే – నారాయణ (సదాశివ) సమారంభాం శంకరాచార్య మధ్యమాం అస్మదాచార్య పర్యంతాం వందే గురుపరంపరామ్' – అనే శ్లోకంలో గురుపరంపర ప్రసక్తి , స్మరణ చెప్పబడింది. ఈ గురుపరంపరలోని గురువులందరి రూపంలో అమ్మవారే పనిచేస్తుంది.

'గురుపరంపరలో గురువులందరి రూపంలో పనిచేయునది' – అని ఈ నామానికి అర్థం.

## 714. కులోత్తీర్ణా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కులోత్తీర్ణాయైనమః' అని చెప్పాలి.

కుల = మూలాధారం నుండి, ఉత్తీర్ణా = ఉత్తరమార్గం ద్వారా ఉద్ధరించునది.

'కులం' అంటే ఇంద్రియాలు అని ఒక సంకేతం. ఈ సంకేతార్థంలో లౌకిక విషయాలకు సంబంధించిన ఇంద్రియాలను సరియైన మార్గంలోకి మళ్ళించి ఉద్ధరించేది అని ఒక అర్థం.

'కులం' అంటే మూలాధారం అనే అర్థంలో – మూలాధారం వద్ద ప్రారంభించిన కుండలినీ యోగసాధన కాలక్రమానుగతంగా ఉత్తర మార్గ (సుషుమ్నా) దిశలో సహస్రార పర్యంతం కొనసాగునట్లు చేసి తరింప చేయునది – అని ఇంకో అర్థం.

దేనికైనా ప్రారంభానికి - 'కులకుండం' అంటారు. 'కులము' అంటే 'గుంపు' (Group) అని అర్థం.

'గురుమండలం' అంటే - 'గురువుల గుంపు' లేదా - 'గురుకులము' అని అర్థం. ఈ గురుకులాన్నే శ్రీవిద్యలో 'శ్రీకులము' అని కూడా అంటారు. ఒకే సత్కర్మాచరణ కల్గిన వారు వేరు వేరు చోట్ల ఉండి ఒకసారి కలిస్తే అక్కడ 'కులోత్తీర్ణత' జరుగుతుంది. సత్రయాగములు, గురుపూజా మహోత్సవాలు, సామూహిక ప్రార్థనాసమావేశాలు ఇందుకే.

సిద్ధాంతాలు, రాద్ధాంతాలు లేకుండా పనికి వచ్చే పనులు జరుగుతున్నంతవరకు కులోత్తీర్ణత వలన వృద్ధి ఉంటుంది. అలా లేకపోతే యుద్ధముంటుంది. కులతంత్రం, కులమార్గం, కులాచారాలు ఉన్నచోట సామూహిక ప్రజ్ఞ (Group Consciousness) ఏర్పడి, యోగ సాధకుడు తనలాంటి వారిని తేలికగా గుర్తుపట్టడం జరుగుతుంది. ఫలాని వ్యక్తి ఫలాని దానికి సంబంధించిన వాడు అని తెలుస్తుంది. ఈ సామూహిక ప్రజ్ఞనే(Group Consciousness) 'కుల కుండం' అంటారు. దీని ఉత్తీర్ణతకే యోగసాధకులు కలుస్తారు. ఈ కులం లేకపోతే అంతా సంకులమే అవుతుంది.

(Group Consiousnessకు Mass Consciousnessకు చాలా భేదముంది.)

1) ఇంద్రియాలను సన్మార్గంలోకి మళ్ళించి ఉద్ధరించేది.

2) మూలాధారం నుండి సహస్రార పర్యంతం కుండలినీ యోగసాధనను ఉద్ధరించునది.

3) 'కులకుండము' అనే సామూహిక ప్రజ్ఞను ఉద్ధరించునది' - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 715. భగారాధ్యా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'భగారాధ్యాయైనమః' అని చెప్పాలి.

భగ = సూర్యునిచే, ఆరాధ్యా = ఆరాధింపబడినది.

'భ' అంటే – 'ప్రకాశము,' లేదా – 'కాంతి' లేదా – 'వెలుగు' అని అర్థం.

'గ' అంటే – 'గమనము' అని అర్థము కాబట్టి, 'భగ', అంటే – 'వెలుగుతూ గమించేవాడు' – 'సూర్యుడు' అని అర్థం. కాబట్టి, 'సూర్యుని చేత ఆరాధింపబడునది' అని ఈ నామానికి అర్థం. శ్రీ విద్యా ఉపాసకులలోని పన్నెండు మందిలో సూర్యుడు ఒకడు. అమ్మవారిని అలా ఉపాసించిన ఫలితంగా – అమ్మవారు సూర్యునికి గ్రహమండలాధిపత్యం ప్రసాదించింది. దీనితో సకలలోకారాధ్యుడయ్యాడు సూర్యుడు.

'భగారాధ్యా' అంటే – 'ప్రకాశ చైతన్య రూపాల్లో ఆరాధింపబడునది' అని కూడా అర్థం చెప్పుకోవచ్చును. ఈ 'భగ' పదంలోని 'భ' బుద్ధి స్వరూపాన్ని, ప్రకృతిని, వివేకాన్ని సూచిస్తుంది. 'గ' – ప్రాణస్వరూపాన్ని, అపరా ప్రకృతిని, చైతన్యాన్ని సూచిస్తుంది. అమ్మవారు ఈ రెంటికీ సమన్వయాన్ని కుదురుస్తుంది.

1) సూర్యునిచే ఆరాధింపబడునది.

2) ప్రకాశము, గమనముల మధ్య సమన్వయముకుదుర్చునది.

3) ప్రకాశము, గమన ప్రక్రియలచే ఆరాధింపబడునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 716. మాయా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మాయాయైనమః' అని చెప్పాలి.

మాయా = లేనిది ఉన్నట్లు, ఉన్నది లేనట్లు భ్రమింపచేయు లక్షణము.

అన్ని ఉన్నట్టుగా కనపడే సృష్టి కూడా ఒక విధంగా చెప్పుకోవాలంటే 'మాయ' క్రిందకే వస్తుంది. సృష్టి అంతా పదార్థమయం. ఆ పదార్థ మంతా పరమాణువుల మయం. ఆ పరమాణువుల్లో – ఏదో చాలా తక్కువ ప్రదేశంలోనే ఎలక్ట్రానులు, ప్రోటానులు,

న్యూట్రానులు ఇమిడి పోతాయి తప్ప మిగిలినదంతా శూన్య ప్రదేశమే! అంటే దీన్ని బట్టి సృష్టిలో కనపడే పదార్థమంతా ఎక్కువ భాగం శూన్య భాగం తోనే నిండి ఉండగా, కనబడటానికి అంతా దృఢంగా ఉన్నట్లు కనబడుతుంది. మరి ఇది మాయ కాకపోతే ఏమిటి ?

శరీరంలో నిరంతరం కొన్ని కోట్ల అణువులు పరమాణువులు పుడుతూ - చచ్చిపోతూ ఉంటాయి. కాని ఇదేమీ మనకు తెలీకుండా శరీరమేదో శాశ్వతంగా, దృఢంగా చెక్కు చెదరకుండా స్థిరంగా ఉన్నట్లు కనబడతుంది. ఇది మాయ కాకపోతే ఏమిటి ?

అసలక్కడ ఏమీ లేకపోయినా ఏదో ఉన్నట్టు, అది నీలంగా ఉన్నట్టు ఆకాశం కనబడటం మాయ కదూ! పుట్టిన ప్రతి జీవిపోతాడని తెలిసినా తాము మాత్రం ఉంటామనే ఆశతో - అందుకు ఎన్నోరకాల యోగాలు, మందులు మంత్రాలు ఏర్పాటు చేసుకుని, చివరకు ఇవేమీ పనిచెయ్యకుండానే పోవడం, ఇదంతా చూసినప్పటికీ - ఇతరులు మళ్ళీ అలాంటి ప్రయత్నాలనే చెయ్యడం - ఇదంతా మాయ కాకపోతే ఏమిటి ?

నిద్రలో అన్నీ మరచి పోవడం, మళ్ళీ మెలకువరాగానే - అన్ని గుర్తుకు రావడం, కలల్లో అందర్నీ చూడగలగడం ఇదంతా మాయకాదూ!

ఇలాంటి మాయ లెన్నో ఈ సృష్టిలో ఉన్నాయి. అన్నింటితో పాటు ఈ మాయను కూడా అమ్మవారే ఏర్పాటు చేసింది. ఈ మాయే కనకలేకపోతే ప్రపంచానికి స్థితి లక్షణం లేకుండా పోయేది! జీవులు ఆశలు వదులుకుని జీవించడానికీ ఇష్టపడేవారు కాదు. ఆకాశం కూడా సూర్యుని లాగా వేడిగా, వాడిగా కిరణాలు విరజిమ్మితే దాన్ని చూచే వాళ్ళుమూ కాదు, క్రింద ఉండే వాళ్ళుమూ కాదు.

అసలు 'మాయ' దేనికి ? అనేది ప్రశ్నే కాదు. ఇది - 'రైలెక్కి - అసలు రైలెక్కడం ఎందుకు ? ' అని అనడం లాంటిది. సృష్టిలో క్రీడార్థమై ఏర్పాటు చేసిందే మాయ. అసలు ఈ మాయను 'యామాసామాయా' అన్నారు. అంటే - ఎవరైతే సంపదో ఆమె 'మాయ' అని కూడా అర్థం చెబుతారు. గీతలో కూడా భగవానుడు 'మమమాయాదురత్యయా' అని చెప్పాడు. ('నామాయను దాటడం మీ తరం కాదు'

– అని అర్థం.) విశ్వంలోని ఈ మాయా స్వరూపాన్ని సూచించే అమ్మవారి నామమే 'మాయా'.

'మాయాస్వరూపిణి' అని ఈ నామానికి అర్థం.

## 717. మధుమతీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మధుమత్యైనమః' అని చెప్పాలి.

మధుమతీ = మధురానుభూతి స్వరూపిణి.

అందమైన వస్తువును చూసినా, రుచికరమైన భోజనాన్ని చేసినా, వీనులవిందైన సంగీతాన్ని విన్నా, ఆనందదాయకమైన వినోద ప్రదర్శనను చూసినా, విలువైన విషయాల్ని తెలుసుకున్నా – పొందే అనుభూతిని ఇతరులకు తెలియచెయ్యాల్సి వచ్చినపుడు 'అదొక మధురాతిమధురమైన అనుభూతి' అంటాము. అంటే, ఈ 'మధు' పదం పరాకాష్ఠ ఆనందస్థితిని సూచిస్తుందన్నమాటే కదా! అటువంటి పరాకాష్ఠ ఆనందస్థితి నిండి ఉన్న రూపం అమ్మవారిది' అని ఈ నామం సూచిస్తుంది.

'మధువాతాఋతాయతే మధుక్షరంతి సింధవః''

''మధుజనిష్యే, మధువక్ష్యామి, మధువదిష్యామి, మధుమతీందేవేభ్యోవాచం...'

''జిహ్వామే మధుమత్తమా'' ఇత్యాదివన్నీ అమృత తుల్యమైన 'మధు' లక్షణాన్నే తెలియపరుస్తాయి.

ఏపనైనా, క్రతువైనా కోరిక ఉండి చేసినా, యాంత్రికంగా చేసినా – అది యజ్ఞార్థ కర్మ అవదు. భయం కాకుండా – భక్తి, ముద్దు, ముచ్చట, ఇష్టమూ ఉండాలి. ఏపనైనా, లేదా క్రతువైనా చేస్తుంటే – ఆ పనివల్ల చ్చే అనుభూతి 'మధురంగా' ఉంటేనే ఆ పని చేస్తున్నపుడు ఇష్టము కలుగుతుంది. ఈ మధురతత్త్వమే అమ్మవారు– అని ఈ నామం సూచిస్తుంది.

బ్రహ్మ పదాన్ని పొందినా, బ్రహ్మైక్యస్థితిలో ఉన్నా ఈ మధువులో మనం ఉంటాం. ఈ తుర్యాతీత అవస్థ స్థితిని – 'మధుమతీ' అంటారు.

1) మధుపూరిత లక్షణ స్వరూపిణి.

2) తుర్యాతీతావస్థ స్వరూపిణి – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 718. మహీ

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మహ్యైనమః' అని చెప్పాలి.

మహీ = అన్నిటికీ ఆధారభూతమైనది.

అన్నీ దేని మీద ఆధారపడుతున్నాయో ఆలోచిస్తే చిట్టచివరకు ఎక్కడకు వెళ్తామో దాన్ని 'మహీ' అంటారు.

వరాహమూర్తి, ఆ వరాహమూర్తిచే ఉద్ధరింపబడి పైన ఉన్న భూమి – ఈ రెండూ కలసి 'వారాహి' అవుతుంది. 'మహీ', 'వారాహి' మొదలైన వన్నీ 'హ' కార ప్రాధాన్యం గల మంత్రాలు.

ఈ సృష్టిలో ఈ 'మాయ దేనికి ?' అని అనిపించేట్టుగా ఉండేది – 'మాయా'. ఇలాఉంటే బావుంటుంది అని అనిపించేది – 'మధుమతీ'. ఈ 'మాయా', 'మధుమతీ' రెండూ కలసి ఉండేది 'మహీ'. వేదాల్లో ఈ మహీదేవతనే 'అదితి' అంటారు.

'క్షమయాపృథివీసమా' – అని చెబుతారు. ఓర్పు ఒక రూపాన్ని పొందితే అది 'మహీ' ఔతుంది.

1) అన్నిటికీ ఆధారభూతమైనది.

2) ఓర్పు యొక్క స్వరూపిణి – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

# 719. గణాంబా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'గణాంబాయైనమః' అని చెప్పాలి.

గణ = గణపతికి, అంబా = తల్లి అయినది.

మొత్తం అన్ని అక్షరాలను – అ, క, చ, ట, త, ప, య, శ – మొదలైన 8 వర్గాలుగా విభజిస్తే ఆ వర్గాలను 'గణాలు' (Group or Battalion or squad) అంటారు. ఈ అక్షర గణాలకు అధిపతిని 'గణపతి' అంటారు. గణపతి యొక్క బీజాక్షరం 'గం'. 'గ' కారం ఉచ్చరింపబడబోయే పదాల విరుపుకు కారకమౌతుంది. గొంతులో నుండి స్వేచ్ఛగా ఒకే రీతిని బయటకు నాదం వస్తూ ఉంటే – వివిధ అక్షరాల ఉచ్చారణ జరగదు. ఆ నాదాన్ని ఎక్కడెక్కడ, ఎప్పుడెప్పుడు ఎలా ఎలా నొక్కాలో – నియంత్రణ చెయ్యాలో అలా చేస్తే వివిధ రకాల అక్షరాలు ఉచ్చరింపబడతాయి. గొంతులో నాదాన్ని నొక్కబడటానికి సూచించే అక్షరమే 'గ'. ఇది వాహనము మీద ప్రయాణిస్తున్నపుడు ఉపయోగపడే 'బ్రేకు' లాంటిది. ఈ బ్రేకు లేకపోతే ప్రయాణం ఉండదు– ప్రమాదమే ఉంటుంది. అంటే – అన్ని రకాల మలుపులు, వంకరలు, అవరోధాలు దాటుకుంటూ తిన్నగా ముందుకు సాగిపోవాలంటే వాహనానికి 'బ్రేకు' ఎలా ఉపకరిస్తుందో – అక్షరాలు చక్కగా ఉచ్చరింపబడి – లోపల ఉన్న భావాలన్నీ అక్షర రూపంలో బయటకు వ్యక్తమవాలంటే ఈ 'గ' కారం సూచించే 'అవరోధమే' అలాఉపకరిస్తుందన్నమాట ! ఈ 'గ' కారం చేత సూచింపబడే వాడే 'గణపతి'. నాదమార్గానికి అడ్డుపడి,- అంటే విఘ్నం కలిగించి అక్షరాలు చక్కగా ఉచ్చరింపబడేట్టు చేసే 'గ' కార సూచితుడైన గణపతిని అందుకే మంత్రశాస్త్రంలో 'విఘ్నేశ్వరుడు' అన్నారు. అంతేగాని 'విఘ్నాలకు అధిపతి అనే అర్థంలో కాదు.

ఛందస్సులు గణ సంబంధమైనవి. ఛందోగణములకు మూలమైన అమ్మవారిని గూడా ఈ నామంతో సూచిస్తారు.

1) గణపతికి తల్లి.

2) అక్షర గణములకు మాతృకా స్వరూపిణి.

3) ఛందోగణములకు మూలమాతృకా స్వరూపిణి – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 720. గుహ్యకారాధ్యా

ఐదు అక్షరాల నామం. ఈనామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'గుహ్యకారాధ్యాయై నమః' అని చెప్పాలి.

గుహ్యక = గుహ్యకులచే, ఆరాధ్యా = ఆరాధింపబడునది.

'గుహుడు' అంటే కుమారస్వామి. 'గుహ్యకులు' అంటే కుమారస్వామి పరివారము. వీరిచే ఆరాధింపబడునది అని ఒక అర్థం.

యక్షులు – దేవజాతిలో ఒక విశేషమైన జాతి. వీళ్ళనే 'గుహ్యకులు' అని కూడా అంటారు. 'మాణిభద్రుడు' మొదలైనవారే ఈ గుహ్యకులు. వీళ్ళు కుబేరుని నవనిధులను కాపాడుతూ కుబేరుని ఆజ్ఞలను పాటిస్తూ ఉంటారు. కుబేరుడు 'అమ్మవారి ప్రధాన ఉపాసకులలో ఒకడు. ఈ కుబేరుని వద్ద ఉండే వారిచే – ఆరాధింపబడుతుంది కాబట్టి అమ్మవారు 'గుహ్యకారాధ్యా'.

సహస్రార కమలం లోపల ఉండే చంద్రమండలాన్ని 'గుహ్యస్థానం' అని కూడా అంటారు. ఈ గుహ్యక స్థానాన్ని అమ్మవారి నిలయంగా ఆరాధిస్తారు కాబట్టి అమ్మవారు 'గుహ్యకారాధ్యా'.

ఉద్గీథ విద్య తెలిసిన వారు యక్షులు. 'గుహ్యకుల'నే పేరుతో కూడా పిలువబడే వీరినే 'ఛాందోగ్యులు' అని కూడా అంటారు. 'తండు' మొదలైనవారిని 'తాండ్యులు', లేదా 'తాండేయులు' అని ఎలా అంటారో ఛందస్సులు తెలిసిన ఈ గుహ్యకులను 'ఛాందోగ్యులు' అని కూడా అంటారు. సంగీతంలో వీళ్ళు 'అనురణన ధ్వనులను ఇస్తారు. సంగీతంలో ఇవి ఉంటే ప్రాణం లేచి వస్తుంది. లేకపోతే ప్రాణంలేచి పోతుంది. అతిరసవత్తరంగా, మనోజ్ఞంగా, శ్రవణానందకరంగా చేసే వీరి గానాలనే 'యక్షగానా' లంటారు. ఈ 'యక్షగానా'ల పేరుతో తర్వాత నాటక ఫక్కీలో క్రొత్త ప్రక్రియలు వచ్చాయి కూడా!

1) కుమారస్వామి సేనాపరివారంచే ఆరాధింపబడునది.

2) గుహ్యకులచే ఆరాధింపబడునది.

అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 721. కోమలాంగీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'కోమలాంగ్యైనమః' అని చెప్పాలి.

కోమల = కోమలత్వమును, అంగీ = తనలో భాగముగా కలిగినది.

అందానికి 'కోమలత్వం' దోహదకారిగా ఉంటుంది. సౌందర్యానికి కావలసినవి ఎన్ని ఉన్నా - అవన్నీ గాని, అవన్నీ ఉన్న వ్యక్తిగాని మోటుగా ఉంటే ఆ సౌందర్యం ఎబ్బెట్టుగానే ఉంటుంది. సౌకుమార్యం, ముగ్ధత్వం, ఇవి కూడా ఉండాలి. ఈ రెండూ 'కోమలత్వం' లో ఇమిడి ఉంటాయి. 'సుందరాంగుల అందరి అందంలోని ఈ కోమలత్వం ఎవరిలో భాగమో - ఆమె అమ్మవారు' అని ఈ నామానికి అర్థం చెప్పుకోవాలి. అందానికి సంబంధించిన అంగాల్లో కోమలత్వం ఒక అంగమైతే ఆ కోమలత్వ అంగాన్ని కలిగి ఉన్న అమ్మవారు 'అంగీ' ఔతుంది.

('అంగము' అనంగానే షడంగాలని అర్థం చెప్పుకుని, ఇక వరుసగా వేదాంగాలుగా చెప్పుకునే శిక్షా, వ్యాకరణాదులను, అంగన్యాసాల్లో చెప్పే - హృదయ, శిరో, నాసికా, కవచ, నేత్ర, అస్త్రాలను - ఇలా ఆరు అంకెకు సరిపోయే అంగాలుగా విభజింపబడిన వాటి అన్నిటినీ కలిగియున్నది కాబట్టి 'కోమలాంగీ' అని కూడా కొందరు చెబుతారు).

సృష్టిసౌందర్యంలోని కోమలత్వం ఎవరిలో ఒక భాగమో ఆమె - అని ఈ నామానికి అర్థం.

## 722. గురుప్రియా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'గురుప్రియాయైనమః' అని చెప్పాలి.

గురు = గురువునకు, ప్రియా = ప్రియమైనది.

'గురువు' అంటే – శైవతంత్రంలో – 'సదాశివుడు' అనీ, భాగవతంలో 'నారాయణుడ' నీ, వేదాంతంలో – 'పరబ్రహ్మ' అనీ, అర్థం చేసుకోవాలి. సందర్భాన్ని బట్టి ఆయాఅర్థాలను స్వీకరించి – 'గురువు' అంటే ప్రస్తుతం పరమేశ్వరునిగా అర్థం చెప్పుకుంటే ఆయనకు ఇచ్ఛాశక్తిగా పనిచేసే అమ్మవారు ఆయనకు ప్రియమైంది అవుతుంది కాబట్టి, అమ్మవారు 'గురుప్రియా'.

ఈక్రింద చూపిన విధంగా గురుశిష్యులను ఒక వృత్తంతో పోల్చవచ్చు.




పై వృత్తంలో – కేంద్రం (Centre) గురువు అయితే – పరిధి మీది బిందువులు (Points on Circumference) శిష్యులౌతారు. కేంద్రం 'నేను' అయితే, పరిధి మీద – బిందువులు ఆ నేను యొక్క 'భావములు' అవుతాయి. ఈ నేను అనే గురువు – ఎప్పుడూ 'యువకుడే', 'భావములు' అనే శిష్యులు పుడుతూ, పెరుగుతూ, పోతూ ఉంటారు. అందుకనే ఆదిశంకరులు 'దక్షిణామూర్తి' ని గురించి చెప్పిన

శ్లో. ''చిత్రం వట తరోర్మూలే వృద్ధాః శిష్యాః గురుర్యువా
గురోస్తు మౌన వ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్నసంశయాః''

అనే శ్లోకంలో గురువు – యువకుడని, శిష్యులు వృద్ధులు అనీ చెప్పారు. (ఇక్కడ వృద్ధులు అంటే – 1. వయస్సు ఉన్నవారని 2) గురుని మాటలను వింటూ అభివృద్ధి పొందేవారనీ కూడా అర్థాలు చెప్పుకోవాలి).

ఈ నామంలో 'గురువు' పదానికి 'గురువ'నే అర్థం చెప్పుకున్నా – 'ప్రియా' పదానికి శిష్యుడని చెప్పుకోవచ్చును. ఎందుకంటే – నిజమైన ఉత్తమ గురువుకు ప్రియమైన వాడు శిష్యుడే కాబట్టి. (ద్రోణాచార్యుడు – అర్జునుడు లాగా అన్నమాట!) వృత్త పరిధి లోని బిందువులు కేంద్రం మీద ఆధారపడి ఉంటాయి. అలాగే గురువు మీదే శిష్యుడు ఆధారపడి ఉంటాడు. కాబట్టి, ఈ నామానికి 'గురుశిష్యుల' ఇద్దరి రూపంలో ఉన్నది' అని ఇంకో అర్థం వస్తుంది. అంటే – చెప్పేవాడుగా, వినేవాడుగా ఉన్న అమ్మవారి సమన్వయ రూపాన్ని ఈ నామంలో సూచించారన్నమాట! మహాకవి ధూర్జటి కూడా ''వాగర్థంబులు, శ్రోత్రువక్తలు తలంపన్ స్వామినీవేకదా!'' అన్నాడు ఈశ్వరుణ్ణి ఉద్దేశించి. అంటే – 'వాక్కు దాని అర్థం రూపంలోను; చెప్పేవాడు, వినేవాడు రూపంలోను కూడా ఉన్నది నువ్వేకదా' – అని దాని అర్థం.

శిష్యునికి ఉత్తమ విద్యను చెప్పాలనుకునే ఉత్తమ గురువుకు ముందుగా తోచేది బ్రహ్మవిద్య, ఆత్మవిద్య ఆరెంటినీ సమన్వయించే శ్రీవిద్య. అందుకని ఆ గురువుకు ప్రియమైనది శ్రీవిద్యఔతుంది. అమ్మవారు ఆ శ్రీవిద్యా స్వరూపిణి.

1) పరమేశ్వరునికి ప్రియమైనది.

2) గురుశిష్యుల సమన్వయ స్వరూపిణి.

3) శ్రీవిద్యాస్వరూపిణి.

4) బ్రహ్మవిద్య, శ్రీ విద్యాదులను బోధించు గురువులను అభిమానించునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 723. స్వతంత్రా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'స్వతంత్రాయైనమః' అని చెప్పాలి.

స్వతంత్రా = దేనిమీదా, ఎవరిమీదా ఆధారపడనిది.

సాధారణంగా అందరూ జీవితం గడపడానికి ఎంతోమంది మీద, ఎన్నోవాటి మీద ఆధారపడి ఉంటారు. కాని, అమ్మవారు అలా ఎవరిమీదా, దేనిమీదా ఆధారపడి ఉండదు. అమ్మవారి మీదే అవి ఆధారపడి ఉంటాయి కాబట్టి, అమ్మవారు సర్వస్వతంత్రురాలు.

ఐహికానికి సంబంధించిన - పరకాయ ప్రవేశ, ఆకాశగమన, జలస్తంభన, వాయుస్తంభన, ఇంద్రజాల, మహేంద్రజాలాది మహామాయా శంబరాది తంత్రవిద్యలున్నాయి. అవన్నీ మోహపెట్టి వంచింపచేసేవే! ఒక్క అమ్మవారికి సంబంధించిన శ్రీవిద్యా తంత్రమే మోక్షప్రాప్తిని చేకూర్చేది. శ్రీవిద్యాతంత్రాన్నే 'స్వతంత్రం' అంటారు. ఆది శంకరులు ఈ విషయాన్ని సౌందర్యలహరిలోని 31వ శ్లోకం అయిన ''చతుష్షష్ట్యాతంత్రైః సకలమతి సంధామ భువనా.... స్వతంత్రంతే తంత్రం క్షితితల మవాతీతరదిదమ్'' అన్నారు.

ఈ శ్లోకంలోని 'స్వతంత్రం' - 'స్వ' తంత్రంగా అర్థం చేసుకోవాలి. అంటే - తనకు సంబంధించిన తంత్రం - అని అర్థం చేసుకోవాలి. మిగిలినవన్నీ బాహ్యమైన విషయాలకు సంబంధించిన తంత్రాలు. ఇక్కడ 'తనకు' అన్నపుడు 'అమ్మవారికి సంబంధించిన' అని గాని, ఎవరు ఉపాసిస్తున్నారో' అతనికి సంబంధించిన తంత్రమే అనిగాని అర్థం చేసుకోవాలి.

1) ఎవరిమీదా, దేనిమీదా, ఎప్పుడూ ఎక్కడా ఆధారపడని సర్వస్వతంత్రురాలు.

2) 'స్వ'కు సంబంధించిన తంత్ర స్వరూపిణి - అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 724. సర్వతంత్రేశీ

ఐదు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సర్వతంత్ర్యేశ్యై నమః' అని చెప్పాలి.

సర్వ = అన్ని, తంత్ర = తంత్రములకు, ఈశీ = ఈశ్వరి.

అరవై నాలుగు దాకా తంత్రాలున్నట్లు చెబుతారు. అయితే - వీటన్నిటిలో నేర్పే విషయాలుంటాయి, తెలిసే విషయాలుంటాయి. అంతే! వీటన్నిటిపైన ఆధిపత్యం వహిస్తూ - ఇవన్నీ ఎలా తెలియ చెప్పబడుతున్నాయో, ఎలా తెలుస్తున్నాయో, ఆ తెలుసుకునేది ఎవరో - వారి తత్త్వమేమిటో - ఈ విషయాలకు సంబంధించిన తంత్రం 'స్వతంత్రం'లో ఉంటుంది. ఈ స్వతంత్రం అన్ని తంత్రాలకు మిన్నగా ఉంటుంది.

దక్షిణాచార, వామాచార, కాపాలికాచార, దిగంబరాచార, శాంబరీతంత్రాదులెన్నో ఉన్నాయి. వీటన్నిటిలోను సాధారణంగా వశీకరణ, ఆకర్షణ, విద్వేషణ, సమ్మోహన, ఉచ్చాటన, మారణాలనే షట్కర్మలు, రసాయనిక విశేషాలు, ఇంద్రజాలాలు ఉంటాయి. వీటిలో కొన్ని వ్యామోహకరంగా ఉంటాయి. వీటిలో కొన్ని చాలా జుగుప్సాకరంగా, భయానకంగా, హేయంగా కూడా ఉంటాయి. ఈ తంత్రాల మీద ఆసక్తి కలవారు దైవదూరులవడం తప్పదు. సమయాచార తంత్రము, కాది విద్యాతంత్రము, వసిష్ఠ, సనక, సనందన, సనత్కుమార శుక సంహితలు మాత్రం శ్రుతి సమ్మతంగా ఉంటాయి. ఏ విధమైన తంత్రంలో అయినా అమ్మవారే కొని యాడబడుతుంది. అందుకని అమ్మవారు 'సర్వతంత్రేశీ'.

'సర్వతంత్రములపై ఆధిపత్యము కలిగినది. – అని ఈ నామానికి అర్థం.

## 725. దక్షిణామూర్తిరూపిణీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'దక్షిణామూర్తి రూపిణ్యైనమః' అని చెప్పాలి.

దక్షిణామూర్తి = దక్షిణామూర్తి యొక్క, రూపిణీ = రూపముగా ఉన్నది.

దక్షిణామూర్తి అనగా సాక్షాత్తు శివుడే! దక్షయాగములో శివనింద భరించలేక సతీదేవి యజ్ఞగుండంలో దేహత్యాగము చేసిన తరువాత శివుడు విరక్తుడై, ఒక వటవృక్షం క్రింద దక్షిణాభిముఖుడై చిన్ముద్ర ధరించి, ప్రణవ స్వరూపముతో, యువకునిగా – మౌన దీక్షకొనసాగించాడు. ఆవిధంగా దక్షిణాభిముఖుడైన శివుణ్ణి 'దక్షిణామూర్తి' అంటారు. ఇది ఒక కథ.

సనకసనందనాదులు బ్రహ్మ జ్ఞాన విషయ సంశయ నిర్మూలనకై శివుణ్ణి ప్రార్థిస్తే – ఆ శివుడు పదహారు సంవత్సరాల రూపంలో 'భాండీరమ'నే ఒక మఱ్ఱి చెట్టు క్రింద దక్షిణాభిముఖంగా పద్మాసనంలో కూర్చుని దక్షిణ హస్తంతో 'చిన్ముద్ర' ధరించి తురీయస్థితిలో వారికి దర్శనమిచ్చాడు. ఆ మూర్తిని చూడగానే సనకాదులకు వారి సంశయాలు తీరిపోయాయి. ఇది మరో కథ. (ఈ రెండవ కథే ప్రస్తుతం సముచితంగా ఉంటుంది. ఎందుకంటే – రాబోయే నామం 'సనకాది సమారాధ్యా' కాబట్టి)

శాస్త్రాల స్వయం బోధకానికి దక్షిణామూర్తిని ఉపాసించాలి. ఈ దక్షిణా మూర్తి దక్షిణ హస్తంతో ధరించిన 'చిన్ముద్ర' సమస్త సంశయాలను తీరుస్తుంది. కుడి చేతి చూపుడు వ్రేలు (Fore finger) కొసను, కుడిచేతి బొటనవ్రేలు(Thumb) కొసకు తగిలించి మిగిలిన మూడు వేళ్ళను నిట్టనిలువుగా అభయహస్త ముద్రలాగా ఉంచితే ఏర్పడే ముద్రను 'చిన్ముద్ర' అంటారు. ఈ చిన్ముద్రలో చూపుడు వ్రేలు 'బ్రహ్మ'ను బొటనవ్రేలు 'అహం'ను సూచిస్తాయి. ఈ విధంగా రెండు వ్రేళ్ళు కలిసి ఉన్న చిన్ముద్ర – 'అహం బ్రహ్మాస్మి' అనే మహావాక్యాన్ని) 'సోఽహం' అనే అజపా గాయత్రీ మంత్రాన్ని సూచిస్తుంది. తెలుగులో దీనికి 'వాడేనేను' అని అర్థం. (ఇక్కడ 'వాడు' అంటే బ్రహ్మ). సర్వవేదశాస్త్రాల సారం ఇదే 'దీంతోనే అన్ని సంశయాలు తీరిపోతాయి. (లోపలి ''చిచ్ఛక్తి'' జ్ఞానమే బయటకు ''చిన్ముద్ర'' గా వర్తిస్తుంది.)

(ఈ దక్షిణామూర్తిని ఉపాసించాలనుకునేవారు నలభై రోజులు మర్రి చెట్టు క్రింద కూర్చుని శ్వాసలోని ఉచ్ఛ్వాసలతో సోఽ హం మంత్రాన్ని జత చేస్తూ నిరంతర మౌనధ్యానంలో ఉండాలి.)

ఈ నామాన్ని 'దక్షిణ + అమూర్తి + రూపిణీ' – అని విడదీసి 'దక్షిణ' పదం 'సగుణబ్రహ్మకు', 'అమూర్తి' పదం 'నిర్గుణ బ్రహ్మ'కు సంకేతించి, ఈ రెంటి సమన్వయ స్వరూపిణి' గా కూడా ఈ నామానికి అర్థంగా కొందరు చెబుతారు.

1) దక్షిణామూర్తి స్వరూపిణి.

2) సగుణ, నిర్గుణ, బ్రహ్మల సమన్వయ స్వరూపిణి – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 726. సనకాదిసమారాధ్యా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'సనకాది సమారాధ్యాయైనమః' అని చెప్పాలి.

సనక = సనకుడు, ఆది = మొదలైన వారి చేత, సమారాధ్యా = చక్కగా ఆరాధింపబడునది.

సనకాదులంటే – సనకుడు, సనందుడు, సనత్కుమారుడు, సనత్సు జాతుడు. ఈ నలుగురూ బ్రహ్మ మానస పుత్రులు. బ్రహ్మవిదులు. ఎప్పుడూ బాలుర రూపంలోనే ఉంటారు. నివృత్తి మార్గంలో ఉంటారు.

పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ వాక్కుల రూపంలో జీవుల్లో అంతర్యామి స్వరూపంగా వరుసగా ఈ సనకాది కుమారులు పనిచేస్తూ ఉంటారు.

పరా – నామాలను; పశ్యంతీ – క్రియలను; మధ్యమా – అవ్యయాలను; వైఖరీ – ఉపసర్గలను – సూచిస్తాయి. ఈ నాలుగు రకాల పద జాలాలు ఈ నలుగురు కుమారులవల్లనే వస్తాయి. ఈ నాలుగు పదజాలాలను భాషకు 'కొమ్ము' లంటారు. అందుకే, వీటిని సరస్వతీ సూక్తంలో 'చత్వారిశృంగా ...' అనే మంత్రంలో 'శృంగా' అనే పదంతో పోల్చారు. పైన తెల్పిన వరుసను బట్టి పరా – సనకుణ్ణి. పశ్యంతి – సనందనుణ్ణి, మధ్యమ – సనత్కుమారుణ్ణి, వైఖరి – సనత్సుజాతుణ్ణి, సూచిస్తాయి. ఈ నాల్గింటిలో మధ్యమా – బ్రహ్మవిద్యను సూచిస్తుంది. ఈ బ్రహ్మవిద్య, 'మధ్యమా'చే – సూచింపబడే సనత్కుమారుని వల్ల వస్తుంది. మధ్యమా – అవ్యయాన్ని సూచిస్తుంది కాబట్టి, ఈ బ్రహ్మవిద్య – అవ్యయం అంటే – వ్యయం కానిది, తరగనిది' అని అర్థం.

గాంధర్వ, బ్రహ్మ, ఉద్గీథాదివిద్యలలో వాగ్దేవీ స్వరూపిణి అయిన అమ్మవారు సనకాదులచే ఈ విధంగా ఆరాధింపబడుతుంది. అంటే – ఈ సనకాదులు అటు దక్షిణామూర్తిని, ఇటు అమ్మవారిని సమంగా ఆరాధిస్తారని గతనామం ఈ నామం చెబుతాయి. సనకాదులు అంటే ఈ నలుగురు కుమారులచే – అనే కాకుండా ఈ నలుగురు కుమారులతో సమానమైన బ్రహ్మవేత్త లందరిచేత చక్కగా ఆరాధింపబడునది – అని కూడా చెప్పుకోవాలి.

1) సనకాది కుమారులచే చక్కగా ఆరాధింపబడునది.

2) సనకాది బ్రహ్మవేత్తలచే ఆరాధింపబడునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 727. శివజ్ఞానప్రదాయినీ

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'శివజ్ఞానప్రదాయిన్యైనమః' అని చెప్పాలి.

శివ = శివపరమైన, జ్ఞాన = జ్ఞానమును, ప్రదాయినీ = చక్కగా ఇచ్చునది.

ఒక్కొక్కరి గురించి ఒక్కొక్క పద్ధతి ద్వారా, లక్షణం ద్వారా ఒక్కొక్కరికి బాగా తెలుస్తుంది. అలాగే ఒక్కొక్క విద్య ఒక్కొక్కరి ద్వారా బాగా తెలుస్తుంది. యోగవాసిష్ఠంలోని ఈ క్రింది శ్లోకం అర్థం చేసుకుంటే ఈ విషయం నిర్ధారణౌతుంది.

శ్లో. స్పందేన లక్ష్యతేవాయుః వహ్నిః ఔష్ణేనలక్ష్యతే

చిన్మాత్రం అమలంశాంతం శివఇత్యుది తంతుయత్.

'వాయువు స్పందన ద్వారాను, అగ్ని ఉష్ణత వలన, శాంతియుతమైన పరిశుద్ధ జ్ఞాన మార్గం చేత శివుడు - తెలియబడతారు' అని పైశ్లోకానికి అర్థం. కాబట్టి - విమర్శరూపిణి, జ్ఞాన స్వరూపిణి అయిన అమ్మవారే శివజ్ఞానాన్ని ప్రసాదించింది, ప్రసాదిస్తుంది. శివుణ్ణి సూటిగా అర్చించినా, ఉపాసించినా శివజ్ఞానం శివుని ద్వారా రాదు. అమ్మవారి ద్వారానే వస్తుంది. ఎందుకంటే - నిర్వికారుడైన శివునికి ఇవేమీ పట్టవు. ఈ పనులన్నీ ఆయన అమ్మవారికే అప్పచెప్తాడు. అందుకే ఆదిశంకరులు సౌందర్యలహరిలోని 'శివఃశక్త్యాయుక్తో.... అన్న ప్రథమ శ్లోకంలో అమ్మవారి ద్వారానే అయ్యవారికి పేరు వచ్చేది - అని చెప్పారు. శివుణ్ణి గురించి శక్తికి, శక్తిని గురించి శివుడికే తెలియాలి. ఇతరులెవ్వరికీ తెలియదు. వారిద్దరూ అత్యంత సన్నిహితులు. ఈ ఇద్దర్ని అర్థం చేసుకోవాలంటే ఒక పోలిక చెప్పుకోవాలి. అయ్యవారిని ఒక సంచీ (Bag)తో పోలిస్తే - ఆ సంచీలో విశ్వం ఉంటుంది. ఆ సంచీని తిరగేస్తే విశ్వం బయట పడుతుంది. ఆ తిరగేసిన సంచీయే అమ్మవారు. **ఇదీ ఈ 'అయ్యవారి - అమ్మవారి' - విషయం**

వాఙ్మయ ప్రపంచంలో 'శివుడు - శక్తి' - ఈ ఇద్దరూ వరుసగా ఉచ్చారణ చేయబడే వాక్కుకు, ఉచ్చారణ శక్తికి ప్రతీకలు.

**ఎవడైతే తెలుసుకుంటున్నాడో వాడు శివుడై పోవడాన్ని 'శివజ్ఞానం' అంటారు. ఇలా ఐపోవడాన్ని -**

1) సంగీతంలో పరవశత్వం అనీ 2) యోగంలో సమాధి అనీ 3) తంత్రంలో - తన్మయీ కరణం అనీ - అంటారు. 'శక్తిని కొలవండి' అంటే - 'ఉచ్చరించండి అనే అర్థం. అప్పుడు శివజ్ఞానాన్ని ఆమె ఇస్తుంది. అప్పటి జీవుని స్థితి శివ స్థితే!

శివజ్ఞానమును చక్కగా ఇచ్చునది - అని ఈ నామానికి అర్థం.

## 728. చిత్కళా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'చిత్కళాయైనమః' అని చెప్పాలి.

చిత్ = జాగ్రదవస్థకు సంబంధించిన, కళ = అంశము.

చిత్ - అంటే పరిశుద్ధ జ్ఞానము(awakening Point of Pure Consciousness) నిద్రలో మనస్థితి నల్లబల్ల (Black Board) అంతా సీమసుద్ధ (Chalk Piece) పొడి అన్నట్లుంటుంది. దాని మధ్య ఒక చుక్క ఘనీభవిస్తే అది మేల్కాంచిన స్థితికి చిహ్నంగా ఉంటుంది. శ్రీవిద్యలో ఈ మేల్కాంచడాలు గూడా మూడు రకాలుగా మూడు బిందువులతో సూచిస్తారు. వాటినే 1) చిత్ బిందువు 2) ప్రకాశబిందువు 3) విమర్శ బిందువు అంటారు. మెలకువ ప్రారంభాన్ని 'చిద్‌బిందువు' (Point of Awakening) సూచిస్తే, ఆ మెలకువ విస్తృతిని 'ప్రకాశబిందువు' (Point of Brilliance) సూచిస్తే, - ఈ రెంటివల్ల వచ్చే 'స్ఫురణ' లేదా 'వివేకాన్ని' 'విమర్శబిందువు'(Point of Reasoning) సూచిస్తుంది.

ఒక విషయం అర్థం కాక పూర్వం, అర్థమైన తర్వాత ఉండే స్థితులకు ఏ తేడా అయితే ఉందో దానిని, మెలకువ రాక పూర్వం మెలకువ వచ్చిన స్థితులకు ఏ తేడా అయితే ఉందో - దానిని 'చిత్' అంటారు. ('చిదగ్ని కుండ సంభూతా' అనే 4వ నామ వివరణ 'చిచ్ఛక్తిః' అన్న 416వ నామ వివరణ కూడా ఇక్కడ చదువుకోవాలి).

చిత్ బిందువుకు సంబంధించిన అంశము - అని ఈ నామానికి అర్థం.

## 729. ఆనందకలికా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ఆనందకళికాయైనమః' అని చెప్పాలి.

ఆనంద = ఆనందము యొక్క, కళికా = మొగ్గ

మనం చేసే ఏ పనికైనా ఆనందమే లక్ష్యం. ఈ ఆనందం ఎన్నో రకాలుగా ఉంటుంది. మానుషానందం నుండి బ్రహ్మానందం దాకా ఎన్నో స్థాయిలున్నాయి. ఈ స్థాయిల గురించి 'స్వాత్మానందలవీభూత బ్రహ్మాద్యానంద సంతతిః' అన్న 365వ నామ వివరణలో తెలుపబడింది, 'బ్రహ్మానందా' అన్న 676 నామ వివరణలో 'బహ్మానందం' గురించి మరికొంత తెలుపబడింది. ఈ బ్రహ్మానందం పూర్తిగా విచ్చుకున్న పువ్వు అయితే - ప్రస్తుత నామంలో సూచించిన అమ్మవారు ఆ విచ్చుకున్న పువ్వుకు మొగ్గలాంటిది. అంటే - ఈ మొగ్గఅయిన అమ్మవారే తరువాత విచ్చుకోగా రూపొందే 'బ్రహ్మానందపుష్పం' గా అర్థం చేసుకోవాలి.

కుండలిని - మూలాధారం నుండి సహస్రారం చేరితే అప్పుడు ఆ మనిషి 'మొగా' డౌతాడు. అంటే శివుడౌతాడు. ఇది పూర్ణానందస్థితి. మళ్ళీ సహస్రారం నుండి మూలాధారం చేరే మార్గంలో 'ఆడది' అయిపోతాడు. అంటే - 'శక్తి' అయిపోతాడు. మూలాధారం వద్ద కుండలిని ఉంటే - అది ఆనందానికి ప్రారంభస్థితి. ఇది ఆనంద పుష్పానికి మొగ్గలాంటి స్థితి. కుండలిని సహస్రారంలో శివుడైపోయిన స్థితి - పూర్తిగా వికసించిన పుష్పం అవుతుంది. ఇదే బ్రహ్మానందస్థితి - ఈ స్థితిలోనే

''దేహోదేవాలయఃప్రోక్తః, జీవోదేవస్సనాతనః''.

అనే - మహన్యాసమంత్రానికి అర్థం నూటికి నూరుపాళ్ళు చెల్లుతుంది. అంతేకాదు, గీతలో చెప్పిన 'యజ్జుహోషి- యదశ్నాసి ... తత్కురుష్వమదర్పణమ్'' ('నేనే మీలో ఉంటూ మీరు ఏం చేసినా స్వీకరించేది') అన్న శ్లోకం యొక్క అర్థం కూడా ఈ స్థితిలోనే నూటికి నూరుపాళ్లు చెల్లుతుంది.

ఆనందం యొక్క మొగ్గ - అని ఈ నామానికి అర్థం.

## 730. ప్రేమరూపా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ప్రేమరూపాయైనమః' అని చెప్పాలి.

ప్రేమ = ప్రేమ, రూపా = రూపముగా నున్నది.

పైన తెలిపిన బ్రహ్మానంద స్థితిని సాధించిన వారిలో 'మహాప్రేమ' ప్రవహిస్తున్నది. అటువంటివారు నవ్వినా, పలకరించినా ఏది చేసినా అందరూ ఆకర్షితులౌతారు. అతని ద్వారా అమ్మవారి ప్రేమ అందరిమీదా ప్రసరిస్తుంది. అదే – 'మర్యాద (eticate) కోసం మాట్లాడు తుంటే' – ఇద్దరి మధ్యా 'వీడెప్పుడు వెళ్తాడా' అని ఇద్దరికీ ఉంటుంది. ఆప్యాయతకు, ఆకర్షణకు, ప్రేమకు చోటు ఉండదు.

అయస్కాంతంలో (Magnet) అయస్కాంతేతర పదార్థాలు (Non Magnetic Substances) ఉంటే – ఎలా అయితే అది పరిపూర్ణ అయస్కాంతం లాగా పనిచెయ్యదో – అలాగే ఒక విద్యుద్వాహికలో (Conductor of Electricity) అవిద్యుద్వాహక పదార్థాలు (Non Conducting Materials) ఉంటే – అది ఎలా పరిపూర్ణ విద్యుద్వాహకంగా పనిచెయ్యదో – అలాగే, మనలో కూడా దుస్సంకల్పాలు, ప్రతిఫలాపేక్షలు, స్వార్థపూరిత ఉద్దేశ్యాలు (Motives) ఉంటే 'మహాప్రేమ' వర్తించదు. తత్ఫలితంగా మనలో ప్రేమ, ఆప్యాయత, ఆకర్షణ శక్తి తగ్గిపోతుంది, ప్రసారశక్తి తగ్గపోతుంది.

తల్లికి తన పిల్లలమీద ఎంతటి ప్రేమానురాగాలుంటాయో – అలాగే జగన్మాత అయిన అమ్మవారికి తన సృష్టిమీద అంతటి ప్రేమా ఉంటుంది. ఈ ప్రేమకు హద్దులు, నియమాలు, నిబంధనలు ఉండవు. ఇది పూర్తిగా వాత్సల్యపూరితమైన ప్రేమ. అమ్మవారు 'ఆనందం ఘనరూపం చెందినమూర్తి' అమ్మవారిది ఆనంద పారవశ్యంతో నిండిన ప్రేమ. 'ప్రేమయే రూపం దాల్చిన మూర్తి' – అమ్మవారు.

ప్రేమ రూపముగా ఉన్నది – అని ఈనామానికి అర్థం.

## 731. ప్రియంకరీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ప్రియంకర్యైనమః' అని చెప్పాలి.

ప్రియా = ప్రియమును, కరీ = చేకూర్చునది. (చేయించునది)

అందరి ఎడల ప్రేమ ఉండటం, అందరికీ మంచి పనులు చేసి పెట్టడం, అందరికీ సహకరించడం ఇవి మాత్రమే ఉంటే అలాంటి వారు పరిపూర్ణ శిక్షకులు కారు. డబ్బులు ఇచ్చి ఆదుకోడం కంటే – డబ్బులు సంపాదించే శిక్షణ ఇవ్వాలి. అన్నం పెట్టి ఆదుకోడం

కంటె – ఎవరి అన్నం వారు ఏర్పాటు చేసుకునేవిధంగా శిక్షణ ఇవ్వాలి. మన భుజాల మీద ఎక్కికూచోడం కాకుండా – వారి కాళ్ళమీద వారు నిలబడేలా శిక్షణ ఇవ్వాలి. అప్పుడే వ్యక్తి సాధనగాని, సంస్థనిర్వహణ గాని, వ్యవస్థ నిర్వహణ గాని తిన్నగా ఉంటుంది. చిన్న పన్నాలో నడిచే వ్యక్తి, సంస్థ, వ్యవస్థల విషయంలోనే ఇలా ఉండాలన్నపుడు – సమస్త జగత్తును పరిపాలించే అమ్మవారు ఇంకెంత జాగ్రత్తగా నిర్వహించాలి. అందుకని ఈ 'ప్రియంకరీ' నామానికి ప్రియమైన పనులు చేసేది అని మాత్రమే కాకుండా 'ప్రియమైన పనులు మన చేత చేయించేది' అని కూడా అర్థం చెప్పుకోడం సముచితం. ఆ చేయించడంలో 'మనకీ అవతలి వాళ్ళకి కూడా హైరాణ, ఒత్తిడి, బిగువు లేకుండా ఒక విధమైన హాయి అనుభవించే విధంగానే చేయిస్తుంది'. అని ఈ నామం సూచిస్తుంది. నిజమైన భక్తులకు అన్నిటి కన్న ప్రియమైనది మోక్షం కాబట్టి వారికి 'మోక్షాన్ని గూడా ఇస్తుంది' అనే సూచన కూడా ఈ నామంలో ఉంది.

1) ప్రియమైన అభీష్టములను చేకూర్చునది.

2) ప్రియమైన పనులను (మనచేత) చేయించునది.

3) భక్తులకు మోక్షమును ప్రసాదించునది – అని ఈ నామానికి అర్థాలు.

## 732. నామపారాయణప్రీతా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'నామపారాయణప్రీతాయైనమః' అని చెప్పాలి.

నామ = నామములను, పారాయణ = పారాయణ చేయుట చేత, ప్రీతా = ప్రీతి చెందునది.

(ఈ నామాన్ని చాల జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. ఈ నామంలో చాలా సూక్ష్మ విషయాలున్నాయి. ఇంతవరకు వచ్చిన ఇతర వ్యాఖ్యానాల్లోని విషయాలు – మనుషుల్లో రావలసిన మార్పులు రావడానికి ఎక్కువగా దోహదపడేవిధంగా లేవు. ఇటువంటి చోట్ల తప్పనిసరిగా అటువంటి మార్పులు వచ్చే విధంగా వివరణ చెప్పితే బాగుంటుందనే ఉద్దేశ్యంతోనే – ఈ వివరణ పద్ధతిని వీలైనంత వరకు ప్రత్యేకించి సాధనామార్గంలో

ఉండేవారికి ఉపయోగపడే విధంగానే ఇంతకు పూర్వ నామాల వివరణలో వ్రాయడం జరిగింది, ప్రస్తుత నామ వివరణలోను - ముందూ కూడా అదే విధంగా వ్రాయడం జరుగుతుంది - వివరణకర్త).

మామూలుగా అయితే ఈ నామానికి - 'ఈ స్తోత్రంలో చెప్పిన అమ్మవారి నామాలను పారాయణ చేస్తే అమ్మవారు బాగా ప్రీతి చెందుతుంది. దాంతో మనకు కావలసినవి చేకూరుస్తుంది' - అని అర్థం చెప్పాలి. అన్ని స్తోత్రాలలోను ఫలశ్రుతిగా ఇదే విధంగా 'ఈ స్తోత్రం చదివినా, విన్నా, వినిపించినా (యఃపఠేత్ శ్రుణుయాదపి) ఎన్నో లాభాలు, ఉపయోగాలు చేకూరుతాయి' అని తప్పనిసరిగా చెప్పడం జరుగుతుంది. మరి ఇక్కడ కూడా అలాగే చెప్తే బాగుంటుందనుకుని ఇష్టపడేవారు అలాంటి అర్థాన్నే తీసుకోండి.

**అంతేకాదు ఈ విషయాన్ని నిర్ధారణ చేసుకునేందుకు -**

"మామర్చయంతువా మావా విద్యాం జపతువా నవా
కీర్తయే న్నామ సాహస్రం ఇదం మత్ప్రీతయే సదా" -

అనే శ్లోకాన్ని కూడా ఉదహరించుకోవచ్చును. (నన్ను పూజించినా, నా మంత్రాలు చదివినా, జపించినా, జపించకపోయినా - నా సంతోషం కోసం ఈ సహస్రనామ స్తోత్రం ఎప్పుడూ పారాయణ చెయ్యండి - అని పై శ్లోకానికి అర్థం.) ఈ పారాయణ చేసేందుకు కూడా ఎన్నో రకాల పద్ధతులు విశ్లేషించి ఇచ్చారు. ఆ పద్ధతులలో చెప్పిన ప్రకారం కూడా చేసుకోవచ్చు. కాని, సాధనా మార్గంలో ఉండే వారినుద్దేశించి ఇక ముందు చెప్పే వివరణ కూడా చదివి ఆచరణలో పెట్టడానికి ప్రయత్నించండి.

అసలు 'నామపారాయణప్రీతా' నామంలోని 'పారాయణ' అంటే ఏమిటో చెప్పకుండా మిగతావి ఎన్ని కుప్పలు తెప్పలు చెప్పినా ఔచిత్యం దెబ్బతింటుంది.

'పారం' అంటే - 'అవతలిఒడ్డు' అని అర్థం. 'అయనం' అంటే (దానిని చేరు) 'మార్గము' అని అర్థం. ఈ రెండు అర్థాలను బట్టి - 'పారాయణం' అంటే - అవతలి ఒడ్డుకు చేరు మార్గము - అని అర్థం వస్తుంది. 'అవతలి ఒడ్డు' అంటే ఏమిటి? మన నిత్య

జీవనయోగసాధనలో చేరవలసిన లక్ష్యం, లేదా - ధ్యేయమే అవతలి ఒడ్డు. దీన్ని 'మోక్షం' అని చెప్పుకుంటే బాగుంటుందని అనుకునేవాళ్ళు 'మోక్షం' అని చెప్పుకోవచ్చు. అయితే - అవతలి ఒడ్డు దూరమా ? అంటే - దూరము ఏమీ కాదు. మనచుట్టూ తయారు చేసుకున్నది ఎంత అవరోధంగా ఉంటే అంత దూరంలో ఈ అవతలి ఒడ్డు ఉంటుంది. కొందరికి వారి చుట్టూ అవరోధాలుగా ఉండేవి ఏమీ లేవనుకోండి - అల్లాంటివారు ఆ ఒడ్డు వద్దనే ఉంటారు. అంటే - అవతలి ఒడ్డు సూచించే మోక్షస్థితిలోనే ఉంటారు.

మోక్షవిద్యను - నియమనిబంధనలతో (Rules Regulations) బిగిస్తే అది బంధమే ! ఈ సృష్టిలో తాను క్రీడగా ఆడుతూ ఇంకొకరితో కూడా ఆడుకోగలగడమే మోక్షం !

వాక్యంలోని పదాలకు ఒక దానికొకదానికి సంబంధమెలా ఉంటుందో - అలాగే జగుత్తులో మనుష్యులందరూ ఉంటారని తెలిస్తే - ఆ స్థితి ఆనందాన్నిస్తుంది. ఆ ఆనందమే మోక్షం. భగవంతుడు ఉచ్చరించిన ఒక మహావాక్యం ఈ సృష్టి (సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి' అని తైత్తిరీయంలో చెప్పిన వాక్యం లాంటిదే ఈ వాక్యం అనుకోవచ్చును.) అయితే, ఆ వాక్యంలోని అక్షరాలు, పదాలే - మనమూ మనకుటుంబాలూను.

సృష్టికి, మోక్షానికి ఈ విధమైన ఉపమానాలు చెప్పుకున్నప్పుడు 'నామపారాయణ ప్రీతా' అన్న ప్రస్తుత నామానికి ఈ క్రింది విధంగా అర్థం చెప్పుకోవాలి.

ప్రపంచంలో ఎవ రెవరిని, ఏ యే పేర్లతో పిలుస్తున్నా, మాట్లాడుతున్నా - ఆ పేర్లన్నీ అమ్మవారివే అనుకుని, వారి వారి రూపాల్లో అమ్మవారే వ్యక్తమౌతూ మన ఎదురుగా తారసిల్లుతోందని, ఆవిడ యొక్క ఆ వివిధ రూపాలతోనే మన జన్మ కాలమంతా మాట్లాడుతున్నామని అనుకునే విధంగా మన ప్రవర్తన ఉంటే అమ్మవారు ప్రీతి చెందుతుంది - అని ఈ నామాన్ని అర్థం చేసుకుంటే బావుంటుంది. (ఈ విధమైన మన ప్రవర్తనను చూసి - అవతలి ఒడ్డుచే సూచింపబడే మోక్షాన్ని అమ్మవారు మనకు దగ్గఱకు చెయ్యడంలో సంతోషిస్తుంది).

1) నామ పారాయణకు ప్రీతి చెందునది.

2) 'ఎవరి నామములను ఉచ్చరించినను అవి అన్నియు అమ్మవారి నామములుగానే ఎంచి పారాయణము చేయువారి యెడ ప్రీతి చెందునది' అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 733. నందివిద్యా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'నందివిద్యాయైనమః' అని చెప్పాలి.

నంది = నందీశ్వరునిచే ఉద్ధరింపబడిన, విద్యా = విద్యారూపిణి.

ఆనందాన్ని పొందించే వాటిలో 'నందివిద్య' ఒకటి. శ్రీవిద్యకు సంబంధించిన భానువిద్య, చంద్రవిద్య ల్లాంటిదే ఇది కూడా! ఆనందాన్ని కలుగ చేసేది కాబట్టి దీన్ని 'ఆనందవిద్య' అని కూడా అంటారు.

తాళము, లయ, ఛందస్సు, స్వరము, శ్రుతి, రంగ ప్రసాధనము (తెర ఎత్తంగానే రంగస్థలం అని గుర్తు రాకుండా ఉండేందుకు చేసే మార్పులు, కూర్పుల ఏర్పాటు(Stage arrangement)ఆహార్యము, ఆంగికము, వాచికము, సాత్త్వికము మొదలైనవన్నిటితో పాటు పాత్రలు చెప్పవలసిన సంభాషణాదులు, సంపాదకత్వం(Editing) దర్శకత్వం(Direction) మొదలైనవన్నీ కలిసి ఉండేదాన్ని 'నందివిద్యా' అంటారు. నటరాజుచేత నందీశ్వరాదులకు నర్తావసానకాలంలో ఈ 'నందివిద్య' ఉపదేశింపబడింది.

నందీశ్వరునిచే ఉద్ధరింపబడిన విద్యాస్వరూపము – అని ఈ నామానికి అర్థం.

## 734. నటేశ్వరి

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'నటేశ్వర్యైనమః' అని చెప్పాలి.

నట = నటించుటకు, ఈశ్వరీ = ప్రపంచాధినాథురాలు.

'కర్తవ్యము నిర్వహించుట' అన్నదానికి అర్థమేమిటో 'నటము' అన్న పదానికి అదే

అర్థము. అయితే ఇది 'నటన' కాదు. 'నటము'కి 'నటన'కి తేడా ఉంది.

ధర్మోత్తర జీవితంలో నడిచేవాడు చేసే పనులు 'నటన్నా' క్రిందకు వస్తాయి. కేవలం స్వార్థపరత్వంతో జీవితంలో చేసే పనులు, వేసే వేషాలు – 'నటన' క్రిందకు వస్తాయి. అందరి వ్యక్తుల ద్వారా అమ్మవారు ఈ జగన్నాటకంలో నటిస్తూ ఉంటుంది. నాటకాల్లో – కోపమును అభినయించుట, బాధను అభినయించుట, ఆనందము అభినయించుట ఇత్యాదులుంటాయి. ఇవన్నీ ఆ పాత్ర ధారి నిర్వహించవలసిన కర్తవ్యములే ! ఆ విధంగా అభినయించేవాణ్ణి 'నటేశ్వరుడ'ంటారు. ఈ అభినయం మళ్ళీ రెండు రకాలు.

1) 'తాండవం' ఇది అయ్యవారు (శివుడు) చేసేది.

2) 'లాస్యం' ఇది అమ్మవారు చేసేది.

('ప్రపంచ సృష్ట్యున్ముఖలాస్యకాయై, సమస్తసంహారకతాండవాయ' – అన్నారు ఆదిశంకరులు అర్ధనారీశ్వరస్తోత్రంలో). ఈ తాండవం చేస్తున్నపుడే అన్ని జంతువుల కంఠధ్వనులు పుట్టాయి. అవే మహేశ్వర సూత్రాలయాయి. ఈ సూత్రాలే తర్వాత వివిధ అచ్చులు – హల్లులతో రూపొందింపబడిన అక్షర సమామ్నాయ మయాయి.

అవతల నటుడు కోపాన్ని అభినయిస్తుంటే – మనకు కోపం వచ్చినపుడు మనలో ఏం జరుగుతుందో – ఎదురుగా అభినయించే ఆ నటునిలో మనం చూడవచ్చు. అలాగే ఈ విధంగా మనలో జరిగేవి అన్నీ మనం చూసుకోలేనపుడు, తెలుసుకోలేనపుడు – చూసుకునేందుకు, తెలుసుకునేందుకు ఉపయోగపడేవే అభినయాదులన్నీ ! ఈ అభినయంలో ఆవేశస్థాయి(Level of emotion) నుండి 'స్ఫూర్తిస్థాయి'కి (level of inspiration) ప్రేక్షకుడు లేదా శ్రోత ఎదగడం జరుగుతుంది.

1) నట ప్రక్రియకు ఈశ్వరి.

2) వ్యక్తులందరి ద్వారా జగన్నాటకంలో నటించు ప్రధాన పాత్రధారి – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 735. మిథ్యాజగదధిష్ఠానా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మిథ్యాజగదధిష్ఠానాయైనమః' అని చెప్పాలి.

మిథ్యా = మిథ్యాభూతమైన జగత్తుకు, అధిష్ఠానా = అధిష్ఠానకారణంగా ఉన్నది.

ముత్యపు చిప్పను చూసి వెండి అనుకోడం – అలాగే త్రాడును చూసి సర్పం అనుకోడం – ఇలాటి వన్నీ మిథ్య క్రిందకే వస్తాయి. వెండి అనుకోడానికి 'ముత్యపుచిప్ప' అధిష్ఠాన కారణం అవుతుంది. అలాగే, పాము అనుకోడానికి 'త్రాడు' అధిష్ఠాన కారణం అవుతుంది. అలాగే, లేనిది ఏదో ఉన్నట్టు అనిపించే సర్వజగత్తుకు అమ్మవారు అధిష్ఠాన కారణం ఔతుంది. ఇటువంటి అధిష్ఠాన కారణాన్ని సూచించే నామమే ప్రస్తుతనామం.

'మిథ్య' అనేది తప్పు (False) కాదు. అది కేవలం కట్టుబాటు చేయబడిన – అంటే కొన్ని నియమ నిబంధనలకు లొంగుబాటు చేయబడిన సత్యం – (Conditioned Truth) భగవంతుడు ప్రసరింపచేసింది 'మాయ' అయితే, మానవుడు కల్పించుకున్నది 'మిథ్య'. దేనివలన మోహం పుడుతుందో అక్కడ 'మిథ్య' ఉంటుంది. సగటు మనిషికి మిథ్య లేందే బ్రతుకు లేదు. ఎందుకంటే 'మోహం' లేకుండా ఉండలేడు కాబట్టి – అయితే –

'మాయవల్ల భగవంతుడు దూరమైనట్టు కనబడతాడనుకోడం తప్పు, భగవంతుడు దూరమవడం వల్లనే మాయ వర్తిస్తుంది. (It is not Maya that creates the apparent absence of God, It is God's absence that creates Maya)

'అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత
అవ్యక్తనిధ నాన్యేవ తత్రకాపరిదేవనా'. (2-28 గీత)

(ప్రాణి కోట్లన్ని పుట్టడానికి పూర్వం కనబడవు. పుట్టిన తర్వాత (దేహంతో) కనబడతాయి. మళ్ళీ మరణించిన తర్వాత కనబడవు. అట్టి వానికై శోకించడం దేనికి – అని ఈ శ్లోకార్థం.)

సృష్టిలో జీవులు ఇలా శరీరంలో ఉన్నట్లు కనబడటమే మిథ్య. ఈ మిథ్యకు కారణం అమ్మవారు. ఈ జగత్తులోకి అమ్మవారు – ఆకార, పరిమాణ, నామ రూపాదులుగా దిగివస్తూ ఈ మిథ్యా జగత్తును అధివసించి ఉంటుంది. వీటన్నిటిలోను చివరకు మిగిలేది ఏ ఒక్కటి అయితే ఉందో అది 'సత్యం'. ఆ సత్యమే అయ్యవారు (Absolute)

మిథ్యా భూతమైన జగత్తుకు అధిష్ఠాన కారణము – అని ఈ నామానికి అర్థం.

## 736. ముక్తిదా

మూడు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ముక్తిదాయైనమః' అని చెప్పాలి.

ముక్తి = మోక్షమును, దా = ఇచ్చునది.

ఇచ్చేవాడు, పుచ్చుకునేవాడు, ఇవ్వబడేది – ఈ మూడూ ఒకటి అయితే అది 'ముక్తి' అవుతుంది. లేకపోతే అది ముక్తికాదు, విభక్తమౌతుంది. శివస్వరూపులైన జీవులందరికీ ఒకళ్ళు కొకళ్ళు పార్వతుల్లాగా (అమ్మవారి లాగా) కనబడితే ఆ స్థితిని పరాకాష్ఠ భక్తి అంటారు. ఈ భక్తి కలవారికి అమ్మవారు ముక్తినిస్తుంది. (రాసలీలలో కూడా ఇంతే! అక్కడ వాస్తవానికి కృష్ణుడు వుండడు, ప్రతి గోపికకు ఎదురుగా ఉండే గోపిక కృష్ణుడుగా కనిపిస్తుంది. ఆ స్థితికి ఎదిగిన భక్తి ఆ గోపికలది. అందుకే నారద భక్తి సూత్రాల్లో – భక్తికి ప్రమాణంగా 'యథా వ్రజగోపికానాం' అన్నారు. ఇటువంటి వ్రజ గోపికల భక్తి కూడా ముక్తినిస్తుంది.)

బ్రహ్మ పురాణంలో – అమ్మవారి ఈ 'ముక్తిదా' నామార్థ నిర్ధారణకు ఈ క్రింది శ్లోకం ఉంది.

యేర్చయంతి పరాంశక్తిం విధినాఽవిధినా పివా
నతౌ సంసారిణోమానం ముక్తా ఏవన సంశయః-

విధిపూర్వకంగా అయినా సరే, అలా కాక పోయినా సరే, అమ్మవారిని ఆరాధించిన వారు ముక్తులే! సంసార బంధ విముక్తులే – అని ఈశ్లోకార్థం.

'ముక్తిని ఇచ్చునది' అని ఈనామానికి అర్థం.

## 737. ముక్తిరూపిణీ

ఐదు అక్షరాల నామం. ఈనామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'ముక్తిరూపిణ్యైనమః' అని చెప్పాలి.

ముక్తి = మోక్షమును, రూపిణీ = రూపముగా గలది.

అమ్మవారు కేవలం ముక్తిని ఇచ్చేది మాత్రమే కాదు. ఆ ముక్తి స్వరూపం కూడా అమ్మవారే!

స్వస్వరూప జ్ఞానం ఎవరికైతే ఉంటుందో వారు ముక్తి స్థితిలో ఉన్నట్లే! జ్ఞానంతో గాని ఇది సిద్ధించదు. అజ్ఞానం చేత కల్పించుకున్న మిథ్యా జగత్ప్రభావం వలన ఈ జ్ఞానం మనలో కప్పబడి ఉంటుంది. ఎప్పుడైతే ఈ అజ్ఞానం తొలగుతుందో అప్పుడు స్వస్వరూప జ్ఞానం భాసిల్లి, ముక్తి వస్తుంది. అజ్ఞానాన్ని తొలగించేది జ్ఞానమే'! ఆ జ్ఞానస్వరూపిణి అమ్మవారే కాబట్టి అమ్మవారు ముక్తిరూపిణి.

ముక్తిని రూపముగా దాల్చిన జ్ఞానస్వరూపిణి – అని ఈనామానికి అర్థం.

## 738. లాస్యప్రియా

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'లాస్యప్రియాయైనమః' అని చెప్పాలి.

లాస్య = లాస్యమునందు, ప్రియా = ప్రీతి కలది.

అమ్మవారు చేసేనృత్యాన్ని – లాస్యమని, అయ్యవారు (శివుడు) చేసేది – తాండవమనీ అంటారు. దీనికి తగ్గట్టుగా ఆడవాళ్ళు లాస్యాన్ని, మొగవారు తాండవాన్ని చేస్తే సముచితంగా (fitting) ఉంటుంది. ఆడవాళ్ళు తాండవం చేసినా, మొగవాళ్ళు లాస్యం చేసినా ఎబ్బెట్టుగానే ఉంటుంది. రాణింపు ఉండదు.

పై నుండి చూసే అమ్మవారికి ప్రపంచమంతా 'లాస్యం' గా కనబడుతుంది. తన ప్రపంచ మంటే తనకిష్టం కాబట్టి అమ్మవారు – 'లాస్యప్రియా!' ప్రపంచం లోని అన్నిరకాల వైవిధ్యాలు, వైరుధ్యాలు, 'సామ్యాలు, సమన్వయాలు, అభినయాలు, అభినందనలు,

ఋతువులు, ఋతుధర్మాలు గ్రహాలు గ్రహలక్షణాలు ఇవన్నీ అంజన దృష్టితో చూసే వారికి 'ఆనందలాస్యంగా కనపడక పోవచ్చు గాని - నిరంజన దృష్టికి ఇవి అన్నీ - 'ఆనందహేల' గానే కనబడతాయి.

జీవితం సంగీతం అయిన వారికి జగత్తులోని చైతన్యమంతా లాస్యంగానే భాసిస్తుంది. ఈ లాస్యం అన్నా, లాస్యంగా జగచ్చైతన్యాన్ని భావించే వారన్నా - అమ్మవారికి ఇష్టం.

పరమేశ్వరుని ప్రళయ తాండవానికి అమ్మవారి 'లాస్యం' అనే మలుపు లేకపోతే సృష్టికి నాంది ఏర్పడదు. అందుకే - 'ప్రపంచ సృష్ట్యున్ముఖ లాస్యకాయై, సమస్త సంహారక తాండవాయ' అని - అమ్మవారిని అయ్యవారిని కలిపి అర్ధనారీశ్వర స్తోత్రములో' - ఆదిశంకరులు అన్నారు -

లాస్యమునందు ప్రీతి కలది - అని ఈనామానికి అర్థం.

## 739. లయకరీ

నాలుగు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'లయకర్యైనమః' అని చెప్పాలి.

లయ = లీనము, కరీ = చేసుకొనునది.

'లయ' మన్నా 'లయకారు' డన్నా - 'చావు', 'చంపేవాడు' అని గాని 'వినాశము' - 'వినాశకారుడు' అని గాని సాధారణంగా అనుకుంటారు. 'లయము' అంటే 'లీనము' అని - లయమవడం అంటే 'లీనమవడం' అని 'ప్రళయం' అంటే చక్కగా లీనమైన స్థితి అనీ అర్థం చెప్పుకోవాలి.

జీవేశ్వర సర్వేశ్వర ఐక్యస్థితిని 'లయం' అంటారు. సమస్త సృష్టి- పరమేశ్వరునిలో లీనమై ఉండే స్థితిని ప్రళయమంటారు. ఈ స్థితి శలవుల్లో ఉండే కళాశాల(College) లాంటిది. లవణాలన్నీ కరిగి ఉన్న నీళ్ళస్థితి లాంటిది ఈ లయస్థితి. ఈ స్థితిలో ఆ లవణాలన్నీ చచ్చిపోవు. నీళ్ళలో చక్కగా లీనమై ఉంటాయి. ఆ నీళ్ళు ఆ లవణాలకు ఏమీ హాని జరగకుండా చక్కగా కాపాడుతూ తనలో ఉంచుతుంది. అలాగే, అమ్మవారు

కూడా ఈ లయాన్ని అన్ని స్థాయిల్లోను వర్తింపచేస్తుంది. ఉదా: నిద్రపోయినా అలాగే నిద్రలోనే ఉండిపోయేట్టుగా కాకుండా మళ్ళీ మెలకువ తెప్పిస్తుంది. అలసట వచ్చినపుడు నిద్రలో లీనం అయేట్లు చేస్తుంది. కల్పాలకు కూడా ఇదే లక్షణాన్ని వర్తింపచేస్తుంది.

లీనము చేయునది లేదా - చేసుకొనునది - అని ఈ నామానికి అర్థం.

## 740. లజ్జా

రెండు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'లజ్జాయైనమః' అని చెప్పాలి.

లజ్జా = నిరహంకార వినమ్రలక్షణము.

ఇంత సృష్టిచేసినా అమ్మవారికి ఏ మాత్రం అహంకారం లేదు. ఏదైనా గొప్ప పనిచేసినపుడు గాని, చేయించినపుడు కాని అహంకారం పడడం కాని గర్వపడటం గాని సాధారణంగా మనంచూస్తాం. దానికి విరుద్ధ లక్షణమే వినయం - వినమ్రం. ఈ వినయ లక్షణాన్ని తెలియపరిచే వాటిలో 'లజ్జ' ఒకటి. ఎంత గొప్పపని, పెద్ద పనిచేసినా ఇంతే చెయ్యగలిగాను అని బిడియపడటం 'లజ్జా' లక్షణం క్రిందకు వస్తుంది.

కులస్త్రీలకు 'లజ్జ' అలంకారం. స్త్రీలకు సిగ్గేసింగారం - అని కూడా అంటారు.

'సలజ్జాగణికానష్టా నిర్లజ్జాచకులాంగనా' అన్నారు.

అంటే - 'సిగ్గుపడి తేవేశ్యనష్టపోతుంది. సిగ్గుపడకపోతే కులాంగన నష్టపోతుంది' - అని దీని అర్థం.

సిగ్గుపడటం - ఒక సుకుమారమైన, ముగ్ధత్వ లక్షణం. మొగవారు మోటుగా ఉన్నా ఫరావలేదు కాని, ఆడవారు మోటుగా ఉంటే బాగుండదు. స్నిగ్ధత్వం, ముగ్ధత్వం కలిసిన లాలిత్యం ఉంటే - దానికి లజ్జా లక్షణం అప్రయత్నంగా తోడవుతుంది.

స్త్రీలలో ఈ లజ్జా లక్షణంగా అమ్మవారు ఉంటుంది.

1) లజ్జా లక్షణము కలది.

2) (స్త్రీలలో) లజ్జారూపముగా ఉండునది - అని ఈ నామానికి అర్థాలు.

## 741. రంభాదివందితా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రంభాదివందితాయైనమః' అని చెప్పాలి.

రంభ = రంభ మొదలైన అప్సర స్త్రీలచేత, వందితా = పూజింపబడునది.

రంభ, ఊర్వశి, తిలోత్తమ, మేనక మొదలైన వాళ్ళందరినీ అప్సర స్త్రీలు అంటారు. వీళ్ళు సంగీతంలోను, నృత్యంలోను బాగా ప్రసిద్ధులు. వీరు లేకపోతే ఇంద్రుని సభకు శోభే లేదు. దేవేంద్రాదులందరినీ వీరు తమ గానాలతో, నృత్యాలతో వినోదింపచేసి, ఆనందింపచేస్తారు. వీరిని 'దేవవిలాసినులు' అని, 'దేవవేశ్య' లనీ అంటారు. వీరందరిచేత అమ్మవారు సేవించబడుతుంది.

మంత్రశాస్త్రంలో అప్సర స్త్రీలంటే అనునాసికాక్షరాలు. ఙ, ఞ, ణ, న, మ, - ఈ ఐదు అక్షరాలను 'అనునాసికా' లంటారు. వీటిని ముక్కు సహకారంతో పలకాలి. అందుకని వీటిని అనునాసికాలన్నారు. సంగీతంలో గాని, మాట్లాడేటప్పుడు గాని ఈ అనునాసికాల ప్రమేయం లేకపోతే ఆ సంగీతం శ్రావ్యంగా ముందుకు సాగదు. ఆ మాటలు చెవులకు ఇంపుగాను, సొంపుగాను ఉండవు. బాగా జలుబు చేసి ముక్కుపట్టేసినపుడు ఈ సంగతి బాగా తెలుస్తుంది. ఈ 'అనునాసికాక్షరాలు - అనే అప్సర స్త్రీల చేత చక్కగా ఆరాధింపబడే వాగ్దేవీ స్వరూపిణి ! అని ఈ నామానికి ఒక అర్థం.

అమ్మవారు సంగీత ప్రియ, సామగాన ప్రియ. అందుకని అమ్మవారి దగ్గర సామవేద గానాలను, శ్రవణ పేయమైన సంగీత కచ్చేరీలను, నయనానందకరమైన నృత్యాలను చేసి, అమ్మవారిని మెప్పించి ఈ అప్సర స్త్రీలు ఆమె అనుగ్రహ పాత్రులౌతారు. అందుకని అమ్మవారు 'రంభాదివందితా'.

1) రంభా మొదలైన అప్సర స్త్రీలచే పూజింపబడునది.

2) అనునాసికాక్షర అప్సరలచే ఆరాధింపబడు వాగ్దేవీ స్వరూపిణి - అని ఈ నామానికి అర్థం.

## 742. భవదావసుధావృష్టిః

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'భవదావసుధావృష్ట్యై నమః' అని చెప్పాలి.

భవ = సంసారము అను, దావ = అరణ్యాగ్నికి, సుధా = అమృత వృష్టిః = వర్షము వంటిది.

ఈ నామం నుండి కొన్ని ఫలశ్రుతి నామాలు చెప్పబడతాయి.

'భవ' అంటే సంసార సంబంధమైన అని అర్థం కాని – 'సంసారం' అని అర్థం కాదు. సంసార సంబంధమైన అంటే వెంటనే – భార్యా, పిల్లలు; తిండి – తిప్పలు; కొట్లాటలు – పోట్లాటలు,; అప్పులు, గొప్పలు; రోగాలు – రొచ్చులు; – ఇవే గుర్తువచ్చే వారిని సంసార జీవులంటారు. ఈ నామం ఇటువంటి సంసార జీవుల నుద్దేశించి వ్రాసినదే కాని – సంసారం సుఖంగా 'హాయిగా స్వర్గతుల్యంగా చేసుకునేవారిని ఉద్దేశించి కాదు. భార్యా పిల్లలను గురించి మనం ఏమనుకుంటున్నామో – అది నిజమైన అర్థంలో సంసారం గాని, భార్యా పిల్లలు వగైరా – సంసారం కాదు. అన్ని రకాల ఇబ్బందులు పడుతూ సంసారంచేసే వారికి కూడా అమ్మవారు ఒక పరిష్కారం చూపించకలదు. రోగాలే కాదు – భవరోగాలకు కూడా పరిష్కారం చూపకలదు – అని ఈ నామం తెలుపుతుంది. 'ఎంత అన్నం పెట్టేస్తే భార్యా పిల్లలు ఇక అన్నం అడగరు'? అనే భావంలో ఉండేవారు కూడా ఈ సంసార జీవుల్లో ఉంటారు. అయితే – 'మనలోని చెడ్డలు సర్దుకోడం దేనికి ?' అన్నవాడికి తప్ప – మిగిలిన అందరికీ అమ్మవారి కరుణా కటాక్షం దక్కుతుంది. పండుటాకులు రాలుతూ ఎండి పోయిన చెట్లు ఉన్న అడవి అయినా వర్షం కురిస్తే ఎలా సస్య శ్యామలంగా తయారవుతుందో, అలాగే – అమ్మవారు తన కరుణార్ద్ర దృక్కులు వర్షింపచేస్తే సంసార జీవుల భవదావానలాలు నిశ్శేషంగా ఆరిపోవడమే కాదు – ఆ సంసారాలు అన్ని విధాలా చక్కబడి, నిత్యకళ్యాణం పచ్చతోరణంలా ఉంటాయి.

'మనలో ప్రజ్ఞ ఉందన్నంత కాలం కొట్టుకోడమే మిగుల్తుంది – ప్రజ్ఞలో మనం ఉంటున్నామని తెలిస్తే సహకార భావం, సహజీవన భావం వచ్చి జీవన భావం తేలికౌతుంది.

అమ్మవారు మనలో ఈ భావం కలిగేలా జ్ఞానాన్ని అనుగ్రహించి, భవదావనలాలకు పరిష్కారం మనంతకు మనమే ఏర్పాటు చేసుకునే విధంగా చేస్తుంది. అప్పుడు మన సంసారాగ్నులకు అమృత వర్షం కురిసి శీతలోపచారం జరిగినట్లవుతుంది. అందుకని అమ్మవారు 'భవదావసుధావృష్టిః'

సంసారమనే అరణ్యాగ్నులకు అమృతవర్షము వంటిది - అని ఈ నామానికి అర్థం చెప్పవచ్చును.

## 743. పాపారణ్యదవానలా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'పాపారణ్యదవానలాయైనమః' అని చెప్పాలి.

పాప = పాపము అనెడి, అరణ్య = అరణ్యమునకు, దవానలా = కారుచిచ్చు వంటిది.

ఎవరైనా పాపాలమీద పాపాలు గుట్టలు గుట్టలుగా చేసి వాటి మధ్యలో సతమతమౌతూ, తెములుచ్చుకుని బయటపడలేక, అష్టకష్టాలు పడుతూ ఉంటే - అల్లాంటి వారిని, వారి పాపాలను - 'ఒకదానితో ఒకటి పెనవేసుకుపోయి, గుబరుగా, వత్తుగా, గుంపులు గుంపులుగా ఉండే మహావృక్షాలతో చీమలు దూరలేని, కాకులు వ్రాలని - అరణ్యంతో' పోల్చవచ్చు. ఇలాంటి పాపారణ్యాన్ని దహించివేసి, వారిని విముక్తులను చెయ్యడంలో అమ్మవారు కార్చిచ్చులాంటిది. ఒక్కసారి ఈ కార్చిచ్చు అంటుకుంటే అరణ్యాన్ని అంతా నిశ్శేషంగా, సమూలంగా నిర్మూలిస్తుంది. ఇటువంటి వారి పట్ల అమ్మవారి అనుగ్రహం ఉంటే - పాపి ఉండి, పాపాలు మాడిపోతాయి, లేకపోతే పాపితో సహా మాడిపోతాయి. అయితే - ప్రలోభం వల్ల పాపం జరిగితే అమ్మవారు రక్షించి శిక్షణ ఇస్తుంది. ప్రయత్నం వల్ల పాపం జరిగితే అమ్మవారు శిక్షించి రక్షిస్తుంది.

పాపాలు అనే అరణ్యాలకి కారుచిచ్చు లాంటిది - అని ఈ నామానికి అర్థం.

## 744. దౌర్భాగ్యతూలవాతూలా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'దౌర్భాగ్య తూలవాతూలాయైనమః' అని చెప్పాలి.

దౌర్భాగ్య = దౌర్భాగ్యమనెడి, తూల = దూది రాశికి, వాతూలా = గాలి దుమారం లాంటిది.

దౌర్భాగ్యమనేది ఆధ్యాత్మిక కేన్సర్ వ్యాధి లాంటిది. ఇలాంటి కేన్సర్ కేసులు రెంటిని నయం చేస్తే చాలు – వెయ్యి టైఫాయిడ్ కేసులు నయం చెయ్యడం కంటె. దౌర్భాగ్యాలు దురదృష్టం వల్ల వస్తాయి. వాతూలుడంటే – వాయుదేవుడు. ఈ వాయుదేవుడు – మహాపర్వతాలను కూడా పెళ్లగించి ఎగిరిపోయేట్టు చేయకలడు. దౌర్భాగ్యాల పట్ల అమ్మవారు ఇలాంటి వాయుదేవుని విజృంభణ లాంటిది. అమ్మవారి అనుగ్రహం పొందిన వారికి ఎటువంటి దౌర్భాగ్యాలైనా మటుమాయమై పోయి, సౌభాగ్యవంతులౌతారు. ముఖ్యంగా దౌర్భాగ్యాలు ఎనిమిది ఉంటాయి. ఆ అష్టదౌర్భాగ్యాలు అనుబంధంలో ఇవ్వబడ్డాయి.

దౌర్భాగ్యాలనే దూది పింజలరాశికి గాలి దుమారం వంటిది – అని ఈ నామానికి అర్థం.

## 745. జరాధ్వాంతరవిప్రభా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'జరాధ్వాంతరవి ప్రభాయైనమః' అని చెప్పాలి.

జరా = ముసలితనమనెడి, ధ్వాంత = చీకటికి, రవిప్రభా = సూర్య కిరణపుంజము వంటిది

ముసలితనం వస్తే జ్ఞానేంద్రియాలు పనిచెయ్యడం తగ్గుతుంది. ఉదా: ముసలితనం వస్తే 5 గంటలకే చీకటి పట్టినట్లుంటుంది. అలాగే, ఇతరమైన జ్ఞానేంద్రియ విషయాలు కూడా! ఈ జ్ఞానేంద్రియాలు పనిచెయ్యకపోవడంతో వారికి జీవితం అంధకార ప్రాయంగా

ఉంటుంది. అటువంటి అంధకారానికి అమ్మవారు మధ్యందినమార్తాండుని మహోజ్జ్వల మయూఖపుంజం లాంటిది.

మనం కల్పించుకున్నటువంటి చీకట్లనుండి విముక్తుల్ని చేసి, అంతకు పూర్వం నుండి ఉన్న వెలుగులందు మనల్ని జీవింపచేస్తుంది అమ్మవారు. ఈ వెలుగులలో కూడా వివిధరకాలైనవి ఉన్నాయి.

1) సాధారణమైన వెలుగు(Optical light) 2) మానసికమైన వెలుగు(Mental light) 3) సృజనాత్మకమైన వెలుగు 4) 'నేను' - 'వెలుగు'('I am' - light) అంటే 'ఆత్మ'.

1) భౌతికమైన వస్తువులు మనం కంటితో చూడగలగడం సాధారణ వెలుగుకు సంబంధించినది. 2) ఒక విషయం అర్థం అవుతున్నపుడు మన బుద్ధి వికసించడం 'మానసికమైన వెలుగు' క్రిందకు వస్తుంది. 3) పరిశోధనలో ఒక క్రొత్త విషయాన్ని కనుగొనడం - సృజనాత్మక మైన వెలుగు క్రిందకు వస్తుంది. ఇవన్నీ మన దేహంలోని దేనివల్ల అయితే జరుగుతున్నాయో అది - 'నేనుకు, అంటే - ఆత్మకు సంబంధించిన - వెలుగు క్రిందకు వస్తుంది.

ఈ నాలుగు విధాలైన వెలుగులను మనలో ఉద్బుద్ధం చేసి మనలోని అన్నిరకాలైన చీకట్లను పొగొడుతుంది అమ్మవారు.

ఎదుటివాణ్ణి చూసి నీలో లోపం ఉంది అంటే - వాడు గూడా మనలను చూసి అలాగే అంటాడు కాబట్టి - మనం మూడవ వాడి గురించే ఎదుటి వాడికి చెప్తాము. అప్పుడు ఆ ఎదుటివాడు మనల్ని గురించి మనకు చెప్పకుండా ఆ మూడోవాడికి చెప్తాడు. ఆ మూడోవాడు మనల్ని కలిసినపుడు పూర్వం మన ఎదురుగా ఉన్న వాణ్ణి గురించి మనకు చెబుతాడు. ఒకరి పట్ల ఒకరికి మనలో ఉండే చీకటి భావాలను ఇలా ఒకరికి ఒకరు సూటిగా తెలియపరచుకోకుండా మూడోవాడికి చెప్పుకుంటాం. మనందరిలోని ఈ విధమైన చీకటి బుద్ధుల్ని అమ్మవారు మటుమాయం చెయ్యడంలో మంచి ప్రావీణ్యురాలు. చిన్నతనంలో మనకు ఎవరియందు, ఏ విధమైన చీకటి భావమూ ఉండదు. పెద్ద అయిన కొద్దీ అభిప్రాయాలను పెంచుకోవడంతో ఈ చీకటి పెరుగుతుంది. (We are donkeys carrying thousand opinions and impressions about others) వయస్సు వస్తున్న

కొద్దీ – మనలో పెరిగే ఈ చీకట్లను కూడా జ్ఞాన ప్రకాశిని అయిన అమ్మవారు తొలగిస్తుంది – అని ఈ నామానికి అర్థం చెప్పుకోవాలి.

1) ముసలి తనంలో జీవితం అంధకార ప్రాయంగా తోచే జీవులకు అన్ని విధాలా ఆసరాగా ఉంటూ, ఆదుకునే జ్ఞాన ప్రకాశ స్వరూపిణి.

2) కలగకూడని, అనవసరమైన అజ్ఞాన భావాంధకారాలకు – సుజ్ఞాన సూర్యప్రభ అమ్మవారు – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 746. భాగ్యాబ్ధిచంద్రికా

ఆరు అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'భాగ్యాబ్ధి చంద్రికాయైనమః' అని చెప్పాలి.

భాగ్య = సంపద అనెడి, అబ్ధి = సముద్రానికి, చంద్రికా = వెన్నెల వంటిది.

సముద్రానికి ఆనందాన్నిచ్చి, ఉప్పొంగేలా చెయ్యటంలో పర్వదినాల్లోని చంద్రుని వెన్నెల ఎలాంటిదో – భక్తులకు సంపదలిచ్చి, ఆనంద పరచడంలో అమ్మవారు అలాంటిది. ప్రవర్తన తిన్నగా ఉంటే అమ్మవారు తన భక్తులకు అన్ని సంపదలూ ప్రసాదించి, వారిని ఎప్పుడూ ఆనందంగా ఉంచుతుంది.

'(భక్తులకు) సంపదలివ్వడంలో – సముద్రునికి (చంద్రుని) వెన్నెల వంటిది – అని ఈ నామానికి అర్థం.

## 747. భక్తచిత్త కేకిఘనాఘనా

పది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'భక్తచిత్తకేకిఘనాఘనాయైనమః' అని చెప్పాలి.

భక్త = భక్తులయొక్క, చిత్త = చిత్తములనెడి, కేకి = నెమళ్ళకు, ఘనాఘనా = దట్టమైన నల్లని మేఘము వంటిది.

నెమళ్ళు నీలి మేఘాలను చూడంగానే పురివిప్పి ఆనంద నృత్యం చేస్తాయి. అలాగే

భక్తులకు అమ్మవారి గురించి భక్తి భావాలు కలగగానే వారి చిత్తాలన్నీ ఆనంద తరంగిత హృదయాలవుతాయి.

భక్తుల చిత్తాలకు నెమలి పింఛం రంగుల్లోని సంశ్లేషణాత్మక ఐక్యత(Synthetic Unity)ను ఉపమానంగా చెప్పడం ఔచిత్యాన్నత్యాన్ని సూచిస్తుంది.

నెమలి పింఛంలో ఎన్ని రకాల రంగులు ఒక దానిలో ఒకటి మిళితమై ఉండి, ఏ రెండు రంగులకూ మధ్య ఉండే హద్దు తెలియని సమన్వయ సంశ్లేషణ ఉంటుంది. అలాగే భక్తుల చిత్తాల్లో భక్తి భావనలు ఎన్నో రకాలుగా ఉన్నా, వాటన్నిటి సమన్వయ స్వరూపిణి అమ్మవారే ! అలాగే, ప్రపంచంలోని మాయ, మిథ్య, మోహం ఇత్యాది లక్షణాలన్నిటినీ భక్తుల చేత సమన్వయాత్మక దృష్టితో పరిశీలింప చేస్తుంది అమ్మవారు' అని కూడా ఈ నామానికి అర్థం చెప్పవచ్చును.

1) భక్తుల చిత్తాలనే నెమళ్ళకు – దట్టమైన నల్లని మేఘముల వంటిది ( భక్త చిత్త భక్తి ప్రవృత్తుల సమన్వయ సచ్చిదానంద స్వరూపిణి)

2) విశ్లేషణాత్మక సృష్టి పట్ల సంశ్లేషణాత్మక దృష్టిని ప్రసాదించునది – అని ఈ నామానికి అర్థాలు చెప్పవచ్చును.

## 748. రోగపర్వతదంభోళిః

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'రోగపర్వత దంభోళ్యై నమః' అని చెప్పాలి.

రోగ = రోగము అను, పర్వత = పర్వతమునకు, దంభోళిః = వజ్రాయుధం వంటిది.

ఇంద్రుని ఆయుధం పేరు 'వజ్రం'. దీనినే పిడుగు'గా అని కూడా చెబుతారు. (పూర్వం పర్వతాలకు రెక్కలుండేవని, ఆ రెక్కలను ఇంద్రుడు తన వజ్రాయుధంతో నరికేశాడనీ పురాణ కథ ఉంది). వజ్రాయుధంతో ఎంత పెద్ద కొండ అయినా బ్రద్దలౌతుంది. ఈ ఇంద్రుని వజ్రాయుధాన్ని విజ్ఞాన శాస్త్ర పరిభాషలో 'అత్యధిక

విద్యుదుత్సర్గం (Heavy electrical Discharge) అంటారు. తైత్తిరీయం కూడా 'అప స్సంధిః వైద్యుతస్సంధానమ్' అని చెబుతుంది. ఈ విద్యుత్తులో అంతకు పూర్వపునిద్ర స్థితి నుండి మేల్కాంచడం జరుగుతుంది. మొదట భూమ్మీద మేల్కాంచడంలో ముందుగా పర్వతాలు వస్తాయి. ఇలా 'భూమ్మీద' పర్వతాలు ఏర్పడటం', అంటే – మొట్టమొదట అణువులన్నీ కలసి – 'రాయి' – లేదా 'బండ' లాగా తయారవడం అని అర్థం. 'మొట్టమొదట ఆ కొండలు బద్ధలై పైకెగిరి ముక్కలు ప్రక్కన పడటాన్నే' ఇంద్రుడు పర్వతాల రెక్కలు విరగొట్టడంగా కథగా చెబుతారు. 'గిరులు' వేరు. 'పర్వతాలు' వేరు. అందుకే – 'గిరవశ్చమే, పర్వతాశమే' అని రుద్ర చమకంలో చెప్పబడింది. 'గిరి' అంటే మనం సాధారణంగా చూచే కొండ. 'పర్వతం' అంటే ఇతర గ్రహాలతో సంబంధమున్నచోట్లు. (సప్తకుల పర్వతాలు) వీటినే ఆంగ్లంలో Nodal Points' అంటారు. ఖగోళశాస్త్రంలో 'పర్వము' అంటే 'అక్షాంశము'(Latitude) అని అర్థం. ('పార్వతీ' నామ వివరణ కూడా ఇక్కడ చదువుకోవాలి).

'బాధ' – నిజానికి భౌతికంగా కాదు – మానసికమే! ఎంత బాధ అయినా అతి ముఖ్యమైన పనిలోనిమగ్నమై ఉన్నపుడు ఈ బాధ సంగతి గుర్తు రాదు. – 'బాధ భౌతికం కాదు' అన్న దానికి నిదర్శనం – ఇదే! ఇటువంటి మానసికమైన వాటినే 'భవరోగాలు' అంటారు. 'డబ్బులు ఎలావచ్చాయో తెలియకపోతే వెంకటేశ్వరస్వామి హుండీలో వెయ్యమన్నట్లు – ఈ భవరోగాల్ని తొలగించే మార్గం అమ్మవారు చూడకలదు. పైన చెప్పిన దాని సారాంశం అంతా ఒక్కటే! అమ్మవారు 'భవరోగ భేషజం' అని

రోగములనే పర్వతాలకు వజ్రాయుధం వంటిది – అని ఈ నామానికి అర్థం చెప్పవచ్చును.

## 749. మృత్యుదారుకుఠారికా

ఎనిమిది అక్షరాల నామం. ఈ నామంతో అమ్మవారికి నమస్కరించేటప్పుడు 'మృత్యుదారుకుఠారికాయైనమః' అని చెప్పాలి.

మృత్యు = మృత్యువు అను, దారు = మ్రానుకు (Trunk), కుఠారికా = గండ్రగొడ్డలి వంటిది.

మృత్యువు యొక్క నిర్వచనం తిన్నగా అర్థం చేసుకోవాలి. 'మృత్యువు' అనగా 'చావడం' అనే అర్థం చెప్పుకుంటే – తప్పుడు అర్థం వస్తుంది. అప్పుడు ఎన్నిసార్లు ఈ 'మృత్యుదారు కుఠారికా' అన్న నామాన్ని అమ్మవారికి వినబడేట్లు బాగా గట్టిగా చెప్పుకున్నా ఆ చెప్పిన వాడు చావకుండా ఉండడు.

పోకుండా జాగ్రత్తగా ఉండేవాడు మొనగాడు కానీ – పోతే బిడ్డు లాగా ఏడ్చేవాడు 'అవివేకి' అవుతాడు. ఇక్కడ పోవడమంటే – ఆ పోయేది వస్తువైనా సరే, తనైనా సరే !

'రోగం' తర్వాత ఉండేది 'మృత్యువు' అని కూడా గుర్తుంటే ఈ 748, 749 నామాల వరుసకు ఔచిత్యం ఉందని తెలుస్తుంది. దేనిని గురించి అయినా – ఏమవుతుందోనని గిలగిలలాడటం – అన్నది నిజమైన మృత్యువు. అంటే - fear of Death is real Death)మృత్యు భీతి' అనేదాన్ని మృత్యువుగా సాధారణంగా వాడుతూ ఉంటాము. ఈ నామంలోని 'మృత్యువు' పదం కూడా – 'మృత్యుభీతి' అనే అర్థంలోనే వాడబడింది.

(దేహంలోంచి బయట పడడాన్ని 'మృత్యువు' అని భయపడేవారికి ఒక్క విషయం చెప్పవచ్చు. 'అసలు మనం ఉంటున్న ఈ దేహం ఆ యముడి ఇల్లే ! మనం ఆ ఇంట్లో గతిలేక ఉంటున్నాం. ఆ ఇంట్లో ఉండటానికి భయపడాలి గాని బయటపడటానికి భయందేనికి ?'' అన్నాడు మామూలుగా కనబడే ఒక మహానుభావుడు)

గిలగిలలాడే మృత్యుభీతికి గొడ్డలిపెట్టు' వంటిది – అని ఈ నామానికి అర్థం.

సకల మహా జగద్వ్యూహానికి తనకు గల సంబంధాన్ని బంధం లాగా చేసుకోవడాన్ని 'మృత్యువు' అనవచ్చును.

చెట్టు పెరుగుతున్న కొద్దీ చెట్టులోని అసలు తత్త్వం – పైన ఉన్న కాయలకు, పండ్లకు, విత్తానాల్లోకి వెళ్తు ంది గాని – లావు అవుతూ పెరుగుతున్న మ్రానులోకి కాదు. అంటే చెట్టులోని ఈ మ్రానుభాగం మృత్యువుతో సమానమన్నమాట ! మాను

ప్రతి సంవత్సరం పై పొరలు వేసుకుంటూ లావవడాన్ని Secondary thickening అంటారు. ఈ మ్రాను వాస్తవానికి వృక్ష అంశం పెరగాడానికి దోహదపడుతుంది గాని, వృక్ష వంశం పెరగడానికి తోడ్పడుదు. ఇది మన కుర్చీలకు, బల్లలకు, తలుపులకు ఉపయోగపడేది మాత్రమే అయితే, ఇది 'ఒకరి కోసం ఇంకొకరు' అనే సూత్రానికి (Principle)కి సంబంధించడానికి ఉదాహరణగా చెప్పుకోడానికి మాత్రం పనికి వస్తుంది.

''మానవులుగా ఈ మృత్యువు యొక్క అసలైన నిర్వచనాన్ని చెప్పుకోకుండా, దాన్ని గురించిన అవగాహన కలగకుండా 'మానవుల'మని చెప్పుకోడం అంత సమంజసం కాదు అనిపిస్తుంది. (It is something awful to say that we are human beings until we transcend these Limitations and Bondages) దిలీప్‌కుమార్‌రే 'మృత్యువు అంటే ఏమిటి, ఎలా ఉంటుంది ?' అని అడిగితే – 'చావకమునుపు ఆ చావు అంటే మన మనస్సులో కలిగే, చెప్పుకునే అభిప్రాయాల సముదాయాన్నే 'మృత్యువు' అంటారు అన్నాడు రవీంద్రనాథ్ ఠాగూర్.)

యముడు మృత్యు దేవతకు సలహాఇచ్చాడుట – 'నువ్వు మానవ జాతి మనస్సులో చోటుచేసుకుని ఉండు' – అని (అన్ని జాతులవారి లోను, మానవునికి ఒక్కనికే ఈ మృత్యువు గుఱించి భయం' – అని ఈ వాక్యానికి అర్థం). మృత్యుదేవత అప్పుడు యముడితో, – అయితే – 'చోటు చేసుకోడం ఎలా ?' అని అడిగితే – 'మృత్యువును గురించిన అభిప్రాయాల్లోనువ్వుంటే – చోటుచేసుకోడం అదేవీలవుతుంది' – అన్నాడుట యముడు.

'మృత్యువు పై మనకు ఉండే అభిప్రాయము అనే మ్రానుకు గండ్రగొడ్డలి వంటిది' – అని ఈ నామానికి అర్థం.

'భవదావ సుధావృష్టి', 'పాపారణ్యదవానలా', 'దౌర్భాగ్యతూలవాతూలా' 'జరాధ్వాంతరవిప్రభా', 'భాగ్యాబ్ధిచంద్రికా', 'భక్త చిత్తకేకి ఘనాఘనా' 'రోగపర్వత దంభోళిః' 'మృత్యుదారుకుఠారికా' – ఈ ఎనిమిది నామాలు ఈ తృతీయభాగానికి ఫలశ్రుతి నామాలుగా గ్రహించవచ్చును. ఈ ఎనిమిది నామాలను జాగ్రత్తగా పరిశీలిస్తే

- ఈ నామాల్లో అమ్మవారు వరుసగా - సుధావృష్టిః (అపస్), దవానలం (అగ్ని), వాతూలం (గాలి), రవిప్రభా (వెలుగు) చంద్రికా (వెన్నెల), ఘనాఘనా (మేఘం), కుఠారికా (గండ్రగొడ్డలి)లతో పోల్చబడింది. వీటిలో మొదటి మూడూ పంచభూతాల్లోని - అపస్సు, తేజస్సు, వాయువులను సూచిస్తే; వెలుగు, వెన్నెలలు - ఆకాశంలోంచి మనకు వస్తాయి కాబట్టి, మేఘం ఆకాశంలో ఉండేదే కాబట్టి - అవి ఆకాశాన్ని సూచిస్తాయి., గండ్రగొడ్డలి - దృఢంగా ఉండే 'పృథివి' ని సూచిస్తుంది. పంచభూతాత్మక మైన దేహం గల జీవికి ఈ విధంగా పంచభూతాల ఉపమానాలతోనే పోల్చబడిన అమ్మవారు అవసరమైన సమయాల్లో ఆదుకుని అండగా ఉంటుంది అనే అర్థం కూడా ఈ నామంలో నిగూఢంగా ఉందని అర్థం చేసుకోవాలి - అంటే - ఈ నామాల్లో వేసిన ఉపమానాలన్నీ చాలా 'సార్థకమైనవి అన్నమాట!

ఈ చివరి నామంలోని మృత్యువు గురించి చెప్పుకునేటప్పుడు మోక్షం గురించి, మన కర్తవ్యం గురించి కూడా ఈ తృతీయ భాగాంతంలో చెప్పుకోడం సమంజసంగా ఉంటుంది. 'మోక్షం' అంటే - చిక్కు దీసుకోవడం - అని అర్థం చెప్పుకోవచ్చును. అసలు - చిక్కులేని వాడుంటే - వాడితో - 'మోక్షం గురించి చెప్తానుండు' అంటే అర్థం లేదు.

ప్రామిసరీ నోటుకు కాలదోషం ఉంటుంది కాని, సంకల్పానికి కాలదోషం ఉండదు. ఇంకొక సంకల్పం పుట్టేంతవరకు మన ద్వారా జరగవలసినవి ఏమైనా ఉంటే - దాన్ని చేసుకుంటూ పోవాలి, అంతే గాని - అది జరగలేదు - ఇది జరగలేదు - లాంటి వాటితో సతమతమవకూడదు.

'మృషానాదంనకుర్యాత్' అన్నారు. అంటే - 'పనికి రాని కబుర్లతో కాలాన్ని వృథా చెయ్యకు' అని దీని అర్థం.

కాబట్టి - 'అయితే నిజంగా మృత్యువు ఉండదా ? ఉంటుందా? ఉంటే - అమ్మవారి ఈ నామస్మరణ దాని నడుము విరగ్గొడుతుందా ?' అనే విచికిత్స - వితర్కం చెయ్యకూడదు. 'మన మనస్సుల్లో ఆ మృత్యువు అంటే ఉన్న 'చచ్చు' అభిప్రాయాలను

తొలగించి, మెచ్చుకునే పనులు మనచేత హెచ్చుగా చేయిస్తూ, మన మనఃస్థాయిని హెచ్చిస్తూ – మనకు అచ్చి వచ్చేదే అమ్మవారు – అని గ్రహించాలి.

(ప్రథమ భాగంలో - మొదటి 200 నామాలకు వివరణ ఇవ్వబడింది. ద్వితీయ భాగంలో 201వ నామం నుండి 474వ నామం వరకు వివరణ ఇవ్వబడింది. ప్రస్తుత తృతీయ భాగంలో 475వ నామం నుండి 749వ నామం వరకు వివరణ ఇవ్వబడింది. ఈ వివరణతో పాటు ఈ తృతీయ భాగంలో చివరకు ఇచ్చిన అనుబంధంలో తెలిపిన విషయాలు గూడా చదువుకోవాలి. ఇక ముందు రాబోయే చతుర్థ భాగంలో 750వ నామం నుండి 1000వ నామం దాకా వివరణ ఇవ్వబడుతుంది. ఆ చతుర్థ భాగంతో - 'చతుర్బాహుసమన్వితా' అయిన శ్రీలలితాదేవికి సంబంధించిన - ఈ 'లలితాసహస్ర నామవివరణ' చతుర్భాగ సమన్వితగా పరిపూర్ణమౌతుంది - వివరణ కర్త).

**విశుద్ధి పద్మదళ సూచిత అమృతాది షోడశ మహాశక్తులు**

1) అమృత 2) ఆకర్షిణి 3) ఇంద్రాణి 4) ఈశాని 5) ఉషకేశి 6) ఊర్ధ్వ 7) బుద్ధిద 8) ఋూకార 9) ౡకా 10) ౡషా 11) ఏకపదా 12) ఐశ్వర్యా 13) ఓంకారి 14) ఔషధి 15) అంబికా 16) అక్షరా.

**అనాహత పద్మదళ సూచిత కాళరాత్ర్యాది ('క' కారాది 'ఠ' కారాంత)**

**ద్వాదశ శక్తులు**

1) కాళరాత్రి 2) ఖాతీత 3) గాయత్రి 4) ఘంటాధారిణి 5) జామిని 6) చంద్రా 7) ఛాయా 8) జయా 9) ఝుంకారి 10) జ్ఞానరూపా 11) టంకహస్తా 12) ఠంకారిణి

**మణిపూర పద్మదళ సూచిత డామర్యాది ('డ' కారాది 'ఫ' కారంత)**

**దశశక్తులు**

1) డామరి 2) ఢంకారిణి 3) ణామిరి 4) తామసి 5) స్థాన్వి 6) దాక్షాయణి 7) ధాత్రి 8) నందా 9) పార్వతి 10) ఫట్కారి

**స్వాధిష్ఠానాంబుజ దళ సూచిత బందిన్యాది ('బ' కారాది 'ల'**

**కారాంత) షట్చక్తులు**

1) బందినీ 2) భద్రకాళి 3) మహామాయ 4) యశస్వినీ 5) రమా 6) లంబోష్ఠి

**మూలాధారాంబుజ దళ సూచిత వరదాది ('వ' కారాది 'స' కారాంత)**

**చతుశ్శక్తులు**

1) వరద 2) శ్రియై 3) షండా 4) సరస్వతి

**ఆజ్ఞా చక్రాబ్జదళ సూచిత శక్తులు**

1) హంసవతీ 2) క్షమావతీ,

**స్వాహా దేవీ షోడశ నామములు**

1) స్వాహా 2) వహ్నిప్రియా 3) వహ్నిజాయా 4) సంతోషకారిణీ 5) క్రియా 6) శక్తి 7) కాలరాత్రి 8) పరిపాకకరీ 9) ధ్రువ 10) గతి 11) దాహిక 12) దహనక్షమ

13) సంసార సారరూపా 14) దేవపోషణ కారిణీ 15) ఘోర సంసార తారిణీ 16) దేవజీవన రూపా

### స్వధాదేవి అష్టనామములు

1) స్వధా 2) పితృప్రాణతుల్యా 3) ద్విజప్రీతికరా 4) ద్విజజీవనరూపిణీ 5) శ్రాద్ధ ఫలప్రదా 7) బ్రహ్మమానస కన్యా 8) పితృతుష్టప్రదా

### సప్తధాతువులు

1) త్వక్ 2) రుధిరము 3) మాంసము 4) మేదస్సు 5) అస్థి 6) మజ్జ 7) శుక్రము.

### షడ్గుణాలు

ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము

### దండనీతి విద్యలు

1) విజ్ఞాన బోధకమగు అన్వీక్షకీయను విద్య 2) ధర్మాధర్మ బోధక మగు త్రయీవిద్య 3) అర్థా నర్థ బోధకమగు వార్తాయను విద్య 4) నయానయబోధకమగు దండనీతి అనువిద్య.

### అష్టమూర్తులు

1) పంచభూతములు, చంద్రుడు, సూర్యుడు, యజ్ఞ దీక్షగల సోమయాజి

2) భవుడు, శర్వుడు, ఈశానుడు, పశుపతి, రుద్రుడు, ఉగ్రుడు, భీముడు, మహాదేవుడు

3) భూమి, తపస్సు, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము.

4) లక్ష్మి, మేధ, ధర, పుష్టి, గౌరి, తుష్టి, ప్రభ, ధృతి

5) జీవాత్మ, పరమాత్మ, అంతరాత్మ, నిర్మలాత్మ, శుద్ధాత్మ, జ్ఞానాత్మ, మహాత్మ, భూతాత్మ

6) అనంగకుసుమ, అనంగ మేఖల, అనంగమదన, అనంగమదనాతుర, అనంగరేఖ, అనంగవేగిని, అనంగాంకుశ, అనంగమాలిని.

7) బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండి, మహాలక్ష్మి

8) జ్ఞానేంద్రియం, కర్మేంద్రియం, మనోబుద్ధ్యాదులు, ప్రాణపంచకం, భూతపంచకం, కామ, కర్మ, అవిద్య

## జాగ్రదవస్థా కళలు

1) ఉత్పత్తి 2) జాగ్రత 3) బోధ 4) మనోవ్యాపారము - ఇవి శక్తి స్వరూపములు.

## సుషుప్తి కళలు

1) మరణము 2) పరాకు 3) మూర్ఛ 4) నిద్ర - ఇవి శివస్వరూపములు.

## స్వప్నావస్థా కళలు

1) అభిలాష 2) భ్రమ 3) చింత 4) విషయవాంఛ - ఇవి శివశక్త్యైక్య కళలు

## తురీయావస్థా కళలు

1) వైరాగ్యము 2) మోక్షేచ్ఛ 3) మనశ్శుద్ధి 4) సదసద్వస్తువిచక్షణ
(మొత్తము మీద నాలుగు అవస్థలకు కళలు 4 X 4 = 16 ఉంటాయి)

## సప్తకుల పర్వతాలు

1) హిమవంతము 2) నిషధము 3) వింధ్యము 4) మాల్యవంతము 5) పారియాత్రము 6) గంధమాదనము 7) హేమకూటము

## ప్రకృతి పంచలక్షణాలు

1) అస్తి 2) భాతి 3) ప్రియము 4) రూపము 5) నామము (వీటిలో మొదటి మూడూ కంటికి కనబడవు. చివరి రెండూ కంటికి కనబడతాయి. కంటికి కనబడని మూడు 'సత్, చిత్ ఆనందా' లను సూచిస్తాయి.)

## ప్రముఖ భక్తులకు పరమేశ్వరి ప్రసాదించిన రాజ్యములు

1) ఈశ్వరునికి - కైలాసం 2) విష్ణువుకు - వైకుంఠం 3) బ్రహ్మకు - సత్యలోకం 4) ఇంద్రునికి - అమరావతి (స్వర్గం) 5) అగ్నికి - తేజోవతి 6) యమునికి - సంయమని

7) నిర్ృతికి - కృష్ణాంగన 8) వరుణునికి - శ్రద్ధావతి 9) వాయువుకు - గంధవతి 10) కుబేరునికి - అలకావతి 11) ఈశానునికి - యశోవతి.

## నవనిధులు

1) పద్మము 2) మహాపద్మము 3) శంఖము 4) మకరము 5) కచ్ఛపము 6) ముకుందము 7) కుందము 8) నీలము 9) వరము

## పరమేశ్వరి శరీర అవయవాలకు సంబంధించిన శాస్త్రాలు

1) ఉచ్ఛ్వాస నిశ్వాసములు - ఋగ్వేదాది చతుర్వేదములు 2) అభిమానము - మహామంత్రచయము 3) మధురాలాపము - కావ్యనాటకాలంకారములు 4) జిహ్వ - సరస్వతి 5) చుబుకము - వేదాంగములు 6) కంఠము యొక్క ఊర్ధ్వరేఖ - మీమాంస న్యాయ శాస్త్రాదులు 7) కంఠమధ్య రేఖ - అయుర్వేదాదులు 8) కంఠమూలం - చతుష్షష్టి తంత్రాలు 9) ఇతరావయముల నుండి - తదితర తంత్రాలు 10) బాహువులు - కామశాస్త్రము

## షడంగ దేవతలు

1) హృదయదేవి 2) శిరోదేవి 3) శిఖాదేవి 4) కవచదేవి 5) నేత్రదేవి 6) అస్త్రదేవి

## అష్టదౌర్భాగ్యములు

1) ఋణము 2) యాచన 3) ముసలితనము 4) జారత్వము 5) చోరత్వము 6) దరిద్రము 7) రోగము 8) భుక్తశేష భోజనము

శ్రీ

శ్రీ మాత్రే నమః

# శ్రీ లలితా సహస్ర నామావళి

(ఈ తృతీయ భాగము లోనివి)

# అకారాది నామసంఖ్యాను క్రమణిక

(ఈ తృతీయ భాగము లోనివి)



# గ్రంథకర్త

# G.L.N. శాస్త్రి

(గొర్తి లక్ష్మినారాయణ శాస్త్రి)

| | |
|---|---|
| తల్లి దండ్రులు | : శేషారత్నం, హనుమచ్ఛాస్త్రి |
| జన్మ స్థలము | : వెంకటాపురం (కైకలూరు తాలూకా, కృష్ణాజిల్లా) |
| జన్మ దినము | : విక్రమ, ఆశ్వయుజశుద్ధ ద్వాదశి (12.10.1940) |
| విద్యాభ్యాసము | : **B.Sc.,** - హిందూ కళాశాల, మచిలీపట్నం<br>**M.Sc., M.Phil, Ph.D.** -ఆంధ్ర విశ్వవిద్యాలయము - విశాఖపట్టణము |
| వృత్తి | : గుంటూరులోని **T.J.P.S.** కళాశాలలో భౌతికశాస్త్రశాఖాధ్యక్షులు |
| పరిశోధనా రంగము | : వివిధ జాతీయ, అంతర్జాతీయ వైజ్ఞానికసదస్సులలో పాల్గొని, నూతన పరిశోధనా విషయ వ్యాసములను ఇప్పటికి 18 వరకు వివిధ వైజ్ఞానికపత్రికలలో ప్రచురించి, భారతీయ ధ్వనిశాస్త్ర **(ACOUSTICS)** అతి ధ్వనిశాస్త్ర **(ULTRASON-ICS)** పరిషత్తులలో సభ్యులుగా గౌరవింపబడిరి.<br>ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వముచే 1996 -97 సంవత్సరంలో ఉత్తమ అధ్యాపక పురస్కార గౌరవమును పొందిరి. |
| ఆర్ష విజ్ఞాన రంగము | : 1965 సం.లో కులపతి **ఎక్కిరాల కృష్ణమాచార్యగారికి** శిష్యులై-వేద, ఇతిహాస, జ్యౌతిష, కావ్య, క్రతు విద్యా, యోగ, హూమియో, వాస్తుశాస్త్రములలో సుశిక్షుతులైరి. అంతర్జాతీయ అధ్యాత్మికసేవా సంస్థ అయిన జగద్గురు పీఠమునకు సలహా సంఘ సభ్యులుగా ఉన్నారు. |
| రచనావ్యాసంగము | : సంగీత రూపకములు-రేడియోలో ప్రసారమై, నాటికలు, ప్రబోధాత్మక హాస్యకథా వ్యాసములు, -"నావాణి", "భారతీయ మార్గము" లలో ప్రచురింపబడుచున్నవి. |
| ముద్రిత రచనలు | : ప్రేయరు, గాయత్రి, శాంతి పాఠము, రుద్రాభిషేక సంకలనము, జాతక చక్రమును గుణించు పద్ధతి, పాదుకా పట్టాభిషేకము, శ్రీమద్రామాయణము-అరణ్య, కిష్కింధా, సుందర కాండలు, రామోవిగ్రహవాన్ ధర్మః, శ్రుతిగీత-1 అక్షర గణపతి - కుండలినీపతి, లీలా మాధవమ్, శ్రుతిగీత - 2. |
| అముద్రిత రచనలు | : సౌందర్యలహరి, శివానందలహరి, సంక్షిప్త గృహ వాస్తు, **HOMEO & ASTROLOGY,** శ్రీ లలితా సహస్రనామ వివరణము. |
| సేవా కార్యక్రమములు | : రాష్ట్ర, రాష్ట్రేతర పట్టణములలో ఆర్ష విజ్ఞాన ప్రసంగములు చేయుచు, వేద జ్యౌతిష శిక్షణా తరగతులు నిర్వహించిరి. గుంటూరు 2/9 బ్రాడీపేటలో స్వగృహము నందు ఒక ఉచిత వేద, జ్యౌతిష, హోమియో వైద్యాలయమును నిర్వహించుచున్నారు, |